శ్రీ

# కువలాశ్వ విజయము

## (హూణభాషాంధ్ర దివ్యకథా ప్రబంధము)

గ్రంథకర్త

శ్రీనాథ యామునావతార పవిత్ర శతమర్షణ గోత్ర
బుక్కపట్టణకుల కలశాంబుధి రాకాసుధాకర
విద్యానగర సంస్థాన సముపార్జితానేకాగ్రహార బిరుదాంచిత
కర్ణాట రాజాచార్య శ్రీవేంకటాచార్య పౌత్ర
శ్రీనివాస తాతాచార్యపుత్ర స్వీయ మేధా స్వయం సముపార్జిత
రాజకీయ హూణ భాషా పాండితీ మండిత అష్టావధాన
కరణ చణ శిష్టజనహిత వైయాకరణ పండిత

**శ్రీబుక్క పట్టణ రాఘవాచార్యులు**

ప్రకాశకులు

**త్రికరణ్మయి**

(సారస్వత విభాగము)

టి. ఆర్. టి. 141, విద్యానగర్ కాలనీ,
న్యూనల్లకుంట పోస్టు, హైదరాబాద్ - 500 044.
ఫోన్ నెం. : 7601212

శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః



కృతికర్త సమర్పణము

శ్రీరుక్మిణి, సత్యభామా సమేత

శ్రీ-వేణుగోపాల స్వామివారికి



(గ్రంథకర్త కుమారుడు, కోడలు)

శ్రీమాన్ బి.వి. గోపాలాచార్యులు

శ్రీమతి నరసమ్మ



కృతికర్త మనుమడు మరియు వారి సతీమణి

శ్రీమాన్ మాడభూషి శ్రీనివాసాచార్యులు, శ్రీమతి మాడభూషి రాజమ్మ



కృతికర్త దాయాదికుమారుడు మరియు మనుమరాలు.
శ్రీమాన్ బుక్కపట్నం తిరుమల లక్ష్మీనరసింహాచారులు, శ్రీమతి రాజ్యలక్ష్మి

చ శ్లో॥ శఠమర్షాన్వయోద్భూతం - రాఘవార్య గురుస్స్తుతం
ఆచార్య పుత్ర వంశజం - నృసింహార్యమహఃభజే ॥

శ్రీమతే రామానుజాయనమః
శ్రీమతే వేదాంతగురవేనమః

శ్రీలక్ష్మినృసింహ గురునే నుతింతు

# నమస్సుమాంజలి

శ్రీమాన్ బుక్కపట్టణము రాఘవాచార్యులు గారు (1848 - 1908 A.D.) నాకు మాతపితామహులు. వీరు శఠమర్షణ గోత్రోద్భవులు. శ్రీమాన్ శ్రీనివాస తాతాచార్యులుగారు వీరిజనకులు, తల్లి సింగవమాంబ. ఈ పుణ్యదంపతులకు అనంత వర్యుడు, రాఘవాచార్యులు, వెంకటా చార్యులు అనుమూవురు పుత్రులు. వీరిలో రెండవ వారగు శ్రీమాన్ బుక్కపట్టణము రాఘవాచార్యులు శ్రీకువలయాశ్వ విజయము అను ప్రబంద గ్రంధకర్త. వీరు తన పదునారవ యేట నుండియు సంస్కృతాంధ్ర భాషలను అష్టావధాన మొనర్చిన సభలో మెచ్చు కొనెడివారట. వీరు విశిష్టాద్వైత మతమునకు తగినటుల శ్రీలక్ష్మినారాయణ ప్రార్థనతో తమ గ్రంధ రచనను ఆరంభించిరి. యీప్రబంధ మున భాగవత కథను, రామాయణ కథను, భారత కధను, శ్రీకృష్ణుని లీలలను సంగ్రహముగా చోటుచేసుకొనినవి. యిందు ఉపయోగించిన తెనుగు సామెత లు, లోకోక్తులు పెక్కు కలవు.

వీరు తమ యిష్ట దైవమగు శ్రీకృష్ణునకే తమ గ్రంథము అంకితమిచ్చిన ధన్య జీవి. వీరి ఏకైకపుత్రులగు గోపయాచార్యులు భాగవతాగ్రేసరులు. వీరు గుంటూరు జిల్లా నరసరావుపేటలో పాత ఊరునందు తమ జీవితకాలము ఆదర్శ ప్రాయముగా గడపిరి. వీరికి ఏకైక పుత్రులు వీర రాఘవా చార్యులు సంతానము బడయక మునుపే పరమపదించిరి.

వీరి చతుర్థపుత్రికమాడభూషి ఆమ్మాళమ్మ తండ్రిగారి వద్ద విద్యనభ్యసించిరి. సమాశ్రయణమును పొందిరి. వీరికి తండ్రిగారు రచించిన ప్రబంధము కంఠస్థమై, ఆశ్వకథను శైలి మనోహరముగ గానము చేసి వినిపించెడివారు. వీరి కనిష్ఠ కుమారుడు శ్రీనివాసాచార్యులు అగునేను నా అష్టవర్షప్రాయమున విను భాగ్యము కలిగెను. దరిమిలా నేనడుగగా తమ తండ్రిగారు కష్టపడి వ్రాసిన గ్రంథము ఎవరితావున చేరినది తెలియలేదని వాపోయిరి.

నా 59వ యేట అనగా 1983సం.లో నా ఉద్యోగ విరమణానంతరము మా అమ్మగారు ఈ ప్రబంధ విషయమై నా చిన్నతనమున పలికిన విషయములు గుర్తు చేసుకొని, దీని ప్రాప్తికై ప్రస్తావన పలువుర ప్రశ్నించితిని. ఈ ప్రబంధ వ్రాత ప్రతి మదరాసు యూనివర్శిటీ లైబ్రరీలో R.No. 610 18-10-1920 న యుండినదని తెలియ వచ్చెను. అందుండి దాయవిభాగము శ్రీవేంకటేశ్వర యూనివర్సిటీ రిసెర్చి ఇన్స్టిట్యూట్, తిరుపతికి తరలినదని తెలిసెను. వెంటనే తిరుపతి అడ్రసుకు జాబువ్రాయగా అచటి డైరెక్టరు Prof. Dr. S. Venkatanarayanan గారు Ref. OR1/38/MSS/84 తేది 10-2-84 సదరు ప్రబంధము కాపీవ్రాసు కొనుటకు నాకు అనుమతి నిచ్చిరి. యీ పురాతన గ్రంధ మెవ్వరియొ ద్దనున్నది తెలుసుకొనలేక గొట్టుమిట్టాడు నాకు ఈ ఉత్తరము కల్గించిన సంతోషమింతని చెప్పలేను. దీనిని శ్రీవేంకటేశ్వరుని లీలగా భావించితిని. సంతోషము పట్టలేక కంటనీరు కారనారంభించెను. వృద్ధుడను. చక్కెర వ్యాధితో బాధపడుచుంటిని. శ్రియః పతిపై భారముంచి, తిరుపతి లైబ్రరీ సమీపముననే నివసించుచూ వ్రాతపని పూర్తి చేయ సంకల్పించితిని. కాని తిరుపతిలో ఊరుబయట రెండు మైళ్ళదూరములో యున్న లైబ్రరీకి ప్రతిదినము వెళ్లుచూ 481 పేజీలు వ్రాయుట ఈ వయసులో సుమారు మూడువారములపై

చిలుకు అచట యుండనాకు సాధ్యమాయను చింతకలిగెను. యింతలో దైవము పంపినటుల, నామేనకోడలు చిరంజీవి కుమారి గోమఠం విజయలక్ష్మి తిరుపతి S.V. యూనివర్సిటీలో RESEARCH చేయుచూ పాన్నారు మాయింటికి వచ్చినది. తాను పనిపై Tirupathi లో అచటికి ప్రతిరోజు వెళ్లుచుండుదునని, ఖాళీ సమయమందు లైబ్రరీలో ఆప్రబంధమును కాపీచేయుట తనకు సులువైనపని యనియు, వృద్ధాప్యములో నన్ను కష్టపడ వద్దని కోరి, నానుండి Authorisation Letter యొకటి తీసుకువెళ్లి, వారి అనుమతితో నాకు బదులుగా వ్రాతపని పూర్తి జేసి తనమాట నెగ్గించుకొనిన సౌజన్యశీలి. ఈ ఉపకారము జేసిన చిరంజీవి జి. విజయలక్ష్మికి కృతజ్ఞత తెలుపుచున్నాను. ఈమెకు ఆయురారోగ్యములు శ్రీఘ్రమే కళ్యాణ సౌభాగ్యములు శ్రీవేంకటేశ్వర స్వామి సమకూర్చుగాక!

నేను చిరంజీవి విజయలక్ష్మి వ్రాసిన ప్రతిని పరిశీలించి దానికి శుద్ధప్రతిని వ్రాసితిని. నామేనల్లుడు చిరంజీవి B.T. ఆనందరామాచార్యులు నేవ్రాసిన శుద్ధ ప్రతికి జిరాక్స్ కాపీలు సేకరించి పెట్టిరి. వీటిని సీతానగరంలో శ్రీ శ్రీ శ్రీ చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జియ్యర్‌స్వామి వారికి జూప దీనిని రెండు వాల్యూములుగా విభజించిన T.T.D. వారి ద్రవ్య సహాయముతో అచ్చువేయించ నగునని వారు దివ్యమంగళా శాసనమొనరించిరి.

నామేనల్లుడగు చిరంజీవి B.T.A. రామాచార్యులు T.T.D. ద్వారా కొన్ని గ్రంధములు అచ్చువేయించిన అనుభవము కలదని విని, తాతాగారు వ్రాసిన శ్రీకువలాశ్వ విజయము T.T.D. ద్వారా అచ్చు వేయించ సంకల్పించి అతనితో యీ విషయము హెచ్చరించితిని. గ్రంధకర్త తనకును మాతా ప్రమాతామహు డును, సగోత్రీకుడగుట వలన నాకు తనపూర్తి సహాయసహకారములుండునని, తప్పక T.T.D. ద్వారా అచ్చు వేయించ హామీగా తెలిపి, వారి సన్నిహితులును, సాహిత్య విద్యా ప్రవీణ, భాషాప్రవీణ వేదశాస్త్ర పండితులగు శ్రీ తెలికిజెర్ల రాజేశ్వరశర్మ గారికి ఈ గ్రంధమును పరిశీలన నిమిత్తము పంపిరి. వారీ గ్రంధమును పూర్తిగా పరిశీలన గావించి 102 వ పద్యము అల్లసాని సీసపద్య రచనను బోలినదని,

మరియు శ్రీనాధుని పద్య రచనా ప్రౌఢిమ గ్రంథకర్త దండకరచనలో గలదని, ప్రబంధ రచనా విశిష్టతను మాకు తేటతెల్లముగ తెలుప చాలసంతోషపడితిమి.

నాప్రమాతా మహులగు శ్రీమాన్ బుక్కపట్టణము రాఘవాచార్యులుగారు సుమారు నూరు వత్సరములక్రింది రచించిన శ్రీకువలాశ్వ విజయము ప్రబంధమును నేను కనుగొనుటలో సహాయపడిన వారికి, ప్రత్యేకముగ దానిని ప్రతిని లైబ్రరీలో శ్రమించి కాపీవ్రాసిన కుమారి గోమఠం విజయ లక్ష్మికి, గ్రంధ పరిశీలన వాత్సల్యముతో పూర్తిగావించిన శ్రీ తెలికిచెర్ల రాజేశ్వర శర్మ గారికి నేను వృద్ధుడను గావున నా తరఫున శ్రద్ధతీసుకొని T.T.D. ఆర్థిక సహాయముతో అచ్చువేయించు టకు ముందుకు వచ్చిన నామేనల్లుడగు B.T. ఆనంద రామాచార్యులకు నా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

గ్రందకర్త చతుర్థ కుమార్తె శ్రీమతి మాడభూషి అమ్మాళమ్మ గారు మా అమ్మగారు. ఆమె **1934**లో నా అష్టవర్షప్రాయమున తెలిపిన విషయము **1984**లో స్ఫురణ చేకూర్చి పలువుర సహాయసంపత్తులతో యీ గ్రంధము సూర్యావలోకనము, ప్రాప్తి కలుగ జేయుచున్న తిరుమల శ్రీవేంకటేశ్వర స్వామివారికి వారి దివ్యమహిషి అఖిల జగన్మాతయగు శ్రీమతి అలమేలు మంగ దివ్యపాదారవిందములకీ ప్రపన్నుడు తలమోడ్చి చేయు నమస్సు.


యిట్లు

**మాడభూషి శ్రీనివాసదాసుడు**

**యెమ్. శ్రీనివాసాచార్యులు**

రిటైర్డు కోపరేటివ్ డిప్యూటీ రిజిస్ట్రార్

**1-4-35**, భావనగర్ కాలనీ,

పొన్నూరు - **522 124**

గుంటూరు జిల్లా (ఆం.ప్ర)



శ్రీమేధా దక్షిణామూర్తయే నమః
శ్రీగాయత్రీ మంత్రే నమః

# అభిప్రాయనివేదనము

# శ్రీ కువలయాశ్వ ప్రబంధ పరిశీలనము

శ్రీ కువలయాశ్వవిజయము ఆంధ్రప్రబంధము. దీనిని రచించిన కవివరేణ్యులు శ్రీబుక్కపట్టణ రాఘవాచార్యులుగారు. శఠమర్షణ గోత్రోద్భవులు. ఈప్రబంధమున కృతికర్తలు 12వ పద్యము మొదలు 24వ పద్యము పూర్తియగు వరకును వ్రాసిన వంశాభివర్ణనను పరిశీలించి వీరి వంశచరిత్రను యథాశక్తి వ్రాయుచున్నాను గమనింపుడు. ఈకవిశేఖరుడును వీరి పూర్వులును నూజివీడురాజుగారి సంస్థానమున ఆస్థాన కవిపండితులుగారాజుగారిచే సుప్రతిష్ఠింపబడిరి. వీరి వంశమున గల ప్రథమ రాఘవాచార్యులుగారు వేదశాస్త్ర నిపుణులు. వాది సింహమని ప్రఖ్యాతి పొందినవారు. అందుచే రాజుగారు వీరిని మహాకవి పండితులుగా నిల్పి సంభావించిరి. వీరికి అనంతుడు, చిన్నయ్య అని ఇరువురు పుత్రులు గల్గిరి. వీరిలో అనన్తాచార్యులుగారు ఉరుటూరు మున్నగు అగ్రహారములను గడించిరి. వీరుసత్కవులు మెచ్చుకొనునట్లు కృతులు వ్రాసిరి. వీరికి వరదాచార్యులుగారు, వీరరాఘవాచార్యులుగారు అని ఇరువురు పుత్రులు వుద్భవించిరి. వీర రాఘవాచార్యులు గారు చక్కని కవీశ్వరులు. వరదాచార్యులుగారికి వేంకటార్యుడు, అనంతార్యుడు, రామానుజార్యుడు, రంగయార్యుడు అని నల్వురు పుత్రులు గల్గిరి.. వేంకటాచార్యులుగారికి అష్టపుత్ర బహుధనమస్తు అనునట్లు ఎనమండుగురు పుత్రులు గల్గిరి. వారిలో కనిష్ఠులు శ్రీనివాస తాతాచార్యులుగారు. ఆధ్రగీర్వాణ పండితులలో అసమానులు. ఆతని సతీమణి సింగమ్మాంబ. ఆ పుణ్యదంపతులకు అనన్తవర్యుడు, రాఘవార్యుడు, వేంకటార్యుడు అని ముమ్వురు పుత్రులు గల్గిరి. వీరిలో రెండవ వారైన రాఘవాచార్యులుగారే ప్రకృత కువలయాశ్వప్రబంధ కర్తలు. వీరు తమ పదునారవ యేటనుండియు సంస్కృతాంధ్రాంగ్లభాషలు మూడింటను పదుగురు బాగున్నదని మెచ్చుకొనునట్లు అష్టావధానము నొనర్చెడివారట. వీరిలో 3వ వారగు

వేంకటార్యులు వారు వ్రేలెత్తిచూ పుటకు శక్యముకాని విద్వత్కేసరి (పండిత సింహము) ఈయన ఈ రాఘవాచార్యులుగారిని సంభావించెడివారట. ఈయన అష్టావధానమును పదుగురు సెభాష్ అని మెచ్చుకొనెడివారట. వీరి తండ్రిగారు వేంకటాచార్యులు. కవియైన రాఘవాచార్యులుగారి సతీమణి పేరు లక్ష్మీనరసాంబ. ఈయన కుమారుడు వేంకటగోపయాచార్యుడు. ఈకవీశ్వరుడు నానావిధ దేశ్యపదని బిడమగు ఆంధ్రప్రబంధమును అతి సుందరంబుగా రచింపబూనెను. అదియే ఈకువలయాశ్వవిజయ ప్రబంధము. దీనినీయనదైవంబగు శ్రీకృష్ణునకు కృతిగా సమర్పించెను.

''శ్రీరామానుజసమారంభాంనాదయామునమధ్యమాం, అస్మదాచార్య పర్యంన్తాంవందేగురు పరంపరాం'' అనుసూక్తిలో జెప్పినట్లు గురుపరంపరాభి వందన మాచరించి ప్రబంధరచనకు నడుము బిగించిరి. ఈయన అలంకార శాస్త్రమునజెప్పిన ప్రబంధ లక్షణములను పూర్ణముగా పాటించిరి. ''ఆశీర్నమస్క్రియావస్తు నిర్దేశోవా'' అను నియమమునననుసరించి హరి సద్భాగ్యంబు మాకీవుతన్, ఇందిర ప్రోవు నందఱన్ మొదటి రెండు పద్యములందును తమ భాగ్యములను రక్షింపవలసినదిగా ప్రార్థించుచు ఇందిరాహరులకు నమస్కారములను సమర్పించెను. మంగళాదీని మంగళమధ్యాని మంగళా న్తానికావ్యాని ప్రథన్తే అనునియమమునకు అనుకూలముగా మంగళాదిగా శ్రీకారముతో పద్యమును వ్రాసిరి. ఇందలికథ, భాగవతమార్కండేయ పురాణములందు ప్రసిద్ధిగన్నది. కాన, ఇందలి ఇతివృత్తము ప్రఖ్యాతమని తెలియుచున్నది. ప్రబంధము గద్యపద్యాత్మక చంపూకావ్యమున కథ తక్కువగానుండి అష్టాదశవర్ణనలతో, అలంకార చమత్కృతితో నిండి శృంగార వీరరసములలో నొకటి చక్కగా పోషింప బడవలెను. ఇట్టికావ్యలక్షణమునకు అనుకూలముగా ఇందు అనన్తుని వర్ణన మాదిరిగా ఎన్నియో వర్ణనలుగావింప బడెను. కువలాశ్వమహారాజకృత దుంధు భాసుర వధ ఇందు నిరూపింపబడెను. కావున ఈ ప్రబంధము వీర రస ప్రధానమని తెలియుచున్నది. కవివరులు విశిష్టాద్వైత మతస్థులు కాన లక్ష్మీనారాయణ ప్రార్థనతో గ్రంథరచనమారంభించిరి. అనన్తుడును, వైనతేయుడును 3,4, పద్యములందు అతి సుందరముగా వర్ణింపబడిరి. గురు భక్తి ప్రపత్తులు 5,6,7,8 పద్యములందు ప్రస్ఫురించు చున్నవి. వాల్మీకి, వ్యాసుడు, కాళిదాసు, దండి, బాణుడు మున్నగు సుప్రసిద్ధ

కవులను మఱియు నన్నయ, తిక్కన, ఎఱ్ఱాప్రగడ అను ప్రసిద్ధ కవిత్రయమును 9,10 పద్యములందు సంస్మరింపబడిరి. కృతికర్త వంశాభి వర్ణనము 12 వ పద్యము మొదలు 24వ పద్యము పూర్తియగు వరకును ప్రస్ఫుటముగా కలదు. 25,26,27 పద్యములందు షష్ఠ్యంతములు కవితా సంప్రదాయానుకులముల్తై యున్నవి.

28వ పద్యమునుండి చక్కగా కథా ప్రరంభము కలదు. జనమేజయ మహారాజు కోరికపైన వైశంపాయనుడు చెప్పినట్లు కవివరేణ్యులు. ఈ కువలాశ్వచరిత్రమును నవ్యకథను మధుమాధురీధురిన్ వ్రాసెదనని ప్రతిజ్ఞ చేసినాడు. అట్లే వ్రాసినారు. ఈయన కవితలో సగమచ్చతెనుగు పదములును సగము సంస్కృత సమాస పదములును గలవు. 61వ వచనమున బాల్యశిక్షలు అచ్చతెనుగు పదములలో నిరూపింపబడెను. 62,63,64 పద్యములలో కవి తమ కాలపు ఆటలను అచ్చతెనుగు మాటలలో నిరూపించినారు. గ్రంథము మొత్తము పైని ఈతని వచన రచనలు పెక్కుభంగుల గావింపబడి అహంకార పూర్ణ పండితుల గర్వ భంగకరములుగా కలవు. అచ్చతెనుగు కవితనల్లుటలో కూచిమంచి తిమ్మకవి వీరికి గురువుగానున్నట్లు తోచుచున్నది. ఊఁఅకరారు మహాత్ములు అనునట్టి లోకొక్తులు వీరి కవితలో కోకొల్లలుగలవు. 102వ పద్యము అల్లసాని పెద్దన్న గారి సీస పద్యము బోలియున్నది. 114వ పద్యమున కవిగారి ఆత్మీయత అతి సుందరవముగా గోచరించును. ఎవ్వతెయౌవెు భీతహరిణేక్షణ అనెడి పెద్దనామాత్యుని పద్యమును బోలినది ఎవ్వడవీవు అనెడి 134వ పద్యము శ్రీనాధుని పద్యరచనా ప్రౌఢిమ ఈయని దండక రచనలో గలదు. కందము, తేటగీతి, సీసము, తరువోజు మున్నగు అచ్చతెనుగు పద్యరచనలో వీరి దందె వేసిన చేయి. ప్రధమాశ్వాసాంతపద్య రచనచే రాఘవాచార్యులుగారి పాండిత్య ప్రతిభలు సువ్యక్తముగా గోచరించును.

ద్వితీయాశ్వాసమున కథాగ్రంధము ఆకాశతారలనంటినది. ఈయన కవితలోమల్లెవట్టినచేను, పులికడుపునఁజలిచిమయు, గ్రుడ్డియెద్దు చేనబడ్డట్టుగా, మున్నగుజాతీయ పదముల గూర్పులు ముచ్చట గొల్పును. తృతీయాశ్వాసమున రామాయణ కథా సంగ్రహము అద్వితీయము. మత్తకోకిల, సుగంధివృత్తము మున్నగు వృత్తపద్యరచన సందర్భాను కూలముగా గలదు. వీరు సంస్కృతాంధ్ర కర్ణాటక భాషలకు చెందిన ఛందస్సులననుసరించి రచించిన వృత్తరచనలు

అపురూపవములు. సామాన్యముగా పండితులకు అందుబాటులో లేని వృత్తములను పండితుల పరీక్షకా! అన్నట్లు 1.)కరంబ్వావాత వృత్తము 2.)తన్వీవృత్తము 3.)పద్మనాభవృత్తము మున్నగు నామములతో ఎన్నింటినో వ్రాసిరి. అత్యాధునికమైన సామెతలను శిష్టవ్యావహారిక భాషలో అనుసంధించిరి. అన్యదేశ్యములనెన్నింటినో గ్రంధించిరి. 192వ పేజి లోని లయగ్రాహి పద్యము లయగ్రాహిగానున్నది. ఈయన దండక రచనలోను, వచన రచనలోను అందెవేసిన చేయి. శబ్దాలంకార ప్రయోగవైచిత్రి, పోతన్నగారి రచనను మఱిపించుననుటలో అతిశయోక్తిలేదు

చతుర్థాశ్వాశమున భాగవతకథను అతి సుందరముగా గ్రథించిరి. ఇంతకమున్ను సందర్భోచితముగా శ్రీరామాయణ కథను సంగ్రహముగా విన్నవించి, ఇపుడు జనమేజయ ప్రభువునకు భాగవత కథను కర్ణసుందరముగా వినిపించు సందర్భమున కవివరేణ్యులు ఉపయోగించిన అచ్చతెనుగు సామెతలను లోకోక్తులును తామర తంపరగా గలవు. 'అడినది అట' 'పాడినది పాట', 'కాటికి బోయినను కర్మగతి తప్పునకో' అనునట్టివి అసంఖ్యాకములు. భారతకథను కూడ ముచ్చటగా ప్రభువునకు వినిపించిరి.

పంచమాశ్వాసము శ్రీకృష్ణలీలలను, సుభద్రావర్ణనమును, ఋతు వర్ణనలను పాఠకులకు తెల్పుటలో ఈమహాకవి చూపిన వింతలు లెక్కకు మిక్కుటములు. ఉపమాకాళి దాసస్య భారవేరర్థ గౌరవం దండినఃపదలాలిత్యం, ఘేసంతిత్రయో గుణాః అన్నట్లు యీకవిశేఖరుడు రెండవకవిగా చెప్పవచ్చును. గ్రంధమును చదివితెలుసుకొనుట మంచిది. నేవ్రాసితినేని 10పేజిలకు మించి వ్రాయగలను. చదువరులునన్ను మెచ్చుకొనుటకు మారుగా, ఇంత అతిగా వ్రాయఢాదందురేమో అని నాభయము, పాండురంగుసుకవి పదగుఫణము అన్నట్లు ఈకవీశ్వరుని పదగుంభనము నిరుపమానమని తలపెదరు తప్పదు. 72 సం. వయస్సు వాడనుగాన శరీర బలము తగ్గుటచే వ్రాయుటలేదు. కాని వ్రాసినచో అదియొక్క చిన్న పొత్తము అగును. చదువరులను విసిగింప రాదు. సంస్కృతాంధ్రఛంధో వ్యాకరణాలంకార శాస్త్రములలో తెలియుని వారు సరిదిద్దలేరనుట అతిశయోక్తి. శ్రీకువలాశ్వ విజయాఖ్యమును అద్వితీయకవితా సుగంధ సంపూర్ణమగు ఈమహా ప్రబంధమును ఆంధ్రభాషాయోషకు అమూల్యా భరణముగా రచియించి యిచ్చిన మహాకవి శేఖరులు శ్రీబుక్కపట్టణాన్వయ

సుధాంబుధి చంద్రులు శ్రీరాఘవాచార్యులుగారికి చంద్రునకు నూలుపోగుగా అభిప్రాయమును వ్రాసియిచ్చినవాడు వేదశాస్త్ర పండితుడు, విశ్రాంత ప్రధానాంధ్రోపాధ్యాయుడు, సాహిత్య విద్యాప్రవీణ, భాషాప్రవీణ,

తెలికిచెర్ల రాజేశ్వర శర్మ ఆంధ్రకవి పండితులకు నమస్సుమాంజలులను సమర్పించుచు చేయువిన్నపము.

అర్యులారా!

నాకు పుత్రప్రాయులు చిరంజీవులు బి. టి. ఆనంద రామాచార్యులుగారు, పరిశీలించమని యేసంగిన ఈమహాప్రభంధమును యధాశక్తి పరిశీలించితిని. ప్రమోదోధీ మతామపి అని పెద్దలు చెప్పిన నుడి నిత్యసత్యము. తప్పులున్నచో విధ్వాంసులైన పాఠకులు మన్నింతురుగాక. తప్పులని తోచినవానిని సవరించి ఆస్తికులును పితృభక్తిసంపన్నులును అగుమా బి. టి. ఆనందరామాచార్యులుగారికి పంపగోరిక. వారి ముత్తాతగారు వ్రాసినదే ఈమహాప్రభంధము. వారు నేనోసంగిన సవరణలతో జోడించి దీనిని అచ్చొత్తించగలరు. అన్యధాభావింపుకుడు. నాపూర్వజన్మ పుణ్యఫలముగా దీనిని పరిశీలించు భాగ్యము నాకు కలిగినది. నాకు వేదవిద్యావంశపుత్రులు ఆస్తికులు, ఆప్తులును నాగ్రంధముల ముద్రణ ద్వారా నాకు యెంతయో తోడ్పడిన వారునగు చిరంజీవి బుక్కపట్నం తిరుమల ఆనంద రామాచార్యులుగారి మూలమున నాకు ఈగ్రంధ పరిశీలన భాగ్యము కలిగినది. వారికుటుంబ సభ్యులకు శ్రీవాసుదేవుడు సవిత ఆయురారోగ్యైశ్వర్య విద్యాద్యభివృద్ధులను చేకూర్చుగావుతన్

ఇట్లు
కౌండిన్య సగోత్రోద్భవుడు
వేదశాస్త్ర పండితుడు
విశ్రాంతప్రధానాంధ్రోపాధ్యాయుడు
శ్రీనసను జాతీయ, శ్రీరుద్రాభిషేక మహాత్మ్య
ఆంధ్రవిరాట పర్వ, సౌరమంత్ర రహస్యగ్రంధకర్త
తేది: 23-7-93

**తెలికి చేర్ల రాజేశ్వర శర్మ**



Professor S.B. Raghunathacharya
Vice-Chancellor
Central Sanskrit University
Tirupathi

# ప్రస్తావన

బుక్కపట్టణం పేరు వినగానే అనంతపురం జిల్లాలో పుట్టపర్తికి సమీపములో ఉన్న ఒక చిన్న ఊరు జ్ఞాపకం వస్తుంది. ఈ పట్టణం ఇప్పుడు చిన్నదిగా కనపడుతున్నా ఒకప్పుడు బుక్కభూపతి స్మారకంగా కట్టబడిన పట్టణమని తెలుస్తున్నది. బుక్కపట్టణం ఇంటిపేరుగా గల కవిపండితులెందఱో సంస్కృతశాస్త్రాలలోను, తెలుగు సాహిత్యంలోను అద్వితీయమైన తమ ప్రతిభకు నిదర్శనలుగా ఎన్నో గ్రంథాలను రచించారు. వీరందఱికి మూలస్థానం ఈగ్రామమే అయిఉండటానికి అవకాశం కనబడుతున్నది. చారిత్రకాధారాలను పరిశీలిస్తే బుక్కపట్టణం ఇంటిపేరుగాగల వారిలో అనేక గోత్రాలవారున్నట్లు తెలుస్తున్నది. అందులో కౌండిన్యగోత్రులు, శఠమర్షణగోత్రులు సుప్రసిద్ధులు. కాలక్రమంలో బుక్కపట్టణంవారు తమ పాండిత్యప్రతిభలను గుర్తించిన ఆయారాజాస్థానాల్లో పండితులుగ, కవులుగ వన్నెవాసులను గడించినట్లు తెలుస్తున్నది. అనంతపురం జిల్లా ఆంధ్ర-కర్ణాటక రాష్ట్రాల సరిహద్దుల్లో ఉండటంచేత కర్ణాటక రాష్ట్రంలోని గుల్బర్గాజిల్లాలో కృష్ణా- భీమనదుల మధ్యలోగల 'సురపురాన్ని 18 వ శతాబ్దంలో పరిపాలించిన శ్రీరాఘవనాయకుని ఆస్థానములో బుక్కపట్టణం వారు పండిత కవులుగ ప్రసిద్ధిని సంపాదించారు.

కౌండిన్యగోత్రులు మహాపండితులైన బుక్కపట్టణం శ్రీనివాస తాతాచార్యులవారికి వేంకటాచార్యులు, అన్నయాచార్యులు, శ్రీనివాసాచార్యులని ముగ్గురు కుమారులు ఆంధ్ర సంస్కృత కన్నడ మహారాష్ట్ర భాషలలో మహావిద్వాంసులుగా ప్రసిద్ధి పొంది సురపురం ఆస్థానములో ఉండటంవల్ల వారికి 'సురపురం సోదరులు' అనే వ్యవహారం ఉండేది. న్యాయ విశిష్టాద్వైత వేదాంతాలలో వీరి రచనలు సుప్రసిద్ధాలు. వీరిలో అన్నయాచార్యులవారికి

శ్రీ..వాసాచార్యులు, వేంకటాచార్యులు, బుచ్చి వేంకటాచార్యులని ముగ్గురు కొడుకులు. పెద్దవారైన వేంకటాచార్యులుగారికి కిరీటం వేంకటాచారులు గారనే ప్రసిద్ధి ఉండేది. విశిష్టాద్వైత సిద్ధాంతంలో అనేక వాదాలలో ఇతరులను జయించి కిరీటాన్ని దరించడం చేత వీరికి అలా ప్రసిద్ధి కలిగింది. వీరు 'అచలాత్మజా పరిణయ' మనే తెలుగు ప్రబంధాన్ని రచించినట్లు తెలుస్తున్నది. 'వేదాన్తకారికావళి' అనే సుప్రసిద్ధమైన విశిష్టాద్వైత ప్రకరణ గ్రంథాన్నిరచించిన వారు బుచ్చివేంకటాచార్యులవారు. ఇప్పటికీ సురపురం పట్టణం శివార్లలోని 'సిద్దన అగసి' అనే చోట వీరి సమాధులున్నట్లు చెబుతున్నారు.

ఇక బుక్కపట్టణంవారిలో శఠమర్షణగోత్రానికి సంభందించిన ఒక కుటుంబం నూజివీడు సంస్థానములో సారస్వత సేవ చేసినట్లు తెలుస్తున్నది. శ్రీమాన్ బుక్కపట్టణం రాఘవాచార్యులవారు ఈకుటుంబంలో మూల పురుషులు వీరు వేదవేదాంగాలలో గొప్ప పండితులు. వీరికి అనంతాచార్యులు, చిన్నయాచార్యులని ఇద్దరు కుమారులు. పెద్దవారైన అనంతాచార్యులకు వరదాచార్యులు, వీరరాఘవాచార్యులని ఇద్దరు కుమారులు. వరదాచార్యులకు వేంకటాచార్యులు, అనంతాచార్యులు, రామానుజాచార్యులు, రంగాచార్యులు అని నలుగురు కొడుకులు పెద్దవారైన వేంకటాచార్యులవారికి ఎనిమిది మంది కొడుకులు. వారిలో ఆఖరివారు శ్రీనివాస తాతాచార్యులుగారు. వీరు తెలుగు సంస్కృత భాషలలో మహా పండితులు. వీరి ధర్మపత్ని సింగమాంబ వీరికి అనంతాచార్యులు, రాఘవాచార్యులు, వేంకటాచార్యులని ముగ్గురు సంతానము. రెండవవారైన శ్రీమాన్ రాఘవాచార్యులవారు సంస్కృతాంధ్రాంగ్ల భాషలలో అష్టావధానాలు చేసి పండితులను మెప్పించినారు. వీరి ధర్మపత్ని శ్రీమతి లక్ష్మీనరసమ్మగారు. ఆచార్యులవారు అవధాన విధ్యలో ఎంత ప్రసిద్ధులో మహాకవులుగా కూడా అంతపేరు కలవారు. శ్రీకువలాశ్వ విజయమనే ఈ ప్రబంధాన్ని ఆంధ్రదేశానికి అందించిన మహనీయులు వీరే. ఈ ప్రబంధానికి సంబంధించిన ఆశ్వాసాంత గద్యాలలోను, గ్రంధారంభ ములోను పై అంశాలు పొందుపరచబడ్డాయి.

*1.* ఇది శ్రీనాథ (ముని) యమునావతార పవిత్ర శఠమర్షణ గోత్ర పవిత్ర ఆపస్తంబ సూత్ర బుక్కపట్టణ కుల కలశాంబుధి రాకాసుధాకర

విజయనగర సంస్థాన సముపార్జితానేకాగ్రహార బిరుదాంచిత కర్ణాటరాజాచార్య శ్రీవేంకటాచార్య పౌత్ర శ్రీనివాస తాతాచార్యపుత్ర శిష్టజన హితాష్టావధాన కరణచణ కవలస్వ ప్రతిభా సముపార్జిత రాజకీయ హూణభాషా ప్రాభవ ప్రభావధుర్య వైయాకరణ పండిత రాఘవాచార్య ప్రణీతంబైన కువలాశ్వ విజయంబున ప్రథమాశ్వాసము సంపూర్ణము.

ఈ ప్రబంధేతివృత్తం భాగవత మార్కండేయపురాణాలనుంచి తీసుకోబడింది ఆచార్యులవారు ప్రబంధ కవుల మార్గములో రచన సాగించి ఈ కువలాశ్వ ప్రబంధాన్ని సర్వాంగసుందరంగా తీర్చిదిద్దారు. ఈ కవిపైన కవిత్రయంవారి ప్రభావం, ప్రబంధకవుల ముద్ర ఎక్కువ ఉన్నదనడంలో సందేహములేదు. ప్రతి పద్యములోను మహాకవిత్వలక్షణం మనకు స్పష్టముగా గోచరిస్తుంది. స్వాపజ్ఞమైన కల్పనలు ఈ ప్రబంధములో కుప్పలు తెప్పలుగా కనబడుతున్నాయి. ఉదాహరణకు ఈక్రింది పద్యాలను గమనించండి:-

భావంబందున్ వివిధగతులన్బాగుగా జూచి చేయన్
రావే బాముల్ జనులకెపుడన్యప్రకారానఁబోవన్
'కేవానస్యః పరిభవపదం నిష్ఫలారంభయత్నాః
నావాక్యార్థం బగునె వృథ భిన్నంబు సిద్ధంబు గాదే

సంస్కృతసాహిత్యానికి సుపరిచితమైన మందాక్రాంతవృత్తంలోకాళిదాస శ్లోకపాదాన్ని పేర్కొంటూ చేసిన కల్పన సచమత్కారంగాను, ఆహ్లాదకరంగాను ఉన్నది.

సంధ్యాకాలం చీకట్లు అలుముకుంటున్నాయి. ఆకాశంలో నక్షత్రాలు విరిసాయి. ఈ భావాన్ని క్రింది పద్యాలలో కవి పేర్కొన్న పద్ధతి అనల్పకల్పనాధురీణతను తెలియజేస్తున్నది.

రమణుడు రాకమున్న చికురంబులు దువ్వియలంకరింపగాఁ
దమిఁదమి కాంత పెన్నెఱులు తద్దయు విప్పి నిదిర్చెనోయనన్
దమములు పర్వెరోదసిని దచ్చికురాంతరుదంచిత ప్రసూ
నములట లేచి పైకెగసె నా వినువీధిని దోచె దారకల్

"బిగిఁదమి సోమయాజినుల పెండిలిఁజేయఁగ లాజహోమమున్
బగబగ సాంధ్యరాగ శిఖిపై నిడిరోదసి మంగలంబునన్
దగదగ కాలయాజ్ఞికుడు ధాన్యము వేయఁగఁ బెట్లిపెట్లిపై
కెగసెడు లాజలో యనఁగ నెల్లెడలన్విలసిల్లెఁదారకల్."

ప్రభాతసమయాన్ని క్రింది పద్యంలో వర్ణించిన తీరు ఎంతో హృద్యంగా ఉంది.

"ఉరవడి సూరు తేరున నసూరుడు గుఱ్ఱము బూనె దానికిన్
వెరవగు దారి సూప వినువీథికి నెక్కెను వేగుఁజుక్కయి
ల్లిరుసను నిద్రలేపెఁగ్గుకవాటులు కొక్కొరొకోయటంచు ని
ష్ఠుర విడుమందుఁ బద్మినికి పొందుర సేసెను దేంట్లు ఝుంకృతిన్."

తృతీయాశ్వాసంలో శ్రీసీతారాముల గొప్పదనాన్ని చెప్పిన పద్ధతి అద్వితీయంగా ఉన్నది. చూడండి

"సోముని వంటి శీతలుడు సూర్యునివంటి ప్రతాపశాలియున్
సామజవైరి వంటి బలశాలియుఁగాలుని బోలు ధర్మ్మడున్
గాముని వంటి సుందరుడు గల్గిన నిమ్మహిఁగల్గుఁగాక శ్రీ
రాముని వంటి ధీరుడు ధరాసుతఁబోలిన సాధ్విఁగల్గునే."

సంస్కృతాంధ్రభాషలకు సంబంధించిన ఎన్నో వృత్తాలను ప్రయోగించడం ఈకవికి ఆభాషలపైన ఛందస్సుపైనగల అధికారాన్ని తెలియజేస్తున్నది. తెలుగు జాతీయాలు, సామెతలు, పలుకుబళ్లు ఈయన కవిత్వంలో కోకొల్లలుగా కనిపిస్తున్నాయి. ఈ మహాకవి మునిమనుమలైన శ్రీమాన్ బుక్కపట్టణం తిరుమల ఆనందరామాచార్యులు గారు 1920లో వ్రాయబడిన ఈ ప్రబంధాన్ని 75సం. తరువాత వెలుగులోని తీసుకు రావడానికి చేసిన ప్రయత్నం అనన్యసాధారణం. ఆంధ్రదేశం మనసారా పీరిని అభినందిస్తుందని భావిస్తున్నాను.

తిరుపతి

18 డిసెంబర్ 95 **ఎస్. బి. రఘునాథాచార్య**



కృతికర్త ముని మనుమడు, ముని మనుమరాలు
శ్రీమాన్ బుక్కపట్నం తిరుమల ఆనందరామాచార్యులు,
శ్రీమతి బి.టి. వెంకటలక్ష్మి

# త్రికరణ్మయి మృదుపలుకు

# భక్తి నివేదనము

రామానుజ దయాపాత్రం జ్ఞాన వైరాగ్యభూషణం
శ్రీమత్ వేంకటనాధార్యం వందే వేదాంత దేశికం

శ్రీమాన్ వేఙ్కటనాధార్యః కవితార్కికకేసరీ
వేదాంతాచార్య వర్యోమేసన్నిధత్తాంసదాహృది

శ్లో. శ్రీమచ్ఛోభిత నాభిపద్మజ సురజ్యేష్ఠుండు నల్మోములన్
హేమాస్తన్యము లానఁబోయి శిశుతా హీనాత్మ నేర్పేదని
స్సీమ ప్రేమను నాల్గుచేతులిడి తత్క్షీరంబు లానించి యా
భామారత్నముల న్నగించు హరి సద్భాగ్యంబు మాకీవుతన్

త్రికరణ్మయి సారస్వత సంస్థ చరిత్రలో శ్రీమాన్ బుక్కపట్టణ రాఘవాచార్యులు గారిచే విరచితమైన శ్రీకువలయాశ్వ విజయము అను ఆంధ్ర ప్రబంధమును ముద్రించి ప్రచురించటము ఒక ప్రత్యేక స్థానమును సంతరించుకొన్నది. లోగడ యీ సంస్థ, సారస్వత విభాగము. వేదశాస్త్ర పండితులు, సాహిత్య విద్యాప్రవీణ, భాషాప్రవీణ (విశ్రాన్త ప్రధానాంధ్రోపాధ్యాయులు) శ్రీకాకుళవాస్తవ్యులు రచించిన:

1. శ్రీరుద్రాభిషేక మహాత్మ్యము
2. విరాట పర్వము (వ్యవహారికాంధ్ర భాషావచనము)
3. సూర్య నమస్కార ప్రభావము (మహాసౌమంత్రములకు ఆంధ్ర భాష్యము)

మఱియు

సంగీత విద్వాంసులు, సంగీత విశారద శ్రీమతి మహాభాష్యం పెరిందేవి గారిచే స్వరకల్పనచేయబడిన

4. శ్రీతాళ్ళపాక అన్నమాచార్య కీర్తనలు
5. స్వరకల్ప స్తోత్రరత్నావళి
6. స్వరకల్ప సంక్షేపరామాయణము

మున్నగు వేద, పురాణ, సంగీత గ్రంథములను ప్రచురించుట జరిగినది.

కానీ ప్రస్తుత కువలయాశ్వ విజయ గ్రంథకర్తలు నాకు మాతా పితా మహులేకాక, మా బుక్క పట్నం తిరుమల శఠమర్షణ గోత్రీకులు. మునిమనవడి నైన నాకేగాక త్రికరణ్మయి సంస్థ ఆరంభకులమైన మాఅన్నదమ్ములు, చెల్లెండ్రు వారికి ముని మనమలమే. మామాతా మహులలో చివరివారు, మూడవవారైనా శ్రీమాన్ మాడ భూషి శ్రీని వాసా చార్యులు గారు అత్యంత ధన్య జీవులు. కాకున్న సుమారు 100 సంవత్సరముల క్రితం వ్రాసి ఈ ప్రబంధ వ్రాతప్రతి 4, తరములుగడచు చున్ననూ దాని ఆచూకి ఎవరికీ పట్టకున్ననూ వారి తల్లిగారు (మాఅమ్మమ్మ గారు) వారి చిన్న ప్రాయమునయీ గ్రంధ విషయమ ప్రస్తావించిన విషయమును 50 సంవత్సరాల తరువాత (వారి రిటైర్మెంట్) జ్ఞాపకము పెట్టుకొని పలువురు మా బంధువర్గముతో ప్రస్తావించి తెలుసుకొని, ముందు మదరాసు విశ్వవిద్యాలయ గ్రంధాలయమునకు వ్రాసి, వారు తెలుపగా తదుపరి శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయ అనుసంధాన సంస్థకు వ్రాసి, పట్టినదిపట్టుగా యీప్రబంధ ఆచూకిని తెలుసుకొని వెలుపలికి తీసికొని వచ్చిరి. భగీరదుని వలె. ధృడ సంకల్పముతో ప్రబంధ వ్రాతప్రతి ఆచూకి తెలుసుకొనుట యేగాక, యింటా బైటా ఎవరు విసుకుకొనినా పట్టించుకోక వారి మేనకోడలు చిరంజీవి సౌభాగ్యవతి గోమఠం విజయలక్ష్మి గారిచేత ఆప్రతిని కాపీ చేయించుటయేగాక, దానికి తిరిగి ఆయన శుద్ధప్రతిని వ్రాసి మిగిలిన కార్యభారమును మేనల్లుడినైన నాపై యుంచి నాకు, మాత్రికరణ్మయి సారస్వత సమితికి ఎంతయో మేలు చేసిరి. కాకున్న మాకీఅదృష్టము లభించెడిది కాదు. కావుననే 'కులమునందు వొకడు గుణవంతుడుండెనా కులము వెలయువాని గుణముచేత' అనునానుడు అక్షరాల నిజము. వారు యీవిషయమున పట్టించుకొనని యెడల యీగ్రంధముకాల గర్భములో కలిసిపోయెడిది. కావుననే వారు ధన్యజీవులు.

నారాయణుడు, పరమపురుషుడు, పురుషోత్తముడు, పరంధాముడు యిట్టివన్నియు ఆభగవంతునికి పర్యాయ పదములు. సకలకళ్యాణగుణ సంపన్నుడైన భగవంతుని సంకల్పముతోనే సర్వమునూ జరుగుచున్నది. కావున శ్రద్ధా భక్తులతో ప్రయత్నించువాడు తప్పక కృతకృత్యుడగును. మా అందరి సంకల్పము శ్రద్ధా భక్తులతో జరిగినది కావున యీ గ్రంథము అనుకున్న రీతిలో వెలువడినది. ఇక మా ముత్తాతగారి గ్రంథ రచన గురించి మునిమనవడిగా నేను అభిప్రాయము తెలిపిన హాస్యాస్పదమని పించును. అయినను త్రికరణ్మయి సారస్వత సంస్థ తరుపున రెండు మాటలు వ్రాయసాహసించెదను భగవానుని దశావతారములు పురాణేతిహాసములలో పేర్కొనబడినవి. నాలుగు వేదముల సంకలనము ఉపనిషత్తులను గ్రంథీకరించిన తరువాత కూడా తృప్తి చెందని వ్యాసభగవానుడు నారదముని ప్రేరణమున యితిహాసములను కూడా గ్రంథ రచన చేసి లోకమునకు మహోన్నతి చేకూర్చి పెట్టినాడు. శబ్దప్రదానములైనవి వేదములు. కానీ పురాణములు అట్లుగాక మిత్రునివలె కథలద్వారా మనకు భగవద్భక్తి ప్రసాదించును. కనుక హిందూసాహిత్యమున పురాణములు అతిప్రధానములైనవి. భాగవతము పురాణములలో మిక్కిలి శ్రేష్ఠము ఎందుకనగా భాగవత రచన తరువాతనే వ్యాసమహర్షికి మనశ్శాంతి కలిగినది. శుకుడు పరీక్షిత్తునకు జెప్పిన భగవతత్వమే భాగవతము. ఇందుభవంతుని గుణములు, కర్మములు, నామములు అనేక కథల ద్వారా కీర్తింపబడినవి. భగవత్ప్రాప్తికి భక్తియే ముఖ్యోపాయమని భాగవతము చెప్పుచున్నది. శ్రీకువలయాశ్వవిజయంబను సత్ప్రబంధమున వైశంపాయన ముని యుపదేశింపగా జనమేజయ మహారాజు శక్తులతో వినిన వృత్తాంతము.

ఇందులో దుందుభాసుర వధ శ్రీకువలయాశ్వమహారాజుచేగావించుట, మరియు మధుకైట భాసురుల వృత్తాంతము ప్రధాన విషయములు. కానీ తృతీయాశ్వసమున రామాయణ కథ, సుందరాకాండ అత్యంత మనోహరముగా, అతితేలికగా అర్థము చేసుకొనుటకు అనువైన శైలిలో వ్రాసిరి. సీతాన్వేషణ హనుమంతుడు ఎటుల జరిపెనో ఈ క్రింది పద్యమున చిన్నతెనుగు పదంబుల చూడుడు.

సీ.మేడల నెక్కియు గోడల నక్కియు

మడువుల్డొక్కియు మచ్చులెక్కి
మాటిమాటికిఁ జాటు మాటుచోట్లల నేగి
బోటులగని నిద్రపాటు మీద
రంగస్థలంబులు రచ్చ పట్టులు మెట్టి
శృంగాటకమ్ములు తొంగిచూచి
బందులుండె డిచోట్లు పందలుండెడి చోట్లు
పెందలకడ సందుగొందులరసి
మూలముట్టుగఁ గనియెనాఁ పోలతండు
నిదియది యటుంచునొగి వచియింపనేల
బట్టియనుమఁడు మెట్టని యట్టినేల
లెక్కకును బెత్తెఁడైనను లేదు సుమ్మి

గీ. వెతికి వెతికి యతడు వేసారి వేసారి
లరిగినట్టి చోటికరిగి యరిగి
బలముగాఁగగాళ్ళు బలపముల్గట్టగా
రాముపత్ని కానరామిఁగదలి

నాల్గవ ఆశ్వాసమున భాగవతకథలో శ్రీకృష్ణదేవుని కథ క్లుప్తముగా, భారతకథ అరణ్యపర్వ విరాటపర్వ కథ, భగవద్గీతవిషయముల సంగ్రహముగా మనసువకు హత్తుకొనువిధమున కలదు.

5వ ఆశ్వాసమున కువలాశ్వుండు విజయదుందుభిమ్రోగించి కడకు కేశవ వరప్రసాదియైశౌరి చక్రమహిమచే దుందుని హతమార్చుట చక్కగా విశదీకరించిరి.

పై భాగవములన్నియు ఆశుకవితా ధారగద్య, పద్యంబులతో అనేక చమత్కృతాలంకార శృంగార వీరరసా స్వాదన వర్ణనలతో అనేక అచ్చతెనుగు నుడికార పదజాలములతో వారు సంకల్పించిన విధముననే యీ నవ్యకథను మధు మాధురీధురిన్ వ్రాసి అబ్బా! మాబుక్కపట్టణ పూర్వ వంశీయులలో యింతటిగొప్ప కవులుండుట వలన కోటికన్యప్రదాతలనగ శ్రీవైష్ణవమున పీఠాధిపతులుగ నుండిరి అని తెలియు చున్నది. ఈ మాబుక్కపట్నం తిరుమల వారి వంశాభివర్ణన చదివి తేనే గ్రంధము ఎట్లుండునో తెలియనగును.

సీ. ఏవంశమందున నావిర్భ వించిరి
శ్రీనాధయామున శ్రేష్టమునులు
ఏవంశమున భక్తు శ్రీవెంకటేశుండు
తాతగారని పిల్చిదాహమడిగె
నే వంశమున వారు ధీవిధి ప్రాయులు
నలనర పతులకాచార్యులైరి
ఏ వంశజార్యులు నింపుసొంపార స్థా
నాచార్యులైరి కాంచ్యాది విభుల
నార్యులే వంశమున సదాచార్యపురుషు
లైవసింతుగ॥ కోటి కన్యా ప్రదాత
లనగ శ్రీవైష్ణవమునఁ బీఠాధిపతులు
నట్టి శఠమర్షణాన్వయం బలరుమహిని

ఈగ్రంధ ముద్రణజరుగుచున్నకాలమున జరిగిన ముఖ్య సంఘటనలు

1. త్రికరణ్మయి సారస్వత అధ్యక్షులు శ్రీబుక్కపట్నం తిరుమల మోహన రాఘవాచార్యులు గ్రంధమున చాలాభాగము ముఖ్యముగా సుందరాకాండ ప్రూఫ్ కర్రెక్ట్ చేసినారు. వారు అప్పటికే హృద్రోగముతో అస్వస్థులుగా నుండిరి. 8,10 నెలలక్రితం గుండె ఆపరేషన్ చేయించుకొనిరి. ఎటువంటి యిబ్బంది లేకుండా శ్రియఃపతి దయ వల్ల క్షేమముగా నుండిరి.

2. మా రెండవ అన్నగారు శ్రీమాన్ బుక్కపట్నం తిరుమల రాధా కృష్ణమాచార్యులుగారు క్రిందటి అక్టోబర్ 94లో అస్వస్థులై కాన్సర్‌తో బధపడుచుండిరి. వారు యింతటి తీవ్ర బాధనను భవించుచూ కూడా ముత్తాతగారి గ్రందమున ముఖ్యముగా సుందరాకాండను చదివిరి మిగిలినకొన్ని భాగములు ప్రూఫ్‌దిద్దిరి. వారు అంతటి బాదనను భవించుచూ కూడా తనకికి అయుర్దాయము లేదని తెలిసి ముత్తాతగారి శైలిలో వ్రాసిన అయిదు పద్యములను క్రింద పొందుపరచు చున్నాను.

ఉ. ఎంతని వంతచెందినను చేరదుదైవ కృపారసంబునన్
చెంతకుచూడలేకను అభాగ్యుని పెన్నిధి చేయిజారదా

పొంతన లేని యోచనం పోయెడికాలము ఆగదేరికిన్
వంతయుచెందకన్ సతము వేడుము రాముని ది వ్యపాదముల్

ఉ. అంజని సూనుడాకపి వరుధ్యుడు దీనుల రోగగ్రస్తులన్
అంజలి మోడ్చినంతటను సంతతమున్ మరివారి పీడకన్
రంజనతోడుతన్ సదయ రాముని యందు నచంచలంబు భ
క్తింజవసత్వముల్ కలుగ కాచును బ్రోచుద యాంతరంగుడై

ఉ. అన్నిట తల్లిపోలికలె నావని యందరు మెచ్చుకోలుగా
మిన్నటగాన రీయలను మానక విద్యయు సాహిత్యంబునన్
ఎన్నిట యేమియుండినను యేవిధియీగాగతి నాకుకల్గెనో
సన్నిది యేశరణ్యము అచంచలభక్తితో వేంకటేశ్వరా

ఉ. నాదననేమియున్నది నాకునుగాగ యపూర్వరత్నముల్
వేదన కొచ్చి బోయినది యేమి నెరుంగని నాదు సీతయున్
వేదన గాకనాకిటను వేగిన గుండియ తోడు పీడినన్
కాదనలేను నేను మిము కాగల కార్యము కాకపోవునే

మ. జననంబొందితి పుణ్యదంపతుల రాజ్యలక్ష్మి నృసింహాచా
ర్యునికిం ఈశ్వర నామ మార్గశిర రాకాపూర్ణిమ రాశిలో
తనియంగా మరివారిసేవలను తన్విస్తీరగా చేసిర్వం
దన మామాత పితార్యకుంమిగిలె దేవానికేయీ జీవితం

3. మూడవ విషయం ఈ గ్రంథమును ముందు లెటర్ ప్రింటింగ్ కు యిద్దామనుకొని గూడా తెలుగులిపిలో డి.టి.పి. మీద కంప్యూటరైజ్ చేద్దామని S.S.డేటా ప్రాడక్ట్సు వారికి నమూనాగా కొంచెం పనియివ్వగా వారు రెండు వారాలలో ఒక అశ్వాసం పూర్తిచేసి యీ D.T.P. కంప్యూటరైజేషన్ పని వారికే పూర్తిగా యిమ్మని వారే అంతాపని ఉచితముగా చేసియిస్తామని వేడిరి. కారణము యీ కువలాశ్వవిజయము ప్రారంభించిన నాటి నుండి అంతకుమునుపు పని దొరుకక బాధపడుచున్న వాళ్ళకు చేతినిండా ఎడతెరపి లేకుండా పని వస్తున్నది ఈ విధమైన సంఘటనలు తెలిసీ తెలియనివి కోకొల్లలుగా నుండుననియే

నేననుకొందును.

గ్రంధప్రతులు విక్రయించిన ధనముతో మా యీ త్రికరణ్మయి సారస్వత సంస్థకు యిన్ని నాళ్ళు ఆర్థికముగా వెనుకబడినదానికి తగు నిధి ఏర్పాటు చేసియింకను అనేక ధార్మిక, ఆధ్యాత్మిక కార్యక్రములలో వినియోగించుట కొరకు గూడా 100సంవత్సరముల క్రితం జన్మించిన మా ముత్తాతగారి గ్రంధము పనికొచ్చుచున్నదని వినమ్రతతో తెలియచేయుచున్నాను.

మరియూ సాక్షాత్ శ్రీకృష్ణభగవానునకే యీకృతిని అంకితము చేసుకొనిన మాతాత గారే కాకుండా ఆయన వారసుల మైన మేమందరమే కాక యీగ్రంధముద్రణ విషయమై సహాయపడిన తిరుమల తిరుపతి దేవస్థానము వారికి, తన రీసర్చి పనితోపాటు వ్రాతపనిలోనున్నయీగ్రంధమును శ్రీవేంకటేశ్వర యూనివర్సిటీ రిసెర్చి ఇన్స్టిట్యూట్ తిరుపతి నుంచి శ్రమకోర్చి కాపీ చేసిన చిరంజీవి సౌభాగ్యవతి విజయలక్ష్మికి, గ్రంధమును పునఃపరిశీలించి అభిప్రాయములిచ్చిన శ్రీతెలికిచేర్ల రాజేశ్వరశర్మ గారికి, ప్రొ. శ్రీమాన్ S.B.రఘునాధాచార్యులుగారికి ఈ గ్రంధ ముద్రణ విషయమై అతి శ్రద్ధవహించి అచ్చు వేసిన కర్షక్ ఆర్టు ప్రింటర్సు, న్యూనల్లకుంట, హైదరాబాదు వారికి త్రికరణ్మయి తరుపున నాకృతజ్ఞతలు తెలుపుచున్నాను. ఇంతకూ చెప్పవచ్చేది ఏమంటే 100 సంవత్సరముల క్రితం జన్మించిన మా యీ ముత్తాతగారి గ్రంథరాజము వెలువడి గ్రంథ ప్రతులు విక్రయించిన ధనముతో మా త్రికరణ్మయి సారస్వత సంస్థకు యిన్ని నాళ్ళుగా వున్న ఆర్థిక యిబ్బంది తొలగి తగు నిధి ఏర్పడి యింకనూ అనేక ధార్మిక ఆధ్యాత్మిక, సారస్వతిక కార్యక్రమములలో వినియోగపడబోవుచు దని వినమ్రతతో తెలియచేయు చున్నాను.

ఇట్లు

**బి.టి. ఆనంద రామాచార్యులు**

కార్యదర్శి **11.3.96**

త్రికరణ్మయి, టి.ఆర్.టి. **141,**

విద్యానగర్ కాలనీ, న్యూనల్లకుంట పోస్టు

హైదరాబాద్ - **500 044.**

# శ్రీ వాన్ బుక్కపట్టణం తిరుమల రాఘవాచార్యులు
(మూల పురుషులు)
వేద వేదాంగములలో సుప్రసిద్ధులు

బి.టి. అనంతాచార్యులు | బి.టి. చిన్నయాచార్యులు

బి.టి. వరదాచార్యులు | బి.టి. వీరరాఘవాచార్యులు

బి.టి. వేంకటాచార్యులు (పెద్దన్న గారు) | బి.టి. అనంతాచార్యులు (చినన్న గారు) | బి.టి. రామానుజాచార్యులు (చిత్తన్న గారు) | బి.టి. రంగాచార్యులు (రంగన్న గారు)

ఎనమండుగురు కుమారులు
ఆఖరి కుమారుడు
**బి.టి. శ్రీనివాసతాతాచార్యుడు**
ధర్మపత్ని శ్రీమతి **సింగమాంబ**

బి.టి. అనంతాచార్యులు | బి. రాఘవాచార్యులు, ధర్మపత్ని శ్రీమతి లక్ష్మీనరసమ్మ, కువలయాశ్వ గ్రంథకర్త | బి.టి. వెంకటాచార్యులు

అలివేలమ్మ | సంగమ్మ | రాగమ్మ | రంగనాయకమ్మ | అమ్మాళ్ళమ్మ (భర్త శ్రీవాన్ వడమ్ఘాటి రంగాచార్యులు) | వేంకట గోపయాచార్యుడు 1892 - 1961, కుమార్తె వెంకటలక్ష్మి (యం. రామాచార్యుల గారి భార్య)

రామాచార్యులు | సీతమ్మ | రాజ్యలక్ష్మి (భర్త శ్రీవాన్ బి.టి. నరసింహాచార్యులు) బి.టి. రామాచార్యులు (మొదటి కుమారుడు) శ్రీకరణ్యము స్థాపకులు | లక్ష్మమ్మ | రంగనాయకమ్మ | వెంకటాచార్యులు | శ్రీనివాసాచార్యులు (కృతి శోధకుడు)

# విషయసూచిక

## ప్రథమాశ్వాసము



## ద్వితీయాశ్వాసము



## తృతీయాశ్వాసము



## చతుర్థాశ్వాసము



## పంచమాశ్వాసము

శ్రీ

# కువలాశ్వ విజయము

# శ్రీ బుక్క పట్టణ రాఘవాచార్య ప్రణీతము

## ప్రథమాశ్వాసము

శ్లో. శ్రీమచ్ఛోభిత నాభిపద్మజ సురజ్యేష్ఠుండు నల్మోములన్
హేమాస్తన్యము లానఁబోయి శిశుతా హీనాత్మ నేర్పేదని
స్సీమ ప్రేమను నాల్గుచేతులిడి తత్క్షీరంబు లానించి యా
భామారత్నముల న్నగించు హరి సద్భాగ్యంబు మాకీవుతన్ 1

ఉ. ప్రాకట రూపు కన్నులకుఁబండువు తల్లియు రత్నగర్భ ర
త్నా కరుఁడయ్యరాజు తనయన్న సుధాంశుడు దాసులెన్నఁదా
శ్రీకడు బుట్టుభోగియని చేయనెదంబతి రాణి వాసముం
జేకొనె నాఁగశౌరిహృది చెందిన యిందిర ప్రోవునందఱన్ 2

ఉ. మెప్పుగ గొప్పమెప్పు తన మేను ప్రసూనపు పూలపాన్పుగాఁ
ద్రిప్పిఫణా మణుల్పణులు దీపములట్టులు మేలి కట్లుగాఁ
జొప్పడఁ గుక్షిలోకములు జోఁకకు దూఁకు నటంచు జాగరం
బొప్పెడి నాది దంపతుల బ్రోచు ననంతుని నెంతు నెంతయున్ 3

సీ. పక్షవిక్షేపణోద్భవ చండపవనంబు
తోయధి స్పర్ధని తోడఁ గూర్ప
బదసన్ని కృష్ణసంభ్రమదనే కానోక
హములు బంధుని మాడ్కి ననుగమింప
నబ్ధి నింగికి లేవ నతల వాసులు శేషు
ననికిక బ్రహ్మణ్యమనుచుఁజేర

దిర్దిర దిరుగుచు దివికిలేచిన యద్రు
లాటాడు గోలి గుండ్లనుకరింప
భీతువడి నీట నుక్కిరి బిక్కిఱి యయి
పైకి విశ్రాంతి కెగయు మైనాక మనఁగ
నమృత హరణార్థమై దివికరుగునట్టి
వైన తేయున కొనరింతు వందనములు 4

సీ. శ్రీ హయగ్రీవుండు చెలగి కాపురముండె
నే ధన్యజిహ్వపై నిల్లుగట్టి
యిరువది యేండ్లకే యేధన్యు వరియించె
వెల్లికొల్లలుగాఁగ విద్యలెల్ల
వేదాంత దేశిక బిరుదే ఘనున కిచ్చె
గండపెండేరమ్ము కరణి శౌరి
శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంత హరిచంద
నమునకే ఘనుఁడు నందన వనమ్మ
సర్వతంత్ర స్వతంత్ర తక్షణ పరస్స
హస్రకృతి కర్త విష్ణుఘంటావతారు
శ్రేష్ఠ నాకవితార్కిక సింహ వేంక
టార్య దేశిక వర్యు నేనభి నుతింతు 5

ఉ. మేలగు విష్ణుపొన్పగుట మేలము లాడ పణీశుఁడుందునన్
దాలిమి దూలి యాగరుడు దవ్వులఁజూచినచో నదల్పఁగా
వీలగు నంచు నెంచు గతివేత్రము పూనెడు సైన్యనాథునిన్
జాలగ మేలు లిమ్మనుచు జాఁగిలి కేలు మొగిడ్చిమ్రొక్కెదన్ 6

క. నిస్తుల విపులాచ్యుత వ
క్షస్థల లక్ష్మీనివాస సౌధాగ్రమునన్
న్యస్తల సదుచ్చదీపము
కౌస్తుభమును శస్తదమును గణుతింతుమదిన్ 7

సీ. యజ్జ్వాల లుజ్జ్వాల లపహరించుఁ గమరించు
సర్వసురీకంఠ సూత్రములను
యద్ద్రావ ముద్ద్రావ మడరించు నడఁగించు
నసురుల యసుఖులకు సురులకు ను
యత్పాతముత్పాత మడగించుఁదొడఁగించు
సాధువులకును న సాధువులకు
యద్ధార యుద్ధారమై యార్చుఁ దీర్చును
గని యసురీ సురీ కజ్జలముల
యద్గుణమ్ముపణమ్మ జన్యములందు
దిసువ కసురులయుసురులఁ గొసరి కొనగఁ
దత్సుదర్శన శంఖ గదా కృపాణ
శార్గములు సత్ప్రహరణములే సంస్మరింతు 8

సీ. కవిత భూమికి దిగు కాలానఁ గాలన
వేద్యనెవ్వఁడు తొలి విడిది యయ్యెఁ
బ్రేమబారగ నట్టి వామలూరుజుఁ గొల్చి
సకల పురాణాళి జన్మభూమి
తొలుపల్కుతల చిక్కుతొలఁగించు దువ్వెనఁ
బంచమ శ్రుతి కర్తఁ బ్రస్తుతించి
గణనీయమతి యైన పణిన సూనుఁదలంచి
యంజలి జేసి పతంజలికిని
దనకు భవభూతికిని గవిత్వమునఁ దగవు
పొసఁగ నెవ్వాని దానినిఁ బొగడ వాణి
యట్టి కవి కాళిదాసుని దొట్టి తలతు
దండికవి బాణముఖులను దండికవుల 9

క. తెనుగుననకు నాదికవి వరుఁ
డని మన్ననఁగొన్న నన్నపార్యుఁగవిబ్ర

హ్మను దిక్కయజ్వ నెజ్జనఁ
బనివడి దలచెదఁ బ్రబంధ పరమేశ్వరునిన్ 10

క. ప్రకట పర పూర్వకవులను
సకల వరాధునిక భావి సకల సుకవులన్
సుకృతుల మన్నన సేయుదు
కొలువున బాస విడుమంచుఁ సుకవుల నంచున్ 11

కృతి కర్తృ వంశాభి వర్ణన

సీ. ఏ వంశమందున నావిర్భవించిరి
శ్రీనాథ యామున శ్రేష్ఠమునులు
ఏవంశమున భక్తు శ్రీవేంకటేశుండు
తాతగారని పిల్చి దాహమడిగె
నే వంశమున వారు ధీవిధిప్రాయులు
నలనరపతుల కాచార్యులైరి
ఏ వంశజార్యులు నింపుసొంపార స్థా
నాచార్యులైరి కాంచ్యాది విధుల
నార్యులేవంశమున సదాచార్యపురుషు
లై వసింతురు కోటి కన్యాప్రదాత
లనగ శ్రీవైష్ణవమునఁ బీఠాధిపతులు
నట్టి శఠమర్షణాన్వయం బలరు మహిని 12

శా. ఆ వంశమ్మున బుట్టిరార్యులు మహా హాస్యప్రవక్తల్ సుధీ
దివ్యాఖ్యుల్ నతా దాక్షిణాత్యులు మహా వీఖ్యాత శాస్త్రజ్ఞులున్
ధీవిఖ్యాతుని రాఅవార్య శుభబుద్దిన్నాజి వీద్రాజు
భావింపించి వసింపజెసెఁ దనన ధ్యాఅంబునన్ సూరిగాన్ 13

ఉ. ఆయన కిర్వురాత్మజు లనంత సుధీమణి చిన్నయాఖ్యుడున్
ధీయుతులందుఁ జిన్నయకు ధీరుట గల్గిరి పుత్రులిర్వురం

దాయత కీర్తి శాస్త్రములయందును వేదములందు నవ్విధి
ప్రాయుడు రాఘవార్యుఁడని రార్యుడు పాండితి వాది సింహమై 14

చ. అవల ననంత వర్యుఁడుగ బొబ్బ్యరుటూరు ముఖాగ్రహారముల్
భువిని గడించె నాయనకుఁ బుత్రకులా వరదార్య వీరరా
ఘవ సమభిఖ్యు లిర్వు రనఘస్థితి రెండవ పుత్రుడెంతయున్
జెవులకు నింపుగాఁ గృతుల జెప్పెను సత్కవులెల్ల రౌననన్ 15

గీ. వరదవర్యుండు గనియెను వరసుతుల
విపుల పాండిత్య శోభితు వేంకటార్యు
నల యనంతార్యు రామానుజార్యు రంగ
యార్యునైయాయి కాళ్యగ్రయాయి హోయి 16

గీ. శిష్టులగు వేంకటాచార్యులష్ట పుత్ర
కులను గని శతవర్షము ల్బొలగి మనియె
హాయిలుగని యష్టపుత్ర బహుధనమస్తు
అని శతీం జీవ యను నుడుల్సార్థకముగ 17

గీ. బాగు మీఱంగ వారలలోఁ గనిష్ఠ
సోదరుడు తేజరిల్లెను నాదుజనకుఁ
డార్యుడా శ్రీనివాస తాతార్య వర్యుఁ
డాంధ్ర గీర్వాణ పాండితిన సముడగుచు 18

గీ. తనర శ్రీనివాస తాతవర్యుఁడు సింగ
మాంబయందుమువ్వు రాత్మజులను
గనె ననంతవర్యఘును నన్నురాఘవా
చార్య వేంకటార్యు నార్యహితుల 19

క. పదుగురు తగునని మెచ్చగఁ
బదియాఱవ యేఁట సౌర భాషాంధ్రములన్
విదితముగా నింగ్లీషున
నొదవఁగ నష్టావధాన మొనరిచి నాఁడన్ 20

శా. విద్వాన్ వేంకటార్యుఁ బొండితిని నే వ్రేలెంచ శక్యంబెయే
విద్వత్కే సరికైన నన్నతఁడు భావింపంగ నూజ్వీటిలో
నద్వైత ప్రతిభన్నరేశు సభయందష్టావధానంబు నే
సద్వ్యాచాలతఁ జెప్పి యాతఁడును మెచ్చంగా క్షమాషోడశిన్
మృద్వీక స్థితిన నట్టినా నిపుణతిన్ మేల్మేలు వర్ణింపగన్ 21

క. శ్రీమచ్ఛర మర్షణగో
త్రామల శశివేంకటాహ్వయార్యతనూజున్
మామ కజనకు భజింతుఁబ్ర
ధామహితున్ శ్రీనివాస తాతార్యగురున్ 22

గీ. లక్ష్మిభక్త మదర్థాంగ లక్ష్మి నరస
కౌమరుఁగనియెను వేంకట గోపయాఖ్య
నతఁడు దీర్ఘాయురారోగ్య సుత సుపౌత్ర
సత్పరంపర నెగడు నాచంద్ర రవిగ 23

వ. ఇట్లు నిజనామపారాయణ జనావన పరాయణుండగు శ్రీమన్నారాయణునకు సపరి వారంబుగా స్వాచార్య ప్రాచార్య పూర్వాచార్య భి వాదన పూర్వకంబుగా బహుపారంబు కైవారంబు సేసి సనాత నాథునాతన భావికాలిక సకల సుకవులన వికల భావంబున సంభావించి నానావిధ దేశ్యపద నీరంధ్రంబగు నాంధ్రంబున దివ్యకథా భవ్యం బుగా నొకనవ్యకావ్యంబు సరసజన రుచికరంబుగా రచియింపంబూని కృతిని మానవుల కొసంగుట విహీనంబనియు నట్టి యుభయలోక భయానకా నర్థాపాదకంబగు వ్యర్థకార్యంబు కంటె సకల కలుషదురావయు నిరాయాస నిరాకరిష్ణుఁడగు శ్రీవిష్ణునకు దాస పోషకుఁడగు వాసుదేవునకు సర్వాభీష్ట ఫలప్రదాయకుఁడును శరణ శరణ్యుఁడును శరణాగతి విద్యాతత గీతా శాస్త్రాభిధాయకునకు వృష్ణికుల వర్ధిష్ణునకు శ్రీకృష్ణునకే కృతి సమర్పించి నిష్ఫలంబగు నాజన్మము సఫలంబు సేయందలంచి

24

షష్ఠ్యంతములు

క. మధుమధుర సుగుణ గణునకు
మధుమధనునకు నుబ్బృధాకుమారవనాళీ
మధువునకు మాధవునకును
మధురాపుర నందగోప మాణవకునకున్ 25

క. ధన దునకు కుచేలునకును
జనపాలునకున్ యశో విశాలు నకులసత్
ఘనకనక చేలునకునువి
యానునకు సుశీలునకును యదు బాలునకున్ 26

క. విష్ణునకును బరిపాలిత
జిష్ణునకును గోపగృహవిశిష్ట దధి పయో
ముష్ణునకును శుభసంవ
ర్ధిష్ణునకు సహిష్ణునకును శ్రీకృష్ణునకున్ 27

వ. సమర్పితంబుగా నాయొనర్పం బూనిన కువల యాశ్వ విజయంబను సత్ప్రబంధమునకుఁ గధా ప్రారంభం బెట్టిదన

28

# కువలయాశ్వ విజయ కథా ప్రారంభము

క. వైశంపాయన ముని యుప
దేశింపఁగ వివిధకధలు ధీనిధివినిదే
వేశాభుఁడు జనమే జయుఁ
డాశం గువలాశ్వుఁ గూర్చి యాకర్ణింపన్ 29

వ. సవినయంబుగా మునికిట్లనియె 30

ఉ. మౌనివరా!సురాశనము మాదిరి మాధురి నీమృదూక్తి మెం
తేనియుఁదేనియన్నగుచు తెంపు జనింపఁగ జేయుగాననే

వీనుల నానియాని యఱవీసము తృప్తినిగానఁ గాన్కగా
నానతి నానతిమ్ముగొని, నవ్యకథన్ మధుమాధురీధురిన్ 31

క. కువలాశ్వుఁడనెడు భూపతి
కువలయము న ధుంధు మారకుండెటు లయ్యెన్
జెవులార వినఁదలంచెదఁ
జవులూరఁగ నుడువుమనిన సంయమి పలికెన్ 32

మ. వరరత్నాంచిత భర్మ హర్మ్య శిఖర వ్యాసక్తి తారాళి భా
సుర మాంగళ్యస పుష్ప తోరణ గతిన్ శోభిల్లఁగా ధాత(శ్రీ)
హరి ముందించు దయించు నంచుఁ బురి సర్వాతీతఁగాఁ జేసె నా
సరయూ తీరము నందయోధ్య వెలయు స్సర్వామరా రాధ్యయై 33

ఉ. కాపురముండు లక్ష్మి కలకాలము గాలము వైరి గుండెకున్
గాపురమాధినాదుఁడట గణ్యామగణ్య మహర్ని శంబులన్
కాపురమై సమస్త భువికా పురమెప్పుడు నొప్పులొల్కుచున్
గాపుర మంచు నవ్వ నలకాపురి గోపురి పన్నగేభ్యుడున్ 34

సీ. మహిని లింపులు నిష్క్రమమునఁ జతుః పంచ
షట్సహస్రాస్యుల నఱకు గొనరు
రామత్రయముకంటె రహి నర్జునుల కంటె
శూరతన్నపు లెచ్చు చూపు వాసి
ది జ్యాత్రనిధి యందు ధిక్కరింత్రు కుబేరు
బేరులు సంపద బేరువాడి
తెగఁబండి యెఱఁగు ముద్దిరుసు ముక్కలులుగా
సస్యముల్నా లవజాతి కెప్పుడు
నచ్చరల మచ్చరించుచు వి[illegible]విడి
మచ్చికను బచ్చవిల్తుని మరులుగొల్ప
వలఁతులలఁతులఁ గనరెంత వానినైన
వెలదియింతులు వెలయింతు రనుఁగు కాంద్ర 35

ఉ. అందలి ఖేయ సాలములు నందముగా నొకఁడొంటి తోడుతన్
బందముగట్టి పన్నగ సుపర్వుల లోకములంట వెంటనే
ముందుది గమ్య భూమికిని బోయెను వెన్కటిదంటె జుక్కలన్
మంద మటంచు దానినిట మాటికి ఫేన మిషంబునన్నగున్ 36

ఉ. ఆనగరీతురంగముల నాదట గెల్వఁ గురంగ వాయువుల్
పూని జయింపలేక తుదిఁ బొచ్చెము నంది యొకింతయేణముల్
కానల దూఱి గడ్డిదిను గాడుపు మూల నణంగె కంటివే
కానఁగ రాకపోయె నటుగాదె మహాత్ముల కోటు గల్గినన్ 37

క. గురు కుంభము లురు శృంగము
లరయఁగ మదివారి ఖురము లమితో త్సేదం
బొరయుచు నుప్పర మప్పురి
కరులా ఘీంకృతుల గిరులఁగలకల నవ్వున్ 38

ఉ. ఆపురిసాల రీతి యభియాతిని భీతి నొసంగి దాలనే
యాపుర శాలి సత్పరిఖయల్ల రసాతల సీమనంటుఁదా
దాపురసాల సాలములు దార సుధారసభారవాహులై
త్రాపురసాల వాలఫలతందు రసంబులఁ గోరు వారికిన్ 39

క. పల్లవిత ఫలిత పుష్పిత
సల్లలిత ద్రుమలతాది సకలర్తుకమై
యుల్లసిలి చైత్ర రథమును
నుల్లసముల నాడు నచటి యుద్యానములున్ 40

ఉ. అక్కడి సౌధరాజిపయి హత్తిన శాలల పాళి లోపలన్
జక్కగ నిచ్చలేగుటను జంద్రుఁడు వానికిఁ జంద్ర శాలలం
చొక్కట నామమేర్పడియె నొప్పదటన్న శిరోగృహమ్ములన్
నెక్కునఁ జంద్రశాలలని నేఁటికి నేటికిఁబిల్తురీ భువిన్ 41

చ. తలకొని పుష్పవంతులకు దారికి నడ్డము తొట రాకపో
కలగడు సంకటంబిడు నగారము లంచును వారి కీరు వీ

ధుల సమకట్టి కట్టిరి ప్రతోళులనందున పట్టియే జనుల్
సులువగు సూర్యవీధియని సోముని వీధియటంచ్రు నేఁటికిన్ 42

ఉ. మించెడి సౌధకుడ్యముల మీఁద నలంకరణార్థ మింపుగా
నుంచిన కెంపు కుంపటుల నొప్పుగ బెంచిన పూల చెట్టులన్
దెంచును జంద్రులేఁడి యని దృష్టికి నెత్తిరి గోపురాలపై
గాంచన పంచవక్త్రములఁగాపునకై బెదురుంచి రోయనన్ 43

చ. మరకత రత్నజాల పరిమండిత తత్పుర బాహ్యసీమలన్
సురచిర శాద్వలంబులని చూఁఅగ మేయఁగ బోయి లేళ్ళుగో
పురతపనీయ సింహముఖముల్ గని భీతిలి చౌకలించుటన్
ద్వరగతి దృష్టికాతురత వానికి నేర్పరొనాటఁ బట్టియున్ 44

సీ. సకలాగమమ్ముల సకలాగమములట్ల
సుమనః ప్రకాండ సంశోభితములు
సుమనః ప్రకాండంబు సుమనః ప్రకాండమ
ట్లతి వచనామోద మావహిల్లుఁ
గాండప్రచారంబు కాండప్రచారమ
ట్లహిత పరాసుతా పహరమగుచు
నహిభయంబడఁగి నట్లహి భయంబడగెను
జక్రి మంత్రదరోచ్చాట నమున
గోపురము రీతి విల్లసిల్లు గోపురంబు
నుచ్ఛ్య సంస్థిత కోటి వియచ్చరముగ
ధనము విలసిల్లు యుద్ధ సాధనము వోలె
నఖిల పరదాన యోగ్యమై యఖిల పదవి 45

క. ఆపురము తరణి వంశజ
భూపతులకు సతత మతుల భోగాస్పదమై
కాపురపు రాజధానిగ
దీపించును గోసలమున దివిజులు మెచ్చన్ 46

ఉ. మేలుగనేలు నాపురము మేలు భళీ నరపాలమాత్రుఁడే
కాలుఁడితండు వైరులకుఁగంతుడు కాంతలకంచు నెల్లరున్
లీల నుతింపఁదన్ను నవలీల జయించి సమస్త దేశముల్
హాయిగనింద్రుబోలె బృహదశ్వ నరేంద్రుడు కీర్తిసాంద్రుఁడై 47

సీ. తన భుజాదండంబు ధారుణీదేవికిఁ
బ్రియమైన సుస్థిర పీఠి గాఁగఁ
దనదు పాణి కృపాణి తనర సపత్ని సీ
మంతినీ కజ్జల మపన యింపఁ
దనశాసనము సర్వధాత్రీపతులకు నౌ
దలను ధరించు పూదండ గాఁగఁ
తన కీర్తి నర్తకి తనరారు దేవతా
నగరాల నిత్యంబు నాట్యమాడ
తన పరాక్రమ సంపద తనరుచుండ
అఖిలదీవుల ననయంబు నానవాలు
తనదు తేజంబు దినమణి భాతివెలుగ
భూమి పాలించె బృహదశ్వభూమి జాని 48

ఉ. ఆయన సోయగంబు సుజనాదరణంబు రణంబు నేరుపుల్
పాయని కాయశుద్ధియు నుపాయ మపాయలేని మంత్రమున్
దీయని న్యాయవృత్తి వెనుదీయని బీరము నెంచిచూడగా
నాయనకెన్న నాయన యెయౌ నెనగా రెవరేయుగంబునన్ 49

క. ఆయన ధర బాలించెను
నాయన పలెఁబ్రజలఁజూచిన యన యుగమునన్
నాయతముగ ఘన సౌఖ్యో
న్నౌత్యముగని సుగతి జగతి నరులునుతింపన్ 50

చ. అతనికి గల్గె నందనుడనంతుడు తానతి రాజవర్తనుం
డతను కళాధురంధరుడహోయసమాన సమాన ధైర్యుడై

అతనుడు పద్మనాభునకు నట్లు జయంతుడు జంభబేదికిన్
అతులిత కీర్తిశాలి కువలాశ్వమహీపతి పుణ్యమూర్తియై 51

వ. అట్లుదయించినయతండు 52

సీ. భూమీశుఁడౌట నాభూమీశులకు సాటి
యౌనటంచన్న నేమంత వింత
నరదేవపతిగాన నరదేవ పతులతో
నౌను దీటన్న నేమద్భుతమ్ము
రాజసింహముగాన రాజసింహములతోఁ
బురుఁడన్న నేమి యబ్బురపు మాట
సమవర్తి శుచిగాన సమవర్తిశుచులకు
సదృశుడౌననేమి సందియంబు
సర విశ్రాంతి విభూతి సమితి భోగసుకాంతి
విక్రమ క్రమతోష్ణ వృత్తి నవగ
కువలయంబున జూడఁగువలాశ్వుఁడభి లారి
భంజకుండును లోక రంజకుండు 53

గీ. సర్వ సర్వంసహాచక్ర సర్వ భార
వహన సహనారి గహన సందహన దహనుఁ
డసమ సమరామ రామ్రామ హార సమాన
భీముఁడన దగుఁగువలాశ్వ భూమిజాని 54

సీ. శృంగార యోనినాఁ జెప్పుటొక్కటెగాని
కంతుడనంగుండు కాఁడెచూడ
మహిసుధాంసుడనిన మాట మాత్రమె గాని
యిందుగళంకి గా నెఱుగ రొక్కొ
సురభియామని యటంచును జెప్పుటేకాని
జాతిహీనుండు వసంతుఁడరయఁ
గను శుభాంగా కలంక సుజాతి మహితుండు
నైనట్టి యీకువలాశ్వుతోడు

గీ. కినియగా కంతుడుం గింతుఁడును సుధాంసుఁ
డును గిధాంశుడును వసంతుడును గిసంతుఁ
డెమ్మెయిని హస్తిమశకాంతరమ్ము సుమ్ము
తరములెన్నఁగ నెవ్వారి తరము లన్న 55

గీ. డాబుగా తండ్రికంటె నేడాకు లెచ్చు
చదివెనిలవీడు సకలశాస్త్రాల జూడ
మ్రొగ్గి యితనినె ఘనుడంచు ముల్లుచూపు
తులను బెట్టంగ జగముల తూచగలమె 56

చ. అతనికి నేకవింశతి సహస్ర కుమారులు మూరు మీఱు వా
రతను తనూవిలాసముల నర్యమునంశువు లెల్ల నేకవిం
శతి శకలంబులొక్కొకటి చక్కఁగ ముక్కలు సేసి యాత్మ సం
తతి నుదయింపఁజేసెనొ యనన్ జనియించిరి మంచి నించుచున్ 57

సీ. వేడుక మడిదున్ని వెదపెట్టఁ గుప్ప తె
 ప్పలుగాఁగ మొలచిన పైరనంగఁ
గొమ్మ కొమ్మకు వేలకొలఁది గజడవోసి
 ఫలియించు సహకార ఫలము లనఁగ
జండాంశుకరవిక స్వరములైసరసుల
 నిండఁ బూచిన పద్మషండ మనగఁ
బగలు దీఱఁగడంగి మొగులు జాఱగ నింగి
 నొక్కటఁ బొడమిన చుక్కలనఁగ
గీ. శరధి తరలెడు తరఁగలఁ దెరలఁ దరలి
వెలికిఁ బలువడి వెలువడి తళుకు చిలుకు
కులుకు లొలికెడు రతనంపు మొలకలనఁగఁ
గొమరు మిగిలిరి కువలాశ్వకొమరులలరి 58

చ. హరి విభవావతారములు నారయుగా బదిగానఁ దానుసఁ
బరమున నట్లకాదలచి బ్రహ్మయు నంతకుమున్న నాకృతుల్

బొరయుటఁ బూర్తికై మఱొక మూర్తిగ నీకువలాశ్వు డయ్యెఁగా
కరయఁగ నొక్క పూరుషున కందఱు పుత్త్రులనొంద శక్యమే 59

ఉ. వారక తారకలక సువు వాలుక లెంచిన నెంచవచ్చుఁగా
కారయ నారితేఱి కువలాశ్వతనూజులఁ బెంచు దాదులన్
వారల మన్చు వెజ్జులను వరాలనుంజదివించు నొజ్జలన్
వారి విహారయాన పరివారము లెంచ దరంబె యేరికిన్ 60

వ. ఆజనపతి తనయులు వినయ సంపన్నులై పన్నుఁగా దమ్ము గనుంగొను జనమునకుఁ గనుల పండు వొనరించుచు ననుదినము ననువుగ నింపు జనింప దినదిన ప్రవర్ధమానులై సమృద్ధిన సమానులై బాల్యకౌమార వయస్సుల సమానవయఃప్రమాణకులగు వయస్య మాణవకులం గలసిమెలసి బుద్ధితెలిసిన కొలది నక్షరాభ్యాసంబయ్యుఁదద్వ్యాసంగంబు నందాసక్తి గదురమి మనోను సారంబుగా వలసిన వినోదంబు లందాదరంబు ముదిరి నానాఁటికి నాటల యందు దవిలి పైఁగా బడియందు నయ్యవారుగావించు గుంజిళ్ళు, గుంజనకాలు, ముంజేతిమురువులు, వంగుడులు, గోడపీటలు, కోదండము, దండ పట్టీలు, చెవుల పట్టీలు, బుగ్గబూరెలు, వెన్నుగారెలు, తొడపాసెము, ముంతపొగలు, బొండమెయ్య, బండమోత, పెడకాలు, పెడకీలు, మొట్టికాయలు, లెంపకాయలు, సంకిళులు, నిలువు కొలువు లోనగు మేనివెతలకు బెదిరి యాటవిడుపు నాళు లెప్పుడెప్పుడని యెదురు సూచు చయ్యవి తటస్థపడిన బడివాకిలి గడపఁ ద్రొక్క నక్కఱలేదని చయ్యనఁ దొలినాఁట నింటగోజాడి తెచ్చిన యాటవిడుపు డబ్బులు మునిమాపు దీపంజ్యోతి చెప్పి సిరి చుక్క దెబ్బలందుకొను వేళ నయ్యవారి కప్పనము నప్పన సేసి కప్పము సెల్లుడి బడిపెద్దకుఁబప్పు బెల్లములకుఁ గొండొక ముట్టఁజెప్పి పోయి మఱల బడినాఁటి దనుక మఱలఁబడి రాని పాఠము లాటల సందడిని గట్టిపఱుచుకొనఁ దలపెట్టక కట్టిన పొత్తములు కట్టినయట్లె పెట్టిన చోటనె పెట్టియుంచి విప్పకయాజోలి కట్టిపెట్టి వచ్చి యున్న పాటంబులను మొదటి పాటంబు సొదుమి మొదలంట మఱచి యయ్యవారికే యొప్పగించి యాయన యేది చూత మొప్పఁజెప్పు మనిన నప్పటికెద్దిరయో నొకతప్పు టెత్తుపన్ని తప్పించు కొనవచ్చునని తోడి బాలురతో ముద్దులకుద్దులై

ముద్దుగ నాడిన యాటలెట్లనిన 61

సీ. బండియుఁ జెడుగుడు పచ్చీసు పులి జూదు
మచ్చన గాయలు నమ్మనములు
నుప్పనబట్టేలునుప్పట్టు నీగాట
చీకటి మోదులు చిమ్మ బిళ్ళ
బొట్టనగోలిలు నెట్టుడు కాయలు
చొగడాలు పాళియుఁ బగడసాల
గుడుగుడుగు చాలు గుందేటి దాఁటాలు
దాఁగుడు మూఁతలు దండపట్టు
కోతికొమ్మచ్చి దొంగాట కుందికుట్లు
మేకలాటయు బులియాట రాకురాకు
బండి చదరంగము పతంగి పావురాల
యాటయు దశావతారియు నవల మఱియు 62

సీ. ఆలంకయాలంక కోలాటములు మఱి
గుఱ్ఱపుఁ బందెము ల్కోడి పందె
ములు గచ్చకాయలు మొగిలి పటంబులు
గాలి పటంబుల గవ్వలాట
నాల్గుకంబాలాట నక్కాట కొక్కాట
వామన గుంటలు వత్తులాట
చిట్టిపొట్టికాయ చిత్తర బిళ్ళయు
గుఱ్ఱపెక్కిళ్ళును గోలి గుండ్లు
గంగిరెద్దాట మఱియు సింగన్న దాట్లు
గోట దొర్లుడుకాయ చెండాటచాకి.
మూటసరి బేసులును దోయిలాటముచ్చు
లాటకుప్పిలు జల్లీల యాటలనఁగ 63

సీ. బొంగరంబుల యాట పొదుగుళ్ళు వెతుకుళ్ళు
నపర తిప్పర తాండ యష్ట చెమ్మ
నానవల్లప్పులు గొనెకప్పుళ్ళును
జిమ్మన గ్రోవులు బొమ్మరాలు
తూరనడుక్కాలు దోబూచికన్నులు
గుజగుజరేకులు కొంగులాట
గుబ్బట్ల గురిగింజ కుమ్మర సారెలు
పిల్ల మెఱెంబులు పిల్లిగూటు
వీసెగాజులు గుజ్జాలు వెతకులాట
మచ్చు విద్దెలు నెఱవిద్దె మట్టిగూళ్ళు
నిట్టి బాలురయాట లెన్నెనిగలవు
వాని నన్నింటి నాడిరి వరసబెట్టి 64

వ. నాటికాలమున నాన్నపాలు బాలురు పాఠశాలకుం జదువఁ బోవు తెఱంగెట్లనిన 65

క. పలకలు చదరలు గంట
మ్ములు కవిలెలు తాటియాకు పొత్తములునున్
బలములుఁ జూఱకత్తులు
బలు విడిగొంపోదురెలమి బాలురు బడికిన్ 66

క. ప్రకటము లిరువది యెక్కము
లకరన్నకిరీలు వెఱసులట రాశికములే
నికరముగ నన్నియొడ్డులు
సకలములగు గణితవిధులు చదివిరి వారల్ 67

సీ. మునుమున్న యోనమాలను గుంటలన్ దిద్ది
యంత బళ్లైదు గుణింత మెఱిఁగి
వడిగఁ బేరులు నేర్చి విడివేల యంటిట్లు
పరగఁ బుస్తకమును బట్టి యమర

కాండత్రయమ్మును గంఠపాఠము సేసి
యటఁ బరశ్లోకాన్వయంబు సేయ
బ్రకట కావ్యమ్ములు పఠియించి నాటకా
లంకారములను నిశ్శంకముగను
జదివి యష్టాదశ పురాణ సర్వశాస్త్ర
వేదములు నేర్చి యాధనుర్వేదములను
నిట్టె చూచిన వారల నట్టె చూడ
వింత నెంతటి బుధులనిపించి కొనిరి 68

గీ. ఇట్లు సిరిసంతతులు రెండు నెచ్చి నడువఁ
బ్రజల కెల్లను గన్నుల పండువగుచు
నుచ్చ సామ్రాజ్య మహిమ సముచ్చయమున
నుండె బృహదస్వ మార్తాండుఁడపుడు చూడ 69

సీ. హరితోడ వివదించి సిరియందు వచ్చెఁగా
కున్న నీ విభవ మెట్లుండ గలదు
శర్వుతోఁ గలహించి సతి యిందు నుండెఁగా
కీ సర్వ మాంగళ్య మెటులభించు
బ్రహ్మను నిరసించి భారతి చేరెఁగా
కున్న నీవిద్య లెట్లుండఁబోలు
నల త్రిమూర్తులు నాంద్రకై యావహిల్లిరి
కాకున్న మహిమ యేకరణిఁ గల్గు
ననుచుఁదనుఁగని మనుజులు దనుజరిపులు
మనువు నను వునఁబ్రజలను మనుచు ననుచు
వినుతి యొనర్పింపఁగువలాశ్వ విభుఁడు శుభుడు
జనకు ననుమతి యౌవరాజ్యంబు బూనె

వ. అంత నొక్కనాడు బృహదశ్వ మహీకాంతుండు తన యనంతరంబున నితంత రంబు నిరంతరాయంబుగ నిజ తనయుండు రాజ్యపరిపాలన సేయనేర్పరచి తద్వృత్తాంతం బంతయు రాష్ట్రజనుల కెల్లఁ బేరోలగంబున వెల్లడిసేయ

నుద్దేశించి యెంతయు వింతగ నింతంతనరాని సంతసంబునఁజెంతను సంతసంబునకు నావంతయేని కొఱంత లేక శుభస్వాంతులుగ సంతసపడు మంతురులును, వారికన్న మిన్నలనిపించు కొన్న, కన్నాకులుతదంతికప్రాంత వర్తులగు సామంతులును, దండ రెండవ ధండధ రులం బోలె నఖండ భండనోద్దండ కోదండ చండ పాండి తీమండనారాతి హరిణ మండలీని ఖండన పుండరీకాయ మానప్రచండ శూరశుండాలంబులును, దండోప తండంబుగ దందడి సందడించు దండనాయక ప్రకాండంబులును, బ్రధాన రాజ్య భార నిర్వహణ ధూర్వహోతి విశదమతి విజిత శతధృతి శతక్రతు గురుగుణ గణ నిధాన నిదాన మహా యోధాను యోధులును, జిరంతన కాలప్రభృతి కులక్రమాగతా తీతా నాగతాది నానా విధ వృత్తాంత బోధనా సాధనా సాధారణ ధోరణీ నిధానులగు ముఖ్య ప్రధానులును, ననవరత శుభరతా ప్రతిహత సుకృతి నిరతమతి విహితులగు పురోహితులును, వివిధ సత్కథా సుధారస సంతత సంతర్పిత శ్రోతృ పాపతాపనోదన దురీణకులగు పౌరాణి కులును, సకల శాస్త్రీయ సందేహ సందోహ నిరాయాస నిరాకరణ చరణ పటు తర భారతీ పద కటకఝుళంఝుళాయమాన వాగ్ఝరీ సాహిత్యులగు నాటకాలంకార సాహిత్య సహితులును, వింత నిరవద్య విద్యానవద్య వాణీగణనీయ పాణినీయ, నిశ్శేష శేమితా శేష కర్కశతర్క కాణాథ్యంజన కాణాద, కర్మబ్రహ్మ ప్రశంసాస్పద మీమాంసాది షడ్దర్శన విమర్శనా జ్ఞానాంధంతమః కర్మన సుదర్శనులగు దీర్ఘ దర్శులును సుశబ్దాపశబ్ద విచికిత్సాకరణ శరణులగు వైయాకరణులును, దుర్వాద దూరీకరణప్రచార దూర యాయికగులగు నైయాయికులును, ఇట్టి వివిధ విద్యా మండితులగు నఖిల పండి తులను.

అనన్య సామాన్య విధి వధూ స్తన్యమాన్య సుధా మధుమధుర సరస సంగీత భంగీ సంపూర్ణాకర్ణన మాత్రాతిమాత్ర విస్మృత సమస్తేతర వ్యాపార సభాస్తార విస్తార సంపాదిత శిరః కంపన పూర్వక సంస్తూయమాన శిశు పశు ఫణి ముఖి నిఖిల చేతనానందసంధాయకులగు గాయకులును, భూయోభూయ శ్శ్రేయో విధాన నిదానాభయ ప్రదాన వరణ శరణప్రవణ నిటలతట ఘటితాంజలి పుట ముహుర్ముహుర్ద్వార నివారక ప్రతీహార సందర్శితసమయ నిరీక్షణ కర్మితులై

ప్రాపిత సంతాపులై యరిగాఁపులై హోరాహోరి జోహారు లిడుచుఁదోర హత్తులుగ హత్తులు లోన గునులు పాలరి యప్పనమ్ములుగఁగొని వచ్చి బరువడిఁ బ్రఘూణ ప్రాంతముల హత్తుకొనియున్న పరన్నపా లురును, స్వకృత్యనిత్య భృత్యాయితా మర్త్యహరిణేక్షణాక్షణ ప్రేక్షణీయ నిజన్నృత్తావ లోకన మాత్ర సంపుల్ల లోచనాసేచనక భాజన సభాజన సభాజానా పార పరిఫణిత వారవనితా జనతా మంజు మంజీరకల శింజిత సంజాత మహోల్లాసప్రతి నర్తన తత్పరమధురాలాప కలాప ధురందర పంజరాంత స్సంభ్రమభ్రమ త్కీరశా రికావారంబును, నిజనృప విజయపర పరాజయ సాంయుగేన శస్త్ర విద్యాదూర యాయికసాంపరాయిక విషయ వివిధ విచిత్ర కథాను సంధాన సంకలిత లలిత చరిత భరితావికల సకల స్తుతి పాఠపా రాయణ పరాయణు లగు వందారు వందిమాగధ బృందంబును. వలసిన పనులకుఁ గలసి మెలసి కనుసన్నలమెలంగి తొలంగక యేనుముందేను ముందనుచు నహమహమికఁ జుట్టుకొని చుట్టలవలె విధేయతా జ్ఞాపనా ర్థముగ వక్త్రన్యస్తహస్తులై బుద్ధి బుద్ధియనుచు శిరః కంపన పూర్వకంబు గాఁదద్దయు నొద్దిక సుద్దుల నొపుకొనుచు నెల్లపుడు నృపున కభిముఖులుగాక యించుక యెడ గలుగ సమ్ముఖమ్మునకుఁదొలంగి యోరసిలి నిలిచి ప్రద్వీభూతోర్ధ్వకాయులై భావుక స్వభావకులగు సేవకులును నర్హణీయులగు బ్రహ్మ క్షత్రియవిట్ఛూద్ర ప్రబర్హులును, దక్కుంగల రాజకార్యార్థ సమాగత వాచామ గోచర ధీ చాతురీ పంచజన ప్రపంచంబును బరివేష్టింప నమరావతి యుంబోలె విభుదేంద్ర మహావిచక్షణ గురుముఖాధిష్ఠితంబై యలకాపురంబు రీతి నగణ్య పుణ్యజనసన్నిధాన విరాజమానరాజ రాజాశ్రితంబై నవసేవధీడితంబై కైలాసంబుకైవడి సతత సన్నిహిత రాజశేఖరాభంగుర సర్వమంగళావాప్తి శృంగారవాసంబై భైరవగణాధిప శిఖివాహన వ్యాసంబై సత్యలోకంబుగతి నప్రతిహత శ్రుతి వితతి విశ్రుతపు చార చతురాస్య రసనాధిష్ఠిత భారతీసనా దంబై, సముద్రముకరణి ననంత ముక్తామణి విద్రుమ రత్నప్రత్నంబై, వారణాసిమాడ్కి ననేక ఘట్ట మహావిచార ప్రచారంబై కాసారంబు సేరున సరసకుముదపుష్కరాభిరామంబై, యారామంబు తీరున వివిధ సుమన స్సంవాహితంబై, కిరీటంబుంబోలె నమూల్య సన్మణి స్థగిత మూర్ధాభి షిక్త విరాజితంబై, రజితంబు వలె స్వచ్ఛంబై, మహారజతంబు గతిందపన మహాకుల

సంజాత వరప్రభా భాసమానంబై యసమానంబై, సమానసమాన సామానస మాహిత సమాధి సమాధిసమాన సమానితంబై ప్రమాణాతీత ప్రమేయం బయ్యును బ్రమేయాతీత ప్రమాణంబై, మహాధీర వీరశూర సార్వవిరాజితంబై, యాశ్రిత మహోదరంబయ్యు ననాశ్రిత మహోధరంబై, నారదశారదా శారదా నారదపారదహీరదర తారధరహార నీహారపూర కర్పూర క్షీరపారావారానుకార యశోవిశాలంబై యెల్లరకు నల్లారు ముద్దైన యొడ్డోలగంబున సింగంపు గద్దియపైఁ దద్దయు మహేంద్ర విభవంబుట్టిపడ నధిష్ఠించి యాకొలువు చెలువు వలువు గనుంగొన నలువుచలువుల గలుగదనియు నలువవెట్టిన రెండు కన్నులు జాలవనియును జనులట తవం కన్నుల కలవు దీరఁగన్నుల పండువుగఁ గనుఁగొనఁ గనుఁగొనల సాగి కొనసాగు కటాక్ష వీక్షణామృత పూరంబు ననుక్షణంబు మనువుల వారిపైఁ బ్రసారించుచు వారల విన్నపంబుల నెపము లెంచక యాలకించుచు లాలన నుపలాలించుచు మేలము సేయక పాలించుచు నేర్చి నేర్చిన తెఱంగున దొఱంగక మఱుంగు లెఱింగి ధర్మంబుల దీర్చుచుఁ బేర్చి యోర్చి సుధర్మ నధిష్ఠించి సకల సురప్రకర పరివేష్టితుండైన మహేంద్రుండుం బోలె నమ్మహేంద్రుండే లోపంబు లేక లోకంబులతోఁ బ్రాకట సరససల్లాపంబు సేయుచున్న సమయంబున

71

సీ. ఆపాదమస్తకవ్యాపకంబై వ్రేలు
చుండెడి జటలు నీరెండకాయ
వినుమంతయొడ లేక బసుమంబలందిన
ఱదుగురే వెన్నెల అదరికాయ
నుగ్రతపోగ్ని పైకుబికి పొంగెడురీతిఁ
బసగల కావికుప్పసము పొసఁగఁ
దన తపంబునకు మెచ్చిన దైవమిడు ప్రసాద
పుఁబాత్రనాఁగుండిక నరఁజేతఁ
దమ్ముమొగముతొ ఫాలనేత్రమ్ము నెటనో
దాఁచి వచ్చిన విధియుండె స్థాణుఁడొండె

భానుఁడొండె విధుండొండె బలిరయనుచు
శంకఁబ్రజగన వచ్చెనుదంకమౌని 72

క. చిత్ర శిఖండిజుఁడోయో
చిత్ర శిఖండుల నొకండొ సేరెడు సుభకున్
చాత్రులనేకులు గొల్వగఁ
బాత్రుఁడు పూజ్యతకటంచుఁబ్రజగనవచ్చెన్ 73

సీ. సంహితాక్రమపదజటలు సంతలు సెప్పి
కొంచును దినసరుల్వించు వారు
కాలు తప్పకనువాకము లెత్తి జందెంబు
బొట్టన వ్రేలికి ఁజుట్టువారు
కడ వల్లెకునురాక గడ్డువారివ చోట్లఁ
దోడ వేదము సెప్పి తొలగువారు
ఘన కీతఁడందే వేసిన చేయి క్రమశిఖ
కతఁడంత వాడంచు ననెడి వారు
తీవి షట్శాస్త్రములకుఁబెట్టినది పేరు
దెచ్చు బ్రహ్మవిచారమందీతఁడనుచుఁ
బేరుకొంచు నుదంకుల వారి శిష్యు
లాలు నూర్వురు మునివెంట సంటి చనిరి 74

సీ. నెఱి లాగిముడిఁచిన చిఱుజుట్టుకొనముడి
దిగక ముచ్చిలిగుండ నెగ్గిరి పడఁగ
బుడిగి చెంబొక వంక మడిసంచి యొకవంక
భుజముపైఁద్రాటను మొనసి వ్రేలఁ
గటి సూత్ర సంబద్ధ కౌపీనముల మీఁద
గూడకట్టుల తుండు గుడ్డలమర
గుశసమిత్తతులు స్రుక్స్రువములు గురువుల
శాటులు నరకట సందడింప

మౌంజిమొలఁ జేతరాంభము రంజిలంగ
నజిన యజ్ఞోప వీతము లలర బ్రహ్మ
చారి శతమర్కటములకు సాటినాఁగ
జనికుచేష్టల శిష్యులు చనిరితనరి 75

ఉ. కూరిమిపేరిమింగదిసి కోరక లీరికలెత్త మౌని దా
వారికుఁడూర కీదవుల వారకు సారెకుఁజూచి పోయి యా
ధారుణి నాథు తోడ నొక తాపసి తాఁబసి దిండిచర్మ ము
ప్పార నపార నిష్ఠఁడిదెయచ్చుపడ న్వడివచ్చెనిందనెన్ 76

ఉ. చెప్పిన మాత్రనే నృపతిచేప్పఁగరాఁదగనట్టి వేడ్కతో
దెప్పరమైన గద్దియను దిగ్గునడిగ్గి సభాస్థలీ జనుల్
గుప్పున లేచి తోనరుగఁ గూరిమితో నెదురేగి మౌనికిన్
గొప్పగ దండవత్ప్రణతిఁ గూర్చెఁదదంఘ్రుల జేర్చి యాదలన్ 77

క. పౌనఃపునిక ప్రణతి వి
ధానముగా నృపుఁడు మౌని తల్లిఁజూ నుల్లం
బానఁగ నెదుటను నుదుటను
బూనె నిజాంజలి సవినయముగ వినతుండై 78

ఉ. ఇమ్మెయి నమ్మహీపతి సమీహిత ధీహిత భక్తి సూక్తి యు
క్తమ్ముగ నమ్మునింగని ముదమ్మున నర్ఘ్యము నర్ఘ్యపాద్యమున్
గొమ్మని గోవునిచ్చి తగు కూరిమిపేరిమి గద్దెనుంచి యా
పిమ్మట సమ్మతింబడసి పీఠముపై వసియింప నింపుగన్ 79

వ. అటుపై నా మౌని భూనాథుంగాంచి యిట్లనియె 80

శ్లో. కమలా కమలాదిత్యః కరుణా వరుణాలయః
స్వయం వితరతాత్తేజః శ్రియంజయమయం హరిః 81

క. శ్రీరస్తు జయోస్తు లస
ద్ధీర స్త్వారోగ్య మస్తు దీర్ఘాయుర్భూ

భార్యాస్తు నంత తిర్వి
స్తారోస్త్వ చంద్రసూర తారక మనుచున్ 82

క. సర్వ సుభాస్పదముగ నా
శీర్వాదంబిడి ప్రసాద శీతలమతియై
శర్వ సమానుండగు ముని
దూర్వహునకు నృపతి ప్రియము, దొలుకఁగ ననియెన్ 83

ఉ. నిక్కము నాదుజన్మమవని న్సఫలంబిపు డయ్యెఁగా మునీ
చక్కని యుత్తరాయణపు సంక్రమణమ్ములు గాది భాసురా!
పెక్కు సు పుణ్యపర్వములు పెంపు వహించిన పంచపర్వముల్
దక్కిన యెల్ల పండువులు తావక సేవ ఘటించె మాకిటన్ 84

సీ. మిరాక మునినాథ పేరాఁకటం బడు
నతనికిఁ బరమాన్న మబ్బినట్లు
మీదర్శనము మాకు మేదిని మీదను
నిరుపేదకొక నిధిదొరకి నట్లు
మీ మేట్మటలు ధన్య మేదినిఁదీయని
పానీయ దీర్ఘిక బడిసినట్లు
మీదీవనలు మాకు, మేదురానుగ్రహ
శుష్కసస్యమునకు సోనయట్లు
తమ సమాగమము నిధాన సమముగాదె
దమ సమాతీత రుచి సురోత్తమ సమాగ
మముగదా మీమహిమ మసమము గదయ్య
ధన్యమయ్యెను నాజన్మ మన్య మేల 85

ఉ. మీయుట జాంగణ స్థలిని మేయుచు దర్భల నెండవేళలన్
మేయుట మానిపెన్ దగకు మీకరకుండి జలంబు లాని మీ
మేయును, ముట్టెతో నొఅసి మేకున గోకుచు నిర్భయంబుగాఁ
జాయఁబరుండి కూర్కు వృక శాబకము ల్వ్యకము స్మరించునే 86

ఉ. ఎండకు మెండుగా బడలి యేగెడు వారికి సేదదీఱు న
ట్లుండగ నుండు నీడలకు నాశ్రయముల్బ్రవదాశ్రమాగముల్
కొండల పిండు వోలె వనిఁగ్రుమ్మఁ ఱు మత్తమతంగ జాళిచేఁ
దొండపుఁబ్రేటులందినక తుంగములైగములై చెలంగునే 87

చ. తలరి తపో వసానమునఁదాపస పారణ కౌనటంచు శి
ష్యులు లవివిత్తి, కయ్యలను జొప్పడఁబెంచినయట్టిని వ్వరిన్
బలువిడి మూగి, య్యాగడమునంజెడుగోదలు మేయ కుండునే
నలువుగ నీనఁగాచి తుద నక్కల పాలొనరించి నట్లుగాన్ 88

ఉ. మానగు మీతపంబునకు మాయలమాటి బలారిఁక్రిందుపైఁ
గానక మేన క న్సరసగానకఁగానక మిచ్చి కానుకల్
గానన వింటిదంటముని గామును గాముని బంపి విఘ్నమున్
దానొనరింప కుండునగదా తపముల్తలనొప్పి వజ్రికిన్ 89

చ. అమర మనఃప్రమోదముగ నాహుతిదోహద వేది కయ్యలో
నమరమనః ప్రమోదముగ నాజ్య సువృష్టిని బెంపు చెందగా
సమరహితపు శస్తి మఘ సస్యములంబడి మేయకుండునే
సమరహిత ప్రశక్తి విరసంబగు దైత్యకడంగరీయముల్ 90

క. ఊరకరారు మహాత్ములు
కారియములు లేక మిగులఁగాటియ పడుచున్
మీరిట విచ్చేయఁగఁగత
మారయ నెయ్యది యొక కరమానతియిడుడీ 91

క. ఈగ్గతి వినయమ్మునఁదన
యోగక్షేమంబు నరసి యుత్తమభక్తిన్
రాగిల్లియడుగు నృపతికి
యోగీంద్రుండిట్లులనియెహో చిత ఫణితిన్ 92

చ. పొసఁగిన మిత్రవంశమునఁబుట్టిన రాజువు నీవు ప్రాభవం
బొసక మెసంగ ధర్మమున నేలను నేలను చోలమేల నె

ద్దెస దొసఁగుల్పొసంగవని త్రెక్కొని యెక్కువ వక్కణింపనే
ల సవిత్రుఁడే చి తోచినఁ దొలంగక చీకటి పీటవెట్టునే 93

క. ఇక్ష్వాకు వంశమనగా
భేష్వాపద్ధ్వంసమునకుఁ బెట్టినపేరే
యిక్ష్వాతిగ మధుర వృత్తియు
యిక్ష్వాలికి సోపనంబొ మోక్షం బెక్కన్ 94

క. భువిపుట్టిరిందయిక్ష్వా
కువర మరుత్తునకు పృథుక కుత్సముఖేద్యుల్
దివిరిన జన్మశతములకొ
దవునే రవికుల మునెంత తపములకైనన్ 95

ఉ. పుట్టిన సూర్యవంశమునఁబుట్ట వలెం బతిగాఁదలంచినన్
గట్టిగఁగోసలంబునఁదగంగ నయోధ్యకె రాజుగావలెన్
బుట్టుక లందునిందుఁగొని పోయినఁబుణ్యమె పూరుషార్ధమో
యట్టివిగాని నాఁడు హరి యిందుదయించునే యేరుకోరినన్ 96

వ. ఇంకంగూడ ముందిందు నవతారమెత్తంగల నవతారాధిపచూడ తారధర తారానాథ పటీర్థ పంకసిత పంకజసింహ హంసబిసరుహవాసన పటుకీర్తి సుధాదవలిత భూనభోంతరాళ మహామందిరులై బృందారక సదృక్షరాజర్షి బృందంబు నొక్కింత వక్కాణించెదఁబూర్ణంబుగా జెదరని మనంబుతో నాకర్ణింపుము

97

మ. తగమాంధాతయు నంబరీష పురుకుత్సక్ష్మే త్రిశంకు ప్రభుల్
సగరుండు న్ముచికుందుఁడున్మఱి హరిశ్చంద్రే ద్దిలీపాదిపుల్
నగధీరుండు భగీరథుండు రఘువున్నట్వాంగుఁడ న్యాపుఁడున్
భగవంతుండగు రామభద్రుడు దయింపంబోదురిందున్జుమీ 98

వ. వారలెవ్వానికిఁబ్రసిద్ధి కెక్కంగల వారలో వ్రాక్రుచ్చెదవారలే వినుము

99

సీ. ఒకఁడగ్రగణ్యుఁడై మకుటాధిపతులలో
నుదయాస్తశైలమునుర్వి నేలు
నొకఁడు దూర్వాసుని యుగ్ర గర్వమడంచు
నొక్కండు విహరించు నురగజగతి
నొకఁడు నూత్న స్వర్గమొనరించుఁజదలను
నొకఁడు పయోధి కభ్యుదయ మొసగు
నొకఁడు కృష్ణు నుతించి ప్రకట ముక్తిని గాంచు
నొకఁడు ప్రతిష్ఠించు నుర్వి ఋతము
మహినొకండేలు మహిమతో మహికొకండు
గంగఁదెచ్చు బొసంగ నొకండు కులముఁ
దనదు పేరిట నెగడించు ధన్యుఁడొకఁడు
త్రిదశవిముఖుని దశముఖుఁద్రెంచునొకఁడు 100

క. నీవంటి భూప సింహము
కావంగావసుధనెల్లఁగంటికి ఱెప్పై
మావంటి మౌనిజనులకు
రావు తపంబునకునంతరాయము లెప్పుడున్ 101

సీ. ధరణి పాలుఁడు ప్రజాతతికి ఁబెట్టనికోట
యాపన్నకోటికి నండదండ
క్షామపిశాచికుచ్చాటన మంత్రంబు
పాసఁగ బీదలపాలి పుడుకు దొడుగు
అలి వ్యాళ చోరాదులకుఁబ్రాణ గొడ్డంబు
నాఁకొన్నవానికిఁబాక గృహము
కొసరు యాచకులకుఁగొంగు బంగారమ్ము
జెవలేని మనదకు జీవగఱ్ఱ
జగతికి నిగలి ముక్తియు జగతిపతియు
నృపతిలేకున్న రాజ్యము నృపతిహీన

సుందరియుఁ బోలె నావంత సుఖముఁగొనదు
గాన నృపతికి సాటి యెందేనిగాన 102

వ. అని మఱియు 103

సీ. భవదుపవర్త నోద్భవ పంచజనకోటి
భవుకంబుతో నున్నె నవకముగను
నఘునాశనార్థమై యదనాగతా భ్యాగ
తఘనార్చ నలుచేయు విఘసమునకు
నైష్ఠిక ఘౌరికాంతర్వంశిక స్థాయి
కాదులఁగాదన కాదరింతె
శ్రుతిధిక్కృతులకు నిష్కృతిగని కృతిగని
ప్రతికృతి యొనరించె బహుకృతిగను
ప్రకృత జనతతి మతిఁగని ప్రకృతమప్ర
కృతము పరికించి మఱువక కృతముమతిని
బరగన పకృతి పరులగు నరుల నరసి
తిరుగఁబడువారినొంతె యత్తెఱఁగెఱింగి 104

ఉ. దారకదేశదేశముల వారన పాయముగా నుపాయనా
తారక సారకుంగొనుచు, నూరికిఁజేరక చేరిక న్నినున్
జేరికనం దలంచికొని నేరిమి నోరిమి సేయుమంచు దొ
వారకుచేతఁజూపఁబడు వారిని వారని ప్రేమ జూతువే 105

ఉ. పాలనసేవె భూమిఁబని బాలుర బాలుఱకెల్ల ప్రొద్దుప్రొ
ల్మాలక వేళ కిచ్చు తలిమాదిరి మేదుర కీర్తి నెవ్వరే
యాలముసెప్పికొన్న నడియాలముసేయక కూరిమిందగన్
లాలన నాలకించి యుపలాలన మేలొనఁగూర్చి పంపుదే 106

క. ప్రకటామాత్యులమతిని గ
నికరము నికరము గనడతినిక్కృతి విక్కృతి సే

యక మది మర్మ జ్ఞుం న
ప్రకోపయేత్తనెడి నుడిని బట్టి యనువుగన్ 107

క. గణికుల విద్వేషింపక
గణన యొనర్చెదవె యొప్పుగాఁగ గతశ్రీ
ర్గణకంద్వేష్టి యనంబడు
పణితిని గణుతించి మదిని పరిణత త నీతోన్ 108

ఉ. బ్రాతిగ నీదుకొల్వు పనిపాటల వాండ్రకుందీఁడ వెచ్చఁగా
జీతము లిచ్చి పుచ్చెదవె సీదర మూదర బీద కాదరం
బీతఱిఁ గెల్పునేతఱి నేతరి సేయును లాతిసేఁతగా
వే తన చేతిమీఁదగను వేతన మిచ్చుట నీతినేతకున్ 109

ఉ. హాలికు లేలికన్నినును హాళిని బాళిని జేరి చేరికన్
జాలఁగఁ జేలకట్టలను సారెకు వారక విన్నవింపఁబోఁ
దోలక యాలకించి మదిఁదుష్టి నవగ్రహ వృష్టినష్టముల్
యేలుగ వీలుసేసి సరళిందగు పన్నులు సున్నసేయుదే 110

ఉ. సేనల గూర్చి తీర్చెదవె చిక్కని మన్నెము లంగడీలలో
గోనల జుట్టు పట్టులను గొండల యండలఁజెండు బెండుగాఁ
గానల దట్టమైన పాదకట్టులనుందెగఁగొట్టి వట్టిమై
దానము సేయిదే మరుగుతావులు దోవలుగావె సేగికిన్ 111

సీ. ధరభ్రూణహత్యయు నరహత్య దోపిడి
పశుహత్య కన్నంబు బందిపోటు
ఘాతయు విశ్వాస ఘాతుకత్వము సృష్టి
దొమ్మీలు కమ్మీలు దుర్జనతయు
మగనాలిఁగూడుట తగునాలి వీడుట
తప్పు సాక్ష్యమ్ము నిందయును జె ఱుపు
గరదాయితము నట్ల గారదాహితయును
మోసంబు వేసంబు బాసతప్పు

భూపు మీఁదికి దండెత్తఁబూనుటయును
నాస్తికద్వేషమును మఱి నాస్తికతయు
మొదలుగాగల నేరము ల్పొదలకుండ
మొదలఁదుదముట్ట జేతయే మెదలకుండ 112

సీ. మొఱకు నేరములకుఁజూఱుకుగా నుఱుకంగ
గఱుకైన బరికాయ యెఱుక వాఁడు
కానల కాణాచి కాని చెయ్వులకేదు
మాదిరి తిరుగు నేనాది వాడు
రేయింబ వళ్ళను బాయక కానల
మాయద్రిమ్మరు వాడు కోయవాడు
క్రించు తనమ్మున నించుక కొంచక
మించి చెట్ల వసించుఁజెంచువాడు
బుడ బుడక్కులఁ దొమ్మరి మొండిబండ
చుండి పిండారి తోడాలు లండిగాండ్లు
మైదులంబాడి పింజారి కోదు లిట్టి
కష్టదుష్టుల నొక కంటఁగాంచియుండె.

గీ. బాలురకు బాలికలకును బాఠశాల
లేర్పరిచి వేఱువేఱుగా నెలమివిద్య
వృద్ధిఁగొనఁజేయుదువె నీదుబుద్ధినుంచి
యవని విద్యావిహీనః పశువను సుద్ది 113

ఉ. నీదగు సత్యవర్తనము నీదగుకృత్యవిచారశక్తియున్
నీదగు విక్రమక్రమము నీదగుదైవ విచారభక్తియున్
నీదగు రాజ ఠీవియును నీదగు సర్వ సమత్వబుద్ధియున్
నీదగు వత్సలత్వమును నీయెడఁగాక మఱెందుఁగంటిమే 114

వ. ఇటు లాశీర్వాద పూర్వకముగా శర్వాతీత సర్వజ్ఞతా విశిష్టుండును శిష్టజనుండుననగు నుదంకమహాముని తనయోగ క్షేమంబు బాగుగ విచారించి యన్య ప్రచారంబునకుఁజోఱక యూరక కూర్చిండి యున్న నన్నర

నాథుండిట్లనియె

115

క. మీయాశీర్వచనము చే
నాయుర్భాగ్యములు సంతతారోగ్యంబుల్
పాయక తామరతంపర
యాయెను నాయవని తాపసామరనాథా 116

క. ఇటుకుశల ప్రశ్నదములకు
నెట మందల పెందలకడ యీారలు రాcగా
నిటకేమి కతమొ యాకత
దటుకున నానతి నిడుండు దయదైవాఅన్ 117

వ. అని తనరాకకు నిదానమ్ము సావధానమ్ముగా వినఁ గోరిన జననాథునకు ముని
నాథుండిట్లనియె

118

క. తడయక తినఁబోవుచు రుచు
లడుగంగానేల నేలకధిపతి వఁట నీ
వడవులఁగడునిడుమలఁబడు
బడుగుల మఁట మాకు నిచట పనివడుటరుదే 119

క. అన్నిట ధన్యుఁడ వగు నిను
గన్నను బని తీఱు ననుచు గంపెండాసన్
గ్రన్నన వచ్చితి నిటనీ
కన్న నెవండిట్టి పనుల కుపమస్మియునున్ 120

మత్తకోకిల.

మెచ్చువెచ్చులుగావు నేనిట వచ్చితింకను కారణం
బచ్చునొత్తినయట్లు సెప్పుమటంచునన్నును మన్ననం
గ్రుచ్చిగ్రుచ్చియు నీవుకోరఁగ గొంకనింకను జల్లకున్
వచ్చిముంతను దాఁపనేఁటికి వాసిదెల్పెద విన్మికన్ 121

క. జననాథా మధుకైటభ
దనుజులు మునుగలరు వారితనయుఁడు ధుంధుం
డను వాఁడు వారి తనయుఁడు
ఘనమాయల వారికంటె ఘనతరుఁడధిపా 122

క. విను మానికపుఁగొలము దొర
వినుమాయను మానమీఁగి వీర్యంబున శ్రీ
వి నుమాపతి సముఁడాతఁడు
వినుమాదిరి గానరాఁడు వింగద మెసగన్ 123

వ. అద్దురాత్ముండద్దము రేయి నిద్దుర ప్రొద్దున నెచ్చటనుండియో వచ్చి విశ్రమించుటకై మదాశ్రమంబునకు ననతి దూరంబున నేరికి గానరాకుండ నొక సైకత ప్రదేశంబునఁబ్రవేశించి కొండొక బొండి సుకన్ కొండ చిలువవలె బండి యుండేడకుఁబోక యేకడకున్ గదలక మెదలక బెదరించుక లేక నిదురించుచు మము బెదరించుచు వారమ్ము నకొకసారి యూరటకై యూరటమెత్తి యూరతారలుగా నూపిరి బుచ్చు గడుఁదత్తల వాలు కొజాలకంబుజాలగాఁబుడ మినుండి వియత్తలంబున కెగసి వ్యోమయానంబు లొడ్డ గెడవుగా నొడ్డ గిలంజేసి యుడ్డుగుడిపించి స్వర్గ వీధులనిండికొని మార్గంబునఁజనం, నిలింపులకుఁ బులకలు వొడమ నూపిరిసలుప స్వల్పావకాశమ్మునీయకుండఁదనమేని నుండి చిచ్చు లెగయించుచుఁ బంచక్రోశ మధ్యమ్మున నెద్దియేనిఁగాన్పించినఁ బంచత్వంబున కగ్గపఱచి మాడ్చి మంబరంబు సేయుచు నంతట నంబరంబు పొడవున లేచి కంటఁబడిన జంతువు నిసుమంతయు వీడక తోడన మ్రింగి మిసిమింతుండుగాక హాంతకారి తనంబున నెంతవారినైన గొంతకారయటు డివిండుమను గాని యూరక పోనీడు మఱియు మాకును మాయాశ్రమంబునకును మాయాశ్రయుం డగు నద్దానవుండింతంతనరాని రంతల నిడి యలంత సేయుచు నెత్తికి బోటు వెళ్ళ ప్రుత్తిల్లి క్రొత్త పనులకు జాలి పాఱి మాగాలిసోఁకిన నాసోకు జోదు పసిగట్టి పాఱివచ్చి పసిఁబట్టు వచ్చు వాలాము వోలె నల్లల్లన నల్లకల్లోలము గావించుచు మాకు విశ్రమింప ననువుగాకుండ గడు విన్ననువుగ నున్నవాఁడు విన్నకన్న వాఁడు మూఁడు వారముల దనుకఁదనుకుదొనకి

నిద్దురలోఁగళవళ పడుచుఁ గలహించుచు మేలుకొని వాఁడు మందునకునైనఁ గానరాడు సుమీ వానిదోలింప శ్రీహరి యొండె నట్టిఁడన దగిన నీనందనుండొండె గాక లోకంబున నొండొక రెవ్వరున్ జాలరుగాన నిన్ను సపుత్ర పౌత్రకంబుగా నందులకుఁదొందరగఁ దోడ్కొని పోయి యీకారియ దీరిచి కొను కారి యముమై నీకడకు వచ్చినాఁడ నన్నిచ్చకములాడి తోఁపుచ్చక నామది చిన్నపుచ్చక నామనవిని విని ఘనంబగు మీమనంబున నింకే యెడసేయక యప్పాపాత్ము రూపుమాపి మాపాలి పెనుబ్రాపులై యోపదరషుఁగాని యాపద దరముల నాపి యాదరమున నాదరమున నాదరము పోఁదరిమి ముమ్మెద రావే యని యావురుమని యావరచినట్లరచి సకరుణంబుగ నొడివి యొండేవి యనక మిన్న కుండిన యుదంకముని తల్లజుంగని బృహదశ్వ ధరణీవల్లభుండల్ల నిట్లనియె 124

ఉ. గోమఱి నొక్క పామరుని గూరిచి మీరిటు కుందనేల యా
క్షామ బలుండు సోమకుఁడో శత్రుభయంకర వృత్రుఁడో మహో
ద్దామ విధూమ వహ్ని సమతారక నేత్రుడు తారకుండో సు
త్రామహిత ప్రధామహిత రక్కసికై యిటులేల స్రుక్కగన్ 125

క. ఱేపో మాపో కానకుఁ
దాపస వృత్తినిఁజనంగఁదలఁచి యుసుతుపై
మోపితిని రాజ్యభారము
జే పడ నస్త్రముల సన్యసించితి నెల్లన్ 126

గీ. తపమునకుఁగానఁగానబోదలఁచి వృద్ధు
చెప్పులంగాళ్ళ నిడి యుంటచే నుదంకు
మాటయును గీటు వుచ్చిపో మనసురామి
నుర్విపతి మతి యుఱ్ఱూఁత లూఁగసాగె 127

వ. అంత భూకాంతుడెంతయు నిజస్వాంతంబునఁ గొంతవడిఁజింతించి తఱి లేపులకు వెలిమెచ్చులకది యదను గాదని మది ననువుపరచికొని తఱుచు తఱచి ముందు వెనుకలు పాఱఁజూచి కొంత సేపు తలయూఁచ యెన్ని

యెన్నియన్నను దగు మన్నన గొన్న పై బాగుగ నేగుఁగాని కానిచోఁగోపమున
మౌని రూపమెత్తి శాపమున నిగ్రహానుగ్రహములకు నడిసన్న యీ నిరాబారి
మిన్న మిన్నక చనునోటు నోట లేదంట కంటెఁజేత లేదంట దంట తనమున
కనువగు పనియెని యెంచి శక్తివంచన సేయక కొంచక తనచేతనైనంత వఱకు
మెల్లఁగఁజేయుదునని యాయవనీ నేత కాగి చల్లారిన పాలుగాన నద్దనుజు
జనకు లోగడ వృత్తాంత మంతయు విని మనంబై యాతపోధనున కిట్లనియె
128

గీ. తినగనేమయ్యెఁగానిండు నేను నిండు
పైన మయ్యెడి లోన నాపైని దైన
వాని పితృకధ యెట్టిదో వీనులార
దాని వినిగాని చెప్ప నెద్దాని గాని 129

క. మధుకైటభులను వారలు
విధిపై దండెత్తి పోయి విఖ్యాతి గుఁడౌ
మధుమధను చేతఁబొలిసిన
కధయంతయుఁజెప్పఁగదవె కరుణాళుడవై 130

వ. అని జనవరుఁడడిగిన మునివరుండు మధు కైటభుల వృత్తాంతమామూ
లాగ్రంబుగా నిట్లని చెప్పందొడంగె
131

సీ. తూగుటుయ్యేలలుగాఁదూగు సంద్రపుటలల్
నిజకుక్షికాండంబు నిద్ర గూర్ప
శీతల క్షీరాబ్ధి శీకర ప్రకరంబు
సర్వ సృష్ట్య వనజ శ్రమముఁదీర్ప
వట పత్రశాయి యై బొటన వ్రేల్ చీకెడు
తనకు వాఁదోడుగా ధాతయొప్ప .

గీ. వర్తనము మాని జగము సంవర్తనటన
విపుల జలమయముగ నుండ విపుల జలము
శయనమున హరిశయనింప శయనమునకై
దనుజులట కేగిరజునిపైఁదమకమునను 132

వ. ఇట్లు మధుకైటభు లిరువురు వెరవరులై యయ్యుద్ధ మునకిర వొప్ప నరిగి
విరించి నవలోకించి నవలోకము గాంచితిమని సంతసించి యతనిం గురించి
యఱంగం దలంచి యిట్లని పలుకరించిరి 133

ఉ. ఎవ్వడ వీవు నీట వసియింపగ నేటికి నోట లేక నీ
కెవ్వరు తల్లిదండ్రు లిట నేలకొబాలక యుంటినీటి పై
పువ్వునఁడాగి నావలల పుర్వుగ నేలకొ మేలుకొంటియున్
నివ్వెఱగయ్యెడి న్దెలుపు నీస్థితి యున్నది యున్నయట్లుగాన్ 134

చ. అనుటయు ధాత యిట్లనియె నద్దిర యిద్దఱు మీరలెవ్వరో
దనుజవరేణ్యులట్లు విశదంబుగఁజెప్పక చెప్పు మీముఖా
లనఘులు మీరలిచ్చటికి నాగతులైన కతంబు వీనులన్
విన మనమయ్యెఁజెప్పుఁడన విప్పిరి వారి కథాప్రసంగమున్ 135

చ. ఖరభుజ దర్పచండ మధుకై టభనామములన్ త్రిలోచనున్
వరుఁజిరకాలము గొలిచి వారు పరాసుతయున్ బరాసుఘఁ
స్మరతయవధ్యతన్ బడసి మాఱెడ లేక చరింతు మీచరా
చరమరగంటలో మెసవజాలుదు మేలుదు మెల్ల దైత్యులన్ 136

ఉ. మాకుల దావమేర్చుగతి మాధవుడే కడతేర్చెఁజూఱఁగా
మాకుల మెల్లగాన హరిమార్కొని బందు ఋణంబు దీర్పమే
మాకులవృత్తి నుంట వడియంబుగ మ్రింగెద మీవెఱింగినన్
మాకులవంబు దాఁపకను మానము నూనక చూపుమాతనిన్ 137

ఉ. అట్టుల చూపక న్ననిను నర్దని మేషములోనఁబట్టి మా
బొట్టన వ్రేళ్ళ క్రిందనిడి బుగ్గి మొనర్చెదమొండెఁ జెండిమే
తట్టునసైన నూఱుకొని త్రావెద మొండె మఱంతకాని ని
న్నిట్టులు నట్టులం గదలనీయ మజేయుల మంచెఱుంగు మీ 138

ఉ. వొరల మిట్టు కోటులును వార్మెడిగ్రుడ్లులు భైరవాకృతుల్
వారి నరాస్థిహారములు వారక సేసెడి నట్టహాసముల్

వారి కరాళ వక్త్రములు వారల జుంజురువెండ్రుకల్ కరం
బారయ గుండె గూడు బురదయ్యె విరించికి నించు కేనియున్ 139

వ. అప్పుడు చప్పుడు సేయ వెఱచి యఱచినంగఱచెదరని చెదరిన మనంబు
తోఁదమ్మిచూలి తనలో నిట్లనుకొనియె

140

ఉ. ఎందులకేగువాడ నెటులే మఱలింపగ నేర్తు నేమఱన్
గ్రిందును మీదు నింతపరికింపరు శూలి వరప్రభావులై
యందినపట్లజుట్టు చెయికందని పట్లను గాళ్ళుగాఁగ వీ
రుందురు త్రాఁచు ముందుఁబడు నుందురు చందము లయ్యె నాకిటన్ 141

చ. హరియిటనున్న వాడనుచు నందును బోఫలమేమి యాశధుల్
వెరవరు లట్టులన్వెదకి విష్ణుని గన్గొనలేక నాపయిన్
దరలుదురే యెఱుంగనని తార్మది నమ్మరు రెంట మూడె నే
వెరవున నీఁగువాఁడ నెతవెన్కను గొయ్యియు ముందు నుయ్యిగాన్ 142

ఉ. ఏది యెట్లైనగాని పరమేశు రమేశుని మేలు కొల్పి నా
బాధను నీఁగువాడ నగుబాటగు పాటగు వేఱుబాట చోన్
గాదిలి పుత్రునన్ను హరి గాదనునాతను నాడు వీరలన్
బూది యొనర్చుగాని హరిముందఱ వీరల యాట సాగునే 143

ఉ. మించ నిటుల్లటాలున సమీపములోనికిఁజేరినార న
న్మించి యెట్లైన వీరిచెయి మించకయున్న యుపాయయుక్తి నొ
ప్పించక యిప్డు తప్పుకొని పిమ్మట నేర్పరి వెక్కిరించు న
ట్లించుక కానకుండ నుతియించెద నాదగు తండ్రి మాధవున్ 144

వ. ఇట్లు తనువెనుకొను దనుజుల కినుకను మనమునఁద లచుకొనుచు దనుకుఁదల
మునుకలై వెల్లి వొడమ నా వనజ గర్భుండు నీగొడవఁగడవంబెట్టఁగన్న తండ్రి
కంటెఁదెన్ను వే ఱొండు లేదని మనసిజ జనకుందన మనమున నునువు
పఱిచికొని దనుఁబఱచ నాయిత పడు నాచెడుగులకును దిలఁగొను నెదఁబదిల
ముగఁగుదురు పఱిచికొని మఱల వారు తనపైకిఁదెరలకయమున్న నిట్లని

వినుతించె నదియెట్లన

145

దండకము

శ్రీమాలినీ మానసాంభోజినీ ఖేలనా మానమానైకతానైక సన్మాన సన్మాన సౌకః ఖగేంద్రా, సమరూఢధావ త్ఖగేంద్రా యహీంద్రా హిభుక్సైన్యనాథాది నిత్యుల్ గిరీశాది భృత్యుల్ సనందాది ముక్తుల్ వశిష్టాది భక్తుల్ విశిష్టాది మౌనుల్ వినష్టాభిమానుల్ విరించ్యాద్యనేక ప్రపంచాధి కారులీ స్వరోచి స్వరోచి ర్భవాదిప్రజాపాలనైకాతి ధీరుల్

సదామస్తకన్యస్తశస్తాత్తహస్తద్వయీ సంస్తుతిధ్వస్త నిస్తార విస్తార దుస్తార సంసార హింసా రతినిన్ సత్రృశంసా మతిన్ సన్నుతింపన్ నతింపన్ స్వలుంత త్తమోకుంత వైకుంఠసీమన్ సమస్త ప్రతీత ప్రభా తీత భవ్యాతి దివ్యోచ్చ సింహా సనంబందు దేదీప్య మానాతి మాత్ర స్వభాధిక్య తాధః కృతా స్ఫోట కృత్కోటి సూర్య ప్రభాబాసమాన సమానాసమా నుండవై యండవై భుర్భువస్స్వర్మహస్స జ్జనస్సత్యముఖ్యాది సర్వోర్ధ్వలోకా లకుం జాల నాభీల పాతాళ లోకా తలా త్యాద్యధోలోక లోకాలకున్ బ్రహ్మ విష్ణీశ రూపంబులం బూనుచుంగర్తవై భర్తవై హర్త వైదాగ నిర్వాచ్యమై సర్వథా వాఙ్మనో నోచ రస్వ స్వరూపంబు నన్నిన్ని యామ్యస్సగో త్రాయి తాద్యంత శూన్యప్రధానాత్మలన్నెంటి నొం డొంటితో జేర్చి యారెంటిలో సత్త్వముఖ్య త్రిగుణాతి గణ్య ప్రధానంబున వ్యక్తమున్ దన్మహత్తత్త్వ మమరిట్లే యహంకార మాకా శవాతాగ్ని వార్భూమి రూప ప్రపంచాది బూ తంబులా పంచభూత మ్ములన్ భూత తన్మా త్రలంజేర్చి యిట్లే జగంబంతయుంగూర్చి తద్ధర్మ కర్మాను గుణ్యంబు గణ్యంబు గా జీవులం జేర్చి తజ్జన్మ నాశాదులం బుట్టగా గిట్టగా నొక్క కాలంబునన్ నీకృపావ్యాప్తిచే భక్తులై ముక్తులై త్వత్పదాంభోజ సేవాప్తిచేఁ గేవలానంద పాథోధి వీచీల సద్దోలి కాజాల మందోల లాడంగ నీవందులోఁజొ చ్చిలోబైల నిండారగానుండియు యోగమాయా విశి ష్టుండవై యుండి యున్నట్టు లెవ్వారికేవీలునంజూచినం దోచరాకుండ బల్పెద్దకుంబెద్దవై చిన్నకుంజిన్నవై యాది మధ్యాంత శూన్యుండవై వాసుదేవాది నానాపరవ్యూహాది మధ్యాంత శూన్యుండవై వాసుదేవాది నానాపరవ్యూహ సద్వైభ వార్చాంత రాత్మా

విభేధంబుల స్వేదవిచ్ఛేద సమ్మోదనాపాద నాత్యంత లోకోత్తరావార్య సచ్చౌర్య గాంభీర్య సౌందర్య సౌశీల్య కౌసల్య వాత్సల్య సర్వాతి శాయి ప్రకృష్టాతి శక్తిప్రయుక్తి ప్రశస్తాద్య సంఖ్యేయ కల్యాణ సాద్గుణ్య గణ్యుండవై నీవ గణ్యుండవై యుందు వంచిట్లునుంగొందఱున్

దేవుడిట్లంతయున్నత్యుడౌ వ్యావహారిక్య లీస్థన్ గనంగా మదిన్నద్భుణ బ్రహ్మ బుద్ధి న్విచారింపగా నాపరబ్రహ్మ సత్యంబ సత్యంబు శిష్టంబు స్పష్టంబు దృష్టంబు నష్టంబవిద్యా విశిష్టంబహంభావ సృష్టిం గదా జీవులెల్లం బరబహ్మలో నైక్యముంబొందుఁ దారెందును నిష్క్రియం నిష్కలం శుద్ధ మత్యంత శాంతం. ప్రబుద్ధంబనం జెల్లియున్నట్టి యాసన్మహధ్యస్తుచే సిద్ధ మంచిట్లు నుంగొంద ఱున్

జూడగాఁజూడగామాయ సర్వంబు సర్వేశ్వరుండాది మధ్యాంత శూన్యుం డు మాన్యుండు దేహాత్మలుందత్కృత్యంబు న్మించు న్మరీరంబు జీవుం డనం తుండు తద్వేవ తుల్యుండుగా నుండు దైవాత్మకుందారకుంగొల్చి తద్బ్రహ్మ సాన్నిధ్యముంగాంచి యానంద ముంజెందు నెన్నండిఁకన్ముందు నిందుద్భ వంబొందఁ బోడంచునుం గొందఱున్

గొందరీదృశ్యమాన ప్రపంచంబు నొక్కండెవండేని గావించలేదింతదానంత తానై జనించెన్ జగంబీ గతిన్నైజ మీ యోజనే యుటం సిద్ధంబ బద్ధంబు సృష్టిప్రయోగ ప్రయోగ్యంబు మృగ్యంబటంచున్ బ్రకారప్రచారా విచార స్వభావుల్తదీయ ప్రభావంబు నింతేనియుంగానలేకట్లు భావించి యవ్వాని కెవ్వారు వీలై మదిందోచు నట్లే ప్రకృష్టోహ విశ్వాస సంధనుసారంబుగా నిన్ను నెన్నేని భావం బులన్ దేవభావించుచున్నారు. నిన్నేరును న్నేరరి ట్లుండు నీలాగువాటిట్టి లీలావిశేషంబటంచెన్న నిన్నెంచ నేనెంత వాఁడన్ వరేణ్యా శరణ్యాయ గణ్యాతిగణ్యా మహీశా మహీశాస్వభక్తార్తి నిర్వా పణైకైక దీక్షా విపక్షా ప్రశిక్షా పరందామ సద్ధామ భూమా నమస్తే నమస్తే నమస్తే నమః 146

వ. అని సంస్తుతించి మఱియును 147

శా. ఈలాగేల యుపేక్ష సేసెదవు తండ్రీ! నాకు దిక్కెవ్వనీ
కాలంగేలులఁగేలు కొల్పుచు నమస్కారంబు గావించెదన్
బాలన్మ్రొంచెదో నీటముంచెదో ననుం బాపాత్ములీ దైత్యులన్
నేలన్నేలను బెట్టి కాలఁజమురన్ నీచాటునం జేరితిన్ 148

శా. నీవేకావను దల్లిదండ్రి గురువున్ నెయ్యంపు వియ్యంబవున్
నీవేదాతవు నేత వేడుగడయున్ నిక్కంపు దిక్కేయెడన్
నీవే నావ విపత్సముద్రము తరింపన్ నీవు నాకిందు మా
యావల్కొలకు నేలకుందివిరితేనైరావతాదస్తనిన్ 149

చ. మనమున నిట్లుజుండు ననుమానము మానియు మానమూనితి
మ్మనమున సంస్తుతింప హరి మానసమానసమాధి నిండు ప్రే
మను మునుగంగఁజేసి ననుమంచును నించున గూర్మి దుష్టతా
మనమున కీడు కీడుడుపు మన్ననగ్రన్నన నంచు నెంచుచున్ 150

క. భక్తిని బలుతెఱగుల నిటు
ప్రాక్తన సూక్తముల ధాతప్రస్తుతి సేయన్
భక్తపరాధీనుండను
రక్తిన్ బొడసూపి శౌరి స్రష్టకు ననియెన్ 151

క. ఏనిదె వచ్చితి నీకున్
దీనత నూనంగనేల ధీనిధి వెతతో
దీనన్ దానంబోయెడు
దీనుల దానవులఁగాంచి దిటముడుఁగుదురే 152

ఉ. ఓ చతురాస్య నీవతగ నోడకు మేనిదె చూడు వీరలన్
నీ చతురత్వ మెంచితగ నీఱొనరించెద మించి నీదు సం
కోచముఁబాచి పాచితము గూర్చెద వీరికి పాపి కోటికిన్
గీచక రోటిగా నణచి కేళి చంపెద కీలిపోలికన్ 153

చ. ఇటునటు శౌరి తోచుటకు నెక్కుడు వెక్కసమంది రక్కసుల్
పెటపెట దంతము ల్గొఱికి పిండిగఁ బెండిలికేగునట్లుగాఁ

బటు కటు రోషభాషలగు భాలునజుంద్రొలంగి యొ
క్కట వటపత్రశాయి పయింగయ్యముకై యొగిఁగాలుఁద్రవ్వగన్ 154

వ. అట్టియెడ నాజగజెట్టియగు వారిజాక్షుండు మిట్టి మిట్టి పడువారి జాల్మతకుఁదగిన మతకరితన ముట్టిపడ నెట్టన నెటైన వారల పుట్టి ముంచ సంకల్పంబు పుట్టి ముంచికొనివచ్చు మిత్తిని గాంచ నేరక వారక క్రించు దనమ్మున నెదిరి తమ్మెఱుంగక కొంచెపు బుద్ధి నెఱయను బుద్ధిగాలము మ్రింగదమకించు శాలముల గతిఁదమకుఁగాలము చేరువగుట గతిలేని యహామతిమాలిన దానవులు దురభిమానమున కుఁగల కల నగి నగధరుండిట్లనియె 155

ఉ. ఓయమరారులార యిటకోహరి సాహరి మీరురాగతం
బేయది మీ యెదంగలుగు నీతిని నీతినిదెల్పు డంత నా
కాయది కాయొపండొవిని యావల నావలనైనదిత్తు నే
దాయె వరమ్ముదాయ శరణన్న దయంగనువాడ దాయనున్ 156

క. అని శ్రీహరి యనుడుం దల
మునుకలుగా గినుకదొలుక ముకుంద్రాడుండు
స్సిన యెనుబోతులవలెఁదో
కనుద్రొక్కిన పాములట్ల కడగి యిరువురున్ 157

మ. అకటా మాకు వరములిచ్చుటకు నీవాబాగు బాగేస్కౌ పెం
డ్లికి నెఁటింతల రాయభారమగు నాలేదంచు చేఁసాచినన్
గికురింపంగల వారమే యెదియునుంగీడొండె మేలొండేదాఁ
పక మేమిత్తుము కోరుమేదయిన ప్రాణంబులుంగూడగన్ 158

ఉ. మోసము దోసమౌ ననక మోఱకులై మధుకైటభాసురుల్
భాసురధీసరున్ హరిని బ్రాణము లేనియుఁగోరు మంటకున్
బాసెములో ఘృతంబొలికె బొసెములందఱి కాలినుండి యం
చోసరిలంగ నుండి విధియుత్సుకియై సుఖియై కనుంగొనన్ 159

మ. అసురశ్రీ్కిందును మీదు గానకన నట్లావంత చింతింపకిం
కింపెసగందమ్మును గట్టిత్రాళులను దామే తెచ్చికొన్నట్లు గా
బొసగన్మాధవుడాడి తప్పని మహాపుణ్యుల్గదా మీరు మీ
యసువుల్దాపక నాకు నిండనుచు సయ్యాటంబుగా బల్కినన్ 160

క. అదివిని నడుము లొటుక్కని
న దనుజులకు వచ్చె నెమరున కపుడు సహసా
విది ధీతన క్రియామను
సదుదిత మేలగును భువిన సత్యంబనుచున్ 161

క. ఆహా యెటులాయెను మన
సాహస కృత్యంబు ఫలమ సాధ్యంబనుచున్
బాహిర పడి దనుజులు సం
దేహము వదలుకొని రాత్మ దేహముల యెడన్ 162

వ. వారలొండురు లిట్లు వితర్కించుకొనిరి 163

మ. మధువా! యేమిరకైటభా!మన మిటుల్ మత్తిల్లిరాఁజెల్లునా
వ్యధయయ్యె న్స్వకృతాపరాధమున నూహాపోహలే లేక యీ
వధ చేజేతులఁదెచ్చుకొంటి మిటు కువ్వాళంపు గోవాళ్ళమై
విధిరేగంబొదలడ్డ మా మనము పిర్వీకల్బడం బోవునా 164

ఉ. కర్బురసంతతిన్ బడసి గాసినవారము భీకరారిచే
కర్బుర సంతతిన్ బడసికామపితన్ తగనాజిగెల్వగన్
దోర్బలహీనతన్ మఱిసుదుర్జయ వైరి విచారధీవ్యధా
దోర్బల మర్దనార్దితులు దుర్జయవైరులపైచలంగరే 165

సీ. తాహరివలె లేచి తాహరీయని హరి
బాహర పోవంగ మోహరించి
యాసురంబగు మాయ నాసురంబుగఁబూని
మీసరంబుగ జమమీసలూచి

నీరాధి నాథుని బారాది యబ్దము
కారాధి వాసుగాఁగారియ లిడి
వాసవా వెడలక బాసవాల్గను గొనఁ
గాసిల్ల ధనదుని మోసపుచ్చి
కంట బడినట్టి వారిని మంట గలిపి
భూమెదీముల నిడి సర్వభూతములను
గాములను గీములకుఁబాపి గోములణఁచి
యెంతసేయ మెయట్టు లోరంతఁప్రొద్దు 166

గీ. అప్పుడేమయ్యె హరియు గిరియు
నిప్పుడొప్పుమి గల్గిన దెప్పుకొనఁగ
నేటికి మనంతటను మనమిట్టు లుఱక
నేటి కొక తప్పు టెత్తున్న నెగ్గగలము 167

సీ. ఎడప కెయ్యెడనైనఁబడి యుండ కిట నీటఁ
దిగి హుటాహుటి నేగుదెంచనేల
నేతెంచినాము పొనెక్కువల్ గచ్చులు
వాగి విరించిపై కేగనేలఁ
బోయితి మట్లైపో భోగీశ శాయిఁజూ
పుమని కారాకూరములననేల
నంటిమిపో తానెహరి వరమ్మీఁబూన
వలదంచు బింకముల్వదరనేల
బదరితిమి పో మనంబున బెదరులేక
ప్రాణమే నిత్తుమని తట్టిపగ్గెలట్లు
ప్రేలనేలిప్షు చేతులు పిసికొన్న
దీరునే చల్లి గట్టించి తినగవలదె 168

క. వెంబర విత్తుల మైతిమి
తంబలి యనుమానమొద్దు తలతిక్కయుఁదీ

రెం బలుమాట లిడేటికి
నంబలి ద్రావుచును హరికి నను లిడుటొప్పున్ 169

గీ. అష్టకష్టమ్ములంబడి యష్టమూర్తి
వలన వలనుగఁబడసిన వరములెల్లఁ
గూడఁగుమ్మర కీడునుగుడికి నొక్క
పెట్టనెడు రీతి హరిపొట్ట బెట్టఁ(గ)డియె 170

మందాక్రాంతవృత్తము:
భావంబందు న్వివిధగతులన్బాగుగాజూచి చేయన్
రావే బాముల్ జనులకెపుడన్యప్రకారానఁబోవన్
కేవాదిన్యః పరిభవ పదం నిష్ఫలాం భావయత్నా
నా వాక్యార్థంబగునె వృధ భిన్నంబు సిద్ధంబుగాదే 171

క. దెప్పరమగు నీ ముప్పుం
దప్పక తప్పింపఁగల్గు ధన్యులు గలరే
యిప్పగిది జనిన శుభముల్
జొప్పడునని చెప్పిదారి సూపనెవఁడిఁకన్ 172

చ. అనియెనలేని నెవ్వగకు నగ్గముగా బలమేది రక్కసుల్
మనములు పెల్చఁజేయిడి కలంచిన యట్టులుగాఁగ నెంతయున్
బని మధుకొంత దిట్ట బవరంబున సోదరు కైటభాసురున్
గని మనమెట్టకేని మనగంటిమి గట్టియుపాయ మీ యెడన్ 173

వ. అది యెయ్యది యంటివేని నుడివైద వినుమని యద్దనుజుఁడనుజున కిట్లనియె 174

క. దెట్టు మీదనిదెట్టైనను మా
మీద నెదం గూర్చి మముదమింపుము పొడిచో
మీఁదననెదనట నొంటవదో
కోదరి యుటు నుండి కొట్టుకొని రమ్మనరే 175

క. వరములు వడసిన చెడుగౌ
వరమున, మధుకైటభాఖ్య వరతిమి లాల్ఁధీ
వర వరజాలములో స్థా
వరముగఁబడియడఁగ జడధి వ్రాసితివె విధీ 176

వ. అని యిట్లనేక విధంబుల మధుకైటభూలు తలపోసి తలపోసియున్న తఱి
నన్నయగు మధువు మధుర వచన రచన బేరుగాంచె నరితోఁ శ్రీహరితో నిట్లని
విన్నపించె

177

చ. వినుమనుమాల మేల హరి వింతగ సంతసమందు మాదులా
వినుమడిగాఁగ మాపలుకులించుక యేనితిదమ్ముఁ దప్పఁబో
వినుమయిన న్సువర్ణగిరి విందు రవుల్లతు లింత తప్పినన్
వినుమనుగంగ ప్రత్యులయి ప్రీలినఁగూలిన శైలజాలముల్ 178

ఆ. కాని యొకటి కలదు కానిమాటయ కాదు
కాని చేయుదన్నఁగాని చెప్ప
గాని తమ్ముకాదు కాని జంబట నుంట
గాని పోకగాని కలుగు మాకు 179

వ. అను నద్దానవుల దీనవాక్యాలకు దయదవుల దవుల నున్న వారిఁజేరువకుఁదివిచి
భక్త పరాయణుండగు నారాయణుండు వారికోరిక ప్రకారంబ కావింపగల
వాఁడనని ముమ్మారు సమ్మతించి వల్లెయనిన నాసురారులు నాముకొని
తామిక సునిన వారయకా నమ్మి యమ్మిడిసి పాటు కొయ్యలు మిడిమానుసుల
వలె నిట్లనిరి.

180

ఆ.వె. నీరు లేని చోట దొరింపుమని వారు
కోర శౌరి తనదు కురువు మీఁద
వారిఁబండ బెట్టి వరుసగా దొరించె
నిద్దర సురవరుల నిద్దముగను 181

ఆ. వారిపుణ్య మహహా వర్ణింపఁదరమౌనె
యెట్టి లాయనేమి యీాశు చేతఁ
గనిరి మృతిని నట్లు గల్గనెట్టుడునైన
ధన్యుఁడగును గాక యన్యుఁడగునె 182

క. ఎల్లిదము సేసి ధాతను
నల్లల్లన చెవులు వట్టి యాడించిన యా
యుల్లఅవు బిరుదు లడఁగిరి
చెల్లరె యెట్టుఁడును నవధి చెల్లిన తోడన్ 183

క. అట్టి మధుకైటభులకుం
బుట్టిన దుందుండునసదె భువి విత్తొకటిం
చెట్టునఁబుట్టునె వేఱొక
చెట్టేటికి సందియంబు శిష్టోక్తిపయిన్ 184

క. ప్రతిగాన యద్దురాత్మున
కతఁడతి మాయలకుఁబెట్టు నది పేరత్యు
న్నతిని నభుతో నభవి
ష్యతి యనఁదగి యుండు వేయి చదువులికేలా 185

మ. తొడరంజాలరు బ్రహ్మరుద్రులని యందు న్వానితో నెందునుం
గడకుంజీమ చిటుక్కుమన్న నులుకుంగాలీఁచ బోఁబారియ
క్కడకు న్వ్వాన నిదానముందెలియుదాఁక న్నిద్రమో కార్చుచున్
వడి మన్నుం బొడి మన్నుగాఁదిరిగి మీఁదంబట్టి త్రుంచున్రిపున్ 186

వ. ఇట్లు దానవు వృత్తాంతంబు వక్కాణించు తరి దరణి బింబస్తగిరి మస్తకంబునకు మకుటాయ మానంబగుటయు సాయంతన సంధ్యాతి కృత్యంబులు నిర్వహించువాడై యుదంకుండు రేపకడఁదక్కుంగల వచనీయంబు తెలుంగగుంగాక యనిచనియె బృహదశ్వుండును నాటుకొలగము సాలించి నిజప్రాసాదతలంబధిరోహించి తాపసి వచించినమధుకైటభాసురుల యుదంత

మంతయు స్వాంతమునకొక వింతగా జింతింపు చుండె నట్టియెడ 187

సంధ్యాది కాల వర్ణన

గీ. పూర్వ దిక్కామధేనువు పొడుపు తిప్ప
పైని దూర్పు మొగమ్ముగాఁబండి సమయ
గోపకుఁడు సంజ బాల్పిండవేపు తఱిని
వెలికి గన్పట్టు పొదుగు నాఁదెలుపు దోచె 188

చ. రమణుడు రాకమున్న చికురంబులు దువ్వియలంకరింపగాఁ
దమిఁదమి కాంత పెన్నెఱులు తద్దయువిప్పి విదిర్చెనోయనన్
దమములు పర్వెరోదసిని దచ్చి కురాంతరు దంచితప్రసూ
నములటలేచి పైకెగసె నా వినువీధిని దోచె దారకల్ 189

ఉ. యామిని భామినీమణి సమంచిత గౌరవయుక్తిమై నిజ
స్వామి నెదుర్కొనంగడఁగఁజయ్యనఁదత్సఖులైన యష్టది
క్కామినులు న్సుఖావహముగాఁగుసుమాక్షత యుక్తియుక్తతన్
బ్రేమనుజల్లు సేసల నరిక్కఁలు నొక్కటఁచిక్కటిల్లెడిన్ 190

చ. బిగిఁదమి సోమయామినుల పెండిలిఁజేయఁగ లాజహోమమున్
బగబగ సాంధ్యరాగ శిఖిపై నిడిరోదసి మంగలంబునన్
దగదగకాల యాజ్ఞికుడు ధాన్యము వేపఁగఁబెట్లిపెట్లి పై
కెగసెడు లాజలో యనఁగ నెల్లెడల న్విలసిల్లెఁదారకల్ 191

చ. సమయ కలాదుఁడాదట నిశాపతి. శీర్షవిభుషణార్థ మం
దమగు కడానిగుల్లఁగొని తారిచి తూరుపుకొండ దిమ్మపైఁ
దిమిరపు లక్కలోఁబొదిగి తోరమి మధ్యమునందు నీలముల్
రమణఘటించి పైకిఁగొను రాగిడి నాశశిదోఁచె దూర్పునన్ 192

శా. పాతాళంబునఁబట్టి రాహువు పగన్ బైకిన్వడిన్ విద్చెనా
స్పీతుండై శశి దోచెఁదూర్పునఁదనుం బీడించి సాక్షాత్తమ

స్పంచు గ్రోదసి నిండి పండుకొనుగా స్వర్భానుంతోడ్తోనవి
ఖ్యాతిం జంద్రుఁడు మ్రింగెనాఁజనియరుల్లాహో పటాపంచలై 193

సీ. కాలగోపాలుండు కడసంజఁబాల్పిండఁ
జంద్రోధ్ని బూర్వదిక్సార భేయిఁ
బొడుపు గుబ్బలి దూడఁగుడి పిరశ్మల దాయఁ
గట్టి రోదో భాండకమునఁబిండు
క్షీరపూరమనంగఁజెన్నొందు వెన్నెల
లీవల కావల కెగసి పడిన
పాలచుక్కలనంగ భాసిల్లె రిక్కలు
జక్కవక వవిచ్చె వెక్కసముగఁ
గలకలోత్కంఠ పిక కంఠ కలవరములఁ
గలరవంబుల రవములఁగలఁకదేఱి
మెలకువను జెంది కుముదిని గులుకసాఁగె
గోరికలు కొనసాగెఁజకోరి కపుడు 194

చ. తరణి నభంబు సొఁగు నిఁక దాఁటుము చోటులతోడనంచు ముం
జొఱవను వేగు జుక్క తన చుట్టరికంబుల వేగఁదెల్పగా
వరుణుని వీట రాజు పరివారముతో దిగ మిట్ట లెక్కిగో
పురమును జూచునోయనగ పోయె నిశాపతి పశ్చిమాద్రిపైన్ 195

చ. ఉరవడి సూరు తేరున కనూరుడు గుఱ్ఱముబూన్చె దానికిన్
వెరవగు దారి సూప వినువీధికి నెక్కెను వేగుఁజుక్కయి
ల్వరుసను నిద్రలేపెఁగ్రొక వాకులు కొక్కొరొకోయటంచు ని
ద్దుర విడుమంచుఁబద్మినిని దొందర సేసెను దేంట్లు ఝుంకృతిన్ 196

చ. సరిగనుతేనె తేనియలు చాలఁగగ్రోలి మిళిందము ల్విశన్
సరిగమ యంచు వేకువను సారసమందునె మేలగించి వే
సరిగమునించి నట్లు సరసంబుగఁబాడెను మేలు కొల్పులన్
సరి గమలంబులన్ మధుప ఝుంకృతి మేల్కొనె మెల్ల బద్మినుల్ 197

చ. వెలవెల బాఱె దీపములు వెన్నెలప్రాయము జాఱె బయ్యెదల్
సొలయుచుఁదూఱె సొరెకును సోరణ గండ్లను నిద్ర తాళికిన్
మెలఁకువసేరి మెల్లగను మేతకుఁబాఱెను జక్రవాకముల్
కలువలు నిద్ర గూడె విహగంబులు జేరెను జెట్లపట్టులన్ 198

సీ. కాల విజ్ఞానార్ధకామియై ప్రాగ్గిరి
యందిడ్డ పొన్నడియార మనగఁ
జెండాడుచును జయంతుడు చేతఁదుఱుముచు
బరపిన హోంబట్టు బంతి యనగ
సమయానవిప్రుండు సంధ్యావార్చగఁజేతఁ
బట్టిన పొన్వారి వాణమనగ
బ్రాగ్దిశాంగన ఫాలభాగంబు నందున
దిద్దిన సిందూర తిలక మనగ
సతతమున్మత ధృతి ఘన శ్రుతి వితతులఁ
బెట్టి దాచిన రతనాల పెట్టె చక్ర
వాక గార్హస్థ్య ధర్మ నిర్వాహకుండు
లోక బాంధవుఁడుదయాద్రి పైకి బ్రాకె 199

సీ. చక్రవాక బ్రహ్మ చర్య వ్రతోత్సర్గ
హోరా ప్రధర్మమౌ హూర్తికుండు
మధు చౌరి కాంబుజాంతర్బద్ధ మధుకర
పుంజదుష్కార్య విమోచకుండు
సంవేశ నష్ట దృగ్జాతికిఁజైతన్య
సిద్ధాంజన ప్రదాక్షి భిషజుండు
రోదసీ కుహర సరోజ గుచ్ఛవికాసి
ధ్వాంత నక్రహర సుదర్శనుండు
కాలబాలుండు చదలను కాగితమున
వ్రాతవరువడికై వరువ్రాతలేచి
పొడుపు గుబ్బలి గూర్చుండి పొన్ను నీట

సారెదిద్దిన సున్న నాసవిత్రుడోదవె 200

వ. అని చెప్పిన విని జనమేజయుండు తదుపరి వృత్తాంత మెట్టిదయ్యె నానతీయు
మని యడుగుటయు

201

మాలిని:

అకలుష జనవంద్యా యచ్చ యోగాబినంద్యా
వికట దితిజ భేదీ వీత రాగాను మోదీ
ప్రకట యదుకులేశా పాండవాను ప్రవేశా
సకల దురిత దూరాస్వామి కృష్ణావతారా 202

శ్రీ రుక్మిణీశ నృహరీ
కారుణ్య పయః పయోధి కంస విదారీ
భూరి దురితాప హారీ
చారు ఘనాభాంగ విజయ సారధి శౌరి 203

వ. దేవా దివ్య చిత్తంబున నవధరింపు మట్లు జనమేజయుడడిగిన, వైశంపాయనుడు
తదుపర్యుదంతమంతయు నాకర్ణింపుమని యిట్లనియె అట్లుదంకుండరిగి
మఱునాఁడు రేపకడఁ గాల్య కరణీయంబులెల్లఁగల్పకాలంబున ఁదీర్చికొని
తన రాకవార్చి యెడ్డోలగంబునఁగూర్చుండిన బృహ దశ్వ మహీశ్వరుఁదగు
తెఱంగునఁగాంచి యో పంచానన విక్రమా ప్రపంచమునకెల్ల వంచనసేయు
నప్పాపదానవు దుశ్చర్యలింకంగలవు విన నాశ్చర్యకరంబులు గావె యవి కొన్నిటి
నుగ్గడించెద వినుమని మునినాధుండజ్జన నాధున కిట్లనియె

204

సీ. ఏఁడాది కొకసారి యేచి లేచి యతండు
ఇనుని మ్రింగుదునని పోవ నినుని పైకి
బెగడొంది రవి డుక్కి బెడగొండ మఱువున
మరువున కేతెంచు మఱుకువగను
దారి తప్పునఁదప్పిదారి యద్దారిని
జను వారి మురికొని చాఁగఱకొను

గాన నొండేమియుగాన రాకుండిన
    ముసుల తాళము పట్టు మూరిబోవ
నబుసుపోకున్న గిఱికొని తబిసి యత్ర
మమునఁదెల చెడి తఱి నేమమున నుండు
మమున గెంటసమాడుచు మల్లరమున
బిలిచి యఱ్ఱాఁకలం బెట్టు బెలుచములుచ 205

ఉ. ఏరి తరమ్ము వాని నిదమిత్థమటంచని యెంచ నిల్వని
స్తారము బూటకమ్ము గ్రహచారము చాలక యెవ్వరేనిన
ద్దారిని దారి తప్పి చనఁదప్పక వారల పుట్టిముంచు గ
న్నారఁగఁదేఱి పాఱి కనినంతకు గుండియ తాళదింతయున్ 206

చ. అది యటులుండ నిండు వని నాఁకలి కాకునలమ్ము దించు వేఁ
గు మఱె యెల్లకాలమును గూరయునారయి యట్టిమమ్ములన్
బెదరగ ముప్పుతిప్పలను బెట్టెడు మాదురవస్థ సెప్పఁదీ
రదు నృప యుండరాములిటురా విడనాడితి జీవితాశలన్ 207

శా. ఏనాఁడేరికి నేమొనర్చితినొ కీడీనాఁడు వెన్నాడి యా
హోనా చెయ్యి సురాకృతిన్ వెలసి యీయందాన సంధానమై
నానా బాధలఁబెట్టి కట్టి కుడుపంగా నోర్వలేకిప్పుడ
య్యోనానేమగుఁగాళ్ళఁబడ్డ ఫణి పోనో పూని దష్టింపదే 208

సీ. కన్నెఱ్ఱ సేసెనా కట్టెదుటికి బాఁసి
    మరి యముండును దోకముడత బెట్టు
మదిపుట్టి లేచెనా పదునాల్గు భువనమ్ము
    లర నిముసము లోనఁదిరిగి వచ్చు
నాఁకొని మెసవెనా చేకొన్నమును మెల్ల
    మల్లె వట్టిన చేని మాడ్కిఁదీర్చు
నాము సూపించెనా భూమి యాకాశంబు
    వంచి తాళమ్ము వాయించి విడుచుఁ

జూచి చూడక యసిమిరి దాఁచి కొన్న
యేటు సూటికి నొక్కఁడు కోటి కొకఁడు
నుండునో యుండఁడో కాక యొనరఁగంటఁ
బడిన వాఁడెంత వాఁడైన బ్రతికి చనునె 209

మ. అలకా దానవుపేరు సెప్పఁగనె యత్యంతంబు పాఱుంజుమీ
యలకాధీశుండు శంభునంతటిఁడు నండై యుండియున్ వాని మా
యలకా గండలకానుమాకు వినుమయ్యా గాలికిందూలి చా
యలకా పల్గులు కొట్టుకొంచుఁజనఁబొల్లా కెట్లు నిల్వంబడున్ 210

చ. మునులము సంగవర్జి తులముంబవనాంబు దళాహ్వాతిన్నటిం
చు నరుల మమ్ము నొక్క చెయి సూడఁగడంగెడు నిద్దురాత్ముఁడీ
తనికది యేపు యోజన మెుదయ్యుపుఁగంటికిఁబేలగింజ పె
ద్దనియెడు రీతి నీతనికి నద్దిర యుద్ది యెవండు లేడికన్ 211

గీ. ఇంకనొక్కటిగలదు మీకిందు నుడువ
వాఁడు పగఁబట్టెనేని యెవ్వానినైనఁ
బంతగించి యసుల్గొను నంతవరకు
నన్నపానాదులను వీడు నంతోపు వహిని 212

క. మాటాడినఁబోట్లాడును
దట్లాటకు సిద్ధపడుచు దయ్యము వలెనా
యాట్లడు వేట్లాడుచు నగ
చాట్లం బెట్టును మునులను చాటుగ నధిపా 213

క. పలవ యిటుల్మ్రోయు నే చఁగఁ
జల పట్టెను మునులపాలి శని దేవతయై
యిలఁబిల్లికి చెలగాటము
నెలుకకుఁగడుఁబ్రాణ గొడ్డమిది యనుకరణిన్ 214

సీ. మంపిర్లి గాంధారి మాందారి ప్రొద్దేగి
పప్పు పప్పుగఁగూల్చుఁ గుప్పములను

వరువాతనేయు పవడముమై బిట్టార్చుఁ
    దోడనాకస మెల్లఁదూటు గట్టి
మును మాపులను బోయి ముని మూఁపు లందెక్కి
    తత్తడి యనికశందత్తటించు
మిట్టమధ్యాహ్నంబు మిడిగ్రుడ్లు ద్రిప్పుచు
    వెక్కురు కాతాళమెక్కి తిరుగు
వేళపాళలు లేకుండ వేదురెత్తి
నములఁగను పడ్డజను వెతారములు వెట్టి
కుఱు చవాయలగడ తేర్చి గోడెములను
బట్టి మాకీడుమగతికే తెట్టు దొలఁగు 215

ఉ. వట్టిదికాదు నాకఱదవానిది యాలుడి విప్పి సెప్పఁగాఁ
పట్టువె యేండ్లు పూండ్లుతని వంటి దుర్మాత్ముఁడు పుట్టలేదికం
బుట్టుగఁ బోఁడు సూడఁ బెనుభూతము నాతని పేరు సెప్పినన్
బిట్టలున నీరు ద్రావవిలవేయు ప్రలాపము లింక నేటికిన్ 216

ఉ. ఆవలనేది యెట్లయిన నాన సుమీ తెగటార్చుకున్ననా
కావలుఁగేవ లాంతకుని గాదః నానసుమీ వధింపగన్
మావగ వోవఁగా నడచు మార్గము భార్గవరామశౌర్యయో
నీవిఁక లావు కార్యమని నీఁగను పాయముఁజూడు పోఁడిమిన్ 217

ఉ. మెల్లగఁ జెప్పినాఁడనని మేలము సేయక నాదు విన్నపం
బుల్లము నందు నుంచి ప్రజ కొవ్వమిసేయుచు విఱ్ఱవీగుఁనా
కల్లరి మల్లరం బణఁపగా నిఁక నెంచక మీన మేషముల్
తెల్లమినీదు నందను మదీయ వశంబునఁ బెట్టు మిల్లడన్ 218

క. వినుమొక బ్రహ్మ రహస్యము
వనజాక్షుఁడు మొన్ననాకు వాక్రుచ్చినదా
నిని దూచా తప్పక యె
ల్లను విన్నది విన్న యట్టులన్ వినిపింతున్ 219

సీ. ఒకనాడు సపనమ్ము నొనరింప నేఁబూని
మునులతో బతము మై మొనసియుండ
నొక్కచమ్మునఁజుక్క యూఁడి పడినయట్టు
లీ రక్కసుడట కేగుదెంచి
తన పరివారమ్ము దైత్యుల నూల్కొల్పి
బిరబిర యూపము ల్విఱికి వైచి
కాపీనములు సించి కళవసమ్ములుఁదెంచి
దండకమండలు ల్పిండిసేసి
కుశ సమిత్తతిపై నూఁచి కుండలముల
నిండ మూత్రించి త్రెంచి జందెముల నాదు
గడ్డమును మీస ... గుదుల్లగదలఁబెఱికి
వాఁడిమిని జూపి యూడని బాడె వాఁడు 220

వ. అమ్ముక్కడి రక్కసితో వెక్కసపడి నాప్రక్క నొక్కింతయేని లోపంబు లేదు గదా యీపగిది నన్నేల వేఁ పెదు బాలునిఁ కనా జోలికి రాకు మేకాంతముననే కతమ మేకత లెఱుంగక యడవుల నిడుమలఁగుడుచుచుఁబడి యుండు వెడగులమగు మమునేచిన నేమి ఫలంబు లభించు నీనోచిన నోముఫలంబు లెల్ల విఫలంబులై మేటి పాపంబు మూటఁగట్టికొని దాఁచి కొనియెద వింతె కొదవగాక నీకొదవఁబోవునది వేతేమియు లేదు సుమా, కాన నీకానవెట్టి గట్టిగఁ జెప్పదనీ కాననిఁ కన నెన్నండు వేఁచకుమని చాలఁగ వాని జాలిపుట్టగ వేడికొని మఱియును 221

క. ఇచ్చం గలనైననుం నే
నెచ్చెడుగుందలప నీకు నే...కి వత్సా
పిచ్చుకపై బ్రహ్మాస్త్రము
విచ్చలవిడి విడిచినట్లు వేఁడిమి నాపై 222

గీ. సతత మేము వనిని సన్న్యాసులము గాఁగ
నొరుల తెరువు చొరక మొదిగి యుండు

యేలనయ్య విడువు మేలమంచనఁగ స
నేమిరా యటంచుఁజెవి నిడండు 223

గీ. సొరెకును జెప్పి చెప్పి నానోరుకాయ
గాసెఁగాకతఁడొక యింత కరగడయ్యె
వీనిపని సుతిమించి రాగానఁబడియెఁ
గాన నీ సూనుఁడౌ సుమీ వీని మిత్తి 224

వ. ఆవివరమువశ్యముదేవ రహస్యమైనను నీకు దాఁప నేరఁగానఁ జెప్పెద వినుము 225

గీ. ఎపుడు సవనము దలపెట్ట నిదియ గతిగ
నుట్టిపడు వాఁడు పిల్చి నట్లుఁటికి వచ్చి
యుకట యాకుమ్మ రావమ్మ నార్చు తెలవు
కలదొలేదో యటంచు నేఁగాంచ దివిరి 226

క. కరచరణ క్షాళనము న
మరఁగాఁ గావించి యాచమన మొనరిచి శ్రీ
హరి పదకమలము లెడద గు
దురు పఱిచి తదేకనిష్ఠఁ దొలగక యుండన్ 227

క. ప్రత్యక్షంబై శ్రీహరి
కృత్యంబి టనాన తిచ్చెఁ గృపదైవాఱన్
సత్యముగా దుందున కప
మృత్యువు కువలాశ్వుఁడనుచు మృధుమధురోక్తిన్ 228

క. ఆ కువలాశ్వుని యందే
ప్రాకటముగ నావహించి ప్రధనములో నీ
రాకాసిం దోరించెద
భూకంపము సేయ కతని బుచ్చుమిటకనెన్ 229

వ. అనిన విని యవన మిత గాత్రుండనై పునఃపునఃకృతస్తోత్రుండనై తదభివాదన
సమయ పిహిత శ్రోత్రుం డనై యప్రకాశాంత స్సముచ్చారిత నిజనామ

గోత్రుండనై దూరీ కృతచ్ఛాత్రుండనై తత్పద ధ్యాన విస్మృత గాత్రుండనై, నిమీలిత నేత్రుండనై, నిర్హేతుక జాయమాన కటాక్ష మధుమధన మధుర సంభాషణామృత పాన మధుపాయ మాన శ్రోత్రుండనై విస్తార నిస్తారిత దుస్తార సంసార మాత్రుండనై తద్దయా పాత్రుండనై, యంజలి సేసి నెంజెలి ద్రోసి భయంబు దెగగోసి వినయంబెగఁబోసి యనయంబు నయంబున వాని యానతి నతి పూర్వకంబుగా నౌదల మోసి కొనదలచి తెలచిన భక్తితో మొలచిన యుక్తితో గొలచిన సూక్తితో ముక్తికి దానకంబై విరక్తికి సంధానకంబై యనురక్తికి నిదానకంబై యఘార్ణవ మంథాన కంబై భక్త జనానంద దాయకంబై శుభవిధాయకంబై విభవ ప్రదాయ కంబై వెలయు శ్రీహరి చరణకమలము నమలిన హృదయంబునఁ బాయక సదయ హృదయుండు గాన విన్నపించ దలఁచినది వెనుదీయక యభయప్రదుడుగాన విప్పదలచినది కప్పివేయక త్రిప్పివేయక దప్పిదీర నొప్పిజాఱ నొప్పిదమగు తీరున గాయకుని వలె గంతులిడక పాయకము వలె గుఱిసెడక మాయికుని వలె మనికితము సేయక లేనిది తీయక కానిది కనుఁగొనక లేని పోనిది వినుమనక మనవిని వినుమని మనమునఁబెనగొను ననురక్తి కొలంది యాచించక మాసక్తి కొలంది యోజించక ఘన సన్మాన మొదవెనని యెదఁద్రుళ్లక యపుడ ఫలింప లేదని మళ్ళ పట్టిన పట్టు సడలక దను సంతతి సస్యసంతతావగ్రహంబగు తదీయ దివ్య మంగళ విగ్రహంబు గన్నుల కఱవు దీఱ గనుంగొనుచుఁ గాళ్లబెనఁగొనుచు సంతసంబు నగుమొగంబున కొంక వింతయగు కాంతి నీనుచు గండపాళి చెంతను మంతనంబు లాడ నుదర నిమిత్తము గాదు గానని దురయు నాహారంబు వర్జించి కర్జము పార్జించు వాడనై యీడంబోని వేడుక వేఁడుకొను వాడనై యిన్నేలపై నన్నేలగ దలంచి మేలుగ నామ్రోలఁగించి దంకురిత సీరాననంబున శ్రీవరా నను లక్షించి వక్షంబుననుప లాలించుచు నన్నుగడ తేర్పఁబూనిన పూనిక వెలికిఁ దొలుకాడ వెళ్లిగొల్పుచుఁదన భక్తి మార్గము నకు దిన్నగ నన్ను బురికొల్పి గిరికొల్పుచుఁ బొల్పుగ గటాక్షంబు నాపై మెలపుచు సకల మనోబాధలను సందర్శన మాత్రంబున దూరంబుగ బాఱద్రోలు తనప్రశస్తంబగు హస్తంబున వీను లీను నిమురుచు రుచుల యోజించక యాశసూచించుచు వాత్సల్యంబు దెల్పు చూడ్కుల వెదచల్లుచు వీడ్కొన నొల్లక యల్లనల్లనఁ దనువెన్నాడిన సనకసనంద నాదులు చుట్టుం జుట్టంబుల

వలెఁ జుట్టుకొని తన మెట్టు దమ్ములకుఁ దలలు సోఁకఁ జాగిలి యొక్కుమ్మడి మ్రొక్కి దక్కువగాని భక్తి విశ్వాసముల నొడలెరుంగక యెడనెడ భావించి సేవింపగ మంద సుఖా నందాబ్ధి తరంగాలకు రాజహంసలైన పరమ హంస సింధురు లాసక్తి బంధురంబుగా సంతోష సింధు స్నానము సేసి మోహదాహంబులు దీరి భాసిల్లందొల్లి గ్రాహగ్రస్త హస్తినిఁగావఁబూనిన నాఁటి వాత్సల్యంబును దత్పరతయుఁ తత్తర పాటు మూడు మూర్తంబులా ముహూర్తంబున మూర్తీభవించి నట్టు కేవలముగ నుట్టి పడ మదీయాతను తను మనస్తాపంబు పాపంబు తోడన పాపం బూని కొండిక పాపనికి గొండుక లోపమాపాదించి లోపలనె డాఁగి కొండొక సేపున కప్పాపని కోపమెడబాపి యోచింప జేయ నేయంబు దీయంబుగ జూపుచు మరలఁ బొడసూరిన జనకుని కైవడి వడిగను పడిన యా శ్రీహరి నాకు దాహరి ననియు దహరించుచు దాహరినగు నాయెడలెల్లఁ గుప్ప తెప్పలుగ నుప్పలిల్లు మొలక పులకల దనుప్పదుతరకరతల స్పర్శమున శమింప జేయుచు నన్గటాక్షించు నీరజాక్షుంబెన్నిధి గన్న పేదవలె గన్న తల్లిం గన్న పిన్న బాలుంబోలె జుంటి తెరగంట బడపరగ బరుగిడు సరస్సు కైవడి నతి శీతల పానీయపు పఁగ న్గొన్న పిపాసి తథన్వాధ్వన్యగతి నాప్యాయమాన వర్షంబుం గొన్న సస్యంబురీత షడ్రసోపేతేష్ట మృష్టాన్న సంపన్న భోజన భాజనం బొదవిన క్షుదిత పథికుని గతిఁ దనివి గొని నామనమునగల చింత యంతయు మంతనమునఁ దన మనుమున కొక్క మనవి సేసి మేలొడ గూర్పించు కొను వాడనై యెన్నరాని మన్ననఁ దిన్నగ నిట్లని విన్నవించితి

230

మహాస్రగ్ధర:

కువలాశ్వుండే జనుండో కువలయముననే కోణమందుండు వాడో
యెవడో యేజాడవాడో యెవని కొమరుఁడో యెట్టిడో తెల్పొనల్పో
లవలేశంబే నెఱుంగన్ లలి బొళుకువ యిందాక యెందాక బోనా
భువి కెట్టులొప్పొయి వానిన్ బొసఁగ వెసగనీ భూమికిందోడి తెత్తున్ 231

క. వెంగలిని గాన నాకున్
ముంగలహరి నీవు నడిచి ముదమొదవఁగ ను

ప్పొంగుచు నే బట్టిన యది
బంగారౌ నటులుగా శుభం బొనరుచు మీ 232

క. అన విని మనవిని ననుగని
తనయా నీ వినయమునకుఁదనివి సనియె నా
మనమును మన మునులందఱు
మనమున నేఁగనిన యనువు మది వినుమొదవన్ 233

క. అతడిన వంశ మహీపతి
శతముఖసముఁడిప్పుడేలు సాకేతపురిన్
మతి మంతుడు బృహదశ్వుని
సుతుడాతని బోలునట్టి సొబగులు కలరే 234

ఉ. ఆతడు తొల్లి నన్గఱిచి యాతత భక్తి దపంబు సేసె బ్ర
ద్యోతను మీద జూడ్కినిడి యుగ్రపుదాల్లను మండువేసవిన్
శీతన లోతునీట నతిశీతల భూతలమందు వానలన్
ఖ్యాతిగ నుండి మెండు దిట నన్నిట నన్నిటఁ బ్రీతి జేయుచున్ 235

క. తొలి బాముున నతడీగతి
బలు బాముల కోర్చి పేర్చి బహువత్సరముల్
సలుఁపగఁదపము కృపారస
మొలుకఁగ మొలకనగ మెలయ నొంటిగ నంటిన్ 236

క. ఇనకులమున బృహదశ్వన
కును దనయుఁడఁ వగుచుఁబుట్టి కువలాశ్వుడనన్
దనరఁగ నాతేజము నీ
తనువున నెనయింతు దుందుదైత్యునణంపన్ 237

ఉ. వాని నణంపనీహిమ వన్నెకు వాసికి నెక్క ధర్మ సం
ధానముగాఁగ భూప్రజలఁదల్లివలెం జిరకాలమేలి స
న్మానముతోన న్యాయమును నాలుగు పాళ్ళు సెలంగి పొంగగా
మానక యెల్లరౌననగ మామక లోకము జెందు మావలన్ 238

వ. అని యానతిచ్చితి గావున 239

క. ప్రాతిగ నతడేకద సా
కేత పురింబుట్టి యిపుడు కృతయుగమున వి
ఖ్యాతాక్ష్వాకు కులంబున
భీతారి సుతుండు గాఁగ బృహదశ్వనకున్ 240

ఉ. కావున నిన్నయోధ్యకును కావగ భూపతి జేయగాను స
ద్భావనధావనం జని కృపానిధి నాన్నపునిందు దోడి తె
మ్మామల గాఁగలట్టిపని నాయది నాయదిగాఁగనమ్మి మ
త్సేవక నీవిఁకం దడవు సేయక రోయక కాని త్రోవలన్ 241

క. నీవలన విన్నమాత్రన
నీవల నీవలన వలన నెలమి నతఁడు రా
నీవల బలముఁ బలమున
నీ వలసిన వలసినట్టులిడి యేతెంచున్ 242

ఉ. శ్రీహరి యానతిచ్చిన విశేషమశేషము సెప్పినాఁడ సం
దేహము గట్టిపెట్టుమిక దీన నిహమ్ము పరమ్ము గల్గఁగా
నూహలు వేయునేమిటికి నొక్కట రక్కసు నుక్కణంపఁగా
నోహరి సాహరి న్వెడల నొప్పుచుఁ దప్పక పంపునీసుతున్ 243

క. నీ తనయుం గువలాశ్వుని
నీతనయుం బంపు దుందునిందునుమంగా
నీ తనయునికి కీఫలము పు
నీ తనయన తగని తాన నిన్నుతు జయమున్ 244

ఉ. తాపస వృత్తిమైఁ జనగఁ దత్పురుఁ డై బృహదశ్వుఁ డున్నచోఁ
దాపసి భూపు రమ్మనక తానును సూనుని బంపు మంటకున్
బాపురె కాకిత్రాలుటయుఁ బండిల త్రాలుట యొక్క టైనటుల్
దోఁపగ వెజ్జు రోగికిని దుగ్ధమె పథ్యము గోరుటాయెగా 245

క. తలఁవని తలంపుగానుభ
యుల తలఁపిటు లొకటియగుచు నొనరుటకు సభం
గలవారలు ముదమందిరి
బలియుర పని యిట్టుకలసి వచ్చునటంచున్ 246

వ. అప్పుడ ప్పుడమి ఱేడప్పని దెప్పర మనియుఁబర మునికేమి కోపం బొదవు
నొయనియు నెప్పగిది బాలుపోక తనమనంబున నిట్లని వితర్కించె 247

సీ. అరుదుగా రాకరాకరుదెంచి యున్నాడు
పోరాని చుట్టమీ పుణ్యమూర్తి
తలవని తలపుగాఁ దలపెట్టుకున్న
యత్యాశ్రమంబున నతులకీర్తి
కానక కన్న నాకడు పేడుగడయుఁ బు
త్త్రుండునొక యెత్తు రెండొకెత్తు
రహస్వయంతీర్ణః పరాంస్తార యతి యను
వడువునఁ దప్పు నేవసతి జొత్తు
నే నిపుడు పంపలేను నాసూను ననిన
మున్నె కోపి తపసి ముక్కన్ను దెఱచియు
యెంచి వంచన బడశపియించఁడొక్కొ
కత్తినాఁగటి సందయ్యె గదరనాకు 248

ఉ. ఆనగఁ బూనఁ గర్త కువలాశ్వుడు వెల్వడ వాని తోడి నా
రై నగరాజ ధీరులు తదాత్మజులందఱు సైనికాళితోఁ
బో నగరాధి వాసులును బోవఁగ నొంటిగ నింట నుందువే
కానకుఁబోదు నన్న ముని కాలికి సంకిలియయ్యె నాకిటన్ 249

ఉ. నేనును గూడ వెన్దవిలి నెమ్మదిఁ బుత్రుని వెంట బోదునో
కానకుఁ బోదునో వెఱవుకానఁగరాదిఁగ నాకు యుద్ధమా
హీనము మూడుకాళ్ళ ముసలిన్నను నేదుట కట్టివారికిన్
జానలు వృద్ధులున్మునులు సంగడమందురు యోధులాడికిన్ 250

ఉ. కాననెదెట్టులైననిఁకఁ గానకు నేగి తపంబొనర్చెదన్
మానెదనన్య చింతఁదనుమాలిన ధర్మము గల్గునొక్కొ నా
సూనునిఁ బిల్వఁ బంచి ముని సాముడు దెల్పిన దుందు వృత్తమున్
ానికి జెప్పి యెంతయు నవశ్యముదంకున కొప్పగించెదన్ 251

ఉ. ఏనిక లావు మార్తుపయి నేగఁగ నాతరమౌనె యీపనిన్
నేనికఁ బూనుకొంట కెటునేరుతు నార్పను దీర్పనే నొకో
కానకు దారి బత్తెమును గట్టిగ నిప్పుడుగట్టి కొన్న నెఁ
బూనిన నేమి సార్థకము భూమి జనుల్నగ రొక్కొపక్కనన్ 252

చ. నిడుఁద శరీరమేల తననీడగనుంగొని తా నలంకుచున్
దడిపొడి లేని నాలుకయు దండిగ నెండిన రెండు మోవులున్
వడబడు మాట యే పార దాగిన బీరము వెజ్జి చూపులున్
గడగడఁ గంప మొంద మెయికల్గిన వాఁడరిపైకిఁ జాలునే 253

వ. ఇటులు తనప్రార్థన కర్థాంగీకార భావంబూహించుచున్న బృహదశ్వజన
నాథునకుఁ దపోధనుండిట్లనియె
254

సీ. నీవాడ ననినేను నీనీడ నేవేఁడ
నను వీడ ననువేడ ననుఁగ ఱేడ
యూఁకొన్న నాకన్న మీకున్న మీకున్న
యే కన్నెమో పున్నెమో కనుండు
ఘోరమ్ము ఘోరమ్ము పారమ్ము భారమ్ము
వేరమ్ము వేరమ్ము ధీఱఁ గడఁగు
నీ చెంత నాచింత నేనింతగా వింతఁ
గా దెల్పితిని దీని కస్తి నెట్టు
లుసుఱు గొనవంతవేసి మాకెసరు దెచ్చి
విసవిసగఁ గసి ముసఁగెడు నసుర మసఱి
కొలి పసరముఁగోల గగ్గెరను బెట్టు
కటిక వలె గొంత గోయు ముక్కటిక మెడలి 255

ఉ. మాఁగిన పుంటనుప్పు తలమాటున మాటిన నిప్పు దారిలో
దాఁగిన రొప్పు మొండిదిగఁడిన దీపము కంటినల్పు జో
ఱీగ చెవిన్‌బడెన్ పడిగ ఱేగను(ద్రాచునుదిన్న యన్నమం
దీగ యుఁగాలి ముల్లగుచు, నెందును నేచెడు దుందు డందఱన్ 256

చ. పనిని సదోపవాసముల వాడినటించెడి మౌని నన్ను నీ
దనుజుఁడు పట్టి వేఁచెడిని దయ్యపు గంటికిఁబేలగింజ పె
ద్దనుగతి యయ్యె నా(బ్రతుకు దాస్యపు జేతల కగ్గమైతిఁ జె
ప్పినఁగడు సిగ్గు బాటుగను పించెగదా యిటు నిన్ను జేరితిన్ 257

వ. అనిన విని బృహదశ్వుండమ్ముని వరున కిట్లనియె 258

ఉ. వావిరి లక్షవచ్చినను వచ్చును గాకొక కోటి పోయినం
బోవును గాక నాదియగు పూనిక విన్మొక యింత జిహ్వతో
రాపిడి నంటిబో హరిహరాదులు నట్టెట్టులైన దాని నే
నేవిధినైనఁజేసి వెలయింపనె యూపిరి యున్న గొంతులోన్ 259

చ. ఒక నుడి విన్ము నాతనయు నొక్కని నిమ్మని నొక్కికోర నే
టికి నిదె నాదురాజ్యమును తీవిగ నీచతురంగ సేనయున్
(త్రికరణ శుద్ధిగా భవదధీనము సేసితిఁ దాపసోత్తమా
యిఁక నను బాదసేవకుని నేలుము మేలుగ నిచ్చి దీవెనన్ 260

ఉ. నాపుడు మౌని కోర్కె కదనంబుగ నిచ్చితి వన్న రాజు నీ
సేవకుగాఁగ నాసుతుని జేకొని తోడ్కొని పోయి తజ్జయ
(శ్రీవిలసిల్లఁగా నసురఁజెక్కు చెమర్పక (త్రుంచునట్లు సం
భావిత కీర్తి జేసి మనవానిని దోడ్కొని రండు వెండియున్ 261

వ. అనియుంత 262

క. బృహదశ్వుఁడు కువలాశ్వుని
రహిఁగారవమెసఁగ నటుకు రాఁబనుపంగా

విహితగతి వచ్చి నమ్రత
బహువారము తండ్రి కతఁడు ప్రణతి యొనర్చెన్ 263

చ. ప్రణతి యొనర్చి కట్టెదుటఁబాసి యొకించుక యోరసిల్లి కా
రణము వినంగఁగోరి తగఁబ్రహ్వగతి న్నటించి యంజలిన్
గుణనిధి పుత్రుడుండ జనకుండు ముదంబున జూచి సూను స
త్పుణతుల నిచ్చి దీవనను దారిచి కౌగిట చేర్చి యిట్లనున్ 264

క. సారెకు వనిజనమును
వారక కాఁటియను బెట్టు పాపుని దుందున్
ఘోరునఁజని దోరింపుము
వీరికిఁగొన కరిని జెక్కుచెదరకరమ్మా 265

క. పనివేళ వచ్చె నిపుడీ
ముని గుమ్మడి కాయయంత ముత్తెమ్ము సుమ్మీ
వినయమున నయము ననయము
మనశక్తి కొలందిఁజూపి మనుచుట యొప్పున్ 266

శా. నాతండ్రీ నినుబుత్రుగాఁ బడయుట న్నన్యుండనైనాఁడ మ
త్స్వాతంత్ర్యంబును మోపి నీవయిఁదవశ్చర్యాగతింబోవుచో
ఖ్యాతిన్ శ్రీహరి మెచ్చి నీకుఁదన సాక్షాత్ప్రభవం బిచ్చె నం
చేత త్కర్ణ రసాయనోక్తి విని నేనెంతో ముదంబందితిన్ 267

క. కావున మాధవు దయచేఁ
గావు నరాశార్దితాత్ముఘను మునినెవియుం
గావు నలుసంతయును సరి
గోవులయు ధరామరులయు గుప్తికి పత్సా 268

క. దానవ నిధన మొనర్చిన
దా నవని ధనమ్ము సుఖమొదక్కను మునికిన్
దా నవనిఁదనరు నీకరు
దాన నిహపరములు కరతలామలకంబై 269

చ. అనుటయు దండ్రి కిట్లనియె నాత్మజుఁడాశ్రమవృత్తిఁబూని యో
జనక భవత్ప్రసిష్టతర శాసన మౌదలఁదాల్చి నేనిదే
చనియెద మౌని వెంటను నిశాచరు నెట్టనపట్టి కాలువ
త్తనమున కంపి వచ్చెద సుధా భుజులందరు మేలు మేలనన్ 270

చ. ఇది యొకటేల తారుసెలవిచ్చినఁజాలునుగాక సేయనే
వదలక యెట్టికార్యమును వాసుకి కోఁఱల నున్న నన్న్ కిన్
గదల వెలార్చనే నొసటఁగన్ను గలంతటివాని యౌదలన్
బొదవెడి పువ్వునైన నొక పూనిగాగ దెమల్చి తేనొకో 271

ఉ. నా వడి నేను జెప్పుకొన నానయుగా కది తల్లి పుట్టినిల్
చేవగ మేనమామ కడజెప్పుట కాదె నిమేష మాత్రమే
దీవన పెంపుమై వెనుక దీయక యెల్లరు నౌననం జిరం
జీవుడు రాఁడె మళ్లియిటఁజెక్కు చెమర్పక త్రుంచి రక్కసున్ 272

క. పులికడుపునఁజలి చీమయుఁ
గలుగునె బృహదశ్వరాజు కనునే బేలన్
బలుమాట లేల మునిపని
నలయున నెరవేర్చి వత్తు నరనిముసమునన్ 273

వ. అనుటయు 274

క. ఆలించి కొడుకు నుడువ ప
లాలించి జయమ్ము గొను హలాహలి ధరణిం
బాలించు పోయిరమ్మని
చాలుపు దీవెనల నిచ్చి జనకుండనుపన్ 275

చ. మునిగని ఁతేడు నేఁడు తుదముట్టగ మీకెలసమ్ము దీర్పగా
నెనయుచు మీవశంబునను నిల్లడవెట్టితి నాతనూజునిన్
గొని పనిగొంచు నాకు నిటకొంకక యాన నిడంగ భక్తితో
విని జనులార! యీమునిని వేగమె గొంటి నెఱుంగ గాఁపన్ 276

వ. అట్లు జనకుండు మునివృత్తి వనమ్మ నకుంజనుడుఁ దత్తనయుండు వినయంబున నుదంకమహాముని దోకొని నిజభవనమునకు జని యమ్మని కేలు తన కెంగేలం బట్టుకొని గట్టిగ నతని మనికి పట్టున గల మనికితము ముఖాముఖి నాలించి గాలించ వైరింధ్రోరింపహాళిందేవింప జాలి నిర్మూలింప నుద్దేశించి యా వేదైశికుండు పదేశించిన విశేషం బశేషంబు స్వకార్య నిర్విశేషంబుగ గ్రహించి యయ్యతి పతి ననుగ్రహించి మేలిమి యగు తాలిమి వీడక నాలి తనంబును గూడక మాలిమి నప్పని పట్ల ప్రాల్మాలక యే పట్టునను తేలికగఁ జూడక సూడుకొని యెట్టులేని జుట్టు ముట్టి యారక్కసి దిట్టను మట్టగించక మానని యొట్టు బెట్టుకొనుచు మౌనికి మఱియు నిట్లనియె
277

మ. తెలియం బల్కెద నున్న వాస్తవము లాతింబోలె నన్నెన్నకుం
డిలలోనే నతలంబు నందు నను నెందేడాగినన్ దుందు మా
యలతో బట్టి వధించు వాడ వినవయ్యా నీపనిన్ దల్లియా
దల కెక్కించెను గొంచ కందనుక నిద్రాభుక్తుల న్మానెదన్ 278

క. సెనగలు దిని చెయి గడిగె కొ
నిన వడువునఁ బని యొనర్ప నేఁదలఁచితి మీ
మనమున ననుమానము విడి
నను మానము నెగడఁజూచి నమ్మఁడు నెమ్మిన్ 279

క. ఇటులాడిన కువలాశ్వుని
పటు తరమగు బరవసమునఁ బరితుష్టుండై
పుట పుటనై కైటభసుతు
మటు మాయలణంగెనంచు మదియతి దలచెన్ 280

వ. మఱి యాము నీశ్వరుఁడు మహేశ్వరునకిట్లనియె 281

ఉ. భూజనులందరు న్వినగఁ బూర్తిగఁ జెప్పెద విమ్మకీర్తి వి
భ్రాజిత మౌ నటు ల్దనుజుఁ బట్టి వధించెద నూఁచ ముట్టుగా

నో జననాథ నాదు తలయోడె దపఃఫలమొండె దీనికిన్
యోజన సేయ కేను గిరవుంచితి సర్వజగంబు సాక్షిగాన్ 282

క. ఇమ్మ హి సర్వోత్తముడవు
నెమ్మది నెట్టుపనికైన నేతువు కర్త
వ్యమ్మహదాశ్రయము మను వచ
నమ్మెద నమ్మెదను గావున న్నిను గంటిన్ 283

చ. మలమల మాడియుంబెఱల మాటునకుం బొర పాటునైన నా
నా నిలువు ధనంబు పోయినను నీచత దేహియటంచుఁ బోడ ∴
నిలయము నాశపాశముల నీగుచుదెంచి వసించు యోగినే
నలవుల జాల్వలం జనుదునా యొక మాత్రపు మర్త్య పాలికిన్ 284

క. అలదుందుండాడిన నాఁ
డిలకుం గన్నార నిద్ర యేర్పడు నేనున్
దల తడవి చూచుకొని యెదఁ
గలుగును నీ కానుషంగిక ఫలము దీనన్ 285

మ. ఇది యేనాటి పురాకృతాఘమొ సుమా యేనిచ్చట న్వచ్చి నా
మది గోడంతయు నీకుఁదెల్పితిని నామాయావి కెట్టేఃట్టలో
చెదరం గ్రక్క పిశాచి తెల్పినటు తెల్పొందానఁదాఁదొంటి కం
టె దురంతార్తి మహాశ్ర మంబునకుఁ దాడింబెట్టు చున్నాడనే 286

వ. అనవిని జనపతి ఇత్తఱి యసురపై కెత్తి పోదగునె వారవర్జముల యోరపారము
లేరు వఱివి తఱచి యొరసితగు ముహూర్తంబు తెల్పుమనిన ముని ఇట్లనియె
287

క. ఏతఱి యాగము విసుపి
యోతరిఁబరిమార్చుఁబో నిదేతగు నుర్విన్
నేత ఏపుఁ జంపుము శకు
నే తరుడు మనోజయమ్మునే గైకొనఁగా 288

క. పిడుగునకు వారశూలయ
సుడివడఁగా దురకలడవఁ జొక్క కెదురొక్కో
యెడరడ మీనమేషము
లడుగం బనిలేదు దైవమన్నిటి కుండన్ 289

గీ. గ్రుడ్డి యెద్దు చేనఁబడ్డట్టుగా దారి
తెన్ను గానకరుగఁ దెరపి యగునె
కాని వాని గెడపఁ గావలసిన త్రోవ
కాంచి వెడలుమయ్య కాశ్యపీశ 290

వ. అనవిని జనవరుఁడ సురయవుగాములు స్థిరమ్ముగాఁ దెలిసి కోఁదలంచి యతి
కిట్లనియె
291

క. ఇదిగో పులి యనగానే
యదిగో తోకయని లోకులన్నట్టులు మీ
రెదఁ గలుష పడుచు బడుచక
బిఱుదుల్ వినిరారు గాచి బోనన నాకై 292

క. సిద్ధము గని వచ్చితి రెపు
బుద్ధుని మీయాశ్రమంబు పొంతన దెందున్
బుద్ధిని విప్రాః పశ్చిమ
బుద్ధయ యను లోకవాకు భువినందరకున్ 293

గీ. ఇంతయేల యనిన నిందుఁదంద్రికిఁగాక
యంత దూరమేగి యసురలేక
పోవ రెంట చెడిన రేవడు రాయన
పరులకెల్ల హాస్యపదము గాఁగ 294

ఉ. మీరిట కింతగా వెడలి మేలగుఁ గార్యమటంచు నెంచినన్
జేరిన దానికేను నిదెచేసెదఁ జేసెద నుండుఁడంచనన్

సూరలఁ జూచు వారహహ సున్నకు సున్నయు హళ్ళి కళ్ళిగా
భారము పాఱు కార్యము నృపాలుడు దీర్చె నటంచు నవ్వరే 295

వ. కావునఁగానకుఁ దపంబు పొంటెఁ జనియెడు జనకుని విడినను సుజనులరగు మీపని నసువు పఱుచుట యయినంగలిగినం జాలుప్రతము చెడిన సుఖంబైన వలదేయని చాలుగ నీపని తలపట్టి సాధింప సమకట్టితింగాన నాదనావుండాడ నుండె నేని మన యుభయుల మనోరథంబుసఫలంబగు లేనినాడు మది యూసర వోవుగదా యడియూస వ్యయప్రయూస లాయసమునకుం బాత్రమగునని తలంచియ కాదె యూరక్కసి నక్కడనుండఁజూచి వచ్చితిరా యని యంటిననిన నమ్మని యతని కిట్లనియె

296

గీ. నీవు రెండవ హరియని నేను దెలిసి
వచ్చి నిన్నును జేరితి నచ్చిమదిని
వేఱ తలఁపేల చదువులు వేయు నేల
కట్టి పెట్టుము పైఱమతి గట్టిపట్టు 297

వ. అందుకు బృహదశ్వ నందనుండిట్లనియె 298

గీ. నన్ను రెండవ హరి యంచు నన్న మాత్ర
నగుదునా నేను నట్టిఁడ నగుదు రొరులు
అక్కటా యిలఁబులిఁ జూచి నక్క వాఁతఁ
బెట్టుకొన్నట్టు లాపేరు పెట్టుకొనుట 299

వ. అని యిట్టు లామునివర జనవరులు పరస్పర సల్లాపంబుల నన్యోన్య మనమ్ములు ఘనమ్ముగ రంజిల్ల జేసి కొనుచు దుందుగోలయంత యామూలాగ్రంబుగ నుదంకుని వలన వలనుగవిని యద్దనుజ వధోపాయ మిదమిత్థమని యెదఁ గుదిర్చికొని యమ్మహీవల్లబుండెల్లి యుద్దమనుచుఁ జల్లగ నుల్లంబు నసువు పఱిచి కొని యంత

300

క. అప్పుడమి ఱేఁడు వేడుక
నప్పుడ పడ వాళ్లఁ బిల్వనంపి మనపురిన్

దప్పట వేయింపుఁడో రే
యిప్పటుకి నృపతి యాజి కేఁగెడు ననుచున్ 301

వ. ఇట్లు నియమించి మించినతమినంచిన గతి సంచిత పుణ్యుడు కారుణ్యామతి
నయ్యతిపితి నొకచో నుంచి క్షితిపతి యుదంచి తాపచితి సేయఁదగు వారిఁబంచి
తాను చిత వర్తనంబున నంతి పురమ్మున కరిగి సుఖంబుండె నంత
302

గీ. అల యుదంకాశ్రమము చెంతమలయు దుందుఁ
బట్టి వధియింప బృహదశ్వపట్టి యెల్లి
తర్లి వెళ్లును సైనికుల్దర్లుఁ డనుచు
సరగఁ దిరుగుచుఁ దప్పటఁ జఱచె నొకడు 303

క. వినరా వినరా లేదని
యనరా యన రాణువందు నలరెడు వారల్
మనరా మనరాయని యా
కనరాకన రాకపోక కనరాకనరా 304

గీ. ఇట్లు వీధివీధికేగి చేగారులు
పరఁగ నొకని పెట్టె పదుగురు అక్కె
వినిచి యొక్కసారికిని ఒదిసారులు
సాటి రెల్ల వారికోట లేక 305

తే. ఎల్లి మనరాజు నాజికి నేగుఁదాన
నెక్క డెక్కడి సరదారు లొక్క పెట్ట
హోయలుగా బైలు దేఱుఁడో హో యటంచు
సందుగొందుల ద్రిమ్మరి సాటె నొకడు 306

చ. వినుఁడిదె జైత్ర యాత్రయని వేగముగా బరిసాటు తర్లుడున్
వెనుకొని యాయుదంతమునె వీరలు వారికి వారు వీరికిన్
బునరుదితంబు జేయఁ బురి భోరుకలంగెను బూర్ణిమానిశన్
వనరుగపాటు పోట్లాదవు వారనిదించిన హాస్యమాడుచున్ 307

వ. ఇట్లు పురంబు చూడఁగరంబు భరంబై దురంబునకువరంబగు తురంగాది చతురంగ బలంబు బలంబగునలబలంబున వెడలు మార్గంబెట్లనిన 308

సీ. పవన మనోతిగ భాసి జవాంచిత
భాసిత భూషిత భాండల స
జ్జవన సమాజము శైల సమోన్న తి
సంతమపాకృతి సామజములు
శ్రవణ సుఖప్రద ఝుంకృతి కింకిణి
జంగమ శాఖులు స్యందనములు
జవన సముత్థిత శస్త్ర భయం కృతి
సత్త్వపదాతి వెసన్వెడలె ను 309

ఉ. మండన రత్నకాంతు లసమాన లసత్సుసమాస మానవే
దండపు తండముల్తన నిదాఘము నందె రవళ్ళుఁగాలు పె
న్గొండల పిండు వోలె బెడగొండలు వీనులగాలి
దూలఁగాఁదొండము లూఁచుచుంగదిలెఁదుంగ పునింగిబెనంగి రాయుచున్ 310

చ. సకల సువర్ణ భూషలును జాలఁగఁదాలిచి యొక్క యుమ్మడిన్
బ్రకట నిజస్యదంబు నను పర్ణకురంగ జవంబుడంబుగన్
బకబక నవ్వి యింద్రుహరి భాస్కరు సప్తినియేల మాడి చి
వ్వకువడిఁ జీరు నావెడలె వారువముల్ప్రుత పంచధారలన్ 311

క. ద్విరదముల కంటెఁబొడవై
యరదంబులు వెడలె వజ్రహతి యెఱుఁగకమున్
గరు దన్వితంబులగు కుల
ధరణీ ధరములను బోలి ధ్వజపటములతోన్ 312

సీ. వాఁడెంత వీఁడెంత వాఁడి పోఁడిమి నని
తీవిఁబల్పో కిళ్ళు పోవువారు

నాఁడేని నేఁడేని నాతోడ సరిదూఁగు
మగవాఁడు లేఁడని మలయువారు
పరశురాముఁడు ఖండ పరశునాముఁడు నాకు
నెనరారు విలువిద్య ననెడివారు
కొనగోటమీట నా కనకాద్రి నొక చెండు
వలెనంచుఁ బగ్గెలు వలుకువారు.
వనధి నొక పుక్కిటను బీల్తు ననెడివారు
నాకసముఁదని యొరగింతు ననెడివారు
గాఁగ వడివడి బీరముల్గడప వెడలెఁ
గ్రాలు కఱకఱి చుఱ కరికాలుబలము 313

సీ. పెడపెడ సరకుల పెట్టిన పెఱికాట
కపు టెద్దు లొకలక్ష కదలి నడచె
సవరణ సవురుగా సవరించి కట్టిన
వేసడంబులు నూఱువేలు గదిలెఁ
బలు దెఱంగులఁ దిను బండారముల మొన
కోల్లారు బండ్లర్ధకోటి గదిలె
మంకెన దొంతరల్ డొంకెన తణఁగముల్
లంకె గిబ్బలు నొక లక్ష గదిలె
తోన మేనాలు గదిలెఁ గోటాను గోట్లు
లాట పాటల వాండ్రును వేఁట కాండ్రు
పలుదెఱంగుల పనివాండ్రు బానిసీండ్రు
భూమి యీనిన రీతి నుప్పొంగి వెడలె 314

క. ఈనిక మజ్జిరులును లొ
ట్టేనుఁగులును గమిడి యెనుము లేడికలేపుల్
తోనంగొలుచు చుమలగుట
బోనులు దీమములు వలలు పాఱెఁబొఱి గదలెన్ 315

క. వెచ్చమునకు గావలసిన
హెచ్చు పదార్థములనెల్ల నేరిచి యిడిపెన్
గచ్చడములతో వెడలిరి
బచ్చులు హెచ్చుఱికఁబైడి బాసము తోడన్ 316

సీ. పడవాళ్ళు గమికాండ్రు బండర్లు నిమితగాం
డ్రెగడులావుతు లును ప్రగ్గడలును
మాసటీండ్రొటర్లు మన్నీలు వేగర్లు
పారివాండ్రును హొంతకారు లేజు
లారెకులును ఫణిహారులు ధీరులు
మందులు దసువందులందముగను
దణులు లేకరులు గవణకాండ్రనుకు వాండ్రు
గులకలు చొప్పర్లు కోలుకాండ్రు
గోదరులు సూసరులు మంగికొమ్ముకాండ్రు
బెస్త పంచాణములు మడివేలు లనఁగ
చదరలము నకు వలయు వారు సర్వజనులు
తామ తమ ఘనాయుధములతోఁ దరలి రనికి 317

చ. బరియలు నారెగోలలును బంకెల లంకుసాలు జో
ళ్లురిజెలు కట్టుకంబములు నొప్పగుగంటలు జంట సేవురుల్
ధరయిడరాని భూషలు మొదల్గల సామజ వస్తు సంచయం
బరిదిగ నెత్తి రత్తఱిని హత్తులు మీదికి దోరహత్తుగన్ 318

గీ. అంత పక్కెర జీనంబు లంకపన్నె
లును దలాటంబులును వాగెలునదరఁటులు
కొఱపములు దోపరాలును గొలది మీఱఁ
దట్ల కెత్తిరి పాలాసత్రాళ్ల తోడ 319

సీ. కైజారు సింగోటి గండ్రగొడ్డలి బాకు
సరదున రాబుజజాయి గుదియ

పార వాతమ్మును బాగు దారి కటారి
తోటమ్ము మోహ దాద్రోణములును
చిల్లోటి డెంకెన చిల్లకోల తుపాకి
గొఱక నేజా యీటె తరకసమ్ము
వాయిదారును జూరి వసి దంచె నముసురుఁ
గోవి ఁదిక్కటియుఁగొంగోలు కత్తి
బరిసి దోదుమ్మి యెడిసెల బల్లె మరిగె
గుటక్రోది క్షురపురము గురుజు మొదలు
గాఁగులుగు నట్టి యుద్ధయోగ్యపు సుసాధ
నములు నెత్తిరిగాన రథములపైని 320

క. పూని దశరథువులాయా
స్థానములను దప్పకుండఁ దగిపెక్కు సుడుల్
బూనక కంఠాభరణము
మానుగ దేవమణి రోచమానము లమరన్ 321

సీ. ఎడమ హయాలుగా జడలల్లి విడిచిన
మెడజాలు కందాన మెఱసి వ్రేల
నిరుమూఁడు జడలుగా నెనపిన సొల్లెముతో
చెవుల సందుగ మోరఁజిందులాడఁ
గడు మోహనమ్ముగాఁగల్కి తురాయియు
లోనగు భూషలు మేన నమరఁ
బనివాని తనమెల్లఁగనఁదాన కంబయి
పైని జీవనంబును బక్కెర తగ
లవిణి నిక్కించి వీనులు లవిటి యూఁచి
నిట్టు నీలిగి నిలుచుండి హూఱ్ఱు మనుచు
వేడ్కఁ దనరారుగనఁబ్రజలే విఱిగి పడఁగ
బెచ్చు పెరిగెడి తేజిని దెచ్చిరటకు 322

సీ. మహనీయ తపనీయ మణికిరీట ద్యుతి
వేవెల్గు రుచులతో వియ్యమంద
నసమాన లసమాన సుషమాన విషమాస్త్రు
మిసమిస సొబగుతో మేల మాడ
నొడలిపైఁ దొడివిన తొడవులు కడుమేలు
కడితముల్కన్నుల కఱవుఁదీర్ప
మనవుల వారిపైఁజనవుల వారిపైఁ
గ్రిగంటి చూపులు క్రీళ్ళుదాఁట
చిరెలతో గట్టికలు బరామరి యొనర్ప
సకలజనులును జయజయ శబ్దమిడఁగ
జదురునకు వచ్చి కువలాశ్వచక్రవర్తి
మించి హయమెక్కి నది కిలారించి చూడ 323

చ. చిదిపినఁబాలుగాఱు మెయి చెన్నగు కాంతిని జంద్రు తోడఁ బ
న్నిదమిడు మోము నద్దముల నిద్దము బద్దొనరాజు చెక్కిళుల్
చదురునఁజెంపఁ గొట్టుచు హలంబును సంపగి నవ్వు నాసయున్
మృదుతర పల్లవంబులను మేలము లాడును వాని పాదముల్ 324

సీ. ఆతని వక్రమంబవలగ్న మెన్న వే
దండ విరోధి నటుండు మనును
తత్త్రాణ యానముల్ దలఁప గానయుత వే
దండ రాజముల నటుండు మనును
దత్కీర్తి హాసముల్తలపించి చూచిన
డిండీరముల నటుండు మనును
నతని పాణి కృపాణులరసి చూచిన నల
కుండలి శ్రేష్ఠు నటుండు మనును
పేరుకొన ధీరతయును గంభీరతయు న
ఖండ మేరూదధుల నటుండమనును

నతని ధర్మ ప్రతిఘలు నప్రతిహతముగ
దండధరు ఖండపరశు నటుండమనును 325

గీ. అతని సొబగు సతుల కతి మోహనంబని
వేఱచెప్పనేల వినుఁడు నిర్మ
మములు మునులు గూడ మునుజూచి యొకసారి
తివిరి యతని జూడఁదివురు చుండ 326

గీ. జనకు చెనుకొని మునికొని తనయు లెల్లఁ
గరులఁగొందఱు గొందఱు హరుల గొంద
ఱరిది యరదము లెర్ధి యెవ్వరికి నిష్ట
మొదవె నద్దాని గొయెక్కి యుఱికి రనికి 327

సీ. తురగముల్తఱు... గరులెన్నఁగా గిరుల్
కర... లు జాలు గండు మీలు
డాళ్ళు తాబేళ్లు జండాల తెరులు తెర
చాపలెత్తిన యోడ లేపు సూపు
వికటపు శకటము ల్విపుల కర్కాటములు
చక్రము ల్నక్రము ల్బారు ధవళ
చమర వాలంబులు విమల డిండీరముల్
ముక్తాతి పత్రము ల్మొక్తి తతులు
గడిమి దంతలు నిండైన గండ శిలలు
కాల్బలము కాలి రవధూళి కదలి యెగయ
బలము కడలి యటంచును బొమ్మరిల్లు
జనములో హరి సాహరి సైన్యమరిగె 328

క. ఈ తీరున బారంతయు
బ్రాతిగ సమకూడి దారిపట్టి నడచు చోఁ
జేతము లలరన్ ధరణీ
నేత యనుజ్ఞయిడ భేరినినదము సేయన్ 329

క. పణవానక దుందుభిముఖ
గణనీయ ప్రబల వాద్య గణముల తోడన్
గణనాతీత మహోర్భటిఁ
గణకణ రణభేరిమ్రోగె గాఢ ధ్వనితోన్ 330

వ. ఇట్టు లొక్క పెట్టున భేరిగేరీ కాహళార్య హార్య తూర్యములు పెక్కులు
దిక్కులు పిక్కటిల్ల మ్రోగ నప్పుడా చప్పుడు పురంబంట నెగసిన
331

సీ. పటుభేరి భాంకృతిఁబగిలె నెండకు విచ్చు
పచ్చి గోడల వ్రాలె దచ్చి కడలు
ప్రతి కక్షివార్ధి యర్బ్రమ సేనడీకొనఁ
బోవునట్లంబుధుల్పొర్లి పాఱె
నృపుజైత్ర యాత్ర నింగికి భూమి తెల్పె నా
నోరెత్తి రోదసి బూరటిల్లె
నెంతమాటనసేన జంతమాటని గిరుల్
మఱి వెక్కిరించె నా మారుమ్రోగె
నోరుగాలికి భోరున నురువడించి
లాగు తెరచాపగల యోడలాగు వేగ
మెండుకొని కేక లార్పులు మిన్నుముట్ట
గాలుబలమెచ్చి నడచెను గాలుబలము 332

వ. అప్పుడమి ఱేని తోడ వెంటఁబడి వీడి పోఁజాలకవీడు వెడలి వీటంగల
వారెల్ల నాఁడి పోతలకు దిగి రందుఁగ గొందరిట్లనిరి
333

క. మనప్రావగు నృపుఁదోడ్కొని
చనియెడు గనుగొంటిరే పిశాచిత బిసి సీ
మనకెచట దాపరించెను
మునుకొని మఱలింత మొక్కెముని పిండిడుచున్ 334

క. రక్కసి సామాన్యుండే
ముక్కిడి నరులేమి లెక్క మోహరమందున్
డ్రెక్కోనడె జముని నైనను
బుక్కిటఁగొని మ్రింగు నొక్కపూట మనమొనన్ 335

గీ. తబిసి గన మూడుదూడల ధరణ మొక్కొ
పరులకై ప్రాణములను గోల్పడుట తగవె
తిపుర బ్రాణమ్ము లేరికిఁ దీపి కావు
ప్రాణముండినఁదినబలుసాకు లేదె 336

వ. అందుఁ బందలగు మఱికొంద ఱిట్లనిరి 337

క. తనదేమి పోయెఁదబిసికి
నెనరున్నదె యుల్లమందు నృపుడెటులగునో
యని మనము దలపోసెనె
తన పాల్తానాఱఁ బోయు తగవరికెనయై 338

గీ. బోడి తబిసి కేమి పోవు నృపతినొవ్వ
నేలువాని యొక్క యెద్దటైనఁ
గాయువాని యొక్క కన్నెట్టువైన నే
మాయె ననెడి వార్తలాయెనిచట 339

మత్తకోకిల

తల్లిగండము పిల్లగండము తప్ప మంతరసాని కెం
దిల్ల గండముగానఁ దాపసి కేమి బామగు నిందునన్
ముల్లు గుట్టిన మాత్రమున్వెత ముప్పు కిందరుదెంచి తా
బెల్లగించెను గోటిలో నొక పిట్ట నేన్వడ కందఱన్ 340

వ. ముందు వెనుకలు విచారించి మఱి కొందరిట్లనిరి 341

మ. అటులాడం బనియేమి మీరెఱుగరే యస్మత్ప్రభు క్షాత్రమున్
దిటమై దుందుఁడు నేమి లెక్కపతికి న్లప్తింబడన్ దైత్యులన్

దృటిమాత్రన్వడిఁబట్టి త్సదృశులన్ దున్మాడఁడే వేవురన్
నిటలాక్షుండును గావశక్తుఁడగునే నిక్కంబు తద్వధ్యునిన్ 342

ఉ. కాదనకట్టి మాటలనఁగారణమేమి నృపుడలంతియే
పాదుకొనంగ దృష్టిఁబడి పాఱక నిల్చినఁబోర దుందు బ్ర
హ్మాదులు నడ్డ పడ్డఁ బరిమార్పక చాపము నెక్కుడించునే
యేదునుగానవచ్చు పనికేటికి గట్టులనెక్కి చూడగన్ 343

చ. అదియటులుండనీ హరిహరాదులు నట్టిటులైన బిడ్డలన్
వదరునె యీ యుదంకముని వారక తాఁబనివేళ వచ్చి నె
మ్మది యొదవింపఁగాశ్యపికి మాధవుఁడీ కువలాశ్వరూపియై
కదనములోన దుందు నతికష్టుని ద్రుంచునటంచుఁ జెప్పునే 344

క. అందునకును దార్కాణము
తొందఱ దుందు పయికేగఁ దొడఁగిన మాత్రన్
బందుగుల యిండ్లఁ బెండ్లికిఁ
బొందుగ బోవు గతి నృపుడు పోవుట గనరే 345

క. కేవల నరునకు వశమే
భావింపఁగఁ గైట భాత్మ భవదానవుపైఁ
బోవఁగ గువలాశ్వుండిదె
ధావన మొనరించె నటకుఁ దా హరియగుటన్ 346

సీ. యుద్ధ వివాహమహోద్దవ వేళ కీ
తని తోడరుంధతీ దర్శనంబు
పరవాహినీ కృతభయ నభోనదికి నీ
మేదినీ ఖండ గస్త్యోదయంబు
శాత్రవ భూపాల సాల సావళికినీ
యవనీశ మౌళి యగ్రభాగమంబు
నాప ధంధంతమో వ్యాపన కీసన్మ
హోదారుఁడు మహార్య మోదయంబు

వేద శాస్త్ర పురాణాది విద్యలతకు
నిరుప మానాల వాలమీ నృపతి యితని
బొగడు నోటను బెరలను బొగడనగునె
యంచు నాబాల గోపాల మెంచ వినమె 347

క. ఏటి కిటు తరకటింపులు
మాటికి మనలోన బేలమాటలతో ము
మ్మాటికి నమ్ముఁడు మనపతి
కోటమి రాఁబోదు జయము కోయలుగ గలుగున్ 348

వ. ఇట్టు పలుగురు పలుతెఱంగుల నెవ్వరికెత్తెఱంగున దోఁచె నత్తెఱంగున ననుచుననుచు తమి విడువక కుడి యెడమలం బలసిబలంబు నడువఁ గువలాశ్వుం డధిరోహిత హిత ధవళాశ్వుండై నసుత సైన్యుండై యువ్వెత్తుగ దండెత్తి యుదంకముని ప్రదర్శిత మార్గుండై దుందుని పైకిఁబోవు చందంబు పంక్తి స్యందన నందనుండు కపిబల సమన్వితుండై పంక్తి కంఠు పైకిఁ అన బోవు చందంబు ననుకరించెను అనవిని జనమేజయుండు దాశరథికైలసనగంబు కేలనెత్తిన మహాబలశాలి యగు రావణు పైకేలయెత్తి చనియె నెత్తెఱంగునఁ బ్రధనంబు నిర్వృత్తంబయ్యె నయ్యది యామూలాగ్రంబుగ నామదికి రుచియింప వచియింపవే యని వినయంబున ప్రార్థించుటయు

349

# ఆశ్వాసాంతము

చరాచర జగద్భరో ద్వహన జన్మ సంహరణా
సురాసుర సుఖాసుఖ ప్రద వసుంధరా ధారణాధరాధర
ధరా దురాప భవతాప నిర్వాపణా మురాసుర హరా
హరా జు మూష ముఖ్య భీవారణా

గద్య:,

ఇది శ్రీనాధ యామునావతార పవిత్ర శఠ మర్షణ గోత్ర పవిత్ర ఆపస్తంబ సూత్ర బుక్కపట్టణ కులకలశాంబుధి రాకాసుధాకర విజయ నగర సంస్థాన సముపార్జితానేకాగ్రహార బిరుదాంచిత కర్ణాటరాజా చార్య

శ్రీ వేంకటా చార్య పౌత్ర శ్రీనివాస తాతా చార్య

పుత్ర శిష్ట జనహితా ష్టావధాన కరణ చణ స్వీయ మేధాస్వ౦ం సముపార్జిత రాజకీయ హూణ భాషా పాండితీమండిత వైయాకరణ పండిత రాఘవాచార్య ప్రణీతంబైన కువలాశ్వ విజయంబున

# ప్రధమాశ్వాసము సంపూర్ణము

# శ్రీ

# కువలాశ్వ విజయము

## బుక్కపట్టణ రాఘవా చార్య ప్రణీతము

## ద్వితీయాశ్వాసము

## శ్రీ రామాయణ కథ

శ్రీ నందనందనా గం
గానందన వినుత చరణ కంజాత ధరి
త్రీనందన నరకహరా
దానవకుల జాల సాల దవ శ్రీకృష్ణా 1

వ. దేవాదివ్య చిత్తంబున నవధరింపు మట్లుజనమే జయుండు శ్రీరామాయణ కథా శ్రవణ కుతూహ లంబున నడిగినఁ దత్కథ సంగ్రహంబుగా వైశంపాయ నుండు వినిపింప దలంచి యిట్లనియె

2

చ. దశరధ రాజయోధ్య ధనధాన్య సమృద్ధిగ నేలె సన్మతిన్
దశరధ రాజు వాజి భట దంతి మాయావృత సైన్య వంతుడై
దశరధ చాపఖజ ముఖ దారుణ శాస్త్ర సహాయుడై మహా
దశరధ రాతి మాత్ర మధితాఖిల శత్రు దవానలుండునై 3

చ. అతడొక నాడు వేట తమినందున్నకైన జనంబుగొంచు నా
యతమయి పోయి హోయి మృగయన్మృగ పంక్తులనొంచి పొంచి యా
నతమతి మాటు వెట్టి నిశినక్కడ నొక్కడు నేరు ముంచఁగా
నతను మతంగ జంబనుచు నాశుగమే యఁగఁగూలె నాతడున్ 4

ఉ. ఆశుగ ఘాతి తుండొక మహాముని పుత్రుడుగా నెఱింగి యా
యాశుగ మీగి రాజు చని యాతని తల్లిని దండ్రిఁగాంచి తా

నాశుగతి న్నిజస్థితి భయంబునఁదెల్పిన తిట్టిరాతనిన్
హాశుగ వార్య కోపులయి యాత్మజులొద్దనులేక చావగన్ 5

క. అది తిట్టైనను నరపతి
మదిఁదీవనఁగాఁగఁగొనియె మఱి యెటులనగా
నదివఱ దను కనపత్యం
బొదవిమి దనకిఁకఁదనూజు లొద చెద రనుచున్ 6

వ. ఇటులు వేఁట నుండి మరలి పురంబునకు జని నిజ మహిషులగు కౌసల్యా కైకేయీ సుమిత్రల గూడి వేడుకలు పొంపిరి వోవఁదెంపు లేని భోగంబులను భవింపుచుఁ జిరకాలంబు రాజ్యంబు ప్రాజ్యంబుగఁ బరిపాలించుచు 7

చ. అతడనపత్యుడై గురుని యానతి నొదల దాల్చితుష్టుడై
కౌతుకక ఋష్యశృంగుకడకుంజని యాతని దెచ్చి యాశతో
క్రతువొనరింప నగ్ని కనకాభుడు భూపతికింద మంచున
ప్రతిమ సుపుత్ర లాభదము పాయస మీయస మీహితాత్ముడై 8

ఉ. ఆపరమాన్న మంది పతి యాపద మాపద మాన్పు నాకు సం
తాప రమా సహాయకుడు తానును నాతని యింట బుట్టినా
నాపర మాతతాయులను నాశనమాశ నొనర్చు నంచుఁదా
నాపరమార్థముం దెలిసి యాండ్రకుఁ దీంద్ర లొసంగ నిచ్చినన్ 9

చ. సవతులు పుత్రకామ ఘన సంజ్ఞ మహేష్టినిఁగొన్న పాసెమున్
సవతుల పుత్ర పాపకృత సంకట వారకమంచు మెక్కి యే
సవతుల వంబు లేని తను జాతుల నల్వుర గాంచి రోజవా
సవతరగాంగగాంగ క్షుర శారద నారద శుద్ధ కీర్తులన్ 10

గీ. కోసలేశతనయ కోచవేశము గాని
తనయురాము నాదృతనయురాము
భరతుఁగైక ఘన శుభరతుని శత్రుఘ్నుల
క్ష్మణుల సుగుణ మణులఁగనె సుమిత్ర 11

ఉ. స్వామిల లామ పంక్తి రధుబట్టపురాణి మహత్త్వ
మెట్టిదో యేమితపంబొనర్చెను మ ఱెంతటి నోములు
నోచెనో పరం ధామ నివాస వాసి తనధామము తానటు
వచ్చి చొచ్చెగా నామెపి చండ మట్టు తన రారునె యెంతటి యింతి కేనియున్
12

క. పెద్దగు భక్తిని లచుమన
పెద్ద యటంచనుసరించెఁ బెద్దన్న నటుల్
తద్దయు శత్రుఘ్నుండున్
తద్దయుడు భజియించె భరుతు ధర్మాభిరతున్ 13

వ. ఇట్లు సర్వజన శ్లా ఘా పాత్రంబగు సౌభ్రాతంబున నెల్ల వారల కల్లారు ముద్దగు చెల్వంబున నల్వురు బాలురు బుద్ధి శాలురై బద్ధ సఖ్యంబున నభివృద్ధి సౌఖ్యంబున ధనురాది విశిష్ట విద్యా బుద్ధుల వసిష్టు శిక్ష వర్ధిల్లు చుండఁ గొండొకడు చండాంశు తేజః పుంజంబునధః కరించి సంజ కెంజాయను ధిక్కరించి రంజిల్లు జటామండలంబు తోడ దండన నేకాంతే వాసితండంబు చేదంబు తోడ వేదంబుగ సంత సెప్పి కొనుచు సంతసంబు తోడఁదోడరాఁగ రాగద్వేషాదుల దూషించి విశ్వామిత్రుండయ్యును విశ్వామిత్రుండను నామంబు సేమంబుగ వహించి యుత్తమ తపోమహిమ నీ మహి బ్రహ్మర్షి సత్తముఁడని ప్రసిద్ధిగనిన ముని సార్వ భౌముండత్తఱిఁ దానొనరించు జన్నమున కెన్నరాని యంతరాయమ్ము నిరంతరమ్ము గావించు దేవారుల వారింప రామ చంద్రుని వలన గాక యే వలనున నితరుల తరము గాదని తన మనమున ననువు పఱిచికొని పఱచికొని పోయి యమ్మహా మహుని సమ్మతి పరచి హుటాహుటి దన కొలమున రామ రూపమున నవతరించిన శ్రీరమాధి నాధుగన్నులగని తన జని తరింపదలచి భూమికి దిగివచ్చు భాస్కరుండని తను బొడగను జనుల బమ్మ రిల్ల చేయుచు నయోధ్య కరుదెంచి పంక్తి రథు ప్రసాదార్థము తా(త్ర)సాదతోరణ సతోరణ ప్రఘాణం బునకుఁ దోతెంచి దవు దవులకని భక్తిమదిఁ దవుల దనకెఱుగు దౌవారికు లోనికనిపి తన యాగముమునకై తనయాగము నకై తవ నీయొక్క తనయా నయనార్థము తన యాగమన మని

[illegible] వినిపించి రమ్మని పించికొని

14

క. [illegible]
[illegible] రాఘవప్రభు సభకున్
[illegible]డెదురై
[illegible] తన యంఘ్రికాన్పు ముని తగవచ్చెన్ 15

వ. ఇట్లువచ్చిన కంశికనందనున కజనందను డ్వర్గగతి పర్యాప్తంబుగ సపర్యలొనర్చి [illegible] దనరు చున్న పెను గద్దియపై సుఖాసీనుంజేసి తాసముచి [illegible] దమ్మని శాసనంబున గూర్చుండి వారి తారాతి కుండా రాజు [illegible] పా త్రకుండును సౌఖశాయిని కుండునునై కుశిక సుతు గుశలప్రశ్న [illegible]ంబుగా నెద్దియడిగిన నుడుగక యిత్తు గాన స్వాగమన కారణమ [illegible] గతి స్వాగత యుతముగ దమకత యంతయు నుడువుడని యడిగిన [illegible] గతి కదతికంబుగా స్వాగతి కుండనైన నగుదుంగాని [illegible]కుండ గాకున్న వాఁడ నది నీదయం బడయు మతి నిటకేతెంచి నాడ [illegible] గాన సత్యవాదివి గమ్మని యమ్మని యిట్లనియె

16

క. [illegible] నృపా
[illegible] రామచంద్రుననుపవే
[illegible] సురక్షక
[illegible] నీశరక్షయనవినవె యనన్ 17

వ. [illegible] ధరాధిపతి యదరి పడియు దిలగొన్న తనమదిం గొండెక తటికి [illegible] ముని కినుకకు వెఱచి తల్లడిల్లుచు నుల్లంబున నిట్లని [illegible]

18

[illegible] [illegible] గాధి సుతు మాటను గీటునఁబుచ్చ బ్రహ్మకుం
[illegible] దప్పక యిత్తునటంచు నోటనున్
[illegible] మున్నెనుకఁదీసిన నిప్పుడు కోపధారి దు
[illegible] వచ్చిన దారిని నూరకేగునే 19

ఉ. జక్కుల మూకలేడ తలిచాటుకుమారుడు రాముడేడ నే
నిక్కము పంప నన్ను గరుణించుమనె కాంచునె నాదు బాధలే
గ్రక్కి డెయుంగలంబులను గాకికి ముద్దాకొ యెద్దు పుండు నీ
ప్రుక్కడి జన్న మెందెదవె ముక్కున గోపము ప్రేలు మౌనికిన్ 20

క. అని వడవడ వడఁకుచుఁదన
తనయుని శ్రీరాము నాద్భుతనయునొసఁగె న
మ్ముని తిలకున కినకులపతి
ఘనులెన్నఁడు నాడి తప్పగా లేరుసుమీ 21

క. రామునితో లక్ష్మణుడును
రామునితో దద్భుహిశ్చర ప్రాణముగా
రామునితోధికముగ జని
రాముని వారించి యరులనణఁప నిరువురున్ 22

క. మునిపతి జనపతి సుతులను
మునుకొని తోడ్కొనుచు మధురములగు కథలలో
ముసు కలిడ నుడివి యతిబల
యును బలయను మను లినతనయులకునొసంగెన్ 23

ఉ. ఆమనువంశరత్నములు నామను రత్నములంది యేగుచో
నామని నామునిందమను నాఁకొని మ్రింగెద నంచు వచ్చి పే
రాముని ఁబైకి దేకొనెను రక్కసిఁదాటకఁ గూల్చె ప్రేటునన్
రాముడు వృక్షదాటిగటు రాతిరి పేటిక నేకథాటిగన్ 24

క. తాటక మరణము చెందగ
తాట కటంకులగు దాని తనయులనయు లెం
తోట వళి సేయఁదాపసి
తోడకునింతోట లేక దూకిరి నింగిన్ 25

వ. తదనంతరవము విశ్వామిత్రుడు తన యాశ్రయంబురాఘవులు తన

యాశ్రమంబున శ్రమంబున బ్రవేశించి వింతగా రాము ననుమతి చితము గైకొనువాఁడై యోరామా యాగారామమును గాపాడుట ముఖ్యము ఇప్పని దప్పనిసరిగా సరిగాఁగాపాడు మప్పాయని యొప్పించి దయఁరప్పించి జయమప్పగించి చేయందగినది తగిన తెఱంగున ఒప్పిదముగ జేయుమన నతండు వినతుండై యొప్పుగఁ జేయ నెప్పుగ సంతసము నంది స్వాంతమునఁ జింత దొఱంగి కుశికనందనుండు కుశ సమిచ్చయంబు చేతనందికొని పవిత్రపాణియై పవిత్రంబుతోఁబ్రాగ్వంశము నుండి యాహవ నీయాగ్న్య గారంబు సొచ్చి యచ్చట

26

శా. శ్రీరామాజ్ఞను బారి కాంక్షి సమముంజేయం దొడంగ గడున్
హోరాహోరిని దాటకేయు వెసఁగ ఝ్ఝంకార ఝుంకారముల్
చేరంబారిన యజ్ఞ భూమికి రఘుశ్రేష్ఠుండొనర్చి న్వడిన్
మారీచుండు దధింబడన్ శరహతిన్మంద న్సు బాహున్మహిన్ 27

వ. అంత నిరాబారి మిన్న జన్నంబు నిరాఘాటంబుగా నవి చ్ఛిన్నంబుగా సంపూర్ణంబుగావించి రామలక్ష్మణులసలక్షణంబుగా సంభావించి దానవ వృధము తోడఁదానవ బృధము తోడను సుకరము గా నొనరించి కుశిక సూనుండ శంక సుఖమానసుండై దశరధ నందనులందనుకఁ దనకు నెనరుంచి యొనరించిన యుపకృతికి మించిన ప్రత్యుపకృతిఁగృతిగఁజేయ నజేయమగు తెరువరయుచును దార దార పరిగ్రహము దారపరిగ్రహమనియు నది కూర్చుటకంటె మించిన మంచి కలదా యనియు నెంచి లోనంగల దాయల నెల్ల నణంచిన వాఁడగుట వాఁడని పోఁడిమి వేఁడి వెలుంగుతో డ ప్రదార కొమరుల కొమరు లు గొలుపఁజాలి నగరగరికకల వెరవరి తెరవల న్వెరవునైన నరవు పఱిచి య య్యిరువుఁరకు సమకూర్చెదనని యెదఁగుదురు పఱిచికొని యా చిఱుత రాచకొమరులతో వెడలు గడలు కొని శుభ సూచకములగు నుపశ్రుతి వాచకముల ను శకునగతిరుతులు లోనగు శుభశకునముల నెడ నెడఁ గనుఁగొనుచుఁబదిలముగ మిధిల దారి వట్టి యేగుతఱి నాపురి దరిసి తత్పరిసర మందరసి యాశ్చర్యకరంబగు నొక రమణీయ వనంబుఁగని తచ్చరితంబు విని యానందభరితులై నడచుచు జిరంతన ప్రభృతి నిరంతరాను

భూత జాయా వియోగ దుర్గంతి చింతా కృశీ భూతు గౌతముఁబ్రీత చేతస్కుఁ జేయుదు నని కౌశిక సంగమ కుపిత పతి కోపంబున ఱాతి రీతి బడి యున్న యహల్య చరితము రామునకు మాట సామెతగఁ దగ నొడివిన విని యినకుల తిలకంబు

28

చ. చెడు పనిసేసి యామెపతి సృష్టి భయానక కోపభూతముల్
పయిబడి నావహిల్ల వని బండగఁబండిన యాయహల్య కూ
రడిగల గాలి ధూళి నిడి రక్షగ నాపెను శాపభూతమున్
గడువడిఁబాఱఁదోలి రఘు కాయజు డాడెను గౌతమస్తుతిన్ 29

వ. అంతశాపాంతమందిన తనకాంతం గైకొని రఘు పుంగవ పునః ప్రతిష్ఠాపిత గృహస్థాశ్రమంబునఁ బ్రహ్మర్షి యైన గౌతమ మహర్షి స్వదార కృతాతి యైన బు నంది పరమానంద భరితుండగు భరతాగ్రజుని ద్వరితంబ దార పరిగ్రహుండవగు మని సాదరాశీర్వాద పూర్వకంబుగా దయాశరథి దాశరథిన నిరంకుశ తపోనిధి విధేయుని త్రిశంకు స్వర్గమాన్య పాథేయుని గాధేయు వీడ్కొని యధేచ్ఛదన దారిం దాఁ జనుటయు నంత విశ్వామిత్రుండు

30

చ. జనక జనేశు వీట శివు చాపము రోపణ సేసి యెక్కిడన్
జనకజ వాని కిత్తురను చక్కటి నొక్కటి నాలకించి స
జ్జన కధి తాధ్వముంగొని వెసంజన బాలుర తోడ లోకరం
నృపుండు సవి చప్పుడు సేయక చక్కనెక్కిడెన్ 32

వ. అట్లు రాఘవుండ ఖండ కరలాఘవంబున ఖండ పరశు కోదండం బవలీల నెక్కిడ భగుంబై నాదండి రావంబునకు దిగ్వేదండంబులు బెండు వడి దిగిన మొగ్గ తిల్లె బ్రహ్మాండ భాండమవసి నట్లయ్యె బ్రహ్మ కర్ణకుహరంబులు నిండి కొండొక కాలము చెవులు బీఁదఱ గొలిపె నతల కుతలంబుల తలకుతల మగు చుండె నప్పుడుప్పొంగి జనకుండు ఘనకోవిదుండుగాన సౌందర్యారామ రాము గారవమునఁగౌగిలించుకొని గానుకగా జానకింగైకొనుమని యామెను రామునకుందన కూర్మి పుత్రి నూర్మిలనున్ రెండవ భారతీ రత మూర్తుల మాండవీ శ్రుత కీర్తుల లక్ష్మణ, భరత, శత్రుఘ్నులకు నిత్తును రమ్మని

భూత జాయా వియోగ దుర్గంతి చింతా కృశీ భూతు గౌతముఁబ్రీత
చేతస్కుఁ జేయుదు నని కౌశిక సంగమ కుపిత పతి కోపంబున ఱాతి రీతి బడి
యున్న యహల్య చరితము రామునకు మాట సామెతగఁ దగ నొడివిన విని
యినకుల తిలకంబు

28

చ. చెడు పనిసేసి యామెపతి సృష్టి భయానక కోపభూతముల్
పయిబడి నావహిల్ల వని బండగఁబండిన యాయహల్య కూ
రడిగల గాలి ధూళి నిడి రక్షగ నాపెను శాపభూతమున్
గడువడిఁబాఱఁదోలి రఘు కాయజు డాడెను గౌతమస్తుతిన్ 29

వ. అంతశాపాంతమందిన తనకాంతం గైకొని రఘు పుంగవ పునః ప్రతిష్ఠాపిత
గృహస్థాశ్రమంబునఁ బ్రహ్మర్షి యైన గౌతమ మహర్షి స్వదార కృతాతి యైన బు
నంది పరమానంద భరితుండగు భరతాగ్రజుని ద్వరితంబ దార పరిగ్రహుండవగు
మని సాదరాశీర్వాద పూర్వకంబుగా దయాశరథి దాశరథిన నిరంకుశ తపోనిధి
విధేయుని త్రిశంకు స్వర్గమాన్య పాథేయుని గాధేయు వీడ్కొని యధేచ్ఛదన
దారిం దాఁ జనుటయు నంత విశ్వామిత్రుండు

30

చ. జనక జనేశు వీట శివు చాపము రోపణ సేసి యెక్కిడన్
జనకజ వాని కిత్తురును చక్కటి నొక్కటి నాలకించి స
జ్జన కధి తాధ్వముంగొని వెసంజన బాలుర తోడ లోకరం
నృపుండు సవి చప్పుడు సేయక చక్కనెక్కిడెన్ 32

వ. అట్లు రాఘవుండ ఖండ కరలాఘవంబున ఖండ పరశు కోదండం బవలీల
నెక్కిడ భగుంబై నాదండి రావంబునకు దిగ్వేదండంబులు బెండు వడి దిగిన
మొగ్గ తిల్లె బ్రహ్మాండ భాండమవసి నట్లయ్యె బ్రహ్మ కర్ణకుహరంబులు నిండి
కొండొక కాలము చెవులు బీఁదఱ గొలిపె నతల కుతలంబుల తలకుతల
మగు చుండె నప్పుడుప్పొంగి జనకుండు ఘనకోవిదుండుగాన సౌందర్యారాము
రాము గారవమునఁగౌగిలించుకొని గానుకగా జానకింగైకొనుమని యామెను
రామునకుందన కూర్మి పుత్రి నూర్మిలనున్ రెండవ భారతీ రత మూర్తుల
మాండవీ శ్రుత కీర్తుల లక్ష్మణ, భరత, శత్రుఘ్నులకు నిత్తును రమ్మని

రాజని సార్థకంబనుచు రాష్ట్రియు లెంచిరి తెల్పెఁ దూర్యముల్
రాజ నివాసమప్పురిని రాగిలి రాఘవు యౌవరాజ్యమున్ 37

వ. అట్టి యెడ నబ్జయోని వరంబున ధరంగుబ్జగా పుట్టిన మంధర దుర్వ్యవసాయ బంధురమ్మై యందఱకు శ్రవణానంద కరముగా రాము పట్టాభిషేకము వార్త ఘన విశ్రుతి పుట చేదనంబునఁగీర్తనగాఁ బడవిని తనశ్రుతి పుట ఛేదనంబుగా గొని యాదాది రాముచేదావిన్న చిన్ననాటి గాథ చెండాటఁపేటునాఁటికొక పాటి నెపంబుగా దొరకించుకొని యామెర కించుకే నెఱుంగ రానీక తనరాణి కడకు సరగున నొక గంతున నరిగి సంతోష భరితస్వాంతయగు భరతమాతం గని యోతల్లీ యెల్లి మనపట్టమహిషి కౌసల్య పట్టికి బట్టముఁగట్టెదరు సుమా యని సుమాళంబుగా జెప్పిన నానుడి నామెతనగొనిశ్రుతి శుభ వార్త చెప్పిన యామెప్పునకు గొప్ప పసదన మొసఁగెదనని తనయెద నున్న పచ్చల పతకము దాని మెడనిడిన నానంగ నాచి తలయూచి నారనూనుచు నంగనామణి యెంత వెఱ్ఱి వమ్మా యిఱ్ఱు లోతు వఱ్ఱు వచ్చుచున్న విఱ్ఱ వీగు కుఱ్ఱవానికి దీటై మీఁది చేటు పాటెరుంగని దానవయి తివి సవతికొడుకు పుడమి కొడయఁడైన నీవునుం బుత్రుండు నేమిటి వారయ్యెదరు. పెఱవారి పడిపంచల బడి యూరటలేని యూడిగము సేయవలసినదిగా విధిచేత నీతలవ్రాయబడిన దప్పింపనేరి తరమగు నింత బ్రతుకు బ్రతికి యంతమున కంతులేని చింతలవంతలఁజే కుదువన్న నెన్నరాని వగ నామది జీఁకు వీకాడఁదొడం గెడు దఱిదప్పిన నీవు చేయబోవు నుపాయములన్ని యు గతజల సేతుబంధన ప్రాయములగు గాన దూర మాసరి తగు తెన్ను నిప్పుడు సూచికొని యగడు పడక మగడు తొల్లి నీకిచ్చిన యిరువరములను బెగడక యుగడించి గడించికొన దలచిన యెడల రాము వనవాసిగా వెడలి భరతురాజుంజేసి పుచ్చుమనిన ఁజనవుననేని బలిమిన నేని నీవు పతిన్బ్రతిమాలిన వ్రాలి నతమినట్లనె యతడొనరించునని యిట్లు దాసి యుదాసీనమతి మతులు విఱిచి చేసిన దుర్బోధలు కైక తలకెక్కి తలవాసెన గట్టికొని గట్టి భూతలమునఁబండి కట్టకడకు దన కడకు నెద్దిగోరిన నిత్తులెమ్మని చపల చిత్తుండై యాస్థమై యాస్థవిర నృపతి రాగ నాఱాగ యదియ మందిడమంచి సమయంబని సందుగొని 39

ఉ. కైకయి గట్టి యిచ్చినటుగాఁ బతి రాజ్యము రామునందిడన్
గైకయి మంధరాకులిత కన్గొని భర్తవరాలు దెల్పి దాఁ
గై కయినుంచి యెట్టెడుచుఁగానకుఁబంపుమురామచంద్రు నా
కైకయి నట్టి పట్టికిని గట్టుము పట్టమటంచు గోరుడున్ 40

శా. ఆమాట ల్చెవినాటి రాజన్నృత మెట్లాడంగఁబోనంచు నున్
మోమోటంగొని రామునెట్లు వనికింబుత్తెంతునం బెట్టులున్
దామాటాడఁగ లేక మిన్నెఱఁగి మీఁదంగూలి నట్లుండె ద
ద్రామెన్ రాముని గాంచుచుం జెఱువు మీదం జేనిపైఁ గాంక్షగాన్ 41

క. అంతట రఘువీరుండును
నంతట నటకేగి కేకయాత్మజచే వృ
త్తాంతం బంతయు వినియుని
తాంతము తన తండ్రిమాటఁదానెగ్గింపగన్ 42

క. ముని వేషము దాల్చిన రా
మునిగని పురజనులు నార్తి మునిగిరి కనులన్
పనిగా బాష్పము కార్చిరి
వనిలో సీతారాములు వడిలచు మనుడున్ 43

వ. పయనమయిరి అంత రామచంద్రుడు సతీమ తల్లికిఁదనతల్లికిఁజెప్పి పోవువాడై
కోసల రాజనందిని మందిరము మోసల దేరు డిగ్గి యుడుఁగని బత్తి లోనికింజని
జనని చరణంబులకు వందనము చేసి
44

చ. జననికిఁజెప్పి తండ్రినుడి సత్యము సేయఁగ కానకేగుటన్
జనని కిటుల్వ పొంచితని సత్యము చెప్పగ రామ మాతయున్
జన నిను నేనుగన్న పెను సంతస మింతటి దయ్యెఁగాని రా
జని నిను నెల్లవారు వినునంతటి భాగ్యము గాంచనైతిరా 45

వ. అనవిని వనికిఁజన పెనుదీవననిడి సెలవిడి నను విడు మమ్మా ముమ్మాటికిదె
వీడ్కొనియెదనని రాముఁడావె పద యుగళికి మఱియు నొఱగిన

నయనయుగళ గళ దశ్రులు ధారయై 46

చ. వినత సుతుంగపుంగిటను వేగమ చేరిచి తిల్లి తొల్లియా
వినత సుదార్థియై యరుగు విష్ణు రథమ్మున కెట్టి రక్ష నీ
వినత సురక్ష పక్షికిడె వీడక నీకగునట్టి రక్షలా
వినత సుఖమ్ము కొందు విక వేగము ప్రోవుత దేవతల్ నినున్ 47

వ. అనియిట్లు కౌసల్య యిడిన దీవనలందుకొని తన్నుంగూడ నందుగొని పొమ్మనిన సతికి బ్రతికి యున్న వఱకు బతియ గతిగాన నతనివిడి సుతుని వెంట నుంట తగవు గాదని రాముఁడామెను నూరడించి యల్లన వీడ్కొని సీత నగరు సొచ్చి జనకుని పనుపున వనమునకుఁ దన పయనము కతను వాక్రుచ్చిన నచ్చెలువ యుచ్చెరు వంది తన్నుంగూడ దోడ దోడుకొని పొమ్మవేఁడిన నాతఁడొప్పమి నప్పుడప్పుడమి కొమరితచనవున ననువుగఁదెప్పించు నిప్పుడిటు విడిచనిన నిప్పుడమివారు నగరి వారెల్ల నగరా నగరాజ ధీరుండవగు నీకిది తగునా తగు నాలి నేలికొనక నాలితనమ్మున జాలివిడనాడి పెఱలపాల ద్రోసి చనిన దోసంబెగాక యేవిధము గాదె. యేవిధమ్ము గాదనక కూడఁదోడుకొని చనుటను చునుఁగాదంటినేని దుంట వింటి దంట బారికి నన్నగ్గ పఱిచి పఱచెడు వాఁడ వగుదు వదియుంగాక నాజనకుండగు నా జనకుండు నన్ను నీకిచ్చునాడు మగరూపున నున్న యాఁడుదిగా నిన్నెఱుంగక మఱచి తప్పున నిచ్చెగాక యిట్టి నీనద ఁగని యాడంబోవ నులికి పడు నట్టిఁడవని తెలిసిన నింతటి యల్లుండు దొరకె నని త్రుళ్ళునే యెల్ల రెఱుంగం బలికెద నన్నింటికేమిగాని నన్నింటు విడినెల్లి జల రజ్జు విషాగ్నుల యందన్యతమోప కరణమ్ము మరణము బ్రాపించి కొనక మాననని యమ్మానిని ఱాయి గ్రుద్దినట్టు లాడి మిన్నకున్న నాయన్నుల మిన్నం దోకొని యేకొని సౌమిత్రి మైత్రి విడనొల్లక యాతని రాకకు గూడ నీకొని యనంతరంబు 48

ఉ. కానకు నేగి రాఘవుడు గాదలి మైథిలి లక్ష్మణుండు రాఁ
గా నకు తో భయుండరిగి గాటముగాఁగని చిత్రకూటమున్

గానకు పత్యకణ్వసతి గాంచి యధిత్యక నున్నవారినిన్
గానకుడీ భయంబని దగన్ ఋషులొద్దవసించె నగ్గిరిన్ 49

వ. అంత నిక్కడ సాకేత పురమునందు అజసుతుడు నంతటను నిజసుతులు కోడలును గజగతి జన న్వనికి నిజసతులు వాపో వజనపతి దా దివికిని జన గురునాజ్ఞ సచి వజనములు కేకయ ధవ జన పద మందే వృజినము లెఱుంగక యనుజ సమసతుండయి మ నుజన భరితు న్బరతు నిజనగరికిం దేనజసుతుఁడు సెప్పినటుల జనకును కుంగ్రియలు స్వజన సహితుండొనరించె జనములు మెచ్చన్ 50

లయవిభాతి.

భరతుడు సమర్ధ పరిభరితుడయి తల్లిఁగని
దురితమతివని నిన్ను నిరత మిల దూఱన్
వరము లివియేల నరవరునిఁబతి గోరితివి?
పరునివలెఁ బంపి రఘువరుని వని కీవె
వ్వరికి నని రాజ్యమిటు వరుస గడియించితివి
పొరిజఱచి నీతలనె చెరివికొను నే నీ
తరుణమున రాముగని చరణముల పైని బడి
శరణమని వేఁడికొని మరల గొని తెత్తున్ 51

వ. అనియిట్లు భరతుండు తల్లింగుత్సిత మతిన్ భర్త్సన చేసి యచటు వాసి కౌసల్య పాలికి భక్తి భరితుండై త్వరితంబుగ నరిగి తత్పుందంబులపై నొఱగి యెఱిగిన నామె రామప్రవాస మైత్రి ప్రదీప్తరుషా పరుష వాక్కుల నెత్తిపొడిచి తన్మొత్తి పల్కిన నతండు వినతుండై యో తల్లీ సతీమతల్లీ నన్నన్న పనియేమి మాయన్న వనవాస మరుగు నన్ను నుడి కలనైన నెన్నడెఁఱుంగ నట్లైఱింగితినేని గతిలేని మహాపాతకుండరుగు నారక మున కూరకరుగు వాఁడనని శపధంబుగ శపధంబిడి యామె నూరడంచి వసిష్ఠాది విశిష్ట శిష్ట జనులనవశిష్ట పరిజనులను పరిజనులంబరిజనులంగూడి రాముఁదోడ్తేర వెడలి చనుచో దనుఁజోరుంగా మార్గమధ్యమున రామసఖుండగు గుహుండు మార్గనిరోధకుండై నిలిచి

యడుగ దనరాక రామపునరానయనమున కని చెప్పి నిషాధాధి పతి విషాదాది రహితునిగా నొనరించి నెన రుంచి యతఁడతిథి సత్కారంబు సబలంబుగా జేసి విడిచిన గంగఁగడచి నడిచి భరధ్వాజు నాశ్రమంబున నారేయి సుఖమ్ముగ నాతిథ్యంబంది నివసించి యామునిని వీడ్కొని రాముని దోడ్కొనిరా ముని కోటిని శాంతమ్మగు చిత్రకూట ప్రాంతమ్ము దరిసి రామ శాల కనతి దూర మ్మున విడిసిన నాబలంబు కలకలంబు విని సౌమిత్రి సామీప్య భూమిజ మెక్కి చూచి కోప మాపజాలక చాపంబు సారించి తూపు మోప నాయితమగుడుఁ దమ్ముని గని రాఘవుడన్నా యింతలో నేమి వింత యొదవె ఎన్నండురాని కట్టలుక నీకిట్లు రాగతంబేమి ఎవ్వనిపై నివ్వని విల్లు మోపెట్టి త్రెవ్వ జూచెద వది యంతయు నాకెరింగించి మఱి యట్టై యరి మార్కొను మన్న నన్నకు మన్నన తో లక్ష్మణుండు మనద్వైమాత్రుండు కైకయీ పుత్రుఁడ మిత్రుఁడై మనల వనములనైన మననీయక అన్యాయ వృత్తి రాజ్యంబు చేకొనుటయె కాక వీఁక మనపైకిదండెత్తి వచ్చుచున్నవాడు వీఁడె కాన నీ భ్రాతృద్రోహి తలదీసి పెందల కడ నీవనస్థలికి బలివేసి కృతకృత్యుండ నయ్యెద నన్నాపక ముదల యిడుమన్న ; నన్నకలకలనగి లక్ష్మణా నీవంటి విలక్షణ బుద్ధిగల విచక్షణున కిట్టి విలక్షత వేగిరపాటుఁగూడునేఁనాడు నేనాఁడు నెఱుంగని యిట్టికూ డనిపని నెవ్వాఁడేని తలపెట్టుకొనునా? తలపెట్టెది యైన దెఱుగక కొండికవు గాన గెందొక త్వరపడితివి. కైకయీ సుతుడు నీకంటె నెక్కువ నాకుం గూర్చు. కాన నెక్కిడిన శరంబుడించి యుంచుక విదానించువన్న, అతండట్లసేయ నింతలో భరతుండు లోభ విరతుండు సేనను గానముంచి యెంటి పాటున సానుజుండై వచ్చి సీతారా ముల చరణంబుల కెఱగి లక్ష్మణు కౌగలించుకొని తండ్రిపోకయు తన రాకయు నెఱింగించినఁ బితృశోక తప్తుండై రాఘవుడు భూమిపై కొఱగి తమ్ముల హితవాక్యముల దేలి తండ్రి కౌర్ధ్వ దైహిక క్రియలు నడిపి తన కడకు భరతుని రాక కారణంబడిగిన నతండు వినతుండై యిట్లనియె

52

చ. అధవము కాంత బుద్ధిభువి నందఱకు న్విదితంబు నట్టిచో
విధము దొఱంగి కైక తను వేఁడిన గీటున బుచ్చుకయ్యె తా

సీ. బ్రహ్మాది దేవతల్ ప్రార్థించి కీర్తింప
భూభార మణఁగింప బుద్ధిపుట్టి
యల రమాపతి కృష్ణుఁడై యదుకులమందుఁ
దమిని ద్వాపర యుగాంతమగు వేళ
శ్రీముఖ వర్షన భూమాస రోహిణీ
యుత బహులాష్టమి నుద్భవించి
యిల నూట యిర్వది యేడేళ్లు నెలలేమి
దినము లెన్మిది యుండి తిరిగి కలియు

గీ. గాదివేళ బ్రమాదియుగాది చైత్ర
సుద్ధ పాడ్యమి వేంచేసె బుద్ధముక్త
నిత్య సత్పూజితుండయి నిజవికుంఠ
ధామమునకు జగమ్ముల సేమమరసి 139

వ. ఇక్కాల పరిమితి లెక్కసేయ నెక్కువ ప్రయాణంబుల నీఁదగిన సద్గ్రంథ దృష్టాంతము లిక్కడ మక్కువకై వక్కాణించెదఁ జక్కఁగ వినుము 10

సీ. భాగవతములోని పదునొకండవ స్కంధ
మందు షష్ఠాధ్యాయమందు మఱియు
రాణశ్రీవిష్ణు పురాణము పంచమా
శము ముప్పదేడవ సర్గమందు
బ్రహ్మాదులరిగి ద్వారకకు గృష్ణుని తోడ
యదువంశమందు నీవవతరించి
నేఁటికి జరిగెను నూట యిర్వది యైదు
వత్సరంబులును మహోత్సవముగ

గీ. బ్రొమది నికింక రమ్మని పిల్చిరట్లె
యాపురాణ చతుర్థాంశమందె కృష్ణుఁ
డే దినమ్మున దివికేగె నాదినమ్మె
నందునే కలి చొరఁబడెననిరి మునులు

సాధు విధేయుడు రక్కసి కాయము శ్వభ్రములోనికి ద్రూద్చె మునుల్
సాధువు లందకుతో భయులై మనసామి వచించెను రాముడంతటన్ 59

ఉ. కానన మందు రాజు చిరకాలము కాల్నరు సంచరించు చున్
అవని మాననీయమునులాశ్రమముల్చని చూచి మౌనులన్
గాన నమస్కరింపజని కానను నేళ్లు వసించి యుంచిటుల్
గా ననుమాన మీఁగుచు సుఖంబునఁ బుచ్చె ను ద్వాదశాబ్ద ముల్ 60

మత్తకోకిల

అట్లు గాదనిరేని తేనిని నంపుఁడీ మన లక్ష్మణున్
గట్టి రాజ్యమయోధ్యకు న్బవిఁగత నన్నును సన్నిధిం
బెట్టి కొండిట మీకు దాస్యము ప్రీతి సేసెద నెప్పుడే
నొట్టు వెట్టితిఁబోవ నింటికి నొల్లనింకను రాఘవా 61

లనవిని రఘువరుఁడనుజునిఁగని నీ
జననికి వరములు జనకుడొసగంగ నే
మన నదియొనరుప మనకిరువురకున్
జనుఁబెఱసరణిని జన దనియనియెన్ 62

వ. ఆమాట విని రామానుజుఁడు వేమారు విన్నపించి వేసారి యీసారి యేమనునోయని చూతమని యిట్లనియె 63

శా. రామా నామొఱ యాలకింప రపచారం బేమి నేఁజేసితిన్
రామున్సోదరుఁగాన కుందఱిమి సామ్రాజ్యంబు దాఁగైక యీ
భామా సూతి హరించెనంచు భువిదెప్పన్ నన్వినన్ ముచ్చటో
స్వామీ నన్ను కృతార్థు జేయుఁడిక లెస్సంగొంచు మీరాజ్యమున్ 64

వ. అనుటయు భరతాగ్రజుండు భరతునితో నిట్లనియె 65

అంబురుహవృత్తము

తల్లియు దండ్రియు దైవసమానులు దన్మ నోరథార్థమ్ములన్
దల్లిఖితంబులును న్నెరవేర్పక తప్పదొప్పఁదత్పూలికిన్
దల్లికి దండ్రికి సాటిగ నగ్రజుదార నగ్రజుంజూచి భీ
తిల్లిన చిత్తముతో గొని లోఁగొని యన్నపంపు సేయందగున్ 66

కానను నీవుంగాదన కేనుంగనుగొని నుడివెడి కరణిని జేయం
గా ననువే నాపాదు కలిన్వేగను గొని పురికినిఁకనుజిని యేలం
గా ననుగెల్వంగానగు యేలే కనియెదవేని దయగదురుగఁబంపన్
గా ననుగానం బాదు కలందాఁగనిచనెఁగొని బలగము భరతుండున్ 67

వ. అందు మీద నందలి ముని బృందము పరమానందమందిరాము
నభినందించుచు నిట్లనిరి 68

ఉ. రాముని వంటి పుత్రుడు ధరాస్థలి బుట్టుట యెంతవారికో
యామహనీయు నెంచి యటులన్యుల నెంచుట కెట్లు చేకుఱున్
జీమ తలంత యేని దమిసేయక రాజ్యము వాసివాసికై
రాముడరణ్యమందుఁబడరాని విపత్తువడెన్సభార్యుడై 69

ఉ. సోముని వంటి శీతలుడు సూర్యునివంటి ప్రతాపశాలియున్
సామజవైరి వంటి బలశాలియుఁగాలుని బోలు ధర్ముఁడున్
గాముని వంటి సుందరుఁడు గల్గిన నిమ్మహిఁగల్గుగాక శ్రీ
రాముని వంటి ధీరుఁడు ధరాసుతఁబోలిన సాధ్వి గల్గునే 70

వ. అని యిట్లు మునులు వినుతించి తమతమ యుట జమ్ములకు బటు
జవమ్మున జనిన పిమ్మట రాముఁడున సుగుణాభిరాముఁడు గానఁ దాము
చిత్రకూటమున నుంట యుచిత ప్రకూటమిగాదు. వాటముగ నిరతము
భరతాగమన మగునని తపో విభ్రాజి భరద్వాజు ననుమతి వడసి నను మతి
నుంచు మంచని యాయన వీడ్కొల్ప నందలి మునుల నందఱ నభినందన
పూర్వకంబుగా వీడ్కొని రఘునందనుండు 71

సీ. ఇల్వల వాతాపు లెవని కోపాన నౌ
దర పావకునకు నిందనము లైరి
యంభోధి యెవ్వాని కఱచేతి గంటెడు
నాపోశనమ్మయ్యె నాచమింప
వింధ్య యెవ్వనిఁగని వినువీధి విడి నేల
కడఁగి నాటంగోలె నట్లయుండె
నహుషుడు నేఁడిల నొకంబు నందుండి
సాహసిఁబడఁద్రోసె వాహనముగ
దక్షిణాపథ మేవనిచో ధన్యమయ్యె
నెవని దర్శన మాత్రాన నవని గల్గు
సకల నదులౌను నిష్కల్మషమ్ము లట్టి
ఘన మహర్షిని గాంచి రగస్త్య మునిని 72

క. ఆముని యొక ధను విషుధులు
రాముని కక్షయ శరములు రాణింపంగా
రామునిజమెసగ మది దయ
రాముని తమ్ములు వచించి రహివెసనొసగెన్. 73

క. ఆయతి పరివృఢువీడ్కొని
యాయతి పంచవటి నుండ నాయత పడివే
యాయతి పావనుఁడటుఁజని
యాయతి పటు పర్ణశాల యందు వసించెన్. 74

వ. ఇట్లురఘునందనుండు జనస్థానమ్మున జనక నందినీ సహి తుండై మౌనిమానసహితుండై గోదావరీ నదికి నేదిష్ఠంబు గా సలక్షణంబుగా లక్ష్మణ నిర్మితమగువిశాల పర్ణశాల సులక్షణ శుభముహూర్తమ్మునఁబ్రవేశించి బుధజన కథిత వివిధ కర్ణ రసాయన కథ లాకర్ణింపుచు మునుల భయంబులుడిపి యభయంబిచ్చుచు హెచ్చగు సుఖమ్మున నాశ్రితవత్సలుండు ఒక సంవత్సరం బనాయాసం బుగఁగడపఁగడుఁ బగగొని దనుజు లచ్చటి మనుజులపైఁ దమయాటలు సాగనీయక యందలి మునికులమున కొాడ దండగ నున్న

యన్నరోత్తములకెత్తెఱంగునవైన నుత్తలపాటొదవింప నదను వేచి యద్దనుజులు కాచి తిరుగుచుండిరి. అట్టితఱి ఖర దూషణాదుల గాదిలి సోదరి చుప్పనాతి యను నాతి దండకారణ్యము తన కరణమ్ముగాఁ బరి ణయదశ దశ కంఠుని చేఁబసుపు కుంకుమములకై యొసఁగ బడి యుంట నాయడవులఁదడవులఁబట్టి పాడుకొని క్రిందుమీదు గానక భయానకముగా ననేక మౌని మేదః॰ ॰ పాదిత రక్త సాగ్రంధిత వదనయగుచు మదనపరవశయ్యై యెగిచి తిమ్మిరుచు రామ పర్ణశాలాభ్యర్ణమునఁ జనుచు నందు నారాయమున రామ లక్ష్మణుల యతి మానుష రూప లావణ్యము లుపలక్షించి కుటజ కుసుమాపచయ వ్యాజంబున నయ్యుటజ సమ భూజ రాజ రాజిఁజొచ్చి వారల సొబగుఁగని మెచ్చికొని యచ్చెరువు పడి యచ్చరలదచ్చన తాడు జానకింజూచి దాని యేని సొబగుం జూచి చూచి యచ్చెరువడి యచ్చేడియ పతి యగు రామభూపతిని పతిగా గోరిన నతి ప్రహసనము నకుఁ దానకంబగుదుఁగానఁ దంగేటి జుంటు వలెఁగంటి కింపయిన తత్సోదరు సౌమిత్రి మైత్రిని లోఁగొన వచ్చునని యెంచి యాతనింజేరి వావివరుసలం జీరుచుఁ జిరకాల పరిచితవలె నఱచేత వైకుంఠంబు జూపుతఱి తీపు మాటలాడుచు నమ్మాటకారి చేటగోటి నిశాటి లకుమని దాపున కేతెంచి లేనిపోని చెలిమి బలిమి నతని చెవులకు దరికొల్పుచు వెలియెచ్చులు హెచ్చుగ వాక్రుచ్చుచు జెవులకుఁ జవి కొల్పుచు వెలిచవులకు బురి కొల్పుచు నాతని పూత మనో భావం బెరుంగక తనమనో భవవికార చేష్టల నల్లనల్లనగా గానిపింప దలంచి మనంబు కలంచ నెంచి టక్కు పాచికల నొడ్డి చూచి కట్టుకడకుఁ బరనారీ సహోదరుండగు లక్ష్మణ కుమారు తనకు మారుగా భావించితి నన నాతండు గంధ పలికేవగించు భృంగమ్ము భంగి నసహ్యించుచు నట్ల నీవన్నట్లు నన్ను నీకుమారుగా భావింపుమనిన నది తన మనమునకుఁ బ్రతికూలమని యెంచ కనుకూల మగుచు తమి నా తనిచేరి

75

మాలిని

దాన పవేకని లక్ష్మణుఁ గాముకి ధన్యను జేయుము చేకొని నన్

దాన వివేకత దేవర నాయము దారగ విగ్రహాత శ్రుతిగన్

దాన వివేకత నావిని యాతఁడు తద్యము సేయుదు నంచునసిన్
దానవి, ముక్కు చెవుల్దెగ గోసియు దానినొనర్చెవి కారముగన్ 76

వ. ఇట్లు శూర్పణఖి హత దర్పముముయ్యై దర్పణ కపోలుండును బవిత్ర వీతి హోత్రమిత్రుండు నగు సౌమిత్రి మైత్రింగోరి వాని వంచింపఁ బోయి తాన వంచితయ్యై మిట్టి పడి యెట్టయితినని దనలోఁ దాసిగ్గుఁ గఱచికొని యిట్లని వితర్కించుకోనియె 77

ఉ. చేరి నమాజు చేయఁగ మసీదు తలంబడె వ్రీలి యున్నటుల్
కోరి వరింప నీయదట కోసెను ముక్కు చెవుల్తటాలునన్
వేరము దీఱ వీరికిఁక వేరమ పాచిత మట్టె కూర్చిక
న్నారగ జూతు వీరి బమమాఱడి వోయి కృశించు చుండగన్ 78

చ. ముది మది తప్పి నాకునొక ముక్కిడి మానిసి గోర జెల్లునే
మది మదిబోతిఁబో బయిసుమాలిన నొల్లనటన్నఁజాలదే
మద మొదవంగ నీతఁడవమానము నన్నిటుసేసె నన్నిటన్
గొదగద నంతఁదా నతివకోరినఁ జుల్కన గాదె మేధినిన్ 79

వ. అని యిట్లు దానవిధాన వివేకమ్మున నిట్లయితినని తలపోయుచుఁ దలపోయిన నింతకంటె మేలుగ నుండు నని మదిఁ దలపోసి వలపోసి వలపోసే యెంతకు దెచ్చితి వే యయ్యొ యో దయ్య మాయని తనను దాఁదూఱు కొనుచు గొంత ప్రొద్దూరకుండి యందుండి లేచి తన యన్నయగు ఖరుని పాలికంజని 80

క. తనయన్న యునికి కిందో
డన నున్నవికొన్ని లేనియవి కొన్నియునున్
దన యన్న కంటఁగాలిచి
పెనఁకువ చుప్పనక రాజఁబెట్టి కనుగొనన్ 81

క.వి.రా.

ఖరదనుజుండును గాదిలి సోదరి
కాయముగా యముఁగన్గొని వా

విరెంబదు నాలుగువేల పదాతుల
వేరముతోఁగొని వేరముతో
ఖరకరవంశ జగత్పతి మీదికిఁ
గ్రమ్మెచుఁదమ్ములు గార్కొని రా
దరమిడి రాముఁడు దానరి సేనను
దా నవలీల వధన్ దునియెన్ 82

చ. పొసగ రక్కసి మూకలట్టులు పోక యద్ద నిమేష మా
త్ర సుగ మాజి వధించి మౌనులు రంజిలం బతి మళ్ళిరా
వసుమతీ సుత పర్ణశాలకు వచ్చు భర్తను జూచి య
ద్దెస నెదుర్కొని రాముఁ వేసటఁ జేరిచె కౌగిటన్ 83

వ. ఇట్టి లా నరాధిపుచే ఖరాది సోదరులుం బెరనరాదులు నొక్క పెట్టున నెక్కండైన మందునకునైన మిగులక చప్పగా హతు లగుడు మిగుల నగడుపడి చుప్పనాక చెప్పరాని వగ దట్టి యెగదట్టిన దగ దొట్టి మీట్టాడఁ దోడు లేని యా చిట్టడ విలోఁదనవారలఁ బేరు పేరు వరుసలఁదడవి వారలగూర్చి యారాకాసి యాసము వగుల నార్చి యడలుచు ఒడల్పడి గడలుకొను నాతగులము చేతఁగులమెల్ల మెల్లన గానం గార్చిచ్చు వలెఁదగులంబెట్టి కడతేర్చితి చేర్చి దగుదు నమ్మాయని నేమాయ నింకనే మొగము వెట్టుకొని లంక మెట్టుదాన నానన విడి చెడితిని బడితినని వేగనంత దవ్వేగెదను బో ఫలమేమి నామొగమును గని ముును గనిన శూర్పణఖవు గావని మావదిన మండోదరి నన్నెక్కడి దానవు పొమ్మని యెక్క సక్కెము లాడ నాడ నేనేమి యుత్తరమిత్తు నామెఁలత నేమితెఱంగున నమ్మింప గలదాన నాకుఁగల దానవుల నడుమ నతిహీననైతిన్ గతి మాలిన నాకీ బ్రతుకేల యని యుల్లంబునఁగుప్ప తెప్పలుగ నుప్పతిల్లు పలువెతల దెప్పఁదోగి యప్పాప దానవి యెప్పుగిది నైన నిప్పగ సాధింప నొక చెప్పరసి యావనధి లంఘించి రావణుంగని వానికి చెప్పవలసినవి చెవిఁ జొప్పించి యొప్పువెల్లఁ దప్పులుగఁ జెప్పి మెప్పు పుట్టగఁసరు రప్పించి దాశరథుల కొసరు దెప్పించకున్న నాపేరు చుప్పనాక గాదని ఱొమ్ము చరచి కొనుచు బఱచికొని తఱుమగ నఱుచుచుఁ బోయి తాన వంచి ట్టై మిట్టిపడి యెట్టయితినని తనలో దాసిగ్గు పడుచు నిట్లని 84

చ. అని ఘనశోక వహ్నిఁబడి యాసురి యా ఛురికొచ్చి తాంగముం
గొని చని లంకకు న్దనుజ కుంజరు నంజలవ్రాలి గోలుగోల్
పని విఖరాది బంధుమృతి స్వస్థితి చెప్పి రవంత నేరముల్
గొనకొని కొండయంత దిగఁగూరిచి పేరిచి యంటఁగాలిచేన్ 85

వ. ఆదానవి దాన వివేకంబున దానవేంద్రునకు మఱిమఱి యిట్లని యనియె
86

క. అన్నిటి కంటెను నిఁక నొక
టున్నది యొక యన్నుమిన్న యున్నది యడవిన్
వెన్నాడి తిరుగుఁబతి యతఁ
డున్నంత నామెనెవడు నోపడు దరియన్ 87

శా. అన్నా వీడియు భిన్న బుద్ధి వడి నేనన్నానెదో నాకవి
న్మాన్నాతి న్నగభిన్న కాయబలవే రావంతయుం బోలవే
రన్నా తిన్నగభీరనాభి చెలువే యాకాంక్షణీయాంశ మా
యన్నాతిన్నగ నీకుఁజేకుఱిన నన్యంటేల నీపుట్టుకన్ 88

ఆ.వె. చుప్పనాతి యిట్లు చొప్పింపగా జెవి
నాటమాట నాటనాట పాట
కట్టిపెట్టి పంక్తి కంఠుడు దాఁగడ
గండ్ల గాంచు చూడ గండ్లనెల్ల 89

ఉ. ఇల్లడ చెల్లెలా మనలనెల్లిద మిందొనరించె నెవ్వఁడో
యల్లడవుల్ కడ న్నెమకి యల్లియె నిశ్చియమేది వేళకున్
గొల్లగ వాని తెచ్చి యిటకున్ బలిదీసెద లంక కుందలం
గొల్లగ వాని రక్తమును గ్రోలుడు వ్రాలుడు మీరలందఱున్ 90

వ. అని యిట్లు దశాననుండు కశా ఘాతిత శూక లాశ్వంబు రీతి నేతంవ్రీతుడై వెలుంగు వీత హోత్రుగతి నతిమా త్రోష్ణ నిశ్వాస నిర్దగ్ధ నిజప్రాంత సమర సముదాయుండై సముదాయత మదాయత్తుండై మద మత్త మదావళా యుత సత్త్వుండై ప్రశామిత సత్త్వగుణుండై యొదియుంగణుతింపక పకపక నగి

మానిసి దిండినగు నా కొక్క మ్రుక్కడి మానిషి లెక్కయే నిక్కువంబున
నొండెయుత్కర్షంబున నెండె వాని దండింప గొండొక దండి యుపాయంబు
వన్ని యాతని యండ నుండు నక్కన్నియ నపహరించి కాని యాహరింప
నిద్రింప నని పన్నిదంబు చఱచి యఱచేత నేల జఱచి క్రోధ ఘూర్ణిత
సంభ్రమ సరిస కుసుమాంతర్భ్ర మరభ్ర మకర చక్షుర్భ్రంభ్రమ్య మాణ
పింకతి తారకా గులికుండై 91

క. పెటపెట పంతముల్కొఱకి పిండిగఁ జెండెద రామునంచుఁద
ప్పటు పెటుపించి పీటు విను బీటులు వాఱఁగ గోలు దాఁటి చూ
పెటఁబెటకంబు పెట్టై నటు పెద్దగ రావణుడౌర మిత్తి సం
పెట పెటుకెక్క జీవులకు వ్రేటువడం బెడబుద్ధి పుట్టుగా 92

వ. క్షత్రైఱంగున పశపదనుండు తలాలున వెడలి యుప్పు కడలి దాఁటి చాటుగఁజని మరీచి మారీ తేజాండగు మారీచు కడకు వేగనేగి వాని కాళ్లంబడి యోయీ మారిచా చరాచరంబున నీ చోఁటి మాయావి లేడు గదాఁ నేఁటితో మన గొప్ప చప్పుగ నడుగంటెఁ గంటివా?. మాయప్పు చుప్పనాతి ప్రీతిఁదన స్థానం బగు జన్మస్థానంబున నుండగ నిర్నిమిత్తంబుగ నొక నాఁడ చ్చోటికిఁ గొండొక కొండిక మానిసి లిరువు రరుదెంచి పరుసంబుగా బల్కి విరసంబుగాఁ జముడులు బదరి యదిరి పాటు ముదిరి మదికి గనరు గదిరి నానిదుర మొగ ప్రాగరితను జెవరించి యప్పాటున జాటునఁ బట్టి కణ్య నొసలు గోసి నా వాసి చెనవేసి మాతులు పొడిచి పొమ్మనుచు నెఱుంగ నట్లు సురింగిరంతఁ బోక యారాకాసి యాకాశ మెత్తెగసి కుండల కొలందిగఁగాఱు కుత్తిక బంటి నెత్తుటఁ బొత్లి మత్లి తిరుగు ఖరుకడ కరిగి చెప్పి మొత్తు కొనుటయు నతండు రౌద్రంబెత్తి వారిపైకి పోయిన జేయి నెత్తురు గాకుండ రాముఁడు డీకొని ఖరాసురుఁ బదునాలుగు వేల రధికుల పరితో గూడఁబరిమార్చి పేర్చి యున్న వాఁడేను వాని నెట్లోర్చెద నేర్చి తాతని నాతి సీత నేతీరున నైన నెత్తుకొని పోవఁదీసు మానము. సేసితి ననునేఁజెప్పి కొనుట గాదు గాని ఘన మానమున నను మానము చేసి నావాసి వన్నె కెక్క జేసి సావాసము సూపి నాకు ఁదోడు పడఁలేడిపై యూచేడెకు వేడుకఁబుట్టి బర్ణ శాలారామాభ్యర్ణమున కరిగి

యారామకు దూరంబు గా రామలక్ష్మణుల నెలయించి కొని పోయితివేని నేనామె సగ నామీఁద నేమైన నగుంగాక సురాళి నగుంగాక నామాయ నామెం గొంపోయెద నిదియనా తుదియని రావణుండు పలికి నఁబలు పోకల మారి యామారీచుండతనింజూచి నీకీ బుద్ధి తగదు తర్కింపనిది కర్కటీ గర్భంబు వోలెనా త్మ హానికరమగు మతి విడువు మారాము నెవనిగాఁ దలం చెదవనినఁగా దలంచి యవతరించిన పరంధాముఁడు సుమీ. మీదెరుంగక యతని మీఁదికిఁబోఁదలచితివేని నీ తలలు చిదిపి నీపుట మార్చుఁగాన నింకఁగొంత కాలము బ్రతుక నిచ్చ గలదేని. యీ పిచ్చిపనిమాని యింతట వచ్చిన దారి బట్టి లంకకు జని నిశ్శంక నుండుము. మునునే గౌశిక ముని జన్నమున నీతని చేతఁదిన్నఁవేటునుకు నాకాయమున బడిన గాయ యుపాయకరవ్మై బాణమూఁడిననాడ బాణమూ డక నాటఁగోలె నేఁటికిఁగూడ బ్రాణాంతక ముగ సెలవేసి పలుగాసి చేసెడి వాసిబ్రాసి మొండిఘటముగాన నెండి సగమ్మై యాయువు మూడమి. పాదెడలు విడజాలక జీవచ్ఛవము నా నటించెదఁ గాన నెఱిగి యెఱిగి యెరగలి పైకి శలభంబును శరభముపైకి హరిణంబును ధరణీ ధరము పైకి దగరునుబోలెనా ధరణీ నేతపైకీ తీరునఁ బోవు వాడఁననిన నసురేశు డట్ట హాసము సేసి చండహాసము గెఱపెఱికి చేత నమర్చి నీతలపగుల వ్రేయుదునని బెదరించిన నదరి పడి కుదురుకొని యెదిరించి యీ తీరున మారు మసలి నీచే నీచపు చావు సచ్చుటకంటె నార్తజన వనప్రియా రాముఁడగు నారాముచేఁదెగి భవ విమోచ నంబుగనియెద నని తాటకేయుండు హాటక కాయ మాయా హరిణంబై యానరవరు శరణంబున కత్తరుణంబునఁజని జనకజ మనోహరణంబుగా వింప చేరణి గావించుచుఁ జరణంబులు ప్పరంబునకుఁ గుప్పించి చౌకళించుచుఁగన్నుల పండువుగ నుండ నాయండ నాయండ జయాన యాలేడిఁదెమ్మని వేడుకపడి వేఁడుకొనుటయు రాముడుల్లంబు పల్లవింప విల్లంబులు కరపల్లవంబున జేకొన లక్ష్మణుడన్నం గని యీవన్నియు నెఱుంగుదు వీవన్నియలేడి నెన్నండైన జూచితిమే నీచ మారీచువంటి తుంటరి రక్కసి మాయగా నోపుగాన నీకాని కానలో నాముకొని వచ్చు నీ మెకమునకై తమకపడి పోనేల యన్నాయన్న నన్న తమ్ముని మాట గీటునంబుచ్చి పోయివచ్చెద లక్ష్మణా సలక్షణంబుగ వదినంగాచుకొని పదిలమ్ముగ గడి గదలకుండుమని చెప్పి కదువడి వెడలి యా మాయా

మృగమ్ము వెనుదవిలి కడుదవ్వు చని తన తమ్ముని తమ్ముగైకొనమికి వగచి యది యసుర మాయగా వగచి ఖర శరమరి వోసి తెగ రాగి యేసి యా మోసగానిఁదెగ టార్చెనట్లు

93

ఉ. రామ మృగమ్ము వెన్దవిలి రామ మహీశుడు దూరమేగి వే
రామడ మాయలేడి యధరంబడి లక్ష్మణయంచు జీర గా
రా మడరంగ సీత యదిరాము రవంబని యెంచి భీతయై
రామ మృగమ్ముఁదెమ్మనుచు రామవరింపగ బాణపాణియై 94

మ. మరదీ లక్ష్మణ యూరకుండెదవు పొమ్మా యన్న కేమాయెనో
మరదీఁవార్తిని నిన్ను బిల్చెనన నమ్మా యన్నకు న్యేమమే
మరదీభీతి విడుండటంచు మమతన్ మత్తిల్లినామిదనే
మఱఁదీయంబులు సూపె దిట్లు దగమా యన్నాలిపై బ్రామికల్ 95

వ. అనుటయు 96

చ. వదెనయుయాడి నట్టి నుడి వాడిమి వేఁడిమి లక్ష్మణుండునో
వ్వఁదినియలందు రంది తడవందగదేనిట నీమెడించి పో
వఁదినియ సాధ్యజంతువులు వాఱు సురారులు మ్రుచ్చిలింతురీ
వది నియతిందరింపఁగల వారెవరేమిఁకగాఁగ నున్నదో 97

చ. అనవినరాని మాటలవి యన్నియునన్న నుడుల్ హరీ హరీ
యని వినఁజాలనంచు ఁజెవులాత ఁడుసేతులమూసి కొంచునేఁ
బని వినినేమి మూడునో విపత్తు వధూనికి నిల్వ నాకెటుల్
సనునిటఁగత్తి నాగళుల సందునకున్ ననుఁదెచ్చి తేవిధీ 98

సుగంధి వృత్తము

ఆడ నామె డించి పో వనన్న యాజ్ఞ మీఱుదున్
గూడనుంద నన్న సీత వనిగూలు నేట రెంటనున్
మూడె నాకుఁబాడు బ్రహ్మ మూడు బంతు లెట్టి మున్
గోడపెట్టు చెంపపెట్టు గూడ వ్రాసె నాతలన్ 99

ఉ. అన్నునుగాంచఁబోదునని యాతఁడు చేతెఁడు దూరమేగునా
గు న్ననుఁగన్న నన్నయలుగు న్గలఁగు న్గతి పోకయున్నఁగా
కన్ననఁబోఁడి వీడిచనఁగాళులు రావని పోకమానుఁదాఁ
గ్రన్ననసాఁగు నాఁగు వెనుకంజను ముందునకేగు వెత్త్రిగన్ 100

వ. ఇట్లు సౌమిత్రి మునురియాడు చిత్తంబున నురియాడు చిత్తంబు ససి
పఱుపఁబూనుట యసి ధారావలేహనము గావస పోరుగాన నాయన్నం గానం
బోయెదనని యెద ఊాయి చేసికొని

101

చ. వలగొని యన్నభార్యకును వందనముల్తగ నాచరించి యా
వలగొని యొక్కబాట నడువవ్వడి లక్ష్మణుఁడొక్కచోట గ్రే
వలగొని యాడ నర్థుఁడగు భ్రాతను గాంచిన నన్నవల్కె నీ
వలగొన మేది యొంటివిడనాయము నాయమె కాఁనఁగానవే 102

చ. అని తనున న్నయన్న నతఁడాతనికిన్ ధరఁజాఁగి మ్రొక్కి మీ
రనినను నేమిసేయుదు నటంచును మోమును జిన్నపుచ్చుకొం
ఛనియెను రామ నామనవి నంతయు దేవర దివ్య చిత్త మం
దున మును జిత్తగించి యటఁదోఁచిన యట్టుగ నానవెట్టుఁడీ 103

ఉ. అన్న నరాని నిష్ఠురము లన్నెముపున్నెమెఱుంగ నట్టి న
న్నన్న నలంకి చెప్పఁగల యట్టివి జానకి కేనుఁజెప్పియే
మన్నను మన్ననే గలుగ కామెను వచ్చితిడించి మీరలే
మన్న నముండు నన్నుడు నన్నక్షమింపఁగ మించి రిర్వురున్ 104

వ. అంత నిక్కడఁ బర్ణశాల కడ నింతలోన 105

శా. రక్షో భీకరుఁడైన లక్ష్మణుఁడు వోరామం గనన్వేచి యా
రక్షోనాథుఁడు కుండి చేఁజెవుల రుద్రాక్ష ల్మెడం దూలఁగా
భిక్షాందేహి యటంచు నా యుటజము న్వేఁజేరె మాయవి తా
భిక్షుండై మెయిఁగావిఁ గాల జడలు న్వేలంగ వ్రేళ్ళెంచుచున్ 106

చ. అతనిని రామపత్నిగని యచ్చపు మౌనిగ నెంచి యంచి తా
యతనియతా ర్ఘ్యపాద్యముల నర్చలొనర్చినగొంచు నీచు మా
యతనియఁజూపి స్వాకృతి భయంపడి యాసతి మూర్ఛిలంగ ను
న్నత నిజబాహుపీఠి నిడి నాచికొనె న్వడి సీత నాతడున్ 107

ఉ. సీతను రావణుండిటులు చేకొనిపోవజటాయు వడ్డమై
సీతనుమధ్యఁ బెట్టి చను చేయకటుల్ చనితేని ద్రుంతు దా
నీ తను జాత నిన్నుచుఁజీఱుచుఁ జంచుల జీర దైత్యుఁడీ
సీతను బడ్డయట్లడరసేసె ఖగాధ్యుని దూసి ఖడ్గమున్ 108

చ. గొనకొని రావణుండటులు గూలిచి గ్రద్దను గ్రద్దనెద్ది వా
కొన కొనరంగ సీత మఱిఁగొంచును లంకకుఁజేరి యందు మా
కొనగొన మేది రక్కసుల కోటులు నామెనుడించి వారి తోఁ
గొనకొనఁ గూర్పుఁడామె తనుఁగూడు విధంబని చెప్పి కాఁపిడెన్ 109

చ. అటవిని తమ్ముచే నతని యాగమనస్థితి యెల్ల రాఘవుం
డటవిని తమ్ము చేపడునొ యాలెటు లౌను యటంచు నేగియా
దటవిని కృత్తవైరిగని దారవిహీనవుఁ బర్ణశాల ముం
దట విని కుంజ నిర్ఝరము లారసి కానక కాన జానకిన్ 110

ఉ. ఆలిని గోలుపోయి నృపుఁడారయ నొండెడ నీదు తండ్రికే
నాలిని గూల్చఁబోకు నను నాదశకంఠుఁడు పోవనందు ప్రో
యాలిని గొంచు నేనతని నాఁగి పరాసుని జేయబోవన
న్నాలిని గూల్చిపోయెఁదమి నాఁతిని గొంచనియెన్ జటాయువున్ 111

మ. తమలోలాక్షి తెఱంగు సెప్పియటు గృధ్రంబీల్గగా రాఘవుల్
తమలో నచ్చెరు వంది వంది యతనిం దండ్రిం బలెం జూచియు
త్తమలోకమ్ముల కేగుమంచుఁ జితి సత్కారంబు గావించి స
త్తమ లోకస్తవనీయు లేగిరిల లసత్రాంం బాటవిం జూడగన్ 112

తన్వీవృత్తము

సందులు గొందుల్వెదకి వెదకి వే
సారి మతంగ వనికిఁ జన వారా
సందులు పై లక్ష్మణుఁగవయుడు రో
షానన యోముఖ శ్రుతికుచముల్ నా
సందులు చంగానసి నతఁడపహా
స్యంబుగ నానురి సురిఁగి వడింగో
సందులు కందం దీన వికృతపు దే
హమ్మున కేడ్పుఁచుఁజనియె యధేచ్ఛన్ 113

తరువోజ

మనమందు వెతగూరి మనువంశ నిధులు
మహిజను గానకమఱఁగు చవ్వనిని
మనమందు వెదకిన మంచి దౌనను చు
మసలఁగబంధుఁడన్మను జూశి తాశతో
మన మంధులను బోని మదట రాఘవుల
మైఁబట్టి కేల నమలఁబోవఁగాఁగ
మనమందులై వారుమాప బాహువుల
మరరూప మొదవి విమానస్థుఁడగుచు 114

క. తనపూర్వోత్తరమును సీ
త నసుర గొంపోక నామె తరణిసుత సుహృ
త్తన చేకుఱుట శబరికథ
తనరఁగదను సుతుఁడు సెప్పి తనదారింజనెన్ 115

ఉత్సాహం

ఆకబంధుఁడెట్లు సెప్పెనట్ల వారలేగి యా
యాక బంధులట్లు శబరి యర్చలంది పంప యం
దౌక బంధురార్తి నరిగి తత్తరంగిణింగనుల్

దాక బంధు జీవకాది తటము జేరెనప్పుడే 116

శా. ఆపంపా నది యోఱఁజేరి కపి సాహాయ్యార్థ మీక్షించుచున్
బాపం బాపఁగఁదాము నాపఁదగు శోభల్సొప్పు నాభూపులన్
బ్రాపై దాపున ఋశ్యమూకమునఁదోఁపందాఁ జతుర్మంత్రులన్
జూపుం జోపియపాపులం గనుచు నా సుగ్రీవుడు ధ్రీవుడై 117

క. ఎందలి వారెందుండియి
టెందుల కేతెంచి రోయి టేమిటొ హితులే
ముందెటొ నాపనియని కపి
తొందరపడి కాళ్ళువిఱుఁగఁద్రొక్కు కొనుచనెన్ 118

ఉత్సాహం
వాలి పంప నవ్వధింప వచ్చినారొ వీరిటుల్
వాలిపంప నడ్వలములఁ బట్టనేల వీరకి
వేల వీరులనుంగు లైన విడువ రాదు నాకులా
వేలవేరసింహులిటకు నేల నన్ను వచ్చిరో 119

క. అని యినసుతుఁడిటులను మన
మున నాఱునెలలకుఁబొసఁగఁ బోవున్పనిగన్
దినకయ రుచులెన్నం గల
ఘనమంత్రి సమీర సుతుఁడు కర్జము సెప్పెన్ 120

ఉ. వారిగనంగ మిత్రజుడు వాయుజుఁబంపిన నాతఁడేగి య
వ్వారి గనంగ రాముఁగని భానుజు దుర్దశఁదెల్పి వానికె
వ్వారిగనంగ డుంగెడప భారము మీయది మైత్రి నిచ్చెదే
వారిగనమ్మ గూర్చినవి వాని కృతమ్ముగఁ జెందుఁడంచనన్ 121

చ. దశరథ సూతి వల్లెయనఁదావనిఁ బావని యేగి తెల్ప సూఁ
దశరథరాజమూర్తి కపిదంతికి నాతఁడు పోయి రాము పా
దశరజమందు వ్రాలి యులఁతందిన యాలిని వాలిగొంట దు
ర్దశ రహిఁజెప్ప రాజు కపిరాజ్యము నిత్తును వాలిఁగూల్చినాన్ 122

వ. ఆపలుకులు తన చెవులకుఁ బులకండ పలుకులుగా నుండి యింపు
జనింపఁజేయ సుగ్రీవుండు ధన్యుండ నైతినని యిట్లనియే. 123

శా. రామా యేమన రావణాసురుఁడు మీరామన్ దివింగొంచు బో
రామా లక్ష్మణ యంచు నామె తన చీరన్భూషలం గట్టి యీ
రామాపైఁ బడవేసి పోయె నవి నాప్రాణంబు రే కెత్తుగా
రామార్ధమ్మని దాఁచి నాఁడనని వేరప్పించి యిప్పించినన్ 124

క. ఆసొమ్ములుగని రాముఁడు
దాసొమ్ములు గాంచి తేజీ తమ్ముని కరమం
దాన న్మన్నిడి కనుమన
దాసోహమ్మనుచు నుడివితగ నతడనియెన్ 125

క. ఇక్కేయూరంబులనే
నిక్కుండల యుగళమేని యెఱుఁగను దినమున్
మ్రొక్కుదుఁగాళ్లకుఁగావున
నక్కోమలి నూపురంబులవి గుఱుతిడితిన్ 126

వ. అనుటయుఁ దదనంతరంబు 127

గీ. వాలి బలశాలి గావున వానిఁగూల్పఁ
గలఁడో లేఁడో నృపుండని కలఁగ నినజుఁ
డతని తృప్తికి రాముఁడు నంగుట మునఁ
ద్రోసిఁ బది యామడం బడ ద్రోసి జూడుమనగన్ 128

చ. అగచర రాజు వొంగ నతఁడాశుగ మొండరి వోసి వాసినే
యఁగఁజని యేడు తాళ్లు జదియంబడఁగూలిచి యంతఁబోకవే
యగభయయుక్త భూధరము నాటఁగఁదూటు రసా తలంబు డా
యఁగఁజని వచ్చి తూణగతమైనఁ గపీంద్రుడు మెచ్చెరాఘవున్ 129

ఉత్సాహం

అంతమందిటుండె నాకు నార్తి రోగ మీఁగఁ(బ్రా
శాంతమంది నుల్లభించి రశ్వినీ సుతాభులై
యంతమంది నావిపత్తు లాఁగ దైవయోగ మం
చంత మందిలోన బాస్కరాత్మజుండు రాముతోన్ 130

ఉత్సాహ వృత్తము

అంత వాలికూలి రాజ్యమందినంత సంతసం
బంత గాంచినాఁడ ధన్యుఁడైతి నాదు చేతనై
నంత వఱకుఁ బొరలి చేయనయ్య నీదు కార్యమా
వంత వీడ నీదు పాదమాన యానఁ బూనికన్ 131

శా. కన్నారంగని నాఁడ రావణుని వేగం బోవ నేనేడ కిం
కన్నారంగని నాద యాతని చెవుల్ గాడించి పీడించి లో
గన్నారింగనయమ్ము గూర్చి తమరుంగాండంబులం(ద్రుంప వే
గన్నారింగని తెత్తు నంచు నృపుపత్కంజంబు లంటెం జెయిన్ 132

వ. అంతట సీతాకాంతుండు సంతుష్టాంత రంగుండై కపి పుంగవుంగని యింక
నీవు వాలిపయి లెంతే చను మతండు నీమీఁదికి రాగ వానిందెగ(వేయుదు
నపుడు నాచెయి బలిమి కలిమి కన్నులార జూచెదవు గాకయని కెండొక
బోవసమీయమేయ మెయి పరవశమై మార్తాండ నందనుండు కొండంత
సత్తువ నంది యప్పుడు
134

లయగ్రాహివృత్తము

తామరస బంధు సుతుఁడాముకొని రాము సెల
వోమి చని వాలి పయినామమునఁబిల్వన
హమికను వాఁడు తనదీయమును వెడలి కడు
దీమసముతో ననుజుపై దెగడి మొత్తి తన
గా మఱి యితండతని గామిడి యతండితని
వేమఱును గొట్టుకొన గోము లడఁగంగా

రాముఁడెటుసేయక నిరామముఁడుగాఁగనుచుఁ
దా మెదలకుండెఁగపి సామడఁగి రాగన్ 135

వ. వచ్చి పతంగ సుతుండు రఘు పుంగవునితో నిట్లని యంగలార్చె 136

క. అయ్యయొ పొమ్మని యరిపై
కయ్యము సమవైరి తోడనటునేఁబెనఁగన్
గయ్యమున నూరకుండితి
కుయ్యిడ నమ్మించి గొంతు గోసిన మాడ్కిన్ 137

చ. అనుటయు నొప్పిచెందకతఁడాతని కిట్లను నాదు చేఁత కీ
వనుటకు నొప్పికొంటి విను మాకృతులా కృతులయ్యలంకృతుల్
కనుగొన మీరలిర్వురు చెలంగ నొకచ్చున నొత్తినట్టుగాఁ
గనుఁగొని నాయమోఘ కటుకాండము వీడ మిన్నకుండితిన్ 138

గీ. కాన నాకానవాలుగాఁగొనొ నెద్ది
యేనియును బూని దాయపై కేగుమంచుఁ
దమ్మునింగన గజపుష్పదామ మతఁడు
నమ్రుఁడగు కపివరు మెడ నచ్చఁబెట్టె 139

ఉ. అయ్యది పూని వాలిపయి కర్కజుఁడేగి యటం దటాలునన్
దయ్యపుఁగేక వెట్ట విని తార నివారణ సేసి వల్లనన్
దొయ్యతి మాట నేటునక త్రోచి రుచింపక కాలపక్వమై
కయ్యము సేయఁదమ్ముపయిఁగాళులు దువ్వుచు వాలి ప్రాలినన్ 140

లయహారి వృత్తము

నవచరులు నిరువురిటులను చరులుగను కవిసి
వనతరుల నొకరి నొకరిజ జఱచి కొనుచునగ
దనువులను నఖ ముఖ రదనములను గఱచికొని
కినుక తలమును కలుగఁ బెనకువఁ భెనగనని 141

దనర దశరథుని పెదతనయుఁ డరినిడి శరము
నవచరుని యురము గుఱిగని సరిగ విడవగను
జని శరము సురవరుని తనయు నిలఁబడ వడినిఁ
దునిమి యట మఱలి తనదొనకమరి వడిగచన 142

క. అట్టులు దన్నుం జాటుగఁ
గొట్టిన శ్రీరాము వాలిక్రూరోక్తులతోఁ
బొట్టు పొరలగుచు దూరినఁ
బట్టఁగనతఁడిచ్చె నిట్లు ప్రత్యుత్తరమున్ 143

శా. జీరీ కాఱులు మానురా ప్లవగ నీయుగ్రాఘ వృత్తింగనన్
నేరంబంచును వేఱు చెప్పవలెనా నీతమ్మునాలింగనన్
జేరందీసి రమించె దీవతని గాసిం బాఱఁగా ద్రోలితే
దూరంబారసి నీకు బ్రాచితముగా ద్రోహినిమంద్రుంచితిన్
మారాజ్యంబున నిట్టి పాపిని మనంగా మానురా దుర్మతీ 144

ఉ. ఇట్టని వాని తమ్మునకు నిచ్చి కపీశ్వర రాజ్య మంగదున్
రట్టున వాలికొర్కె యువరాజ్యము నందిడి యేగి రాఘవుల్
గట్టుపయిన్వసించి పదిలంబుగఁ గానద వానకాలమున్
గట్టడి సీతను వ్వెదకు కార్యము జోలిఁగపేంద్రుఁడూనమిన్ 145

క. రాముఁడలిగి సుగ్రీవుం
డేమాయెనొ సీతవెతకు టేమాయె నాకో
సౌమిత్రి మిత్రు గనిరా
కామాంధత విడఁగఁ దగిన కాటుక యిడుమా 146

వ. అనుటయు 147

చ. అతఁడతి వేగమేగి ప్లవగాధిపుఁగాంచి యిదేమి భానుజా
మఱిసెడి నీవు మైమఱచి మాలిమి మాపని జోలిమాలి నీ
సతుల రతిన్మతిన్నఱిగి స్వామినిఁగన్నులఁగాన వైతి దు
ర్మతి పతివాలిఁజంపిన శరంబొక ప్రక్కనెఱింగి యుండుమీ 148

క. వినుమీ సంతత గమనా
దనాదరో భవతి యను మహాజన వాక్యం
బు నిజంబుగాఁగఁదఱచుగ
ననుఁగని నినుఁగనఁగఁ జేసి నాతలపమ్మున్ 149

ఉ. కామినిఁగోలుపోయి గతిఁగానక చింతిలఁజీకు నీకు శ్రీ
రాముడు కొండయంత రిపురాలిచి రాజ్యము గట్టపెట్టి తా
వేమఱు నన్వటిం గిరినివీట సుఖమ్ముల విఱ్ఱవీఁగి నీ
వేమరు టొప్పునే మముల నేమిగ నెంచితొ రాము నీ మదిన్ 150

చ. అతఁడిటులన్న నన్నగ చరాధిపుఁడిట్లను నన్నరాఘవున్
మతి మఱవంగ నౌనె యతి మానుష మాతని శక్తిగానమే
యితఁడొక యించుకంత కనులెఱ్ఱన జేసిన యంతమాత్రనే
గతిచెడి కూలదే జగము గావున నాయెడలే నెఱుంగనే 151

ఉ. ధీ రహితుండ వానరుఁడ దీనుఁడ హీనుఁడ నన్ క్షమింపుఁడీ
ధీరహితుండ వానరజి తేరుగడైనఁ బరాకు జెంది తెం
తే రహితుండ కుంకుడురఁ దీయునటుల్ కపికోటి నంపి ముం
ధీ రహితున్నబంధు నని ఁదీయుడు వేగమె సీత జాడలన్ 152

ఉ. సీతను దెచ్చి రాఘువుని చెంతను డించెదు నంతదాక నే
నౌతునె మెక్కగూర్క ధరనాబ్రజ వట్టికృతఘ్నుడంచ నన్
ఖ్యాఁతిగ నాకు రాజ్యమిడి కాంతను గూర్చిన స్వామి రాముకై
నాతలనైన నీనె తరుణంబున నట్టి పనుల్పుటించినన్ 153

క. మీకీ బ్రత్యుత్తరముల
సాకల్యముగాఁగఁజెప్పఁ జాలను దంద్రీ
వాకొన నేటికి నేను క్రి
యా కేవలముత్త రమ్మటంచు నెఱుఁగనే 154

వ. అనియిట్లు సుగ్రీవుండు సౌమిత్రికిఁ గోపోప శమనంబు గాఁబలికి తన మంత్రి

ముఖ్యుండగు హనుమంతుఁ బిలిచి దాశరథి మ్రోల నిట్లనియె 155

చ.. మనదగు రాజ్యమందుగల మర్కట భల్లుక కోట్ల నెల్ల రం
డన దగు దూతలంబిలిచి యందర బిల్వఁగ నంపుమిందులన్
మనఁదగు వాఁడు రాక యిఁకమానఁడికం బది నాళ్లలోననే
మనదగు నాకృపాణి నదురంటగఁ ద్రుంతు మదాజ్ఞ మీరినన్ 156

శా. వ్యగ్రో దగ్రత వానరాధిపుఁ డిటుల్వల్క ననూపంతుఁడ
త్యుగ్ర ప్రాగ్ర హరుండు చారుల నహో యుకంబుగాఁబంపినన్
జాగ్రత్తాగ్రియు లేగి వేగరులు నాజ్ఞన్నైక కీశాళికిన్
సుగ్రీవాజ్ఞ యటంచుఁదెల్పి, పరమౌత్సుక్యంబునన్ రమ్మనన్ 157

చ. పిలిచెను భానుజుండని చెవింబడినంతనె కీశరాశి రం
పిలి చెలరేగి యేగెను గపి ప్రభువీటికి నూర్లువేలు ల
క్షలు నట కోటు లర్బుందము ఖర్వము శంఖముభూరి సంఖ్యలన్
గిలకిలలాడికొంచుఁ దమకేకలు నాకమునుం బగుల్పఁగాన్ 158

వ. ఇట్లు ప్లవగములగములు గచ్చువిచ్చుగ పెచ్చుపెరిగి విచ్చలవిడి విడివడి వడిఁదీరుగుచుఁ జెచ్చెరఁ జొచ్చి పొచ్చెము లేని మచ్చి కల హెచ్చి యిచ్చకములకై యొండొరుల గిచ్చికొని తచ్చన లాడికొనుచు బిఱానఱాలు పెగలించి యెగఱువ్వి యువ్వలనొవ్వ నవ్వి పగలఁబండి పండ్లిగిలించుచు గోరమేను బిరబిర గీరి పేను నేరి నోర నిడికొనుచుఁ గొటారు కొమ్మలకుఁ దటాలున నెగిరి గిరిచరియలకు బడదుమికి నెమకి యట నెద్దియేని చోద్యంబగు ఖాద్యంబును దొరకించికొని క్రించు తనమున నించుక పెఱకపి కెఱుక పఱచి కకాపికపఱచి యది వచ్చి తను నెయ్యికొని యొడిసి కొనిపోవ జడియకయ జడిసినట్లెడసి తానుఱికి దానికి దొరకనీక తోక ముడించికొని నడచుచుఁ గఱచి పట్టిన ఖాద్యమును విడక వెఱచినట్లు వెడవెడ నడల నొండెడలకుఁ బాఱి గుట్టుక్కున మ్రింగి నింగి నంగులిచేఁజూపి యుడికించుచు వ్రేలు వాలు గొమ్మల బట్టి చాలఁగ నుయ్యల లూఁగుచు వాలు గొమ్మలతో నయ్యాట లాడుచుఁగూడుచు వీడుచుఁ బాడుచు నాటకురవమ్మని వేడుచుఁ

గనుబొమ్మలెత్తి కన్నులల్లార్చి మొగమెంగయించి చిట్లించుచుఁ గికురించి వెక్కిరించుచు నొక్కరొక్కరిని ధిక్కరించుచు నిమేష మాత్రము సేకరించుచు కేకరించుచు మోకరించి నడువఁగడువు బెట్టి కొంత తడవు హెచ్చునడచి చచ్చువడిన దాని నడచుచుఁ బొడుచుచుఁ దమకంబునఁ దమకంబువు దొరకక దగ చేదిగ జేరులు పడిపడి యలకై గడియగడియకు గట్టులు చెట్టులు మిట్టలు విట్టలు పుట్టలు గుట్టలు నెక్కి నిక్కినిక్కి జూచుచు బారులు తీరి హోరా హోరిం బోరుచుఁ బాఱుచుఁ దాఱుచు నీరాకరంబెద రు నూచెదనని యొక్క రొక్కరి తోనని నీరాకరమునకుఁజేరి ప్రథశ్రమము దీర నీరమాని విశ్రమించి మించి యశ్రమమున నాశ్రమ తరులెక్కి వానితేనె తెరలంబట్టి తుట్టె తెరలంగొట్టి మూలమట్టుగ మధువంతయుఁద్రావుచు సీక్థకముల సత్తుగ బావుచు ఫలరసంబుల గ్రోలుచు దఱచుఁ ప్రేలుచు మధ్య పానంబున దూలుచు సోలుచు నేలకు వ్రాలుచుఁ దోక లెత్తి కొని కేకలిడుచు మూకలుగట్టి మూకుల కెగఁబ్రాకి యాకనక యలమనక ఫలమనక దలమనక కాయయనక పిందెయనక కంటఁబడిన దాని నెల్ల నంటఁబెఱికి యుఱక మంటఁ గలుపుచుఁ వెంటఁ బఱచి యొండొరుల గఱచి కొనుచుఁ దఱచు తరుశాఖల విఱుచుచు గాఁపరులను దాఁపునకు రానీక శిలల నూఁకి వారు తమను మొత్తలగు డంబు లెత్త నత్తఱిఁ దత్తర పాటున దాఁటివ్రేటు దప్పించి కొని వెక్కిరించి వేఱు దారింబట్టి పోయి వారలేమఱిన మఱలి చేరఁబాఱి తాఱి తాఱి పొడనూపి తలనూప రాకుండ గుండురాలతో బడమొత్తియు మెత్తనై వెఱచినవారి నోరు తెఱచి పండ్లఁ జూపి వెఱపించుచు నిట్లనేక విధ స్వాభావిక పరిహాసైక చపల చేష్టలుఁగాఁ పరులకు ఁజూపరులకుఁగరము వినోదకరముగా నెక్కడ జూచిన లెక్కకెక్కువగ ఁబ్లవ గములగములు తండోప తండములుగఁ గిష్కింధా పుర పరిసరము దఱిని యుర్వగతిఁ గపి ప్రబర్హు దర్శించి కపి గోలాంగూలాచ్ఛ భల్లవల్ల భులెల్లరులము వచ్చితిమని తమిని ఁదమరాక నెఱింగించిన సుగ్రీవుండు హనుమ దంగదులతోఁ దోన కపి బలంబులు కూడిరా లక్ష్మణ సహితుండై వానర సహస్రో హ్యమానమగు చతురంత యాన మారోహించి మాల్య వద్గిరి గుహా ద్వారంబున కనతిదూరంబున శిబికావ రోహణంబు గావించి రాము సేవించి దాశరథి కాశదీరఁ జేరువ జుట్టుము ట్టుకొని యున్న యన్నగచర బలంబు గానుపించి దగు కానుక లొప్పించిన రాముడతని గారామున సౌమిత్రి

నిర్విశేషంబుగ గాఢాలింగనంబు సేసి యాసీనుంగావించి సేవ చేతి కచ్చిన యంతగా నంతరంగంబున నుబ్బి యామె జాడ జూడదగు ప్రయత్నంబు గావింపుమని సెలవిడుటయు సుగ్రీవుండు వల్లెయని వానరాచ్ఛ భల్ల వల్లభులలో మెఱకులవంటి గఱకరి శూరులనేరి వారితోన మీరలింతట వేవేగనేగి నాయాదేశమున నాయాదేశములంతట నన్వేషించి మనద్వేషియగు దోషాచరేశు వాసంబు యోషిద్రత్నంబున్న తావునున్నత మతి నరసి యెందెందుఁదిరిగియుఁ దిరిగి యిందున్నట్టు వీర లిటకు నెలమించఁగను నెలమించకయు రావలయునని నలు దిక్కులకయ్యె వారల నయ్యె దిక్కున కేర్పఱచి తదనంతరంబు 159

క. జనకజను వెదుక మీకున్
జనక యిఁకం దప్పదనుచు శతవలిని సుషే
ణుని నుత్తర పశ్చిమముల
కును వినతుని దూరుపు దిశకును బంపి యటన్ 160

ఉ. అన్నకుమారనందగు మహారజతాంగద ముఖ్యభూషుఁడౌ
నన్న కుమారు నంగదు మహాబలశాలి హనూమదాది ధీ
మన్నగ చారి యూధపుల మంతిరి తారును దార బుద్ధి స
మ్పన్నగజారి యోధపులఁ బంపెను దక్షుల దక్షిణాశకున్ 161

వ. ఇట్లొనర్చి యాదిశలకుఁ గుశలులైన కేశయోధనాధులనేర్పఱిచి నేర్పరసిధరులగు వారలకు గారియము బోధింప దరుచర వీరులారాయని సంబోధించి యా నేర్పరి చిరపరిచయముననయముననుజుండు తత్తద్దేశ్యనదీన దము నదీనదములై కని మహాగహనగుహా మహీధ్రములగీనుంగెనుమని సవిస్తరముగాఁ బ్రస్తావశం భృశంబుగా బ్రస్తావించి వారంబ్రస్తావించిన నప్పుడు దాశరథి యుప్పొంగి నలుదెసలకుఁ బఱఁ జూచినకీశరాశిని ముందుగఁదా దారఁ జూచి తక్కిన ముక్కడలు ముక్కడులుగ నెంచి వారిని విడి దక్కినపు దిక్కునకు బయలు వెడలిన యందఱిలోఁ బవన నందనుఁదన ముందఱికిఁ బిలిచి సాదరవాక్యంబుల ఆదరించి బోధించి

162

క. అప్పావనమతి రాఘవుఁ
డప్పావని చేతికిచ్చె నడియాలంబో
యప్పా వనరుగ నాసతి
యప్పావని కిడుమటంచు నంగుళి ముద్రన్ 163

ఉ. ఆగతి రామముద్రికను హస్తముచేఁగొని వాయునందనుం
డాగతుడైన నంగదుఁడు నాతని దక్కినవారి గూడి యం
దాగక యేగి కాననములద్రులు నేళులు సూచి సీతకై
యాగతమేమి చిక్కక హార్యము వింధ్యము చేరి యందలన్ 164

గీ. వినువకిందు నందు వెదకి వేసరియును
బుక్షబిలము నాస గుహను
దారిసొచ్చి యందు దారి తెన్నెఱుఁగలే
కడలి వెడలలేక బడలి యుండ 165

క. హనుమంతుఁడు తారాంగదు
లను మంతురులును గుఁమిగొని యట సరసి తటం
బున మంతనమునను దపం
బొనరించు స్వయంప్రభాఖ్య నొక శ్రమణిఁగనెన్ 166

వ. కని యతండతి వినీత వేష భాషల నామెకడకరిగి తత్పదంబుల కెఱఁగి 167

చ. అకుటిలుఁడామెతో ననియె నమ్మ నృపాజ్ఞను మేము రాముదే
వికినయి వచ్చివచ్చి యిట వింధ్య గుహంబడి తేరుఁదెన్నుగా
నక నినుఁగంటి మీ వెఱఁగినందెరువొక్కటి సూపు మన్నఁగం
దక సతి కండ్లుమూయగవి దాఁటిరి దాఁగుడు మూతగాఁగపుల్ 168

వ. ఇట్లు బహుతిమిర సంవృత గుహాంతరాళంబు నుండి నిమేష మాత్రంబు
వెడలి స్వయంప్రభ ప్రభకు నామె తపోమహిమకు మిగల నచ్చెరు
వందుచు నంగదా ములు చెలంగి యచ్చట నుండి కొండొక
దూరమారసె యెచ్చటను జానకింగానక బుక్షబిలంబుననే తమకు గడువు

నెలగడచి చనుటకును వనచరపతి సుగ్రీవును దగ్గదండ నకువెఱచి యువరాజగు నంగదుండం గదగొని ప్రాయో పవేశంబు నందభి నివేశముగా వింప దారుండుదారుండు గానఁదారేయు తోడి పాటు వాడై యాపనికేయాపని కేమని సమ్మతించుటయు

169

ఉ. పావని రోసి మాస మెడఁబాసియు నీసరికెందుఁగాన మ
ప్పావని సీతఁగాననిఁక బ్రాయమె శ్రేయమటంచటు ల్దలం
పావని నిశ్చయింపఁ గపులందరు నొప్పి ముమూర్షనుంట త
ప్పావని తార్ద మాజిని దశాస్యుని చేత జటాయు వుండునాన్ 170

వ. భాను భానుదగ్ధ పక్షుండై పక్షీంద్రాగ్రజాగ్రతనూజ సుపార్శ్వన్ సంపాదిత మితాహారంబు దేహధారకంబుగాఁ గుక్షి భరింపుచు బక్షీంద్రాగ్రతనూజుండగు సంపాతి పక్షసంపాత వంధ్యశక్తుండై వింధ్య గుహనుండి చిరకామునుండి పడియున్న జటాయునగ్రజుండు నయ్యెండఁదఱుచు గొలగొల లాడుచున్న గోలాంగూల తరుచరవరుల గని యొక్కనినైన విడువక యొక్కొక్కనిదిని దినము దన కడుపు చిచ్చు చల్లార్చెదనని వారి కడకు నొయ్యనొయ్యన వచ్చుచుఁ దన తమ్మునిపేరు వారు పేరుకొనుట యు ఁగనికరమొదవి విపక్షిపక్ష బుద్ధి మాని యా విపక్ష పక్షిపతి యప్పుడు

171

ఉ. పాతిత నర్మశర్ముఁడయి భ్రాతృవధన్విని యార్తిఁగూరి సం
పాతి తనంత తానటకువచ్చి జటాయువు నన్ననేనుఁదా
పాతి తమస్సు దీఱెనని యాత్మకథ న్వినిపించ యంతతోఁ
బాతిత పక్షము ల్మొలువ వారికిఁజెప్పెను సీత జాడలన్ 172

చ. అవనిజ రావణాసురుని యాలయమందున నున్నయట్లుగాఁ
బవనజుఁడంగదాదులును బక్షిపువెల్ల నెఱింగి సంభ్రమున్
బవన జవంబు తోనెవర వారము చేరెదరన్న బుద్ధి గొ
ప్పనజగర్భ సూతి మన పావని కన్నను మిన్నలేడనెన్ 173

కవిరాజ విరాజిత వృత్తము

అదరక నేన్ బదియామడ దూఁకెద
నంచు గజుండు గవాక్షుఁడు ని
ర్వది గవయుండనె వాలుగ ముప్పది
దాశరభుండనె తారక న
ల్వది పదిహెచ్చనె బంటొకఁడర్వది
వాకొనె మైంధుడు బలే ద్వి విదుం
దిడె హెచ్చనె నెంచె సుశేషణుఁడు
నెన్బది తొంబది ఋక్షపుఁడున్ 174

కవిరాజ విరాజిత వృత్తము

అదివిని యంతయు నంగదుఁడిట్లనె
హేళిగ వాలికి నాత్మజుడన్
బదిబదులామడ వారిది నాకొక
భారమె పో మఱి వచ్చుటకున్
జదురునుగా నన జాంబవదాఖ్యుఁడు
చాలుదు వెంతకు స్వర్గమునన్
బదిలిడు వైనను భార్యగ రాజును
బొఁజు గనందగుఁ బాల్యుఁడు గాన్ 175

గీ. కానఁబనిగొను యువరాజుగాను బనుల
కిందఱము భృత్యులుండ నీకిందమగఁ
జనునె తెడ్డుండఁ జెయిఁగాల్చి కొనఁగ నేల
లంక కిపుడంపుమొక యకలంక బలుని 176

క. అనవిని యంగదుఁడంగద
నన వినయముతోడ నెవ్వఁడాపనికిం జా
లిన వాఁడన నెలుగుల ఱేఁ
డనె మనవిని వినుమటంచు నాతని తోడన్ 177

గీ. కొండ తలక్రింద నిడికొని గుండు ఱాల
కొఱకు వెదుకంగ నేల నీ కొఱకు రంటఁ
దవిలి యుండఁగ మదిఁజింత దవులనేల
మంతునకు నెక్కు ఘను హనుమంతు ననుపు 178

వ. అతఁడిట్లనుటయు నీవీకార్యంబు సక్కపఱచి కాపాడుమని యనుమని మఱిమఱి గొనియాడి యనుమతి పఱిచిన నీయంత వాఁడు లేఁడని వేఁడుటయును 179

ఉ. అందఱు నాంజనేయుఁగొని యాడఁగ వేఁడగ నాతఁడొప్పి మీ
రిందఱు వంది చూడను డధీంద్రుని దాఁటెద గొప్పదంబుగాఁ
గందఱుచైన నాబలిమిఁగన్గొనుఁడంచును దూఁకె నింగి కే
గం దరువాణ మందముచుఁగాళులు సేతులు యేఁగు పెంచుచున్ 180

# సుందర కాండము

సీ. అప్పుడాతఁడు పైకిఁగుప్పించి యెగసి
యుప్పు సంద్రము మీఁదనునుఱుకు తఱిని
నాక మాసన్న మగుటనక్కనకకూట
మైనాకముంగని మానమంది
సురసమర్పిత భార సురసదర్పిత ఘోర
విరస వక్త్రము సాచ్చి వెడలి వచ్చి
సింహకోటి కరాళ జిహ్వా కామగ్రాహి
సింహిక ప్రేవులు చీల్చి కూల్చి
సకల వికలాపదల నిట్లు సరవి c గడచి
కడలి శతయోజనము చిఱుకయ్యకరణి
దాఁటి యలవోకగా నద్రి కూట మవలి
నేలపై రామబాణమ్ము పోలె వ్రాలె. 181

వ. ఇట్లు వాయుసూనుండు వాయువేగంబునఁద్రికూటాచలంబున డిగి పగలు

లంకలోనికిఁజనిన రజనీ చరులు పగగొని తన్ను దలపడిన నింతిని వేదకుటకు నంతరాయము వాటిల్లు నని సూర్యాస్తమయము వేచి లంకదేఱిపాఱఁజూచి యద్దాని కోటలు తోటలు పేఁటలు బాటలు మేడలు వాడలు కూడలి రచ్చలు బచ్చులు మచ్చులు పౌజులౌజులు తురంగ మాది చతురంగ బలములు లోనగువాని ఠీవిఁగన్నులారఁగని లోనగుచు నౌర దీనిసౌరు దీనికిగాక మఱియేవ్వటికైనఁగలదే. ఇవ్వటికివ్వననిధి దాఁటిరా నెవ్వనికి వశమగు? నగుఁదాక కట్టిఁడి తనమున నా బోఁటి వాఁడొకానొకండు వచ్చినను నగుబాటగుఁగాక తగుబాట నబోటియగు జానకి యగబాటెట్లు వాటిల్లు సీటుగ నిట్టి యనర్గళ దుర్గమ పురవరంబుఁజొఁఅ నెవరి తరంబగుఁబగఁగొన్న యీ యసుర నెదిరింపఁగరంబు దుర్భరము గాక యీనిబ్బరపు బూటకముల మాట వాఁడేయని లంక హెచ్చుగని మెచ్చుకొనుచునచ్చేరువ నచ్చెరువుపడుచు సీతనొనఁగూర్తునన్ని రఘువరునకు ఱొమ్ముఁజఱచి పన్నిదము సఱచి బరువడి బరవసమిడి నయిన తనయు కేటిమాట తక్కు-నని యెంతయుఁజింతించి హనుమంతుండు మఱియు

183

క. దాశరధి శరధి, శరరధిఁ
ధాశరధి శరధి మహోగ్రతఁదలమొలచి పె
ద్దా శరధినీశ కపిముం
దా శరధుర్యుండడంగు నీని మదినలరెన్ 184

క. సంజను బురిఁగనఁదలఁచి వె
సంజనకందాఁగి చాఁటునఁగొని యీ
సంజనిడియెడమయడును ర
సంజనఁగాఁదొడఁగె బఁలుషం బిల్లి వలెన్ 185

క. అవికల నృపతి సతినిఁగన
నవికలమతి పవనతనయుఁడరుగుటకు నిశన్
రవి కల్పింపఁగ నస్తము
న వికటకము మఱుఁగునకు రయంబున నేగెన్ 186

వ. అంతఁధరణియస్త్ర ధరణీధరావతరణంబు సేసిన యనంతరంబ హను
మంతుండు

187

క. మును మాపగుటయు వెల్వడి
మును మాపనిఁజూతు నన్నుమొఱకు లెదిరినన్
మును మాపనె రాకాసుల
మును మాపగ తీరసాలముల(గ్రోతులిటుల్ 188

వ. ఇట్లుంచు యేగుదించి వనచరవల్ల భుండు నల్ల నల్లనంబిల్లివలె నడుగు లిడుచు.

189

మత్తకోకిల :

లంక యుత్తర గోపురంబును లంఘనమ్మొనరించుచో
లంక యత్తఱి నాత్మరూపము లావు చేకొని యార్చి ని
శ్శంక వానరయేల వచ్చితి చంపుదున్నిను నిల్వునాన్
వంక వెట్టుచు వీఁడు నూడఁగ వచ్చితిని యనె నాతఁడున్ 190

వ. అనుటయు లంకాశక్తి కాలనియుక్తమై కాలాగ్ని రౌద్రాకారంబున నిల్చిన
మీరజుతో నిట్లనియె

191

ఉ. ఆఁడది యంచు జూడకుమనా ధృతి నన్ను జయించి కాని యీ
వీడుసొరంగ నీకగునె వీరిడి యంచును జేతనాతనిన్
గాఁడగ న్రాయమేయఁగపి కామినియంచును జంపలేక ము
న్నాడిగ వామముష్టి వదనంబున మొత్తెను రక్తముర్లఁగన్ 192

ఉత్సాహము

దెబ్బఁదినియళంకు లంక తిమురడంగ నాకిఁకన్
జబ్బుకాల మచ్చె బ్రహ్మ శాపదగ్ధ మీపురిన్
నిబ్బరముగఁజొచ్చి సేయు నీపనుల్పమస్తమో
యబ్బ సీత చేత దైత్యుఁగారు డారుమూడుగాన్. 193

తరళము

ఇటులనఁగపిపతి హేలగ లంక జ
యించి చివాలున నెగిరి యొగిన్
జిటికెన గోటను జెండువ వెంబడఁ
జెచ్చెర దుమికి నిశింగనియెన్
రటనము సేయక రాజ గృహమ్ములు
రాణువు లొక్కెడ రావణునిన్
దటుకున మండోదరిఁగని సీతఁగ
దగఁగొని కాంతని తలఁగియటన్. 194

సీ. మేడల నెక్కియు గోడల నక్కియు
మడువుల్ద్రొక్కియు మచ్చులెక్కి
మాటిమాటికిఁజాటుమాటు చోటులకేగి
బోటులగని నిద్రపాటు మీఁద
రంగస్థలంబులు రచ్చ పట్టులు మెట్టి
శృంగాట కమ్ములు తొంగి చూచి
బందు లుండెడి చోట్లు పందలుండెడి చోట్లు
పెందలకడ సందుగొందులరసి
మూలముట్టుగఁగనియె నాఁప్రోలతండు
నిదియది యటంచునొగి వచియింపనేల
బట్టి యనుమఁడు మెట్టని యట్టినేల
లేక్కకును బెత్తెఁడైనను లేదు సుమ్ము 195

గీ. వెతకి వెతకి యతడు వేసారి వేసారు
లరిగి నట్టి చోటి కరిగి యరిగి
బలముగాఁగ గాళ్లు బలపముల్గట్టగా
రాముపత్ని కానరామిఁగదలి 196

వ. హనుమంతుడు తనమనంబున నిట్లని చింతించె నెట్లనిన
197

క. ఆలించి గృధ్రవాక్కుల
నాలించి హితాళి శరధి లంఘించి పురిన్
దూలించి గ్రామదేవత
గాలించితిలంక దేవి కన్పడదెందున్ 198

ఉ. ఏకడగండ్లు వడ్డ సతియించిన యెచ్చెదరేని నేనటుల్
వాకొని పెట్టిపుట్టని యభాగ్యుఁడ నాకెటుమాట దక్కునే
నే కరణిన్ గమింతును గపీశుని పాలికి సీత సేమమున్
శోకము దీర రాజడుగు నోరెటులాడును నాకు, నేమనన్ 199

ఉ. నేనొక పోటు బంటునని నిండు దయన్నను నంతమందిలో
బూనికఁబిల్చి రాముఁడిడి పుణ్యపు ముద్రిక నానవాలుగా
మానిని కిమ్ము నమ్మ సతిమాఱు వచించును నోటినిండ నీ
తో నన నానలేక తగుదున్మఱి తెమ్మనుకొంటినాదుచేన్. 200

ఉ. జానకి జూచు భాగ్యమెటజాలియు జాలని కోతి నేనెటన్
దీనమ్ముగమ్మ నక్కయెట దేవతలోకమెటన్నయట్లుగా
నానఁగబూనఁగర్తలగు నంగద ముఖ్యులు నందఱుండగన్
నే నహమస్మియంటి నడి నెత్తికి నెత్తికొనంగ వెట్టినే. 201

వ. జానకి జాడగాన కిటసాగి వేగిరమ వానరేంద్ర నరేంద్రుల పాలకేగ, నోయీ వాయుపుత్ర సీతంగంటివే యని వారలు నన్నడిగిన నందున కేమందు 202

చ. అగపడలేదు సీతయన నంతటి తోడనె రామలక్ష్మణుల్
వగను ముగించుకొంద్రు కపివర్యుడడంగును వారితోడి పా
టగుదురు వాలిజుండు కపులందఱటౌటకు నేను నన్ను నె
చ్చుగఁజిరజీవిఁజేసె విధి జూడక సాధక బాధకంబులన్ 203

క. ఏమని కొని చని తెల్పుదు
రామునకీయప్రియము చిరంజీవి వలెన్

నేమని చిరజీవిగఁగొఱ
గాములఁగన నేల మూలఘాతని గాఁగన్ 204

గీ. ఓపనిఁక నాకు జానకిఁజూపకున్న
పీకఁబెకలించికొని నాదుతోకఁజుట్టి
యొక్కవంక నమరపురి నొక్కవంక
రక్కసుల లంకఁగొంపోదు రాముకడకు 205

క. అని వగచి నగ చరేశుడు
కనరున నందనుకఁదానుగానని సుమనో
వనమునకునాదిగొని భూ
తనయను నట గాంతు నన్నదైర్యంబొదవన్ 206

ఉ. రాముని లక్ష్మణుందలచి రాముని దేవి భజించి సీతఁబే
రామనిగాముద్విష్ఠరి హరాజుల నింద్రుని జంద్రు సూర్యుఁగా
రామున మారుతాగ్నులకు రాణనెఱంగుచు సిద్ధినిచ్చి యా
రామమునందు వీరు రఘురాముని భామను నాకుఁజూపుతన్ 207

వ. అని యిట్లు హనుమంతుండత్యంత భక్తియుక్తుండై తన యిష్టదేవతను తలచి మ్రొక్కి రావణుని నిష్కుటపుష్పారావహా వరణ వరణంబునకు దటాలునఁగుప్పించి యెగసి యావట తోట గోడపైవ్రాలి 208

ఉ. తటుకున దూకి గోడను శతహ్రదవోలె సమీరసూతి య
చ్చట నొక శింశుపాతరువు శాఖపయి న్వెసనెక్కి దానిక్రిం
దటఁగనె రామరామాయని యార్తిని గూరి యహర్నిశంబును
ద్భుటగతి భర్తఁగూరిచి తపంబొనరించెడు నొక్కయంగనన్ 209

మ. కని తావిన్న సమస్త లక్షణము లక్కాంతాలలామంబునం
దును దార్కాణగఁగ నృడందొలగె నాదుష్కర్మములోడు తో
డన నాకష్టము లెల్లఁదీరె దుదముట్టన్ సీతనామాత నున్
గనుఁగొన్నాఁడను నాదుభాగ్యమునఁబాగా వేసితింగోటలో 210

క. అని యాసతి సీతయ కా
విను హనుమటు శత, సహస్ర, విధములను పప
త్తింగనియు నిశ్చయించుచు
ననువుగ నెటుపలకరింతునని యెంచు తఱిన్ 211

ఉ. వేకువజాము రావణుఁడు వేగమె నిద్దురలేచి మన్మధో
ద్రేకము పట్టజాలక మదించి సురాసుర భోగ కామినుల్
చేకొనికాలదీవియలు లీలఁగ లోలత వెంటనంటి రాఁ
వేకువ లేచి వేగ యరుదెంచెను జానకియున్న చోటికిన్ 212

ఉ. వచ్చి యితా పతివ్రతను వాకొనరాని కఠోర వాక్కులన్
హెచ్చి సురారి సీతనతి హేయముగాఁదనుగూడు మంచనం
బొచ్చెము సేసి సీతయొక పాఁచను జేకొని దానిఁజూచి యో
కుచ్చితుఁడైనదానవుఁడ కూడదురాయిటులాడఁదల్లితోన్ 213

చ. వినుమిటు కండకావరపు వెఱ్ఱిని నోటికి వచ్చినట్లు గూ
సిన నిహముంబరమ్ముఁజెడు సీయనరో పరదార గామినిన్
ఘనతరపాపకాల ఫణికంఠమునంబెన వేసి చుట్టు కొం
చును దెగఁగ్రోలి నీయసులు చూఱఁగ నాయువు శ్రీ గ్ర సించురా 214

ఉ. దీకొనలేక రాముఁబతిదేవత నన్నిట దొంగిలించితే
నీకెటు లొప్పెరా మనసు నిన్గని నందును మండె యప్పులో
కైకవిభుండు నాదుపతి నేరిగజూచి తొమన్నఁజూచి నన్
జేకొని నాదు బుద్ధి నను శీఘ్రమ రామున కిచ్చి పుచ్చు మీ 215

చ. అటులొనరింపవేని విను మాజిని నోజన పుత్రపౌత్రకున్
దటుకున నిన్నుగూల్చి రఘునాధుడు నాదగ భాగధేయమొ
క్కట నను జెందు నెందెవరి కాళుళపైబడి కావుమన్న నే
మిటనయిన న్నినుందవిలి మ్రింగు గుటుక్కున రామబాణముల్ 216

చ. అదియటులుండనిమ్ము దనుజాధమ యేటికి నంతదాఁక ని
న్నదర శపించి యుమ్మితరియారేడు లోపల బూది సేయనే

మదిఁబతి యాజ్ఞ లేదనుచు, మానితి, నారఘువీరు, చేతఁగొ
న్నిదినములందుఁద్రుంగు నినునేఁదునుమంజెయిసేసి కొందునే 217

ఉ. ఇంతకు మున్పతివ్రతలు నెందరొ నిన్ను శపించి వీడి రా
చింతల జీఁకు నీకకట జీవితకాలము హ్రస్వమయ్యెగా
వింతగ జావు దెబ్బఁదిని వేకొన యూపిరితోఁగ్రుశించు దు
ర్జంతువుఁబాము గట్టిఁగొని చంపఁగనేలని నిన్ను వీడితిన్ 218

మ. అని తన్నామె తృణీకరించి తలవాయన్రోతలంబెట్టఁజ
చ్చిన బామ్మై యమరారి కాతఁడలుకం జేబూని ఖడ్గంబు నా
మెను ద్రుంపంజన భార్య యడ్డపడి కామింపంగ మేమున్న బో
మను జాబ్జాక్షిని బ్రాణనాయకయ కామంగోర నీకేటికిన్ 219

గీ. ఆలియన్న మాటలాలించి లాలించి
వాలుఁబూని నట్టి కేలు వ్రాల్చి
పొంగు కోపమెల్ల మ్రింగికొంచెద లోన
లెస్స నాతఁడనియె నుస్సురనుచు 220

శా. పోనీ పాపము మర్త్యకాంత కెటులబ్బు న్దైత్యలోకేశుతో
నానా భోగములంచు సీతకదియందంజేయ నేఁబూన న
ట్లౌనా కుక్కకు నేయి యిందునె యవశ్యం దీని హింసించి
దానావ్యాళులు తిండి రెండు నెలలన్దా నొప్పుకున్నన్ననున్ 221

క. ఇటులని యసురవరుండం
తట నంతిపురమ్మునకుఁజనన్ జానకి క
చ్చుటి రాకాసులు నుడివిరి
కిటికిడి కటువులను నోటికిని వచ్చినటుల్ 222

## పంచచామరము

కరమ్ము దుష్కరమ్ము పంక్తి కంతు చేయిపట్ట
స్థిరము సుమ్ము ప్రాయ మీవు సేరు రావణున్ స్థిరున్

దొరం దొరంగు రాము మర్త్య తోడ గార్య మేమిఁకన్
దిరమ్ము నందరాని పండు నీదు చేతి కబ్బుటన్ 223

చ. అలనరో! హస్తలబ్ధమగు లప్పసుమీ యసురేంద్రుఁడేనిఁగా
దలఁచితి వాని నీకతఁడు దక్కిన జన్మము ధన్యమౌను నీ
కలవడఁడట్టి వాఁడిఁకను నట్టులు రావణుఁగూడవేని పెం
దలకడ నిను జంపి తొల్తంగబళింతుము చల్దికి కూడుకాగనన్ 224

ఉ. రక్కసులిట్లు జానకిని గ్రందుగ గ్రర్లకఠోరవాక్కులన్
బెక్కులు నొక్కి చెప్ప మది భీతిల కిట్లనె సీత వారితో
నెక్కువ తక్కువల్పలుక నేటికి లొఁబడ నిట్టి కూఁటికిన్
గక్కుఱుతుల్విడుండెడమకాలను గూడ స్పృశింప రావణున్ 225

ఉత్సాహ

ఏల కంఠశోష మీకు హృద్గతంబు దెల్పెదన్
బాలలార వినుడు నాతపః ఫలమ్ము సుమ్ము నా
పాలి దైవమమ్మ నాకు బతియు గతియు రాముఁడే
కాల మతని దక్క నన్యుఁగంట జూడ నేవ్వనిన్ 226

క. అని యిటు జనకజ నిక్కము
తన హృదయగతమ్ము ఖండితముగాఁదెలుపన్
దనుజసతు లామెకడకున్
జని వెనుకటి చదువె మఱలఁజదివిరి పెలుచన్ 227

క. అటరక్కసులన్ త్రిజటయు
పటువాణియు వృద్ధలేచి పల్కెనుకలలో
పటుమతి రాముని విజయము
నట రావణునపజయమ్ము కంటిని విను డీ 228

చ. అనవిని రక్కసుల్ త్రిజట యాకల యెట్టిదొ విప్పి చెప్పవే
యన నది చెప్పె రావణుఁడు సానుజ మంత్రి తనూజు సైన్యుడై

మడిసెను రాము చేత నని తూడ్చెను లంకను రామదూత మ
న్నన బ్రతిఁగూడె సీత స్వజనంబు విభీషణుఁడేలె లంకనున్ 229

వ. ఇట్లు కలగంటినని కాపరులగు రక్కసులకు ఁజెప్పి జానకి నూరార్చి త్రిజట
మఱియు నిట్లనియె
230

క. ఇక్కల నిక్కల మయ్యెడు
మ్రొక్కుడు మన సీతపాదముల కింతటు మీ
రెక్కువ తక్కువ లాడినఁ
రక్కఁగు రాఘవుడు గాచఁరాఁడిక మిమ్మున్ 231

క. అపుడారక్కసులుంజడి
చప్పుడుగాకుండ మ్రొక్కి జానకితో మా
తప్పులనెన్నకు చెప్పకు
మక్కామాబావరాగ మాటలు మాపైన్ 232

క. కని యిటురాకాసులు వా
కొని యెవ్వరిదారి వారు గుజగుజ వడుచున్
జని వేకువతఱి గావునఁ
గొని జానకి చుట్టుఁజుట్టు కొని కూర్చుటయున్ 233

క. దానవ వరు దుర్భాషలు
దానవ వనిత లనుపల్కు దారుణవాక్కుల్
వీనులకు సూడినట్టులు
గా నసువులు వీడ సీతగమకించి మదిన్ 234

క. తన జటను జెట్టుకొమ్మకు
నొనరంగా చేసి మెడకు నురివెట్టుకొనన్
జనకజ పయినించెడు తఱి
వనచర పుంగవుఁడు మర్త్య వాక్కులననియెన్ 235

సీ. మహితుండు సురసత్త మాప్తుండు దశరథ
మహిపుఁడ యోధ్య తామహిమ నేలు
నతనికి నల్వు రున్నత భుజుల్సుతు లందుఁ
బ్రథముండు రాముండు ప్రధనఘనుఁడు
జనకు నానతి నేగవనికి నాలగు సీత
యనుజుండు సౌమిత్రి యనుగమింపఁ
బతి దేవతను సీత దితిజేశుఁడు హరింపఁ
బతియుదేవరు డామె, వెదకి కొంచు
మొనసి వచ్చి ఋశ్య మూకమ్ము చెంతను
గ్రీవుతోడను మిత్ర భావమంది
వానియన్నయైన వాలిని దెగటార్చి
యతని రాజ్యమెల్ల నితని కొసగె 236

సీ. కపిపుంగవుండు నయ్యుపకారమునకుఁబ్ర
త్యుపకార మొనరింప నుత్సహించి
యుర్విలో నెందెందు నున్నట్టి వానర
కోటుల నొక్కటఁగూర్చి తెచ్చి
యొక్క మాసంబున నుర్వీ జతావును
గనుగొని రాకున్న గావననుచు
ముందుగాఁ గొందఱు మొనగాండ్లఁ బంపెను
మూడు దిక్కులకును మొనసి పిదప
గట్టిగాఁజెప్పి యొకనెల ఁగడువు పెట్టి
యస్మదాదులఁగొందఱ నరసి కార్య
దక్షులను దక్షిణాశకు లక్ష కపులఁ
బంప నిట సీతఁగంటి నాభాగ్యవశత 237

క. అమ్మారుత తనయుఁడ నే
నమ్మా హనుమంతుఁడందు రందఱు నన్నున్

నమ్మఁడు ముమ్మాటికి నను
నమ్మానవనాథు దూతనని వివరింపన్ 238

శా. ఆమాటన్విని సీత రాము కథయం తాలించి చాలించి వే
ఱేమో దైత్యుల మాయ నమ్మ వశమా యేరైన నిట్లాడిరో
సామాన్యంబని నమ్మలేమె యడియానందధ్యమై యుండు నా
ధీమంతుండగు వాయుసూతి యనె సందేహింప వల్దంచటన్ 239

క. అమ్మా నను నిటు పంపుచు
నమ్మానవవరుఁడు తన కరాంగుళి ముద్రన్
నమ్మకమున కిడెనాచేఁ
గొమ్మా యిదెయిదెయంచతండు కొమ్మకొసంగెన్ 240

చ. క్షితిసుత రామముద్రికను జేతను సీత పరిగ్రహించి స
మ్మతిఁదలపైని నుంచికొని మక్కువ నక్కునఁజేర్చి కండ్ల నం
చితగతిఁగప్పికొంచుఁబతిసేమము వేమఱుఁగ్రుచ్చి గ్రుచ్చి మా
నితమతి దెల్పి కొంచడిగి నెమ్మిని నమ్మెను రాము బంటుగాన్ 241

ఉ. అమ్మహిజాత సీత ప్లవగాధిపుఁగన్గొని పల్కె నెవ్వగల్
గ్రమ్మెడు మోముతో నెవరు గన్నది విన్నది కాదు కాని దే
శమ్మిది లంక యిందుననుఁజాలఁగ రక్కసు లాడుమాటలన్
దమ్ముఁడ వీనులార వినరాని విఁకేటికి విప్పిచెప్పగన్ 242

ఉ. ఏది యెట్టైనను స్సరియ వేటికి రావణు దీనదానవున్
మేదిని గూల్చి నన్గొనుట మేలగు కార్యమటంచు రాముతో
నాదు మఱందితో నుడివి నన్గొని పొమ్మని వాక్సహాయతన్
మోదము గూర్పు మంచుఁబతి ముద్రకు మాఱొసగెన్ శిరోమణిన్ 243

వ. ఆ మాణిక్యము చేతనంది కపి రాజామాత్యుడా మాతతో నేమం బొప్పగ
నేను జెప్పగల దానింజెప్పి సౌమిత్రితో రాముందెచ్చెద నిందుఁగూర్చెద
మిమున్రంజిల్లి యుండమ్మికన్నామీదందయయుంచి నన్ను వడిగాఁబంపమ్మ

ఉ. ఇంకొక విన్నపంబు వినుడేను దధ్విన్శత యోజనాధ్యమున్
గొంకక యెక్కి యూఁకునను గొబ్బున దాటితి నద్దటుండని
శ్శంకను రేయి యెల్ల నిముసంబయినం గనుమూయ కంతటన్
లంకను రోసి యాక్రొతిని లావుగఁ గాంచితి దల్లి నాకిటన్ 245

గీ. ఈ యశోక వనిక నెంతయు ఫలములు
ముంగఁబాఱ బండి ముగ్గియుండు
గానఁదినఁగ నాకు నానతిండొకటన్న
నట్లెసేయుమంచు నామె యనుడు 246

ఉ. సీతకు మ్రొక్కి వాయుజుడు చెచ్చెర నచ్చట వాసి వాసిగా
నాతత దేహుడై నిలిచి యాసురవర్యుని పూల తోఁట సం
జాతరుషన్సమస్త తరుజాతము కూకటివ్రేళ్ళతో వెసన్
పీత భయుండుగాఁబెఱకి వేసితి గాసిల నూఁచముట్టగాన్ 247

ఉ. అంతట నూఱకుండకతఁడచ్చటి సౌధముఁగూలఁ దన్నియున్
బంతము లాడునట్టి వనపాలుర మెత్తగ మొత్తి చంపి మీ
రంతులు మానుడింక రఘు రాముని దాసుఁడ నాంజనేయుఁడన్
మంతనమేల భానుసుతు మంత్రిని సీతఁగనంగ వచ్చితిన్ 248

ఉ. మిక్కిలి రావణాసురుని మించిన దైత్యులు వేవురేనియుం
జక్కగ నాజి నన్నెదుర జాలరనంగ నదేమి లెక్క యీ
ముక్కుడి రావణుండొకడు మోఱకు వీరత నుండ బోరికిన్
దక్కదు, మీకు లంక యమదండన దప్పదు రాజదండమున్ 249

చ. అని హనుమంతుఁడంతఁదన యాగమన స్థితి దెల్పి తోరణం
బున కెగఁబ్రాకి యుండఁగని పూనికఁగొందఱు పోయితేనితో
దనుజవరేణ్య పేరడఁగెఁదావక పుష్పవనంబు నేఁటి తో
వెనుకొని వానరం బొకటి వీఁక హుజాడొనరించె మ్రాకులన్ 250

చ. వనపు లదల్చఁబోయినను వాఁడెఱచుంబడ మొత్తు ఱాలతో
దనుజుల వెక్కిరించుఁదన దాఁపునః

మన మిది యేరి పంపకము యక్కట యెక్కడ దాపరించేనో
యొనరగ సీతయున్న తరువొక్కటిదక్క మధించె నన్నిటిన్ 251

చ. కనికపిఁబట్టఁగల్గు మొనగాండ్రను వేవురి పంపి పట్టుడన్
ఇటఁగడు మీఁదు మిక్కిలి ఘటించుట సిద్ధమటన్న రావణుం
డనుపమ కింకరాహ్వయుల నంపుడు నేన్బది వేల దైత్యులన్
వనచరు బట్టబోయి యనువారలె కూలిరి యాంజనేయుచేన్ 252

ఉ. పోయిన కింకరహ్వయులు పోయిన వారదె పోకమైనటుల్
మాయముగాఁగ వేగ హనుమంతుని చేఁదిని చావుదెబ్బలన్
రాయుచుఁగోతిఁబట్టు మని రావణుఁడంపె మహోగ్ర మూర్తియై
యాయత శస్త్ర జాలుని బ్రహస్తుని పుత్రుని జంబు మాలినిన్ 253

గీ. జంబుమాలి యంతడంబు మీఱఁగనేగి
సైన్యయుతుఁడు గాఁగ జన్యమందుఁ
గారు చిచ్చుపైకిఁగదిసిన మిడుతల
బారు తీరుగాగ ఁబాఱి తీఱె 254

శా. ఆవార్తన్విని పంక్తి కంధరుడు దానత్యంతముంగుంది స
ద్భావు నావకరూపు నక్షుని మహాదక్షున్సుతుంబంపఁగా
తీవిన్వాడని కేగి పావనికి నోడెంద్రెళ్ళి యుద్ధావనిన్
లావౌదుఃఖముఁబెట్టి తండ్రికిని జాలంధల్లికి న్భార్యకున్ 255

క. అక్షుండూఁడిన తోడనె
రక్షోనాయకుఁడు తనయు రావణి నంతన్
వీక్షించి హృదయగతమును
బక్షా పక్షములు మాని పలికెం గలఁకన్ 256

శా. అన్నాపుత్రక మేఘనాథ వినుమీ యస్మత్సుమారామమున్
ఛిన్నాభిన్నము సేసి యొక్క కపి తాఁజెట్లన్ని చీఁకాకుగాఁ
దన్నుంబట్టగ బోవు దైత్య భటుల న్దండించెఁగా నందఱన్
సన్నాహంబున జంబుమాలిననిలోఁజంపెన్ బ్రహస్తాత్మజున్ 257

శా. నీ తమ్ముండతిదక్షుఁ డక్షుఁడడఁగె న్డీశాలి కీశాధ్యుచే
భీతింజెందఁడొకించుకేని కపికంపింపండు నాబోట్లకున్
ఖ్యాతింగోతిగ నెంచఁబోక తడవధ్య శ్రేష్టుడై తోచెడిన్
భ్రాతిన్నీతరమౌనె వానిని జయింపంగా నెటుల్పట్టెదో 258

ఉ. ఆకృతి జూడ వాడుకపియౌ ననిలో లయకాలరుద్రుఁడే
నీకెద తాలినం జనుము నిక్కము జంకిన వానిపైకిఁబో
బోకు మహేంద్రుఁడాదిగను బోరనినున్గని పాఱిపోవ నీ
దాక జయంబెకాని వితథత్వ మెఱుంగవు యెన్నఁడేనియున్ 259

చ. అనుటయు మేఘనాథుఁడనె నబ్బకు నాయనవిన్మ నాకు నీ
వనచరమేమి లెక్క మును వాసవముఖ్యుల గెల్చినట్టి నా
కునుమల మ్రింగు మారికిని గుల్పగ దల్పొక యప్పుడంబొకో
యనుగతి కోతి యెంతటిది యచ్చెరు వొప్పగ బట్టితెచ్చెదన్ 260

చ. అని తనతండ్రితో నటుల నాడి ససైన్యుఁడు మేఘనాదుఁడ
త్యనుపమ శూరుడై కదలి యంతటరా సభయుక్త మానముం
గొనకొని యెక్కిపోయి యలకోతిని బట్టెదనంచు నెంచి వా
నిని గఱకంఠుకంటి కరణిం బురుణించెడు తూపులేయగన్ 261

క. వానరునకాశరములు
సూనములట్లించుకేని జుఱకయిడమి నా
దానవుఁడెద లోఁదమపని
నానాఁటికిఁదీసికట్టునకు వచ్చెననెన్ 262

వ. అని మఱియు నా మర్కట వీరుని గుఱించి తర్కించి తన పౌరుషంబు చాలమికి మిగుల నెగులుచు రావణి యిక కీర్తిప్రతిష్టలు రావని యిట్లని వితర్కించె

263

చ. కపిని జయింప నాతరము గాఁదిక దొల్లి టినాదులావు నేఁ
డపహతమయ్యె శస్త్రబల మారడి వోయడిఁగాలవైపరీ

త్యపుగధగాగఁదోచు నరయంగతకాలమెమేలు, వచ్చు కా
లపు గతికంటె నాశరబలం బిఁకనేల చెలంగు మున్వలెన్ 264

చ. అనిదనుజేంద్ర నందనుఁడ జాస్త్రము తానరివోసి యేసినన్
వనచరవర్య మేనికది వంత యొనర్పమి మేఘనాదు డీ
వనజ భవాస్త్రమే యిటులు వమ్మయిపోయిన నస్త్రశస్త్రముల్
గొనకొని వేఱెయేమి పొసగున్నర వానర కోటిపైకిఁకన్. 265

వ. మారుతి కీబ్రహ్మాస్త్రంబునఁజీమకుట్టిన పాటియుగాకుంటకు గతంబు
వినుము 266

చ. హనుమయ చిన్ననాడొకట నాడుచు దూర్పునభాను బింబమున్
గనుఁగొనిపండటంచుఁదమకంపడి బింబము మ్రింగ బోసుధా
శనపతి యడ్డమేగి వెలుచన్ బెదరించిన వానరుండు భా
నునివిడి యింద్రుమ్రింగను గనుంగొన వాసవుడాగ్రహంబునన్ 267

చ. కని విదళింపనంత శతకోటిని కోరదెగన్ జివాలునన్
బనుపడినేలపై నతడు బాలుఁడు గూలుడు సొమ్మసిల్లుచున్
గనియనిటండు నచ్చటికిగ్రక్కున జేరి మనోవ్యథం బడెన్
దనయుని నన్యులట్లు డవ దండ్రి జగంబున నూరకుండునే 268

చ. హనుమఁడలుంచు బిల్వఁబడె నాకపి చంద్రుడు నాటినుండి తా
ననిలుడు కోపయుక్తుఁడయి యాత్మజుఁగొంచు గుహ ప్రవిష్టుడా
టను విధిముఖ్యులందఱొకటంజని వాయువుగాంచి యోయినీ
తనయుఁడవధ్యుఁడయ్యెడు వృథా కృధయేటికి నస్త్ర శస్త్రముల్
చెనకవు వానినేమిట గ్రసించగ లేవతనిన్నమీరణా 269

వ. అని యిట్లు వరంబు లిచ్చి బ్రహ్మాదులు వచ్చినదారిఁ బట్టి చెచ్చెర
నరిగిరంత. 270

ఉ. దాననజాస్త్ర మించుక వెతందగఁజేయమి మేఘనాధుఁడ
వ్వానర ధుర్యుఁగొంచు నతివాదము సేయక తండ్రిపాలిక

చ్చో నసురేంద్ర పుష్పవని చూఱ యొనర్చిన వానరాధమున్
ధీనిధి పట్టి తెచ్చితినిదే తగుబుద్ధులు చెప్పిపంపుడీ 271

చ. అనుటయు రావణాసురుడునావనాత్మజుఁగోఱ చూపునన్
గనుగొని దీఁటి మీసముజగంబున నెట్టేఁడు నాదు నామముం
గొని వినినంతనే యవియు గుండెలు బ్రద్దలుగాఁగ నట్టిచో
వననిధి యెట్లు దాటి యెటు వచ్చితి వీపురికోరి వానరా 272

ఉ. వచ్చిన వాఁడవీవిటకు వచ్చిన దారిని బట్టిపోక బల్
ముచ్చట వచ్చు నావనము మూర్ఖుఁడవై పెకలింప నేటికిన్
దచ్చెనలాడు కొంచచటి దానవవీరుల జంపనేటికిన్
జెచ్చెర నున్న వాస్తవము జెప్పుము వీడుదు జంపకుండ నిన్ 273

ఉ. ప్రాణము నీకుఁదీపయిన బల్కుము సత్యము నట్లులైనచో
రాణను వీడువాఁడ నిను బ్రాణముతోడ నిజంబు వల్కితిన్
రోణపులందు రావణుఁడు శూరతముండని నీవెఱుంగవే
పోణిమి భీతిఁజెందకిటు బొంకక తెల్పుము వానరాధమా 274

క. అనవిని హనుమంతుఁడు తన
మనమున రావణుని నొక్క మశకము గాఁగన్
గొని కన్బొమ లెగియించుచు
ననియెను జిఱునగవు సెలవులందున వెడలన్ 275

చ. దనుజుట యొక్కమాట వినుతథ్యము పథ్యము నీకుచెప్పెదన్
వననిధి దాటి వచ్చితిని వాలిని జంపిన రాముభార్యకై
నినుగన వేడ్కపుట్టి యటు నీవనమెల్లను బెల్లగించితిన్
దనుజులు నన్నుఢీకొనినఁదాకి వధించితి దేహరక్షకై 276

ఉ. చౌర్యగతిన్ దురాత్ముఁడవు జానకిఁదెచ్చితి వీవు లంకకున్
శౌర్యము లేమి రామునకు జానకి నిచ్చిన నీకు మేలగున్
గార్యమెఱుంగు మింక నటుగా నొనరింపక తక్కితేని దు
ష్కార్యము పొంటెంద్రుంగెదవు రాఘవుచేత సభాంధవుండవై 277

ఉ. నీ వశమందు నున్న ధరణీసుత నీకు నకాల మృత్యువే
రావణయేరిఁగాగను ధరాసుత నెంచెదొ చేతులారగా
నీవిట దెచ్చికొన్న యశముంగతి నెంచుము కాలపాశ మా
దేవియెనీకు నమ్మిమిది తెల్పెద దథ్యము వేయునేటికిన్ 278

చ. అనవిని రావణుండు కడు నాగ్రహమెత్తి కపిన్వధింపగా
ననుచరకోటి కాజ్ఞయిడ నప్డు విభీషణుఁడన్న దూతనిన్
జనునె వధింప నిట్టిపని శాస్త్ర విరుద్ధము దూతకెందునుం
బనుపడఁగా విరూపకరణం బటు సేయగఁబంపు నావుడున్ 279

చ. వికటదశాననుండనియె వేగమె యీకపి తోఁక గాల్చి నా
రక విడువుండటం చనఁగ రాత్రి చరుల్విని యాంజనేయు తో
కకు వడిఁజుట్టి బట్టలను గట్టిగ నూనెను ముంచి యగ్గిమో
అకులు రగిల్చి కోతి గడుఅూగ తనంబున లంకలో విడన్ 280

మత్తకోకిల
వీధివీధికి దూకి వానర వీరుఁడింటికి నింటికిన్
వేధసేయ రగిల్చి నిప్పును వేగగాలిచె నాతఁడా
సౌధరాజము లెల్ల మాఁడిచెఁజప్పగాఁబురినంతటన్
బాధనొందుచు మొత్తువెట్టిరి బాల వృద్ధులు లోనుగన్ 281

వ. హనుమంతుండు తనవాలమ్మున జ్వాలాభీలమ్ముగ నుండి మండు కీలికీలాలికిని నాఁకలిదీఱ నాహుతియిడ నిదియె యదననుకొని లంకయెల్ల ద్రిమ్మరి మేడలు మాడిచిన తెఱంగెట్లనిన 282

సీ. దశకంధరుని మేడ దగ్ధంబు గావించె
గుంభకర్ణుని కొంపగుముల గాల్చె
మేఘనాధుని యొక్క మేడ పాడొనరించె
మకరాజు సదనంబు మంట గల్పెఁ
గుంభుని టిల్లును నిఖుంభుని యిల్లును
వజ్రదంష్ట్రుని యిల్లు వహ్నికిచ్చె

నింకపేరు గలట్టి యెల్ల దైత్యుల యిండ్లు
రగిలింపగగ్ని మర్కటు వరునకు
నెసగి రక్కసు లిరుచేతు లెత్తి మ్రొక్కి
రంత నాబాలగోపాల మసురు లడలి
యింట వస్తువులను దీయ నెడము లేక
యాల గొల్బాల గోలయ్యె నపుడు లంక 283

క. ఎఱగలి తఱుఁగక పరఁగుచు
దరిగొకి యెరియంగఁగొనఁదప్పించికొనన్
వెఱవించుకయును గానక
యెరసెడి మృగపక్షులట్లు మొరసిరి యసురల్ 284

ఉ. అట్టులు లంకఁగాల్చివడి నాత్మనుజింతిలెనాంజనేయుఁడే
పట్టున నామెసేమము నభాగ్యుఁడనై పరికింపనైతి నే
నెట్టులు పోయి రామునకు నేమని చెపుదు సీత పోకడన్
గట్టిఁడి బ్రహ్మనాతలను గట్టిగ వ్రాసి నిటుల్పడింబడన్ 285

చ. అటులతఁడాత్మలో వగపునందెడు వేళను నింగిఁజారణుల్
బటుమతి నాడిపోయిరటు పావని లంకను గాల్చువేళ నెం
తటి ఘనుఁడోధరాసుతకుఁనాసెగ నించుక దాఁక నీయకా
దటఁబురినెల్లఁగాల్చినిట ధన్యులమైతిమి సీతఁద్రుందమిన్ 286

మ. అని సిద్ధుల్ శ్రుతి సౌఖ్యవార్తలనగా నాలించి మేలంచు నా
వన చార్యగ్రణి కన్నులార సతిదేవింగాంచి నేనేగదన్
జననాథాగ్రణి రాముఁడేమడిగినన్ జక్కంగ వక్కాణమే
నొనరింపంగల నంచశోకవనికి న్యోషామణిం జూడగన్ 287

మ. హనుమంతుండొక యూకునంజనియె నాహా వేగమొప్పారగన్
జని యాసీతకు మ్రొక్కి యంజలిని శీర్షంబందుఁగీలించి యో

జననీ నేనిపుడేగి కాల్చితిని బుష్పావాసమాక్రీడ మున్
దనుజానీకము దాఁకనన్నసురుల న్దాత్రిబడం గూల్చితిన్ 288

మ. దనుజేంద్రుంగని బుద్ధిసెప్పి పురము న్దగ్ధంబు గావించితిన్
మనువంశాగ్రణి రాములక్ష్మణుని సేమంబొప్పఁదేఁబోయెదన్
దనుజేంద్రున్సుతాప్తు గూల్చి యనిలోఁదథ్యంబుగా మిమ్ముఁగై
కొనురాముండిఁక నూరడిల్లుఁడిట బాగుగోరుచు నెమ్మదిన్
నను మున్మాటికి నమ్ముఁమమ్మ మదిలోనం బోయినే వచ్చెదన్ 289

వ. అని యనంతరంబు 290

ఉ. పావని యామె వీడుకొని పక్కన వారిధిఁజొకళించి తా
నావలి తీరముందరియ నంగద జాంబవదాది యోధవుల్
తీవిని నాంజనేయుని వడింగని కౌఁగిట జైర్చి యాతనిన్
దేవికి సేమమేయన విదేహజ సేమముజెప్పె నాతఁడున్ 291

ఉ. మీరలు సూచుచుండగనె మీదయ వారిధి దాటి లంకకున్
జేరి నిశీదినింబురముఁజెచ్చెరఁజొచ్చితి రోసి లెల్లడన్
చీరములో నశోకవని వేగమున్జని సీతగాంచి నే
నారసి రామముద్రికను నామెకొసంగి నమ్మనట్లుగన్ 292

ఉ. ఆమె యొసంగు మాఱు మణి నంది సతీమణి వీడి దైత్యు నా
రామము గూల్చి నాపయికి రాత్రి చరుల్బహు సంఖ్య రాగవే
నోముచు నామరూపముల నెంచక ద్రుంచితి లంకఁగాల్చితిన్
నామము సాటి దైత్యుఁగొని నాతిని గూరిచి బుద్ధి సెప్పితిన్ 293

చ. ఇటకరుదెంచు వేళ జనయిత్రిని సీతను జూచి కన్నులన్
దటుకున నుప్పు సంద్రమును దద్దయుఁదద్దయ దాటి ధాటిగాఁ
బటుగతి వేగ మీకడకు వచ్చితి మీరలు పాఱఁజూచి యి
ప్పటికిఁక నేమియైన దిగఁబడ్డది యుండిన జెప్పుడీయనన్ 294

వ. అనుటయు నంగదుండిట్లనియె 295

చ. సరవి న్వచ్చిన కార్యమెల్ల మనకుం జక్కం బడెన్ జానకీ
చరణాంభోజము గంటి మింతటియు నాసన్లేచి కిష్కింధకున్
సరగం బోదము రాముపాలికనగా సంజాత సమ్మోదు లై
వారవాప్పం ఖగలేక పాతగతి తీవిన్వార లొకుమ్మడిన్ 296

చ. వలీముఖ వీరు లిట్టులని వార్య గతింబడదూకి నింగికిన్
గిలకిల లాడి కొంచు దివిఁగ్రిక్కిరియంగడుఁగమ్మి పోవుచో
బలముగ క్షుత్త్వ షానలను భాదితులై యట మార్గ మధ్యమం
దలవడ భానుసూనుని మహావని గాంచిరి సంతసంబునన్ 297

చ. పృథుతరసాల శోభి యళిపేశల ఝుంకృతిగాన సూనమున్
మధురస సంభృతంబు ఫలమండల మండితమర్కసూతి స
న్మధువన మెట్టిగాంచి దిగి ద్రూకులకున్వడిఁబ్రాకి రందఱున్
బృథులరసాల పక్వములు పండ్లను గండ్లను గాంచి కాంక్షలన్ 298

ఉ. అంగదు నానతింబడసి యాకపులెల్లరు గొల్ల గొల్లగా
ముంగలఁదేనె ద్రావి యతిమోహితులై కడుమత్తులై వడిన్
వెంగళు లట్టు లాడఁగపి వీరుని మామ వనాధిపాలుఁడీ
సంగతి మీకనర్హమని సారెకుఁగీశుల మందలించుడున్ 299

వ. రాజగు సుగ్రీవునితోఁజెప్పెదనన్న యువరాజైన యంగదుండంగదగొని యదలించి వనపాలాగ్రణి యగు దధిముఖున కిట్లనియె 300

ఉ. నిబ్బర మొప్పఁదేనియల నేసెలివిచ్చినఁగ్రోలిరీ కపుల్
సిబ్బితి లేక నాకెదురు సెప్పఁగ లాఁడవే యందుఁ జూడఁగా
దెబ్బకు నొక్క నొక్కనిగఁదెంచెద నాకెదురాడువారి నీ
యబ్బకుఁజెప్పి కొమ్మనుచు నంగదుఁడాదధి వక్త్రు మొత్తుడున్ 301

క. దవ్వున నా దధి వక్త్రుం
డవ్వానిఁదిని చావు దెబ్బ లంగదు చేతన్

రివ్వున జని సుగ్రీవున
కవ్విధి యంతయును దెల్పి యతడిట్లనియెన్ 302

మ. ప్రకటంబైన భవద్వనంబనఘ నాప్రాణంబు లొక్కొత్తు వా
డికఁగన్గొంచును గడ్డగడ్డమును బుట్టెందాని నీరంబులన్
దక పేరామని కట్టగంటు వడకుండన్ బెంచియిందాక చూ
డక మీయంగదు డాగడంబుగను వీటంబుచ్చెనేడవ్వనిన్ 303

మ. హనుమ జ్జాంబవదాదులైన ప్లవగాధ్యక్షుల్ వడిన్ వచ్చిమీ
వనముంజొచ్చి యధేచ్ఛగా మధువు ద్రావన్ బొలునే వల్దనన్
వినగా మాటల మ్రాకులం బేటికి నన్వేధించి తారేయుఁడున్
జన నీయబ్బకు జెప్పి కొమ్మనుచు నన్జాడించి వీడెన్ గడున్ 304

శా. ఆ మాటల్విని భానుసూనుఁడనియెన్ హాళిన్ హనూమన్ముఖుల్
హేమాహేములు కొల్వ సాధకులు వారే యేపనుల్సేసినన్
మోమోడున్గద నాకు నేమియన నామోదించితిన్ దత్కృతిన్
సేమం బేము వినంగ గోరితిమి వాసిన్ వారిని పంపుమాయనన్ 305

చ. అనుటయు నాతడేగెవడి నప్పుడు లక్ష్మణుడర్కసూనుతో
వనపుడిదేల వచ్చెన నభానుజుడప్పుడు వాని కిట్లనెన్
మనుజప దక్షిణంబునకు మానుగనేగిన మర్కటాధిపుల్
వనమును బాడు చేసిరని వార్తను జెప్పగ వచ్చి నాడనెన్ 306

మ. హనుమంతుండెటకేగిన న్సకాల కార్యంబుల్ వడిన్ సిద్ధియౌ
ననుమానం బొకయించుకేనియును లేదాతండె లంకాపురం
బునకుం బోయి ధరాసుతంగని మహామోదంబుతో రాముడు
ద్రను నాదేవి కొసంగి యామెకడ రత్నంబందుఁదామారుగన్ 307

చ. అని యిటులాడు చుండఁగనె యంగద ముఖ్యులు దక్షిణాశకే
గినకపి వీరులార్భటులఁగెవ్వున కేకలు వేసికొంచును
జనివిని రామలక్ష్మణుల పాదములంబడి వానరాధిపుల్
వనజవరాప్త సూనునక వారణ చెప్పిరి సీత సేమమున్ 308

వ. అంత రఘునందనుడు పవననందనుఁగనుంగొని మనఃప్రియంబుగా నిట్లనియె 309

మ. పనియేమాయెనొ మీరలేగినది తాఁబండయ్యెనో కాయ యా
యెనొ రమ్మిందు వచింపుమన్న హనుమండెంతేని సంతోషి యై
జననాథాగ్రణి కంటి జానకిని గార్శ్యంబందు సాధ్వీమణిన్
మునివృత్తిన్ వనమందశోక ద్రుమ హా మూలంబునందుండగన్ 310

ఉ. మారుతి చేరి వేగమునమస్కృతి పూర్వము రాముగాంచి మీ
మారుతి దీక్షనూని తమమానిని రాఘవరామయంచు వే
మారు తిరంబు మీ స్మరణ మానక తానొక చోన దైత్య భా
మారుతి ఘోర తీక్ష్ణమగు మాటల కోర్వక వేగలంకలోన్ 311

క. ఆ రామరామ యంచును
గారవమున నోరుకాయగాయ నెపుడు లం
కా రామమునఁగ్రసించెడి
నారామయుఁబ్రతి పదధ్యయను విద్యవలెన్ 312

సీ. అఘువంశ దవమని రఘువంశధవకీర్తి
నమ్ము సేసితి, సతి నమ్ము ననుచు,
ననుచు హెచ్చరికతోఁగనుచు హెచ్చుగ నన్ను
నన్నులు మిన్నదా ననియె నచ్చి
నచ్చింత లేకుండదన చ్చింత దిగద్రావి
యేకత మీవురా నేకతమని
తన నిజస్థితి యంత, మనుజోక్తి నినంత
బల్కు బల్కు, నికరమొల్కు నామె
నామెతగ నామె, తగనుంగ్ర మంది చేతఁ
జేతనము నందు సముదీర్ణ భీతి వీడి
బొందియటుఁబొందిటగ నన్ను బొందగ నేపుడు
పుడికె వరమణి తలనుండి పుణికి రమణి 313

చ. తమ దేవింబొడగంటి రామ యొక చెంతన్లంకలో శింశుపా
ద్రుమ మూలంబునఁగూరుచుండి తనపై ద్రోహంబెదో, డొర్లిన
ట్లు మితాఘంబొనరించినట్లు మదిలో హారామ(శ్రీరామ యం
చమర న్మిమ్ము నెనంస్మరించుచును గాఢార్తింబడ న్వింతగన్ 314

ఉ. రావణునివ్వధించి రఘురాముడు నన్ గొని పోవునట్లుగాఁ
బావని, చెప్పుమంచు సతిపల్కె విషాల్పడి యేమి సెప్పుదున్
గావలుడా దశననుడు గన్నులఁగానఁడు క్రిందు మీఁదునున్
హా వడి నేమిసేయునొ మహాపద దేవికి నాతఁడెంతయున్ 315

చ. అనవిని రాఘవుండు పవనాత్మజుఁగన్గొని యాంజనేయ నా
మనము నలంత వాయ ననుమానము తీరఁగ సీత సేమమున్
గనుగొని వచ్చి తెల్పితుపకారికిఁ బ్రత్యుపకారమేమి నీ
కొనరుతునంచు నావనచరోత్తముఁ జేరిచె నిండు కౌగిటన్ 316

వ. అంత శ్రీరామ చంద్రుండు వానరేంద్రుండగు సుగ్రీవు నవలోకించి యిట్లనియె
317

మ. పవమానాత్మజుఁడర్కజా మనకు నాపద్బాంధవుండియ్యెడన్
స్తవనీయంబు మహోపకారము ప్రయాసంబోయి యాదేవికై
యవుగాముల్గని వచ్చి సందియము వాయం జెప్ప నేమిచ్చినన్
లవలేశంబు ఋణంబుదీఱునొకొ నిర్లక్ష్యంబుగా వైరిపై
కి వడింబోవఁగ నర్హమైనవల సత్కృత్యంబు సేయింపుమీ 318

చ. అఱమఱలేక రాముఁడటులానతి యీయఁగ భానుసూతి చూ
పఱకు వినోద మౌనటులు వల్లెయటంచతఁడేమి చెప్పెనో
బిఱబిఱ బారులైకపులు బీరములాడుచుఁగన్నుమూసి కన్
దెఱచెడు నంతలో బయలుదేఱిరి రాముని పాలికోలిగన్ 319

మ. కపిసైన్యంబులు దైన్యతందనకడం గట్టాయితంబౌచురాఁ
గృపతో రాముఁడు భానుసూతిగని యోకీశేంద్ర నీసేనలన్

విపులాంభోనిధి తీరముందరి గావింపందగు న్వేగమే
చపలాత్ముండగు దానవాధము వధించంబోవు పైనంబు మైన్ 320

చ. నుడివిన రామవాక్యమటు నోటును వెల్వడి రామున్నె బల్
వడి రవిసూతి వల్లెయన వానర సేనలు నొక్క పెట్టునన్
విడి కపిరాజు ప్రోలు దధివేలకు గోల లొనర్చి కాంచు సం
దడి దరిసెన్ రఘూద్వహులు తద్గతి కచ్చెరు వంది కన్గొనన్ 321

చ. అటుచను కేశసేనగని యర్కకులాధిపుఁడర్కసూతి తోఁ
బటుగతి నిట్లనెన్సఖుఁడ పౌజుల నౌజుల గొంచు నీలుఁడి
చ్చటను దపాన భూములు విషప్రతి పక్ష విదూషితంబ సం
కటములు గాకయుండ మునుగాఁపొనరింపగ నేగఁగాదగున్ 322

వ. అని మఱియు నిట్లనియె 323

ఉ. నీలుఁడు ముందటంజనఁగ నిల్చిన సేన మదంతి కంబునన్
హాలిఁజనందగున్మముల నన్నను దమ్ముని నాంజనేయుఁడున్
దూలక యంగదుండు గొని తోడ్కొని పోవలయున్జవంబునన్
లీలగ వాహనమ్ములవలెంజెలినావుడు నట్లే సేయుడున్ 324

ఉ. అంజనసూను,డంగదుడు నర్కజునాజ్ఞను రాములక్ష్మణున్
బ్రాంజలులై నిజాంసశిఖరాగ్రములందు వహించి మించుచున్
సంజనితప్రహర్ష జవసత్వములంది నిమేషమాత్రలో
నం జనిరెల్లరంగడచి నచ్చిన బంట్లయి వార్ధివేలకున్ 325

వ. ఇట్లు సుగ్రీవుండు సానుజ సుగ్రీవవానరసైన్యుండై లవణోదధి యుత్తర తీరంబున విడిసియుండ నావలి యొడ్డున లంకలోన శంకరవర దుర్విదగ్ధుండైన దశకంధ రుండు పేరోలగంబున దండి తారాతి మండలు డైయుండ ప్రహస్తాది దండనాయకులును నాగాయుత ప్రాణులై బహిఃప్రాణవములనదగిన యమాత్యులును మ్రోల గూర్చుండి వినీతిని సీతను వీడి యామెపతియగు రామునకిడుమని సహేతుకంబుగా నుడివిన నానుడులెల్ల దశవదనుండు పెడచెవినిడి యిఁక మీఁరనెవండేని నామఁ

నొడివిన వినను సరేకదాబెడిదంబగునదిదంబు వెఱికి యుఱికి తలనరికెద
నని బెదరించినవారలెద్దియుంజెప్పనేరకయామోఱకునకూరకచెప్పి యప్పగిది
ముప్పును దెచ్చి కోనేల డబ్బిచ్చి తద్దినము గొని తెచ్చుకొనిన యట్లతనితో
నేలయని బుద్ధి బుద్ధి యని నోరఁజెయి చేరిచికొని యూరకున్నంత
వినయంభూషణుండగు విభీషణుండు నయంభోదనవముల విన్నగ
నన్నకుఁగొండొక తఱవి చెప్పిన నొప్పుకొనుఁదప్పొప్పరయక తప్పేని తప్పక
తఁడు ముప్పు జెందునని తమ్ముండెన్ని తేఱంగుల మంచి చెప్పినఁ జప్పరించి
దెప్పరంబుగనొప్పకున్న నన్నకు ఇంకొకసారి మంచి వినుపించు వాడై యిట్లనియె
326

ఉ. మేలయంగఁజెప్పెదను మేకొని చేకొను నాదు విన్నప
మ్మేలరయన్న సీతమనయింటను రామునకామెనిచ్చి మ
మ్మేలర యంచు మంచిని వచింప విభీషణుఁడన్న యొప్పకా
యేలరయట్లు నాకని విహీనుఁడు దమ్ముని దాఁచె నీచతన్ 327

వ. అప్పుడు కొందఱు మంత్రులు మెప్పులు సెప్పు వారలై రావణున కిట్లనిరి
328

చ. మెకముల ఱేని యట్లరిగి మించి హరించితివీవు సీత వా
సికి నటులేమి సేసితివా సేసితి నన్న సెబాసుగాక యా
వికట మనోవ్యథంబడుట వీరిడి ధోరణి గాదె నాథ హా
మికఁదలఱాయి చేసికొని మేన దృశన్విడకుండు మెన్నిటన్ 329

వ. అట్లుమంతురులు తనకు వ్యతిరేకంబుగాఁ బలుకుటయు విభీషణుడు
రోషభీషణంబులతో దానట నుండఁదగదని రాముపాలికిఁబోవం దలంచి
330

ఉ. తాచిన లేచి మంతురులు తానువిభీషణుఁడన్న బాసి యెం
తాచిన నాఁగ లేగి వినయమ్మున రాముని గాంచి పేద మున్
దాచిన బొక్కసంబుగని తారి నటు ల్చరణంచు నట్లుగా
దాచిన తమ్ముఁడీతఁడభియాతికి నాకభయంబిడుండు నాన్ 331

వ. దానవుని దీనవాక్కులు ధశరథియగు దాశరథి యోచించి యార్తజన

శరణ్యుండుగావున రిపుసోదరు నాదరించి యుపలాలించి 332

ఉ. మన్ననసేసి కాతు ననుమానము మాను విభీషణుండ యే
మన్న నజేయు రావణుని నారిపి చేయదు నిన్నధీశు ర
మ్మన్న, నఖండభక్తి నతఁడాతని యంఘ్రులపైఁబడంగ రా
మన్న నరాశి కిచ్చె నభయమ్ముభయ మ్మిహముంబరమ్మునన్ 333

ఉ. ఆలినిఁదాఁజెఱంగొనుచు నగ్రజుఁడిల్వెడలించి నేపథ
న్వాలిని బంటునంచు దపనాత్మజుఁడాడిన రాముఁడోమియ
వ్వాలిని గూల్చి తప్పదపి వానికి నిచ్చె విభీషణుండు నున్
వాలి నిజాగ్రజాతుఁడడవిన్ శరణన్నగుగాచెఁదప్పకో 334

ఉ. దాశరథీశుఁడట్లతని దగ్గఱదీయ విభీషణుండు వే
దాశరథీశ నా కితరమగ్రజు నొంపుటకంటెఁ బూన రా
దా శరధీశుఁగట్టె నిజదాపనికీ తడవేల వేలగా
దా శరధీశరారులనయంబున లోఁబడఁజేయ నావుడున్ 335

వ. అనవిని యినవంశోత్తముండుత్తమోపాయంబునవిరోధిని నిరోధింప వెరవగు
తెరువరయఁగోరి సుగుణమణిగణ భూషణుండును ద్వేషి భీషణుండు నగు
విభీషణుని నిట్లని మందలించె నెట్లనిన 336

చ. దనుజుల వర్తనమ్ము పురితత్వము రావణుశక్తి యుక్తులున్
దనుజుల వృద్ధి బుద్ధి బలదర్పము మంత్రుల నేర్పు నోర్పునం
దనుజుల వర్తనమ్ము వినయమ్ము నయమ్మును జేయు చేష్టలే
దనుజులువైన మార్గమున దాఁచక లోఁచక తెల్పు మీ యనన్ 337

వ. విని విభీషణుండిట్లని భాషించె 338

చ. దశవదనుండు దుర్మదుఁడు దామసుడున్ బహుపాపపూరు దుర్
దశ పీదశన్ శయించుఁబెదతమ్ముఁడధర్ముడు కుంభకర్ణు డా

దశవద నాత్మజుండు వరదర్పితుఁడర్పిత శస్త్ర శాస్త్ర స
ద్దశవద చక్రవర్తి బహుదక్షుఁడు నంతటి చెయ్యి లేఁడెటన్ 339

ఉ. లంకకు మూలకంద మతి లాఘవు డింద్రజితుండు దుష్టుడున్
లంకకుకూల మింద్రుని కిలావగు శత్రువు పెద్ద మంత్రియా
లంకవినాశకుండు నలలాతుల హేతులభంజకుండుపో
లంకకుతార మారయబ్రహస్తుడు నిస్తులు లంకకాడిటన్ 340

ఉ. దక్షులు రాక్షసాధిపులు దారులు ధీరులు కోటి కోట్లు ధూ
మ్రాక్ష నికుంభకుంభులు సురాంత నరాంతక పారణు ల్విరూ
పాక్ష శుకాతికాయ మకరాక్ష విజిహ్మ సుమాలి మాలి యూ
పాక్షులు జంబుమాలియు సపావులకంపన ముఖ్యులప్పురిన్ 341

ఉ. ఇందరు నొక్క యెత్తరయ నింద్రజితుండొకయెత్తు వానితో
నిందరు నాజి మార్కొనఁగ నేమనినన్ బదునాలుగేండ్లు వా
యిందరుణీ సుఖంబు నిదురెంతయు దాంతిని గట్టిపెట్టినే
నిం దరుమంగలండతని నేరఁడెవండి తరుండు మార్కొనన్ 342

చ. రజని చరేంద్రు మాటవిని రాముఁడు చింతిలఁదమ్ముఁడట్టి లే
రజ నియతుండు గాదె కనుఁడా శరపాలమునా శరాగ్నిఁబో
రజ నితకోప వహ్నిని గరంచెద నీపదునాలుగేండ్లు నీ
రజ నిభనేత్ర భుక్తి నిదురల్ సతి సౌఖ్యమెఱుంగ నావుడున్ 343

క. అనుజుని మాటకు రఘువరుఁ
డనుజునిఁగని సంతసమున నటులేనిఁక వి
న్మనుజుని బెడ దనుజు దశా
నను జంపుట నాదు పాలునకు బెట్టుమనెన్ 344

వ. అంత విభీషణ సుగ్రీవులు జ్వలిత భూషణగ్రీవులై రామ భూభుజునకు గుడియెడమ భుజముల వడువునఁగెడ తో డు నీడవై వీడక కపి దడములు తడవు లేకుండ జడనిధి పైన నడిచి కెంకులేక యకలంకమతి లంకపై విడియ వెరవరయుచు సేతు బంధనమ్ము కరమ్ము క్షేమంకరమ్మని స్థిరంబొనరించకొని

వృథాధ్యవసాయులై సముద్రుం గూర్చి తనకు మార్గమిమ్మని ప్రార్థింప దర్భశయనుడై యున్న శ్రీరాముంగని నతి పూర్వకంబుగా నానతిగైకొని లంకపైకి లగ్గలు పట్టెడని దగు తెఱఁగు ప్లవగ యూథనాథులకు సాధక బోధకంబులు బోధించి సముద్రోపదిష్ట మార్గంబున నలుని సేతు బంధనమునకు నియోగించిన

345

సీ. బలి ముఖబలము ప్రబలి నఖముఖములఁ
బలు శైలములు పలములను దెచ్చి
యలవిగానివి యన్ని యలబలంబులు మోసి
కొని వచ్చియు దధిలోఁగ్రోల వేయ
నలుడందుకొని చేతఁజులువుగా సేతువు
వరుసగా వారిధి బెరసి కట్టెఁ
బది యోజనంబుల పరపును శతయోజ
నమ్ముల పొడవు కాల్నడ యొనర్చి
సంతరించిన ఁగపులెల్ల సంతరించి
సేతువున కెక్కి నడచిరి క్షేమగతిని
నలుని పనితనమునకును నవిన బంధు
కుల నృపాలుఁడు మదిలోన నలరుచుండె 346

వ. సేతు నిర్మాణంబునుం గోతులందుపైఁ గాల్నడను లంక కెక్కి వచ్చి చేరఁబాఱుటయుంగని లంకదనుజులు కొందఱు కొందల ముందుచు బరస్పర సంభాషణలకు దిగి యిట్లనిరి

347

క. మున్నెన్నడు నెవ్వారలు
గన్నది విన్నదియుఁగాని కాలగతి యిటుల్
మున్నట్లుఱాలు దేలుట
చెన్నలరఁగఁగోపులు పనులు సేయుట లరయన్ 348

ఉ. దానను బట్టి చూచినను ధర్మపు బుద్ధిని దానవేంద్రుడున్
వానికిఁజిన్నపెద్ద లిటువల్లని యెంతయు బుద్ధి సెప్పినన్

వీనులఁబెట్ట కాములుచ వేఱ్ఱిగ జానకి ముచ్చిలించి తాఁ
బూనికఁదెచ్చె నాఫలము పోవునె మిన్నక మ్రింగ కాతనిన్ 349

వ. ఇట్లు పలుజనులు పలువిధములగు నాడి పోతలకు దిగి కావలుఁడగు రావణునికి గావలసిన పనికాక మానునా వీనికి బ్రాణహానియు మానహానియు తోడనె కానున్నదని దీవెన బెట్టినట్లు బెట్టిదముగా ముంగలగానె యమంగళ వాక్యములు బెట్టి యాఁనాడు నాడుకొని తఱఁదరు చరులు తఱుముగ రేఁగి 350

లయగ్రాహి

లగ్గలకు నెక్కి కపులగ్గలిక లెచ్చఁజని
డగ్గరుచు లంకిణిని బెగడిలఁజేయన్
మ్రొగ్గిపడె మేడలును మొగ్గతిలె గోడలును
నెగ్గదిఁకలంక యని నిగాపడ దైత్యుల్
వెగ్గలపుఁగోపమున నగ్గివలె రావణుడు
బగ్గుమని మండిపడి ప్రెగ్గడల తోడన్
మొగ్గరములో రిపుల లగ్గము లొనర్చుదను
బగ్గముల పెట్టనుచుఁబగ్గెలను గొట్టెన్ 351

లయవిభాతి

దనుజ వరుఁడిట్టులని దనుజులఁదనూజులను
మొనలఁగొని మీరుచని మొనసి రిపు సేనన్
వనచరులు ద్రెళ్లఁగను వనచరు భుజుల్సురఁగ
బెనఁకువను బాఱిచనఁబెనగుఁడరితోనా
యినకుల నృపాత్మఁజుడు మనకును విధేయుఁడయి
జనకజను నాకువిడిచనుఁదనకుఁదానే
వనమునకుఁగాన మరిమనకగు జయమ్మనుచు
మనపురిని జాఁటుఁడిక నని మురియు చుండన్ 352

చ. పురమున కూదరయ్యెనని బొరుకలంగ దశాస్యుఁడేగి గో
పురవనెక్కి తూర్పు రిపుం గపిసేనఁగపీంద్రు జూడఁదీ

పురమున దాపరించెనని మూపులపైఁబడదూకి తాఁకి కా
పురమున కాశవీడ రవిపుత్రుడు మూర్ఛిలఁజేసె రావణున్ 353

చ. వెదుకక వెన్కముందు తొలిప్రేటున రావణు సాముజంపి లా
వెదుకదకంగ మోది ప్లవగేంద్రుడురామని రాముడంత న
వ్వెదఁగదురంగ నిట్లనియె నింతటి సాహసమేలొనర్చి తీ
వెదకద మాకు నీకెడరొకింతయు వాటిల నిందునేమగున్ 354

క. అనవిని సుగ్రీవుఁడు నా
యన వినియోగంబుగలదె యదనొదవఁగఁదా
యన వినయు విడిన నని యా
యనవిని హాతుజేయుబుద్ధి నరిగితి నరిపై 355

ఉ. ఏది యెట్టైన నీదయయె యెందనకు న్రఘురామద్రోహిచో
వేది యెదిర్చి కంటఁబడ నేవను మీవని తాపహారి నో
ర్వాదియ వానిపైఁబడ నేగితి నేగతినైఁబూన్కి నే
నేదియ వచ్చితిం బలవకిచ్చితిఁ జచ్చెడు పాటి వేట 356

క. దశవదనుఁడేటు వడి దు
ర్దశ వదనము లెండఁ జావుదప్పి యటకు మీఁ
దశవదకుంజెనె లోనికి
దశవ దశక్తుఁడని కపులు దవ్వుల నవ్వన్ 357

వ. మఱియు దశగ్రీవుండు సుగ్రీవుగుఱించి తనమనంబున 358

ఉ. ఇట్టైై యెరుంగనట్లు ప్లవగేశ్వరుఁడెంతలు సేసి పోయెను
న్నట్టులె యుండి గోపురము నంది చివాలున వాలిపైకి నన్
బట్టియు నెట్టి నాదుపరివారములొఁదల లెత్తరాని సి
గ్గట్టై పడంగఁజేసి యట నూడని బాడె మఱెంత వాఁడొకో 359

చ. అనితర సాశనేశుడు ప్రహస్తుని బిల్వగఁబంచి మంత్రి నీ
యనితరసాధ్యసాధన సహాయత చే నవలీల గెల్చి నాఁ

డనితర సాంగ వైరులను నచ్చెరు వానరవానరాళి నా
కనితర సాంపరాయికుఁడవ్వర్గగతిన్మతిఁనొంచి చేయుమీ 360

చ. అనవిని పంక్తి కంఠుని బ్రహస్తుడుగన్గొని యిట్లువల్కె నా
యన వినిపింపనైనతటి నాప్తుడు సెప్పవలెన్ హితంబు నా
యన వినిమంచిగైకొనుట యర్థమనర్థము భూమిపుత్ర్యియ పా
యన విని వృత్తుగా దశరథాత్మజుఁజేయుట నాయమీయెడన్ 361

చ. అవనిజ లోకమాత వినుమచ్యుతు డారఘురామమూర్తి యీ
యవనిని గావఁబుట్టిరిపుడామెను రాముని కిమ్మటంచు దా
నవ చెవినిల్లుగట్టుకొని నాఁడటు సెప్పితి నేమి సార్థక
మ్మవమతి సాధు తాప మెనుహోని కులక్షయ మంచెఱుంగవే 362

క. దనుజాధిప వేయేటికిఁ
దనుఁజంపికొనంగ మందధముఁడుందిను నే
దనుజావళి ఁదనుజావళి
దను మనుచులెఱింగికనైన ధరణిజ విడుటే 363

గీ. అట్లుగాదన్న నీకు జయంబుగల్గఁ
బోదు రాబోదు మంచి కాబోదు సంధి
నాదు బోదును జోరఁబోదు వాదు వోదు
గానసెలవిడుమని కొండె గానకొండె 364

వ. అని యివ్విధంబున నింకం చెప్పంగల ప్రెగ్గడలందఱు ఁజెప్పఁగల నీతులు దఱచు ఁగఁదగ్గని యగ్గలి కందఱమి చెప్పి చెప్పియు నెకసంబుగఁజెప్పిన విని లోకవిద్రావణుండగు రావణుండు కొండొకసేపు మిన్నువిఱిగి కన్ను పైఁగూలి నట్టుల నోరాడక మిన్నకుండె ఁగోపంబు దీపింప నెయియిడిన యగ్గివలె భగ్గున మండి ఁప్రెగ్గడల తోఁగట్టకడకు గడంక తో నిట్లనియె 365

క. రానున్నది రాకుండునె
పానీయము నారికేళఫలమందు వలెన్

బోనున్నది పోకుండునె
దాని భుజించిన సుమన్మథ ఫలమున వలెన్ 366

ఉ. కోతియుఁగొండముచ్చు సురకోటికిఁ గోటికి సాటి వచ్చునే
గోఁతిని సీతఁగ్రొవ్వి చెఱగొంటిని దింటిని దత్ఫలంబు చే
సేతుల ఘాతఁదెచ్చుకొని చీడెల ముచ్చట సంతకేమగున్
వ్రాతఫలంబు నాకిటుల రాఁగను వేననుకొన్న నేమగున్ 367

చ. ఎఱుగుదు సీతమాత జగదేకవహుండు రఘూద్వహుండు
నా కొఱకవతారమెత్తి ననుగూరిచి యిట్లరు దెంచినారు వీ
రెఱవిఁక జేయనేల యనికేగి సబంధుత బంధురంబుగా
నొఱఁగెద రాము శస్త్రముల నోటమి యేటికి ముక్తిచే కుఱన్ 368

వ. అనుచుండ నిక్కడ నవ్వేల సువేల కొమ్మునఁ గొమ్మ మెకమ్ముల ఱేడగు
సుగ్రీవుండు లోనుగాఁగల నఖముఖాయుధులు నఖముఖాలఁజేరి కొల్వ
శుభలక్షణుండగు లక్ష్మణుని తో సంతోష సహితులగు హితులతో శ్రీరామ
చంద్రుడు మంతనంబుండి రాయబారమ్ముగనుఁగొన రాయ బారమ్ము
పంపుట మేలంచు నెంచి 369

ఉ. వాలి తనూజుఁబిల్చి పతి వత్స దశానను పాలికే నిదే
వాలితనూజ మిత్రపరివారము తోఁబడ కిమ్ము సీత నీ
వాలి తనూజ వేఱుతెఱగైనను నిక్కము ధాత్రి నుండబో
వాలి తనూజులం బిలిచి యప్పను జప్పను జెప్పు కొమ్మికన్ 370

వ. అనితెల్పి తద్వృద్ధతంబు దెలిసికొని రమ్మని కృత్యంబు గరపుటయు 371

ఉ. అంగదుఁడా నరేంద్రు సెలవేఁదల నూఁదుచు లేచి తూఁది యొ
క్కంగ దురాపరావణ సంభాంగణము న్దగఁజేరి యోరి నే
నంగదుఁడ న్మతిందలఁపు మంబుధులం బడముంచి యెత్తిని
న్నంగదవెట్టి వీడ్కొలిపి నాయన నాయననాకుఁగావలెన్ 372

ఉ. వాలి తనూజుఁడ న్వినుము వచ్చితి నీకిట బుద్ధి సెప్పఁగా
వాలి తనూజ మిత్ర పరివారముఁజంపక యిమ్ము సీత నే
వాలి తనూజ నొండు తెరువైనను, రాముడు ద్రుంచు నిన్ను నీ
వాలితనూజులన్సతుల నందఱ నిప్పుడ చూచి కొమ్మిగన్ 373

చ. అనిన దశాననుండదరి యౌడుల దౌడల దీడి కొంచు న
న్ననియెడు పాటి వాఁడవె మృగాధమ యష్ట దిగీశులేమి లె
క్కనినను వానరుల్నరులు నక్కట లెక్కట రోరి యింక నే
మనిన మనంగ నీను నిను నప్పుడు వచ్చిన వానరుంబలెన్ 374

క. ఆమాటల్విని యంగదుఁ
డేమీ యెట్టెట్టులంటి వెఱుఁగ నాకో నీ
వా మారుతి సేసిన పని
యా మారఁగఁదలంచు మించుకంతయు మదిలోన్ 375

మత్తకోకిల

ఉండ నిల్లును బండ మంచము నుండకుండ నొనర్చి నీ
కండ నుండెడి మూలరాణువ నర్దసేనకు హెచ్చుగాఁ
జెండిపోయె సమీరసూనుడు సెప్పనేటికి రావణా,
చండమూర్తిని శిష్టకార్యము చక్కఁబెట్టెద నేననన్ 376

మ. దశకంఠుండతి రౌద్రమెత్తి కనుడు నైఋత్యుల్వడింగ్రమ్మి ద్వా
దశ సాహస్రము పైఁబడంగ దివికి న్దట్టించె తారేయుఁడున్
దశ నాంఘ్రిద్వయ హస్త వాలధుల చేత న్వారలంద్రుంచి దు
ర్దశఁద త్సాధముఁగూలఁదన్ని తమ స్కంధావారముంజేరుడున్ 377

వ. హర్యక్ష సదృక్షులగు హర్యక్ష సైన్యనాధులెల్లఁబొదివి దివినుండి క్రిందికి దిగి సందడిగాకుండ శ్రీరామ చంద్రునకమంద భక్తి మదిలెక్క మ్రొక్కి యొక్క యొడ నెడ గలుగ నిలుచున్న ధృత కనకాంగదు నంగదునిగని వాయుసూనుండొయీ తారేయా నీవు పోయిన పని యేమాయెనో సరగ నెరింగింపుమన నతండు తనకును దశవదను నకును జరిగిన తెఱగంతయు

దూచా దిగఁబడకుండ నఱటి పండొలిచి యఱచేత నిడినట్లు తెలియబల్కిన గపులందరు నిపుల గోపంబున లేచి లంకకేచి సందుల గొందుల దిగి సొట్లు సాధించికంటబడిన నరక్కసుల నంటఁబట్టి కొట్టి కోలాహలంబుగ హాలహాలంబువలె మైకమెక్కించి వేధించి బాధించుచు లంకముట్టడించి కట్టిండి దానవులం బట్టి మట్టి మీఱిమట్టి మల్లాడుచునెల్ల వీథుల యందు నెటఁజూచి నఁదామయై పురియెల్ల నల్లోలకల్లోలంబుగా నల్లకల్లోలంబొన రించుచుండ నదివిని దివిజరిపుచక్రవర్తి సమవర్తి రౌద్రంబెత్తి యరులశల్యంబుల రాల్చి రమ్మని తన బలమ్ములకు బలమ్మిగ ముదరి యిడి పంపిన రక్కసులు కక్కసింపుచు దాయలజంపుద మెుండెఁజత్త మెుండె నింతియఁకాని యిసుమంతయు నూరక మఱల నూరికి మఱలమని గట్టిగ నొట్టు వెట్టికొని వంతివహాలిన పతినలు వట్టుచుఁబొలికల నికిఁబలుపొ కలఁబోయి మొట్టమొదల మెదల కుండ వైరుల నొప్పించియుఁగట్టకడకుఁదామె నరవానరులచే వారెవారక పాఱక రక్కసు లొక్కొక్కరుగఁదక్కుచుఁ దాఱుచు వేగి నిక్కముగ నొక్కరుండేని బీరము వోకుండ నందఱు దరుచర వీరులచే హతులై మఱల లంకాపురికి రానోచుకొనక లేచిపోయిన వాఁడు పోయినట్లదే పాకగ విరగడయై పోవుచుఁదరిగి నానా టికి రావణురాణువ నిదాఘ నదీజలంబుల పోఁడిమి నను కరించి వాసిఁదప్పిగాసి వడివడిగఁదీసి కట్టునకు వచ్చి యణంగఁదొణంగె నందుఁదలగల యాశరవీరులందఱ నందు c దరు చరవీరుల చేఁగడ తీఱిన తీఱు విను మని యిట్లనియె 378

మ. హనుమంతుండు నికుంభు జృంభమణగన్ హంవీరు దేవాంతకున్
హనుమానత్రిశిరుందలల్బగుల ధూమ్రాక్షు వైగన్వక్షమున్
హనువింతింతలుగా నకంపనుని యాహామొత్తి వాహారివా
హనుసద్మమ్ము వెసం జొరంబని చెంఁదాన ద్రీంద్రు దంష్ట్రాంఘ్రులన్ 379

ఉ. అంగదుఁడాజిఁగంపనుని నంత నరాంతక వజ్రదంష్ట్రులన్
రంగదభంగ శౌర్యమున రాచి మహాపద పూర్వ పార్శ్వ వా
రంగదునంగదట్ట మెడయంగ నెఱుంగక యుండఁబట్టి పో
రంగదలూఁడలాగికొని రాల్చి తలల్వడ డుల్చినల్వురన్ 380

క. అంత ప్రహస్తు మహోదరు
నంతక పాశాభవాల హస్తము వెడగున్
హంతకుడై తెగఁజుట్టియు
నంతకపురి కనిచెప్రాలుఁడాజిని నాజిన్ 381

ఛ. గొదగొని తామహోద్ధతి నికుంభుని కుంభు విరూపనేత్రు బా
గొదవఁగ భానుసూనుఁడనిఁనొక్కనిఁ దోఁకకుఁజుట్టి యొక్కనిన్
గొదవడిఁగైకమర్చికొని కుమ్మరి సారెను ద్రిప్పినట్టు వే
గుదురిదె కాలుప్రోలి కని కేకలు వెట్టుచుఁగొట్టె నేలకున్ 382

వ. ఇట్లు దండి మగలగు ప్రహస్తప్రముఖరక్షో వీరులులక్షోప లక్షల సమ
సమరంబునఁ గసి మసంగి పొసఁగఁగహసిహర్యక్షవీరులతోఁబెనంగి సమసిరని
విని దనుజేంద్రుండు నమంద్ర భీతి నొంది యత్యంత నిద్రాసక్తుండగు
తనయును జన్మఁగుంభకర్ణుని నిద్దుర నుండి మేల్కొలుప దలంచి
యనుచరులంగని

383

ఉ. ఇద్దురవస్థ యిందగుట యేమెఱుఁగండికఁగుంభకర్ణునిన్
నిద్దుర లేపుఁడింత నిరుత రాజన లేపి రాతనిన్
నిద్దుర కండ్ల లేచి తలనింగికి నంట నిదేటి భూతమం
చిద్దఱు రాకుమారులన నేగెను గోతులు భీతి జెందగన్ 384

ఉ. అన్నను గాంచి పోవుతఱినాజికి దేటికి సీతనుంచి నా
వన్న నులిస్సతిం బతికి నప్పనసేయుట పాడి యంచ తం
డన్నను నన్న నన్నవలెనన్న ప్రయోజనమేమి తమ్ముడా
యన్నను దమ్ము రాఘవుల నార్పు మటోరువవేని కూర్కుమా 385

వ. అని యట్లన్న యన్నకు మన్ననతో నను జన్మండిట్లనియె 386

మ. పరమార్థంబని తెల్పినాఁడను సుమీఁపాల్మాలి కాదాజికేఁ
బరమాప్తా యటుగాదు కూడదనిన బ్రహ్మాదులున్నాకు నో

పర మాంసుల్నరు లేడిట లెక్క విను నాబారింబడం జాల, దె
ప్పర మాఁగం దరమౌనె వారలకు నాహాఁతంబడం జూతుఁగా 387

క. వినుమా యనుమానము విడి
హనుమా ముని గన్నుమూసి కనుదెఱచెడి లో
న నములిమ్రింగెద వరుసను
మునుమిడి నరవానరులను మునుసెలవిడుమీ 388

చ. అనిచని కుంభకర్ణుడు మహాయస శూలమునెత్తి నెత్తిపై
ననిమొన మొత్త నర్కసుతుఁడార్చుచు మూర్ఛమునింగె దానవుం
డ నిలజవాన గెత్తి కొని యాతని లంకకుఁబాఱ నింతలో
న నితఁడు సొమ్మదేఱి పడి నాతని ముక్కు చెవ్లుల్లరించుడున్ 389

ఉ. దానికి నాన వానికెగఁదట్టిన నిట్లనుఁజుప్పనాతి చం
దాన నిటుండఁగాకు విధి నాతలవ్రాసెను జేసెని ట్లనన్
దాన నిఁకేమి సేతు మన దానవులందఱు నవ్వుచుండనె
ద్దానను నే మొగంబునను దానవు నాథుని పాలికేగెదన్ 390

వ. అని ప్రణతాపంబును రణకోపంబును దీపింపగా నతండు 391

చ. మఱలి యనిందినంగపుల మారి మసంగినరీతి గోఁతులున్
మఱల తదీయ కర్ణ ముఖనాసల వెల్వడిఁచూచి రాముఁడే
మఱక మరుచ్ఛరంబున నమానుషశక్తిని గాలుసేతు లా
మఱఁదును మాడి తోడఁదెగటార్చెను లీలగఁగుంభకర్ణునిన్ 392

ఉ. తమ్ముడు వడ్డ వార్తవిని దానవనాథుడు చింతఁజెందగా
తమ్ముడు పమ్ములట్లుగొని తారణసేయుము జన్య వార్ధిచే
తమ్ముడు కంగనేలయని తత్సుతులాయతికాయుఁడింద్ర
జిత్తమ్ముడు పోఁగ జిక్కిన యజార్భక యుగ్మము వోలెఁ బల్కినన్ 393

వ. జనకుండు దనకుండుడెనుకందనక మదిఁదొనికి సలాడు చుండ దానివేను
కఁబట్టించు ననువున తనతనయు లనిన మనః ప్రియాలాపమునకే లోపము

లేక యులు కు దీటి కలక దీటి దశాననుండతికాయుని జూచి చనిపొయిన తన యనుజుండు కుంభకర్ణుండు పునర్జీవితుండై మరలి వచ్చినంత సంతసవెంది పెచ్చు పెరిగి యులుకు దిగద్రావి యులుక మొలక లెత్తఁదత్తనయుల వినయవచనవుల విని వత్సలారా! మిమ్మల దనయులగాఁగనిన నాజనని నేమని కొనియాడ నగునేమును నేమును నేయని యందే నపజయంబను మాట నాకు మీరు కలిగిన నాఁలు గొలె నేఁటి దనుక వినికని యెఱుంగ మీ తెలుఁగెఱుంగక కిటకైటులనో యట మటమ్మన నరవానరు లరుదెంచిరి. ఐన నేవరాయె మీవరాయులకే దాయులకు డాయఁగూడునే? కూడినను కూడునకున్ గుడ్డకు దూరులై యొండె మాఁడి యంబరమై యొండెఁబొవు వారంబరచారుల విచారముగ నవిచారులై వారితో డి లోకము వారై పోవువారు. నెమ్మది మమ్మాఁలు నకు మీకు నేనిదె ముదల యిడి దీవనల వీడు కొల్పితిఁగదే గదలి వదలని పట్టుదలతో చెందలకడ బెందలముల తోచెను దలములఁదల కడచి సేమమున బోయి యొయారి జయలాభమున రండోయి కుమారులారా! యా రాముడన వీకెంత వాఁడది యునుంగాక యాలింగోలుపడి కాలుగాలిన బావురు కాని వలె బావురుమను కానల దాహిర పడ జెడఁద్రిమ్మరి వాడి నత్తయై యున్న వాఁడతని నొంచుట యెంతుయుఁ బెద్ద పనిగాదు. మీయంత వారలకు నోపనిపని కూడ గాదు. కూడఁదీసి చక్కబెట్టిన మీకిది యేపాటి ఘనకార్యంబని నొడివి ధైర్యమున నతిభయానక కాయుండగు నతికాయుని దన యిరువది కరములగుఱఁ గట్టి కిఁగరంబుదిగిచి యురంబునకుఁదార్చి పేర్చి బిగియఁగౌగిలించి కొని హర్షాశ్రులు తనతొంగలి ఱెప్పలఁగడుఁదొంగలింప దొంగిలింపక యరల నెంగిలి యుంచక యుంచుకయుఁగొంచక రిపులగు కపుల విపుల విపదంబుధిఁబడముంచి విపుల విపుల యశంబుగొని జయంబున రారా కుమారా రాకొమారుల నిద్దర నిద్దారమునఁబెద్ద నిద్దురం జెందించి కాని రాకుమా నాకుమారుడవు నీవెకాక యాకోతి మూఁకలఁబో కార్చి కార్చిర్చు కారాకుద్రవాకుల నాకులంబుగ నీఱొనర్చుచు నాకలిఁదీర్చుగతి నార్చి నాకులంబనా కులంబుగఁబగఁదీర్చి సింహనాదంబులఁ బేర్చి రారా సౌకుమార్యంబున మారుండు శౌర్యంబునఁ గుమారుండును నీకుమా రుగారన నీకుమారెట్ల గుదురా రాకుమారులు నాకుమారు ండవనిపించి

కొని యనిందతలపడిన వారల నెంతటి దొరలనేని జీరికిఁగొనక దరలఁబడఁజీరి
మరల నాకనులఁబడ రారా వేగమేగుమని పీడ్కొల్పిన నవార్య తూర్య నాదమ్ముల
తోగదలి

394

అతికాయ యుద్ధము

మ. అతికాయుండతి మాయలంగదలి దాయం దాయగా లక్ష్మణుం
డతి కాయుంబ్రతి కాయజాభుఁడనిలొ నత్యుగ్రుడై తాఁకియా
యతి కాలంబిక నీకు లేదనుచు బ్రహ్మాస్త్రంబరింబోసి వే
యతి కాఠిన్యముగాఁగ పీడ శరమాహోఁత్రుంచెఁదన్మా ర్ధమున్ 395

చ. తనయుని పోక కుమ్మలిక దల్లడమందెడు తల్లిదండ్రులన్
దనయుఁడు మేఘనాదుఁడు నిదాఘదివాకరుమాడ్కిఁజూడిమా
తనయుధమేయ మాయవసుధంబటఁజేసెను జాప చుట్టగాఁ
దన యురగేషు పాశమునఁదత్కపి సేనను రాములక్ష్మణున్ 396

చ. ఆదశనున్న రాముఁడపుడాఁదట మీదటఁదారుక్ష్య దల్పగా
నాదశనున్న పన్నగ శరాపదఁదేఱెను రాముసేన స
న్నా దశయించి వేఁకువను నవ్వుచు లేచిన రీతి లేచె ము
న్నా దశకంఠుపైకిఁగవియన్నమ కట్టిరి రామలక్ష్మణుల్ 397

చ. వసమఱి నాగపాశములు వమ్మయి పోవుట కింద్రజిత్తుచే
వసమసి కొంత ప్రొద్దడలి వ్రాలి నికుంభిలవ్రేలు వంగఁబో
వసమరమాని వ్రేలిమికి భంగముగాఁదగలక్ష్మణుండు లా
ద సమరి దాఁకె రావణుఁడస్త్రముచేఁదెగటారె ఘోరునన్ 398

చ. దశవదనాత్మజుండు వడ దార సులోచన శేషపుత్రి దు
ర్దశ వదనాంబుజమ్మురము తల్లడమందఁగ మోదికొంచు నా
దశవద నాజ్ఞ రాముఁగని తత్ప్రతిభిక్షను వేడ బ్రీతి స
ద్దశవనాథయా నృపతి తా సతికింద్ర జిత్తున్ఁదలంచినన్ 399

చ. అనుమఁడు వట్టి యాపనికి నడ్డము గొట్టిన రామరాముతో
ననుమతి భర్త తోఁజనుట కాయిత మైతిని రామనాకు ని
మ్మనుమతి నన్న రాఘవుడు నంగదుతో శవమిచ్చిపంపు
మ న్నను మతకంబు వీడి యిడెనాతికినాతఁడు తచ్ఛవంబునున్ 400

క. పతికుణపముఁగొని సతి రఘు
పతి కణఁకువ నెఱిఁగి యాజ్ఞఁబడసి యరిగి తాఁ
బతితో సహగమనము గాఁ
బతి లోకము గల్గెఁబుణ్యవతి కాసతికిన్ 401

వ. అంత దురంత చింతాపర దుర్దశాపన్నుండగు దశాననుకి ననికిఁబోవలదని చెప్పుచునికి పట్టునఁగునుకుపాట్లు పడుచు నెల్లప్పుడు పడుచు తనంబెగాని ముదిమి యొదవక సర్వపుత్రహానివశాన వశానుకారి యగుచు ముందునిలచి యమందా దరంబున మండోదరి ప్రాణవల్లభున కిట్లనియె 402

చ. నరవరులా శరావళి ఘనమ్ముగవలె న్నడిముంచి చంప వా
నరవరులాశరావళి ఘనమ్ముగ నోళ్ళనుగోళ్ళనుఁజింప గి
న్నర వరులా శరావము లొనర్పఁగ నింగిని దైత్యు లార్తితో
నరవిరులై హరించిరి జయంబెట నీ వెట పాఱఁజూడుమీ 403

మ. ఇఁకనైనం బతికిమ్ము సీత రఘు వంశేశాంఘ్రి పై వ్రాలు కో
రిక నేమంబ్రతుకంగ నైదువనుగా రేకెత్తుదుం బ్రీతి నై
హిక నానా సుఖముల్మదిందనిసె నీకింకేల నీలంక యే
లిక యాలింపుము నాదు విన్నపమును లెమ్మాత పశ్చర్యకున్ 404

వ. ఆ మాటకు మోమోట దక్కి రక్కసుల ఱేఁడు స్రుక్కియునుక్కివుఁడు గాన ముక్కడి మాటల సవిలెక్కగొనకవెనుకటి మనోదార్ఢ్యంబింకియు బింకమెడల కనడల సడలనడలుగడలు కొని యొడలఁజేవసచ్చి యుబిగి హెచ్చుచు సరిలేని ముది కేసరి కరణిఁగరిణిండాసిన కరణి నాదుని కరణి దన యిరువది కరంబులగ్రుచ్చి యెత్తి యొత్తి యాలింగనము సేసి యాలింగని చాలం

గనికరము తోమందస్మితవదనుండై మండోదరీయమందానందమ్మున వినుమని
యిట్లనియె

405

చ. దనుజులు యుద్ధ దుర్మదులు దాఁటిరి బోటి ప్రహస్తముఖ్యులున్
దనుజులు మేఘనాథుఁడు మొదల్గల వీరులు పోర జాఱిరిం
దనుజులు కుంభకర్ణముఖు లాశరసత్తము లెల్లఁద్రెళ్ళిమీఁ
దనుజులు కాగయీఁబ్రతుకు తన్వి యికేటనికి నాకుఁజెప్పుమా 406

ఉ. ఆలములోన రాము నడియాలములుంచకఁముంచు టొండె న
న్నాలము సేసి వాడు తెగ టార్చిన ముక్తికిఁజేరు టొండె ఁగా
కాలమురించఁజాలనటన(రఘురాము వేఁడఁగాఁ
గాలము సీరఁబాఱినను గావఁగ శక్తుఁడొకండు గల్గునే 407

వ. కానఁబ్రాణసఖీ యడ్డాదిడ్డగ నాకిఁక నడ్డ మాటలు వలుకక వలపుగ వడ్డికిఁబాఱ నోరూర నోటియార మాటలాటి యో మాటలాఁడీ నాయెడ నీవ యావంత యేని సేయక నావంత దీఱఁబావనీ బావని దొడ్డ దీవనఁబెట్టిన గలనికి నికం బంపుము. కలనేనిఁగలక యెఱుంగ గలన నన్నెదిరింప గలవాడు గలఁడే. కలఁడే ని వారింప నెవ్వాఁడు శక్తుండు. ముక్తునకు శాక్తాశక్త విచారంబేల బేలా ముంగలనాకు నీ మంగళ సూత్ర మాహాత్యంబున దీర్ఘాయురవాప్తి కలిగి యుంటచేఁబ రాజయంబు నిరామయంబుగ రాఁబోదు పోరికి నిఁక నే బోదుగాన నిఁక నాబోదుగైకొని యంతి పురంబునకుం బోయి చింతాభరంబు దొరంగి పదిలమ్ముగ నుండుమీ యని యురిల ఁబ్రిదులఁజెప్పి తన భామిని నేట్టికేల కొడఁబఱచి లొనికనిపి దశవదనుండు గురువు మరువు సొచ్చి విజయంబుఁబడయ గోరి శుక్రాచార్యుల మందిరంబునకు ఁదొందరగ దరియంబోయి

408

చ కవిగని మ్రొక్కి రావణుఁడు గారవ మారఁగ జేరిపల్కె స
త్కవిగణసేయ చేయవె పురమ్ము జయప్రదమైన తంతు శో
క విగళనైక కృత్య మభయమ్ముగ వ్రేల్మిడి ఁవ్రేల్చి గెల్తుఁగా
కవిగణి తారిశక్తి వగునట్టి తెలుంగెఱింప వేయనన్

శా. పాతాలంబన గాక యుండఁగతి తా భావించి కావించన
ప్పాతాలంబున నొక్క హోమమపు డప్పా పత్మ్మచే దాని ను
త్పాతాలంబునఁజేసి యుంగదుఁడభ్రత్రాణుండు మండోదరిన్
బాతాలంబడ నీడ్చి భర్త యెదుట న్బాధించి వేధించినన్ 410

వ. ఆభాదల కోర్వలేక పదుఁగురిలోఁదల యెత్తు దానిసిచ్చితి వాడవిు
యంగదుదెబ్బల కాపె యోపిక చెడి తన ప్రాణనాధున కిట్లనియె
411

చ. కనికర మింత లేక చనికా కనుఁగానక రంకుఁదెచ్చి లోం
గని కరమట్టి రాముఁగనుఁగానక మోసము సేసి భూసుతన్
గనికరమాసఁదెచ్చి యొడిఁగట్టితివీసడి వల్లు వల్లనన్
గనికరమైన శూరులిట మందన కేన్మనకుండఁ జేసితే 412

వ. అనిన మండోదరి మాటయందు మందాదరుండై యా యింద్రారి మందస్మిత
వదనార విందుండై యిట్లనియె 413

ఉ. ఆడుది వోలెఁబాడటి నరాధము నేఁడు వరాధ మౌఁళి మం
డాడది లేక సుర్దివిని నవ్వరె నొవ్వరె నాయనుంగు లూ
టాడ దివానిశాకరులు నాజియొనర్చెదనన్న నన్ను వొం
డాడద వెల్ల రజ్జులని యంతట నంతపురంబు సేరినన్ 414

ఉ. ఆశరభర్త యంత తన యాశరయూధపు లెల్లఁదోడ రా
నాశరణంబునందరుల నందఅనుందరుమంగఁబోయి నా
నాశరవృష్టిముంచి యభియాతి పరిన్విడశక్తిఁదమ్ముపై
నాశరమున్ న్వడింబడియె నాటఁగ లక్ష్మణుఁడడ్డమేగుటన్ 415

ఉ. తమ్ముని పాటు సూచి కడుఁదల్లడమందగ రాముఁడొక్క పా
తమ్మున వాయునందనుడు దార గతింజని జీవనౌషధుల్
తమ్ము నెఱుంగరాని గతిఁదాకొన ద్రోణగిరీంద్ర మొక్క ఘా
తమ్మునఁబెల్లగించి యొక తాకున దోకకు జుట్టి తెచ్చినన్ 416

ఉ. ఆ గిరికేగి వేగిరమున జ్జగవెజ్జు సుషేణుఁ డోషధుల్
లోగిరిరంస సూఱి యకలంకముగాఁ గొని పోయ ఁద్రావి వే
ద్రాగిరి మూతలందొకడు దాగిన గొసెన దీసినట్లుగా
దాగిఱి కొంచుఁగ న్నైఱచి తప్పక తెప్పఱె లక్ష్మణుండనిన్ 417

చ. మఱియును లక్ష్మణుండటులు ప్రమందకతేరుడు రావణుండు ప
ల్మఱిటురు యత్నమంత విఫలంబయి పోవగఁగుంది పోరికిన్
మఱియును బోయి పోరగను మాతలి తెచ్చిన తేరినెక్కి పై
మఱువొగిఁదొడ్గి రాముఁడతి మానుష చర్యను ద్రుంచుడుందలల్ 418

ఉ. ఎన్ని శిరంబులన్ నరుక నన్నిటికన్నియు మొల్చుచుండగా
నెన్ని తలంచి రాముఁడిది యెట్టి విచిత్రమటంచుఁ బల్క బే
రెన్నికఁగన్న మాతలి నరేశ సురాశన భాండముండు ము
న్నెన్నఁటి దోసి చండమున నీతని కందునఁబుట్టు నీతలల్ 419

చ. సురపతి సూతుమాట విని శూర శిఖామణి రాఘవుండు బా
సురమతి బ్రహ్మమస్త్ర మరిఁబోసి యెదంగుఱిసేసి యేయ నా
సుర ఘరిపంధి గూలెను వసుంధర నందఱు నమ్మ దాంబుధిన్
సురలును నోలలాడగఁబ్రసూనపు సోనలు రాల రాముపై 420

చ. ఘన దశ కంఠ దావ మొక కాండమున న్నమయించి మించి స
ద్ఘన దశకంఠ దఘ్నముగఁగాండమున న్మద మూన్చి వార్ధి లం
ఘనదశ రాముఁడా శుచి ముఖంబున జానకి గొంచు నమ్మ దా
ఘనదశఁబీశు చేత బ్రతుకంగొని వానర సేన నంతయున్ 421

వ. అట్లు సహజపావని యగు జానకిని లోకసంశయ నిరాసార్థము పావకముఖంబున
నామె పాతివ్రత్యము సర్వ జనస్తుత్యముగఁ బ్రకటించువాఁడై రామచంద్రు
డామెను బరిగ్రహించు నపుడుప్పరంబున నింద్రాది సురులును హరిశ్చంద్ర
దశరథాధి నరవరులును సకల సురమునులును వచ్చిన రఘువీరుండయ్యెడ
వారి మనంబున కనుకూలంబుగ సంభాషించి మఱియును

422

చ జనకుని గాంచి మ్రొక్కి తను శర్వ పితామహులున్నుతింప యో
జనకు బహిశ్చరాసువనఁజాలిన లక్ష్మణుతోడఁగూడి ము
జ్జనకులుగా విభీషణుఁడు సర్వ కపుల్వర పుష్పకంబుపై
జనకుని పుత్రిఁగూడి సరసంబుగ రాముఁడయోధ్యకుంజనెన్ 423

చ. భరతుఁడు రామపాదు కలపైనిడి భూభరమేలుచు న్వ్వలా
భరతుఁడు రామురాకకు శుభంబుగఁదా నెదురేగి రాజ్య స
ద్భరణ ధురంబుఁబూనుమని ప్రార్ధన సేయుచు మ్రొక్కెఁదమ్ముని
ర్భ రతర భక్తియుక్తి నరపాలుఁడు గుచ్చి కవుంగిలింపగన్ 424

చ నరపతి కింద్రజ వహ్నియమ నైర్పత వారిధి రాట్స మీర కి
న్నరపతి శూలు లాదుకొన నాగర రాష్ట్రజనంబు గూడి వా
నర పతు లబ్ది తోయము ఘనంబుగఁగూర్ప వసిష్ఠ నాజ్ఞ ద
న్నరపతి సింహపీఠి శుభనారముతో నభిషేక మందుడున్ 425

చ. మెరసెను దేవదుందుభులు ముచ్చటనచ్చట నాడి రచ్చరల్
గురిసెను బుష్పవర్షములు కుంభములన్ క్షితిగ్రుమ్మరించి న
ట్లురిసెను లోకమెల్లడల నొప్పుగ వేడ్కలు వ్యాధులాధులున్
విరిసెను మూల ముట్టుగ భువి రఘురాముడు పట్టమూనఁగన్ 426

చ. నరులకు నెల్లవారికి మనంబుఁఘనంబుగఁద్రృప్తిసేసి వా
నరలకు భూషణాంబరధనంబులు కొలగఁగొల్ల వెట్టి ము
న్నరులు సెలంగ మారుతి కి నర్ఘ్య పుహారము రాముఁడిచ్చి త
న్నరులును గూడ మెచ్చుకొను నట్లు మదంబునఁదేల్చ నెల్లరన్ 427

ఉ. జన్నము లెల్లఁగొల్ల లయి సారె కజీర్ణము పుట్ట సాఁగె రా
జన్నము చిద్విడాది సురసంహతి కిచ్చెన వద్య కోటి మో
జన్నము వస్త్రమిచ్చి యతఁడన్నల దమ్ముల బోలనేలఁబోఁ
జన్న ముసించ కింటి కొక డాయుధమూనిరి రాము నేల్బడిన్ 428

సీ. వరుణుడు కరుణించి తరుణంబుఁదప్పక
నిల మూడువానలు నిండఁగురిసె

నేతెగుళ్ళెఱుగక నేతెఱంగుల లెస్స
    దండి సస్యంబులు పండి యొఱఁగె
గొడ్డు బోతులు భూమి బిడ్డ తల్లులెయ్యైరి
    యతివలందరు పతివ్రతలె య్యైరి
యేతరినెందు నేనేతరిలేకుండఁ
    బేదలందఱును గుబేరులైరి
పెద్దలెందు నెఱుంగక పిన్నల మృతి
నిండ నూరేళ్ళు జీవించి యుండెజనము
ధరణి తృణకాష్ఠజల సమృద్ధమ్ము గాఁగ
మించె శ్రీరాముఁడవనిఁ బాలించునాఁడు 429

వ. ఇట్లు దశరథ నందనుండు మహానంద దశనాపన్న జన బృందంబుల కశన వసనములు దశశత విధంబుల నరసి సరసమ్ముగా నిడి యమందానంద మొందింపుచుఁ బూజ్యంబగు రాజ్యము సేయుచుండి జనులు తన వాసిని గూర్చి యెదలొ నేమాడ్కి నాడి పోసి కొని యెదరో కనియెదగాక యని యదనొదవ ముదంబున సాకేత పురంబు లోనికి సాకూతంబుగ నిజచారుల ననిపిన వారలు సని హోనిని జాలఁగా నూహలనుగ్రాలి మద వశంబున నొక రజకాపశదుండు వీటి జనమెల్ల మాటు మణిగిన వెనుక నొక నిశి ఘన లులాయము వలెఁ బండి తనయాలయంబునఁదన యాలింగూడి వేడుక మాటలాడి కొనుచు మాటపై మాట హెచ్చి తన బోటి తోఁగలహమెచ్చి మనమెరియ వెడ వెడ ననిన యొక పెడనుడి విని వచ్చి యొకప్రణిధి విధిలేక తనకు వినవచ్చిన వార్త రామమూర్తి తో గీర్తన సేయక దాచిన యెడల నాయన గాఁచునే దాచిన వాని ప్రాణంబుల బాణంబుల కెఱసేయక మానఁడట్లని యున్నది యునట్లున్న ననన్నా సీతకు పాతక వాణీ ఘాత వాటిల్లునని యుల్లంబున దల్లడిల్లుచుఁగల్లవలన జరితంబు వొరయుట తెల్లమియగావున యశోవా మృత్యుర్వ్యాయను సామెత కామెతగా నిజంబ వచియించెద నని చెదరక బెదరక శ్రీరాముని గని యచ్చెరుఁడచ్చెరువొప్ప దన చేతులు రెండును జోడించి మోడ్చిన కేలు ఫాలంబునఁగీలించి రామనృపాలుతో నిట్లనియె 430

చ. అవమతి సేసి యొక్కరజకాపశదుండపరాత్రి భార్యతో
నవమతి సేసితీవునినునాకడనొల్లనుబొమ్మెటైన, దా
నవపతి కొంచుఁబోయెనని నానయొకించుక పూనకంత మా
నవపతి రాముఁడేలెఁదన నాఁతి ననీతిని నేనటోర్తునే 431

వ. అనియెనని చారుండు కారుండన్నుతో నన్నుమాట మూట గట్టుకొని వచ్చి యున్నది యునట్లు విన్నవించుటయు 432

క. ఆపద రజకుఁడనిన నుడి
కాఁపఁదరము గాని రోషమడరఁగ రాముం
డాపన్న సత్త్వఁబత్నిని
హా పన్నగ మృగభయంకరాటవి కనిపెన్ 433

వ. అదియెట్లనిన 434

ఉ. తమ్ముని లక్ష్మణుంబిలిచి తద్రజకోక్తిని జెప్పి నొప్పిచి
త్తమ్ము నుహేళవాక్య చలితమ్మగు చున్నది గానఁగానవప్రాం
తమ్మున సీత వీడుమనఁదతక్షణమ క్షను ళక్ష్మణుండు సీ
తమ్మను గొంచు నాకుజ మహర్షి వరాశ్రమసీమఁజేరిచెన్ 435

ఉ. అమ్మహితాటవిన్విడుచు నప్పుడు గుప్పున గుప్పఁగూరి యో
యమ్మహితాత్మ విండు తమ యాగతి యీగతియంచు లక్ష్మణుం
డమ్మహి తేరుడిగ్గ జనకాత్మజ యిట్లనె నన్న లక్ష్మణా
యమ్మహితాత్ముఁడెట్లనియె నట్టు లొనర్పుము చింతయేటికిన్ 436

చ అనవినిమ్రొక్కి చింతపడు నాతని గన్గొని సీతవల్కె రా
మునకును ధర్మమావిడుట మోసముగా సహధర్మచారిణిన్
వనమున స్వప్నమందయిన వంచన వాక్తను కర్మలందు లే
దనితను దక్క నన్య నెదయందు స్మరింప నటంచు లక్ష్మణా 437

వ. అని మఱియు నిట్లనియె 438

చ. వగలీను వీనికన్నిటికి వాసము కాననమే నయోధ్య యే
నొగినగుఁగాక నాకు విధియొప్పిన చోటది యట్టులుండనీ
యగతిక సాధ్వియైన తన యాలిని రాముఁడు పామరోక్తికై
నగుచుఁద్యజించె క్షత్రియుని నమ్మఁగ వచ్చునె గొంతు గోసినన్ 439

వ. అంతలక్ష్మణుండదర రెడు వదెనకు మదిబెదరు దగ్గ నట్లోదార్చి తనలోఁ
గుందు చుఁదఱచు సౌమిత్రి భూమి పుత్రికిఁబలుమఱు ప్రణమిల్లి యామె
మీవని విడిచి పోఁగాళ్ళు రాక యెట్ట కేలకు నెట్టులో గుండె ఱాయి చేసికొని
కట్టకడకు వీడ్కొని యరదంబు మరలించుకొని లక్ష్మమను దేగుటయు
440

ఉ. అవ్వనమందుడించి చన నవ్వనితామణిరాక శిష్యుచే
నవ్వనవాసి నాకుజ మహర్షి యెఱింగి వెఱంగుజెంది యా
యవ్వను నొవ్వకుండఁదన యాశ్రమ భూమికిఁదెచ్చి యుంచెఁగా
మవ్వపుఁబర్ణశాలను గుమారికి మాఱుగఁజారులోచనన్ 441

ఉ. అక్కట కారుకూతలని యాలము సేయక పాటిసేసి తా
నొక్కట గుర్విణి న్రవికులోత్తముఁడాలిని సాధ్విఁదమ్ముచేఁ
జిక్కఁగఁ జీమలుంజొరని చిట్టడవి న్విడి దింప బంపఁగా
జక్కఁగ మౌని యాశ్రమము శాలకు బాలిక చేరి పిమ్మటన్ 442

క. కుశబీరవసను నింటను
గుశలము మై నుండి సీతకొమరు సుభతిథిన్
గుశశయన యనులఁగనియెను
గుశలవులఁగుశీలవులను గొమరులఁగవలన్ 443

ఉ. అయ్యలఁబోలి యాకవలహర్నిశమశ్రమ మాశ్రమంబునన్
జయ్యనఁబట్టి సింహముల సైరిభగండ మదేభ రాజితోఁ
గయ్యము సేసి గెల్తు రధిక ప్రభ విద్యల నేర్చి రాటఁగా
నయ్యరెఁ పాతరందిడిన యర్థము చేతను దీసినట్లుగాన్ 444

ఉ. నీతిని సీతపుత్రులు జనించిన నాఁటను గోలెనోలిఁబ్రా
చేతస మౌని చేతఁగని సిష్ట శుభప్రద జాతకర్మము
ఖ్యాతత సర్వ వైదిక సమ్మర్ల సుకర్మము ల్లర్ణవేళలం
దాతత శౌర్యులై కొనిరి యాఋషిచే ధనురాది విద్యలన్ 445

# కుశలవకృతయజ్ఞాశ్వ బంధము

ఉ. రాముని యజ్ఞ ఘోటకము రాణఁదదాశ్రమ భూమి సీమకున్
రాముని పుత్రులంగలసి రాముని పుత్రులు పట్టి తెచ్చి గా
రామునఁగట్టి పెట్టఁగను రాముని తమ్ములు పోరిపోయి పో
రాములు పోరిపోరని దురంగొని నట్లు దురంట మూర్ఛిలన్ 446

వ. హత శేషులయిన పదాతి జనమ్ము రఘువీరు పాలికిఁజని కుశలవులఁగూర్చి
యిట్లని విన్నవించె

447

చ. హయమును వీడరెన్ని యెవరన్నను మోదిరి నీదు తమ్ములన్
జయమడరంగ నర్భకుల సాద్యుల యోద్ధ్యులు చండ శాసనుల్
రయమున నీవెరావెయని రాణువ వోణిమి మొల్లవెట్టఁగా
రయమున తోన నేగి రఘురాముఁడు కూడను వారి కోడుడున్ 448

క. కాలరులడిఁగిరి బాలుర
కాలరులై యనుజ సహితుఁడై రాముఁడు బిం
కాలరుదుగఁదెగినన్ యా
కాలరుషాజ్వలనశమిత కాండముల వలెన్ 449

ఉ. నిక్కపుటల్క దొల్కన వనీత సమానమనస్క రాముఁడున్
నిక్కువ మోడెఁబోరి నవనీతశరాహతి నాత్మ జోద్ధతిన్
నిక్కము తండ్రియంచు నవనీ తనయోదితమ్మై యెఱింగి యా
జక్కని దండ్రికిచ్చి ధర సాగిలిరాగిలి మ్రొక్కి రర్భకుల్ 450

ఉ. అంతట రామచంద్రుడు ముదంబుధి మజ్జన మాచరించి యా
వంతయు వంతలేక తనయానుజ బాంధవ మిత్రయుక్తుఁడై
చెంతను వాలి వాల్మికి వచింపఁగఁజేకొనె ధర్మపత్నిఁదా
సంతసమెచ్చ మెచ్చఁబడు జాలిని చాలనసేసె నాలినిన్ 451

క. తనయాశ్రమమున రాముఁడు
తనయాస్రయమంది పత్నిఁదగఁగైకొన నూ
తనముగ ముని యత్తింటికిఁ
దన తనయం బంపునట్లు ధరణిజ బంపెన్ 452

చ. దశరధ రామదేవునకు ద్రమ్ములకిచ్చి య నర్ఘ్యవస్తువుల్
విశదముగాఁగ మైథిలికి వేడుకగాఁగసుదాయమిచ్చియున్
గుశలవ బాలురిర్వురకుఁగోమల భూషణ వస్త్ర పుత్రికల్
కుశ శయ భూసముండిడియుఁగూతును బంపెను బిడ్డ సారెతోన్ 453

వ. ఇట్లు ప్రియానుజ తనుజ గజతురగ శతాంగ మహాంగ సైనికాది చతురంగబల
పరివృతుండై రఘుపతి బుధుండు బృందారక బృందంబు వంది మాగధులవలె
నభినందింప ప్రాచేతసు వీడ్కొని వాహనమ్ములపై జగన్మోహనమ్ముగ సాకేతపు
రమునకు విజయము సేసి జయప్రదమై శుభప్రదంబై నితాంత సువాసనల
భాసిల్లు భద్రసింహాసనం బలంకరించి సమంచితగతి
454

ఉ. డాపలి ప్రక్క సీత తగడాయఁగ మారుతి మ్రోల లక్ష్మమం
డాపలభించి యెల్లికయి నాతపముందన వెన్క సీవురుల్
డాపల వెల్పలన్నిలచి డగ్గరి తమ్ములు వీవఁగోతి పిం
డాపల భోజరాజు నరుణాత్మజ వాలిజు లాప నల్లరుల్ 455

ఉ. డాప సజ్జ నార్భటులు డాయుచు మంత్రులు మధ్యపీఠినాఁ
డాపరమేష్ఠితుల్యుఁడగు నారఘునందనుఁడొప్పె నెల్లరుల్
డాపక శక్త భక్త తతి డగ్గరి సంస్తుతి సేయఁదన్ను గో
డాపరహిన్ మహింగలచు నాశరురావణుఁద్రుంచి తీవునాన్ 456

క. శతహయ మేధము లాయెను
శతవర్షము లాయువాయె జగతిని బ్రజకున్
సతమాయెఁగీర్తి లోకా
ధృతమయి కృపరాముఁడేల విపులన్ విపులన్ 457

గీ. పదునొకండు వేల వత్సరంబులు కీర్తి
హెచ్చ రామభద్రుఁడేల జగము
పుత్ర యుగము బడసి భూపుత్రి యందశ్వ
మేధ శతము సేసి మేలుగాఁగ 458

వ. ఇట్లు రామభద్రుండు నవనవనీత భద్రంబుగా నవనీతలంబు సీతల కృపారస విసర కటాక్షణాసేచనక లోకలోచనా సేచన కరంబుగా వేడుక శుభ పరంపరలు తోడఁదో డఁగూడిరా సంతసిల్ల జగతికిఁగలిగిన మేలు గొనియాడఁదర మాదర మావహిల్ల నరులాదర మావహిల్ల నరులు పరమానంద భరమావహిల్ల సురలుగనెల్లరకు నెల్లయెడ లఁదగు సంతసము వెల్లి విరియఁగ నీతిబోధలు విరియఁగ ఈతి బాధలు మరులు యేమరు తామర తంపరయై కామింపకయ కామంబులు కోరికకినుమడి మిక్కిలి గనడేర నొక నాఁడు భృగు భరద్వాజాగస్త్య కణ్వ జహ్నుశాండిల్య మాండవ్య మతంగమాతంగమందకర్ణి వశిష్ఠ విశ్వామిత్ర ముఖానేక బ్రహ్మర్షి దేవర్షి బృందము రఘురాము ని కొల్వుకూటమునకు వచ్చి హెచ్చుగ నాతని ప్రజాపరిపాలనకు మెచ్చి కొనుచు నతనిరావణ వదార్ద మవని నవతరించిన శ్రీ మహావిష్ణువుగా గని భక్తినతని దశావతా రంబులు గొనియాడుచు నిట్లని రెట్లనిన

459

మత్స్యావతారము

ఉ. సోమక నామకుండు దధిఁజొచ్చిన జాఱగఁజోర రీతిగాఁ
బ్రామినుకుల్లరించి కనుబ్రామ మరల్పఁగ నీవు లోప్తమా
గామిడిఁబట్టి ప్రోష్ఠ ముఖకారను బెట్టితి చోఱరీతి నో
సామి యటాటనేగద విసారముఁజోఱ యటంచు రందఱున్ 460

కూర్మావతారము

శా. స్వామీ మామకతాతఁదిప్పలిడి క్షోభం బెట్ట నేలంచు శ్రీ
తా మేల్మేలన నట్లుచేసి తరిగోత్రంబూని తామేలుగాఁ
బ్రేమ.న్నీవనినట్లొనర్చి గద తాబేలైతి నం చాలితో
నేమో మేలములాడి నవ్వు కమఠం బీవేకదా రాఘవా 461

వరాహావతారము

శా. ఆమెక్కన్ క్షితి చక్రముంగొని హిరణ్యాక్షుండు వార్ధిన్ జొరన్
భీమక్రోడమవై జరాహతిని వానింగూల్చుచోఁగ్రోడమ
క్షామోత్పాత గతింబగిల్చి రధసక్త ప్లీవముం బోలె ను
ద్దామక్షోణిని గుండ్రగా నెగుచు నీ దంష్ట్రాంకురం బొప్పెదన్ 462

నరసింహావతారము

ఉ. పూనిక నాహిరణ్యకశిపు న్దర జాగరలాడునాడు నె
వ్వాని కరిష్టమయ్యెను సభాస్థతి కంబము కన్న తల్లి యు
ద్దానవరాయుధంబులును దార నఖమ్ములు వీరపాణ మా
దానవు నల్లకుర్వు సమదస్థితి యట్టి నృసింహుఁగొల్చెదన్ 463

వామనావతారము

ఉ. భూమిని బొట్టివానికిని బుట్టెడు బుద్ధులుగాన నింద్రుకై
వామనమూర్తివై బలిఁద్రిపాత్పద మిమ్మనికోరి కాండముల్
కామిజగంబు వానితలఁగట్టితి పాదమునుంద్రిపాద మిం
తేమిటి కెట్టి చుట్టఱిక మీతని నాటిదో తాత నాఁటిఁదో 464

పరశురామావతారము

ఉ. ఆర్జవహీన పంక్తిముఖ హస్తికి నందుకమైన కార్త వీ
ర్యార్జును బాహుమండల మహోర్యక దోర కుహోర వహ్ని కిం
గర్జన కాక్కొనం జితుకు కట్టెల చందము నొంద ధారపై
ధూర్జటి ఫాలవహ్ని పడదూఁకిన మాడ్కి వెలుంగఁదద్వధన్ 465

ఉ. ఆర్జన సేయుచో స్పృధితి కంటిన కల్మషమీఁగ వేగమై
నిర్జితరాట్కు తాస్త్రములు నిర్ఝరిణీ గతి బాఱమున్క శున్
మార్జన మంత్రమై తగ ననాధన్పనాధ సతీవిలాపముల్
భర్జన సేయగా ధరణి బ్రాష్టమున న్జవదగ్ని సూతివై 466

ఉ. దుర్జన కోటి మూకలొక తోఁడున లాజల బోలి ప్రేలఁగా
నిర్జనమయ్యె క్షత్రమవనింబడి యిరువదియొక్క మాఱు నీ
వార్జవ మొప్ప భానుకులమందు మఱల్పఁగ రఘువుండవై
యార్జితపూర్వపక్షమున నొప్పితివా ద్విజరాజ వృద్ధికై 467

శ్రీకృష్ణావతారము

సీ. సోమకుఁజంపిన సోడ్డు నత్తింటికి
దిప్పలు దెచ్చినదెప్పుం జడధి
యందుఁబందిగ సువర్ణాక్షుఁగుల్చిన వాదు
కొయ్యకుఁబుట్టైనాఁగొఱత మాట
వామన మూర్తిగా బలియాచనయు సర్వ
రాజకులఁ ద్రోహి నాజనోక్తి
చాటుగా నింద్రజుఁజంపె నన్నది సంతు
మరలింప నొక్కట మతిఁదలంచి
సోమక జమానమునుగాచి ప్రీతు జూచి
యత్తయిలు తిప్పలఁదొలించి యమరి దొరగ
వరయశోధక నఘ రాజవంశమొసఁగఁ
బుట్టి యింద్రజుఁబ్రోవవే పొసఁగ కృష్ణ 468

సీ. శ్రీకృష్ణ దేవ నీ శ్రీనామవర్ణముల్
తనరఁదెల్పు దశావతారములను
శాశఫరము రేఫ జమదగ్ని యదు రఘు
రాములఁగల్కి కూర్మములు కాఁగ
నారసింహుని దెల్పు నావా వరాహ వా
మనుల బుద్ధు నభేదము నవ బలకుఁ

గృష్ణావ తారవుఁ గృత్యమ్ములన్నియు
　నాపాత మధురమ్ము లమృత రీతి
నఘవిఘాతుకములు ముక్తి కాట పట్టు
జన మనోహర శరధిలహరి
నోల లాడించు నందఱ నుర్వి మఱల
హరికి నటువంటి యవతార పమర గలదె　469

వ.　ఇట్లురాముని జనమోహన రూపమునకు మోహము రాముని జన మబలలవలె రాము నాలింగనము సేయదివురుడు నురవుగా నది సీతా సమక్షమునఁ జేయ నొరవు గామి నాగామి కాలంబున శ్రీ కృష్ణావ తారమందు మీ కోరిక తీర్చెదనని మునివరుల కెల్లవరంబొసంగె, ననవిని జనవే జయుండు భక్త జన పరాయణుఁడగు శ్రీమన్నా రాయణుఁడెక్కారణంబున శ్రీకృష్ణావతారం బెత్తె నెత్తెఱంగునం బ్రవర్తిల్లె నెందఱు సతులైరి, యెందరు సుతులైరి తచ్చరితంబుఁగృపారసభరిత మానసుండవై యాన తీయవే యని తీయని మాటల వెనుదీయని బత్తి నడిగినఁగని కరంబు కనికరంబుతో వైశంపాయనుడు వల్లెయని　470

## ఆశ్వాసాంతము

సుగంధి వృత్తము

వృష్ణి వంశదక్ష పాండవేయ పక్ష రక్షకా
జిష్ణు గర్వ జిద్విపక్ష శిక్ష దావ భక్షకా
యుష్ణ భానుకోటి తేజ యుత్తరార్తి మోచకా
కృష్ణ వాసుదేవదేవ కీశ వాభ్రమేచకా　471

గద్యము

ఇది శ్రీనాధ యామునావతార పవిత్ర శఠమర్షణ సగోత్ర బుక్కపట్టణ కులకల శాంబుధి రాకాసుధాకర విద్యా నగర సంస్థాన సముపార్జితనేకాగ్రహార బిరుదాంచిత కర్ణాటక రాజాచార్య పౌత్రశ్రీ నివాస తాతా చార్య పుత్ర శిష్ట జన హితాష్టావధాన రక్షణ చణ వైయాకరణ పండిత స్వీయప్రతిభా సముపార్జిత హూణ రాజకీయ విద్యా ప్రభావ ప్రభావదుర్య రాఘవాచార్య ప్రణీతంబైన కువలాశ్వవిజయము నందు

**ద్వితీయాశ్వాసము సంపూర్ణము**



# కువలాశ్వ విజయము

## బుక్క పట్టణరాఘవా చార్య ప్రణీతము

## తృతీయాశ్వాసము

## భాగవత కథ

శ్రీ మధ్యమ పాండవ సఖ
భామాముఖ విమల కమల భానూదయ స
న్నామా మానిత లోక
క్షేమంకర కింకరాళిసేవిత కృష్ణా 1

వ. దేవా దివ్య చిత్తంబున నవధరింపుమట్లు శ్రీభాగవత కథాశ్రవణప్రవణుండై యమేయభక్తి నడిగిన జనమే జయు మానస మానస మాధాన విధానగతి నవనీత విత్తరస నాస్వాద మానసమాధాన విధానగతి నవనీత విత్త రసనాస్వాద చరిత త్వరిత పునీత మానసునిఁజేయం దలంచి వైశంపాయన మునివరుండు శ్రీకృష్ణదేవు కథ సంగ్రహముగా నిట్లని తెల్పదొడంగె

2

చ. అమర విధీంద్రముఖ్యులు మురాదుల బాధల కోపలే కుపా
యమరసి యోగి పాల్కడలి కచ్యుతుతో నిటువిన్నవించిరో
యమర వరేణ్య దానవులు హాని యొనర్తురు భూమి ప్రాయపా
యమరవఁ గొంతుగోసి నటలాయెఁ బురారి వరాలొసంగుటన్. 3

క. మురదైత్యుని పడిపంచల
నరిగాపుల మగుచు నుంటి మదియట్లుండెన్

నరకుడు వెనుకకు పోవం
డర వాయిగొనండు రుద్రునైనను గడిమిన్ 4

చ. నరకుఁడు వచ్చెవచ్చెనని నిన్నినంతనె యెంతవారలే
నరకట బూఁచి వాఁడన భయంపడి పండెడి పాపలైరి బల్
నరకుఁడు గెల్లి కల్తవిడు లావున రావణుకంటె దంటయౌ
నరకుఁడు నన్నయేని దివఁడాలములేని దినంబునందునన్ 5

క. పోటరి వాఁడాడిన యది
యాటయుఁ బాడినది పాటయై చెల్లెడుఁబే
రోటమి నిదియిట్లని మఱు
మాటయన న్నోచికొన్న మాసటి గలఁడే 6

క. కంసుండు జరాసంధుఁడు
హంసడిభక సాల్వ యవనులఘు పౌండ్రకులున్
హింసకుఁడు చేదిపతి కుల
పాంసను లిటువేలుకోటి ప్రబలిరిదుష్టుల్ 7

ఉత్సాహ:
వట్టిమాటగాదు నరకు వార్తసెప్ప నొప్పియౌఁ
చిట్టి నీరుత్రావదతని పేరుసెప్ప వానిదా
వెట్టి మూట కెప్డు సురలు వేచి యుండకున్న చోఁ
బుట్టెఁడల్క పుట్టి యింద్రు పుట్టిముంచు గ్రించుగాన్ 8

ఉ. ఒక్కొకఁ డొక్కలోకమును నుగ్రవడెంబుగ మ్రింగజాలులోఁ
బుక్కిటఁ బీల్వఁ జాలును సముద్ర మమద్రము బిల్ల బీటుగా
రిక్కల తోడ నాకసము రివ్వున ద్రెవ్వగఁ జాలు నన్నచో
నెక్కటు లిందఱొక్కయెడ నేర్పడ నెంతలు చూడనేర్తురే? 9

ఉ. శంబరు త్రాళ్లుసెప్పఁగ నసాధ్యము మొన్ననతండు వజ్రితో
సంబవువెత్తి తెమ్మనిన శక్రుఁడు తేమిని వాఁడు కోరమీ

సంబును నొక్కి చేతగొని శక్రుడ మంచిది నీదుచర్మ
సంబుపుసేయ నిత్తసరసంబున బావలు తేనినాఁడనెన్ 10

తోదకము:

అనిమిషకంటకి హాని దమోసా
మినరక నామతి నెవ్వగ దీర్పన్
ఘన బదిళమ్ముననగ్రమ్మిగుడెంబ్రా
తిని మడియింపుము ధీవరభాతిన్ 11

క. పడితిమి ఫడరాని వెతల్
పడితిమిసుతగేహములకుఁ బాసితిమి హరీ
పడితిమి చెడితి మటంచును
బడితిమి నీపాల నిడుమఁ బాపుముప్రాపై 12

కరిబృంహిత వృత్తము:

ఇట్టులతి కరుణంబుగను సుర
లెంతయును మొఱపెట్టఁగాఁ
గట్టిగను హరియానతిని నిదెఁ
గంసముర నరకాదులన్
బట్టి తునిమెద మానుఁడల యదు
వంశమున నిల గృష్ణుడై
పుట్టి యల వసుదేవుని కనిఁకఁ
బుట్టుఁ నమరులు తోడ్పడన్ 13

క. సురిచిరగతి నీగతి భా
సురఫణితిని నానతీయ సొంపుగ హరియా
సురలసురులు యుసురులికన
సురుసురగుచు బ్రోవుటేమి చోద్యం బనుచున్ 14

వ. బృందారకు లందరు నిజమందిరముల కరిగి శ్రీహరి యానతింబడి మానాతీత మహిమ వామాహిమకర కులుంబుల హేమాహేములనఁ

ప్రశంసనీయులగు సత్తమ పూరుషులై యపార పౌరుష పూరు యదుముఖ
సద్వంశములఁ దమతమ యంశముఁ బుట్టి పరవాసుదేవుండు వసుదేవునింట
నెప్పుడవతరించి మదోన్మత్తుల యదరణంచి పురందరాదుల దరవు
దొలఁగించునట్టి యసమ సమయంబెన్నడొదవునో యని నవఘనజల
కణంబులకుఁ జాతకీ వ్రాతరీతి నరవింద బంధూదయమునకు
నరవిందాంతర్గళ న్మరందపాన మత్తమిళింద బృందంబుఁ చందంబునఁ
జంద్రకిరణమునకుఁ జకోరవారము తీరున నొక్కటే తీరున ననుక్షణంబు
నిరీక్షించు చుండిరంత 5

చ. మధుర సఖీయు గేయ నృపమందిరమందు రసాల మాలికా
మధుర సమస్త శస్త వసుమానిత భూనుతమంజు మంజరీ
మధురసతన్ మరందరసమత్త మిళింద వసద్రసాల స
న్మధురసఁదేజరిల్లు రిపు మానసమీన సవానమేఘమై 16

ఉ. ఆపురి దేవకీరమణి నానక దుందుభి పెండ్లియాడి పో
నాపురి హెచ్చియామెఁగొని యానక దుందుభి ముఖ్యహృద్యుడై
యాపురి యౌను నీకనుజ యష్టమ గర్భమటంచు నాక వా
కాపురిరంస కంస మదమారును నీకని విప్పి చెప్పినన్ 17

ఉ. ఆనుడి ముల్కి వోలెఁజెవినానుడుఁజేనిది కొన్నదాగెలన్
బోనుడి కంసుడామె కచమున్ బెనవేసి వధింతు నీ పెనం
చూని కృపాణి పాణిఁగొన నోటమి నేటికి బోటి జంపు భీ
తేనియు దీని చూవిదుదునీకాని నీకని బావపల్కినన్ 18

ఉ. చెల్లెలు పెండ్లికూతునిటు సేయుదె యేతటి నీతరిన్ యటం
చెల్లరు దూరఁగంసు నతఁడెట్టలునన్ వసుదేవు మాటచే
మళ్లెను జెల్లెలిన్ విడిచి మాలుబడిన్ వసుదేవుఁడిచ్చెఁగాఁ
బిల్లల నాడి తప్పుదురె పెద్ద లినెందులు దప్పినన్ గతుల్ 19

వ. కంసుడు మొట్టమొదటిపట్టిని చేపట్టిహింసింపఁ బోవు తఱి గావుమని

కాళ్లవేళ్లంబడి దేవకీదేవి తనయన్నుంగని మన్నన నిట్లని ప్రార్థించె నెట్టనిన 20

ఉ. అష్టమ గర్భమే భయ దమంచశరీరి వచించె లాతినే
కష్టము కాదుగావున నకారణ మారణమేల యన్న నా
కిష్టమె యంచుఁగంసుఁడిడి హీనుఁడు వెండియుగాంచు బిల్లలన్
కష్టుడు సంపె నార్వురను గల్గునె పాపికి సుద్ది బద్ధముల్ 21

వ. అంత మఱికొంత కాలమున కాయల కాపలి ప్రరణించు నాలకాపరుల పురిని మాయలకాలయమగు కంసుని యొక్క కనిష్ఠ సోదరియు భావుకీయతియగు దేవకీసతికిఁ గంసుని కనిష్టసూచకముగా నష్టకష్ట దుర్భరముగాను నష్టమగర్భమున కాదఱించి దరియఁ గంసుండు తద్వధూవరుల హింసింపందలంచి 22

శా. అంతర్వత్నిగ నుండదేవకి తదీయభ్రాత విభ్రాంతిమే
యంతర్మానసు లాసుదంపతులఁ గారాగారమందుంచి వాఁ
డంతర్భానుఁడుగా నిశీధ సమయంబందు ద్భువంబంది స
ర్వాంతర్యామియు వారివారలకు దివ్యాత్మా వృతింజూపినన్ 23

ఉ. తల్లికిఁ దండ్రికిన్ విడెఁబదంబుల సంకిలి వీడె వాకిళుల్
తెల్లమి దళ్లుగొట్టినుగలింద సుతాపగ శేషుఁడాయెఁబే
రెల్లిగఁ గన్నతల్లి విడియాక మిళిన్ హరితాత నీతుఁడై
తల్లియశోద శయ్యపయిఁదా బవళించె నెఱింగనట్లుగన్ 24

సుగంధి

ఆడ నందుపత్ని కన్నయాడుపిల్ల నాతఁడుం
దోడుతోన జాయ చాయఁదోడి తెచ్చిపెట్టి తా
నోడకుంట నెప్పటట్టు లుండఁ బిల్లయేడిచెన్
గోడు గోడు రాసబంబుగూసె నింగిమ్రోయఁగన్ 25

ఉ. అల్లయశోద కన్న తనయ న్వసుదేవుఁడు తెచ్చి చాటుగా
నల్లనఁ జంక నెత్తుకొని యాలికడ న్విడిపింప సంకిళుల్

మెల్లన నెప్పటట్ల మఱమేన రరమ్ములు సార్గళమ్ముగా
గొల్లన నేద్చెఁబాల బిడు గొల్లగ వచ్చెను గంసుఁడార్భటిన్ 26

ఉ. హెచ్చులు సెప్పుచుం బురిటియింటికి వచ్చిన కంసుజూచి యా
పచ్చగనున్న చెల్లెలనెఁ బ్రాణభయం బిటలేదు నీకు ని
ప్పచ్చగఁ బుత్రియున్నయది ప్రాణభయంబొకవేళ గల్గనే
నచ్చుగ నీదుప్రాణముల కడ్డము వేయుదు నాదుప్రాణముల్ 27

ఉ. ఆడదిగాని కాడుకొడుకన్న సహింపు మటంచుఁ జిఱ్ఱుము
ఱ్హాడుచుఁ జెల్లికాళ్లఁ బడ నన్న వడింగడ కాళ్లఁబట్టి యా
యాఁడుసుతన్ ద్వయన్ దొఱఁగి యంబర వీధికి ద్రిపి వేయ న
న్నాడనెయుండి యోరి యధమా యిదె నీయరి మందనుండెడిన్ 28

వ. అనిన విని కంసుడు 29

పంచ చామరము:

యోగమాయమాట లెడ్డనుంచి చెల్లె కన్నయ
య్యోగమించి నీదు చూలు నొక్కరీతిఁ జంపి యే
యోగమేనొ నర్చినాఁడ నుల్లమందు గ్రాఁగ కీ
యోగమట్టిదంచు నెంచి యోర్వుఁడీ స్వబంధనన్ 30

చ. అటుతన మిత్తి గోకులమునందున వర్ధిలుచున్న యట్లుగాఁ
దటుకున విప్పిచెప్పి తనదారిని దాఁజన సత్తి కంసుఁడా
కిటుకు నెఱింగి దానుమెయి కృష్ణుని నెట్టులనేని నొంప ది
మ్మిటమగు పిమ్మటంగని శమింపక పిమ్మట జేసె యత్నముల్ 31

ఉ. నందుఁడు బత్నియుందమకు నందనుఁడే యుదయించెఁగాని పు
త్రిందరలించి పుత్రు వసుదేవుఁడు బ్రహ్మ రహస్యరీతి నీ
చందము దెచ్చి మాఱుపడ శయ్యను మాటినటున్న వార్తనుం
డెందమునందెఱుంగక కడింది కడంకును బెంచిరాసుతున్ 32

వ. అటుపిమ్మట కుటిల కుల పాంసనుండైన కంసుండు నిజ శ్రేయస్కాములఁ

జాలగ బ్రశంసించి జాలి వుట్ట వేడికొని వీడుకొనువాడై కారాబంధ మెడలించి వారల నూరడించి వెండియు వారల నూరడించి పరిజనపరివృతుడై నిజనిలయంబున కరిగి పరమోద్దండ భీతి వీతిహోత్రంబు వలనఁ గఱఁగి ధైర్యంబు దఱఁగి తన సెజ్జ పజ్జ నొఱగి మరుగున మఱుగుచుఁ దన తెఱగుగ నున్నవారికివెఱగు పుట్టించు నట్టుగనెట్టకొని యుండి కంటెనిండ నిదురయుఁ గడుపునిండ గుడుపు నెఱుంగక కంటివెంటఁ గుండల కొలందిగఁ గారుకన్నీరు మున్నీరు తరంగలై తుఱంగలింపఁ గుఱంగటఁ దృణంబేని చలింపఁగఁబగ నది శ్రీకృష్ణుండు కృతంబని మనంబున ఘనంబుగ నదరి పడిచెదరుచుఁ దఱచు రుచుల యందరుచి యేర్పడి నేర్పడరఁ బడరాని పాట్లెల్లఁ బడుచుఁ దదేకాగ్ర చిత్తుండై యప్రమత్తుండై నిజభాగినేయు నేయుపాయంబున నైన నపాయంబు నొందించి తానానందింప గమకించుచు నందనందను నొంప జంపు సేయక పెంపున ననుబంపు ననుఁ బంపుమని తెంపున బీరంపుఁ బలుకులు వెలికిఁ బెలుకుఱ నలు సంతయే నలుసులేక నీకెలసము గట్టెంక్కించి నీవలన వలనుగ బసదనమ్ములు బసగల ధనమ్ములు పొసఁగ నొసఁగించు కొనకున్న నన్ను నీపేరఁ బిలువకుము పలువలమని మమ్ము నమ్మకు ముకాసు వీస మునకుఁ దెగనమ్ముమని తగని నమ్మకము వుట్టింపఁ బట్టుదలతో దలతోఁక లేని కఱదలువ వరుద పోర్లుగఁ జెప్పి చేతనయినంతవఱకున చేఁత యందుఁ బొరలు కాడెదమని లేఁత తేఁత సొఱకాయలు అక నఱికిన దానరకఁడు కడుఁబ్రీతి నాలించి యితర వ్యాసంగము భావించి యట్టి శుష్క ప్రియములు సెప్పువారల లాలించి యెదరిందన్ను నెఱుంగక పూతనాది ఘాతుకులను వ్రేపల్లెకుఁబంపి చేయించిన చేఁతలన్నియు సర్వలోకైకనేతయగు గోపాల బాలకునిపట్లఁ జదలఁ బొదలి వెలుంగు పైకెగఁ జల్లిన భూపరాగంబులతో సరాగంబులా పచు దవానలంబు పై మిడిసిపడు మిడుతల దళతములవలె ఘాతకు లందఱు పడి మడిసి మల్లా గిట్టయిరి. వారింగొందఱఁ బైపైని యెదనెదసెదర నీయక వినుమని యిట్లనియె

33

ఉ. పూతన చన్గవన్ గరము పూనుచు గోకులమేగి కృష్ణునిన్
జేతికిఁ దీసి పాల్గుడువ సేయ యశోదయు వల్లువల్లనన్

భీతిల కొక్కు గుక్కతఁడు పిలిచెఁ బ్రాణముతోడ నాపె యా
వ్రేతకుఁద్రెళ్లెఁ బూతనయు వ్రేతలు నార్వఁగ దానిచేఁతకున్ 34

వివిధ కృష్ణకృత్యములు

సీ. పొత్తిళ్ల మను నాఁడు పూతన ప్రాణముల్
గ్రోలె మేలగు నుగ్గుపాలుగాఁగఁ
బిడికిలింతల నాఁడు పిసికెఁ దృణావర్తు
గొంతు పాణికి ముద్దకుడుముగాఁగఁ
జిఱుబువ్వలారగించెడు నాడు కార్చిచ్చు
గొని యానె గుజ్జన గూఁడు గాఁగ
నుత్తాన శయుఁడు గానుండి నుగ్గాడెను
బండి జీలుగు బెండ్లబిండిఁ గాఁగ

గీ. లీల నాఁడెడు నాడు కాళియ ఫణముల
మర్దనము సేసెఁ గోతి కొమ్మచ్చిగాఁగ
శైశవ క్రీడలని యెడు పస్సెమందు
దిగఁచె మద్దుల జత కల్పుతీతగాగ 35

సీ. వత్సవత్సమునకు వలుద వ్యాళంబయ్యె
బకబకంబున కొక పత్రియయ్యె
ధేనుక ధేనుకా దృష్టకేసరి యయ్యె
ముష్టిక ముష్టిదము నసుఁడయ్యె
ముష్టిక ముష్టిదము నసుఁడయ్యె
నఘవాహనమునకు నహితుండి కుండయ్యె
వృష వృషభమునకు ద్వీపి యయ్యెఁ
గువలయాపీడాఖ్య కువలయ పీడార్కుఁ
డయ్యెఁ జాణూర భేకాహి యయ్యె

గీ. వ్యోమకేశిచ్ఛలక్రతు వ్యోమకేశుఁ
డగుచు ఘనలోసల కఘనాఘన సమీరుఁ

డయ్యె రజత శిమోనలి గాబ్బుఁడయ్యెఁ
గంస హంసమునకు వర్షకాలమయ్యె 36

క. నరకునకు మారకగ్రహ
మరయఁగ మురకృత్తిడించి కంస యలీన సా
ల్వరజని కల్యయుఁజేరి ప
కరిహరి హరి దంతవక్త్రకా ననదవమున్ 37

కృష్ణలీలలు

మ. నవనీతాంచిత మస్తు దధ్గముఖ నానాగవ్య శిక్యోల్లస
న్నవ నీతార్గళ కేలి తార్గళ నిశాంతంబేగి కృష్ణుండు తా
నవనీతాత్యశ నాయనన్ మెసవి గవ్యంబెల్లఁ దద్గేహమా
నవనీతాగస మీఁగెఁ జూపుచు రటన్మార్జార కిశాదులన్ 38

క. తెలువఁ బడియుండు నింటను
దెలువయొకతె నిద్రమోవదిగి కృష్ణుండె
త్తెలు వెఱికి కోడె తోకకుఁ
దెలువ కురులు ముడిచి కోడెఁ దెలువునఁ ద్రోలెన్ 39

ఉ. గోపిక యొార్తు నత్తమిలి కోర్కెడు వేళను గృష్ణుఁడేగి కొం
గోపికరంబు నందిగిచి యూరులఁదేలిడి కానకుండు లా
గోపిక పోయి గోపిక యొహూయని జోలఁగఁదేలు మందుగ్గై
గోపిక వాణి యింద యెటఁ గుట్టైను దేలని నవ్వెపక్కునన్ 40

మ. తనచే కందుక మొక్క సందునన్నుగై తప్పెన్పడన్ దోర్లి క్రిం
దన చేయద్మికొనంగ నేగి కని కృష్ణస్వామి యందోర్తు చెం
తన చేలన్ జలకంబు లాడు సతి తద్వస్త్రంబుఁ గొంపోయి మున్
దన చేలంబని యమ్మఁ జూపె విశిఖన్నాదంచు నన్నార్వగన్ 41

ఉ. మంచము మీద దంపతులు మారునికేళిని సోలి కూర్కె లె
మ్మంచు మురారి వారి పసినావలికి న్వెడలించి భర్తఁ బో

మ్మంచును వేఱు దిక్కునకు నంపఁగఁబోనతఁ డింతలోన ర
మ్మంచును ముద్దియంగదిసె నామె తను న్మగఁడంచు బ్రామిడెన్ 42

చ. జనని దధిన్మథించు తఱి శౌరియుటంజని కప్పుపూఁపి యో
జనని మునుంబు వాళ నిఁక జూఁచితి నిమ్మని యేఁవఁగా సతి
జన నివహోద్యపాల్గుడుప శౌరికినోడెడఁ బాలు పొంగె నో
జననికిఁ బాలుడింపఁ దలిసాగ నటుల్గని కృష్ణుఁడుగ్రుడై 43

ఉ. పట్టుగట్టి కట్టై దధిభాండము కొండొక పోవనూకి యా
పట్టున నాదధింబుడమి పాలొనరించె తొలంగి త్రోవనుం
బట్టుడు వచ్చి తల్లి యట బాలునిటన్ దధి బీర పోవఁగాఁ
బట్టుఁడు కొట్టుఁ డంచుఁ దనపట్టిని బట్టి యశోద పేర్కొనెన్ 44

వ. ఇంకొక చోనింటను నుట్టిపైఁ బెట్టియున్న పాలకుండకు శౌరిచేయి సాఁచి
యందకుండె నన్నట్లు
45

ఉ. కల్లరి గొల్లపిల్లడు నొకానొకయింటను భాండమందునన్
కల్లరిరంసఁ దూఁటొడిచియుం జలి జుఱ్ఱుచుఁ బాలకోఁతికై
కల్లరిసేసి కొల్లయిడ నంబకనుంగొని కొట్టఁజేయిరా
కల్లరివాఁడ పోక నిలుమప్పుట రా యటంచునన్ 46

ఉ. నందవధూటి దాటిచను నందను నందఁగ లేక దేలుచు
స్నందతివం దొరంగి హరి నవ్వుచు నవ్వకుఁజేతి కంద నం
దం దవలగ్న లగ్న గుణమంటు బిగించియు లూ ఖలాలికా
నంద పశంబుగా గృహమునం గల త్రాళులు గట్టి వాలమిన్ 47

ఉ. వేసరి యిండ్లనుం బొరుగు వేశ్మములంగల త్రాళ్లుదెచ్చి యె
వ్వేసరిపోమిఁ దల్లి యది యెల్లిదమంచని తల్లడిల్లి నీ
వేసరిరా కుమార గుణహీన నికెట్టులుగట్టుదాన నిన్
వేసరితిం గదే యన వినీతిని గట్టువడెన్ గృపాళుఁడై 48

ఉ. యాదవసింగ మీడ్చుకొని యాటఁగ ఓటిని జోడు మద్దుల
య్యాదవ కీచకోపగయ నారడి పోఁబడఁద్రోయ నంద దా
యాదవ రాంఘ్రిపాత నిహతాగమ జధ్వనిఁ మారు పార్ఘనా
యాదవ గుంపు పొల్లగయు నట్టులు పేరెము పాతె జంతువుల్ 49

ఉ. నారద శప్తులౌ ధనరనందను లర్జున రూపు లెత్తి క
న్నారద దయాపయోధి యదునందనుఁ గన్గొని శాపమీగి కు
న్నారద నౌట స్వాకృతుల నవ్య విమానము లెక్కపోవుచో
నారద వర్ణుఁ గృష్ణుని ఘనంబుగ సంస్తుతి సేసి రిర్వురున్ 50

# రుక్మిణీ కల్యాణము

ఉ. పాపుఁడు నన్ను రుక్మి శిశుపాలున కాలుగ నీఁదలంచె మీ
రేపున రేపు వచ్చి నను నేలుఁ దటంచును నీలు మెప్ప శ్రీ
రూపిణి బాపనిం బిలిచి రుక్మిణి కమ్మను వ్రాసి పంపఁగా
శ్రీపతికోపి కుండినము చేరి కొనెన్వారి రుక్మిణీ సతిన్ 51

క. ఆనక దుందుభి కృష్ణుం
డానక దుందుభులు మ్రోయ నారుక్మికి బల్
వానగ శిశుపాలునకు జ
నానుగ నీక పరిణయంబయ్యెను సతికిన్ 52

# స్యమంతక మణి కథ

శా. సత్రాజిత్తున కర్కుడిచ్చిన మణి స్వభ్రాత విభ్రాంతి మై
గాత్రంబందు ధరించి వేఁటకుఁ జనంగా నాప్రసేనున్వనిన్
దత్రత్యేభ విరోధి చంపి వడిఁ దద్రత్నంబునుంగొంచుఁ బోఁ
బాత్రింబంచును జాంబవంతుఁడు హరిన్ బాధించి దానింగొనెన్ 53

ఉ. అన్న ప్రసేను పోకమది కాగత మేగతిగాక యీమణిన్
వెన్నల దొంగ దొంగిలెను వేఱొక రీపని కేలవత్తురం

చన్నది సంతునోర్ల బడి యాఅడిగా హరి వీనులం బడన్
సన్నగఁ గృష్ణుఁడేగి యదిచన్న తెఅంగునఁ దెచ్చె నామణిన్ 54

వ. ఇట్లు పంకజాక్షుండు నిరంకుశప్రజ్ఞ నుత్తారితి మిథ్యాభిశంసన పంకుండై నిరాతంకంబుగ స్యమంతక మణిని సాధించి జాంబవంతునితో నిరవది దినంబులు నిరవచ్ఛినంబుగ బ్రచ్ఛన్నంబుగ ముష్టియుద్ధమ్మొన రించి యాతని నాతతవమ్మగ యాతనలఁ దుష్టి పఱచి మించి జయించి యాయుచ్ఛ భల్లవల్లభునికి రామావతారంబునఁ దొసంగిన స్వవరంబు నవరగానెర వేర్చి యామణిని జాంబవతీ మణింగొంపోయి సత్రాజిత్తునకుఁ జిత్తంబలరఁ దెచ్చి స్యమంతక మణి నిచ్చుచో నిట్టి నిరపరాధికే యపరాధంబు నిరర్థకంబుగా నెఱుక మాలి యొనరిచితినని యతఁడతి నియతిగని నికొని తన్నుఁ దాదించి కొన నంద నందనుండీ లాగటు నీలాపనిందయే వారికినే పట్టున నాకులంబుగ రాకుండఁగ లోకంబునకు దొలంగ శ్రీకృష్ణుండిట్లని యనుగ్రహించె 55

పద్మనాభవృత్తము

దూరింబడన్బాద్ర శుద్ధంబునందున్
జతుర్థిన్విధుంగన్న వాడూర కొంచున్
హేరంబుల డలన్మహో! శాప మబ్జారి
కిచ్చె న్మృద్గా నింద నాకట్లెకల్గెన్
బూరించితిందీని నేఁగాన నీర
త్నము న్సత్యనుస్సన్ జి నేరే స్మరింపన్
బోరామి విధ్యాభిశాపంబు ప్రాపింప
బోదంచు శ్రీకృష్ణుడిచ్చె న్వరంబున్ 56

క. అంతటు, సత్రాజిత్తు త
నంతటఁ దాసిగ్గు గఱచి హరి కర్పించెన్
కాంతామణి సుతసత్య స్య
మంతకమణి జాంబవంతుఁడటు లిడెపుత్రిన్ 57

# నరకాసురవధ

చ. కడుపగఁ దేరు సత్య కడఁకన్నరకున్ హరి తాఁక వీఁకమై
కడుపగఁ దుర్వ్యనోక్కసరిగా మఱిపోరుచు నింక నొంట లొం
గడుపగ టార్చునట్టు విశిఖంబరివోసి నిగిర్చి వీని నేఁ
గడుపగలించు నంచు శిఖికాండమున న్దెగటార్చె దానవున్ 58

క. నరకుని శిరమటు ఖరతర
శరమున హరి నఱికి యతని శరణమున జెఱన్
గిఱికొని దుఱపిలు గఱితలు
శరణని చరణముల కెఱఁగ సతులుగఁ గొనియెన్ 59

కవిరాజ విరాజిత వృత్తము:
మునురఘురాముఁడు మోపికనిచ్చిన
ముఖ్య వరమ్మున మున్నఱకన్
మునులిలఁ బుట్టిర పూర్వపుఁ గాంతుల
మోహనరూపుల ముఖ్యులుగా
మునుకొని బంధవిముక్తులునై యదు
పుంగవుఁ కౌగిలిఁ బొందిరి సా
మునుపడి పెండిలి మోదము తానయి
మున్నతి సౌఖ్య సమున్నతి తోన్ 60

ప్రియంవద వృత్తము:
నరకు చేతఁ జెఱనాఁటు వ్రేఁగు నా
గఱితలందఱును గైకొనెన్ బరా
బరినిఁ బత్నులుగఁ బద్మ నాభుఁడౌ
నరులు గాంచి పురి నమ్ములైరొగిన్ 61

అంబురుహ వృత్తము:

శౌరికి రుక్మిణి జాంబవతీ సతి
సత్యభామ కళింద జతీ
మీరెడు కాంతుల నాగ్నజితి సతి
మిత్ర విందయు భద్రయున్
సారసలోచన లక్షణ వీరలు
స్వామికి పట్టపు రాణులుగన్
గోరికతోఁ బదియాఱుసహస్రపుఁ
గొమ్మలైరి మహోరహి నాతనికిన్ 62

శా. ఆ నారీమణులందు రుక్మిణికి దేవాకారుఁడై మారుఁడు
న్మానాతీత బలుండు పుట్టెను మెరున్మాన్యుండు పుత్రుండటుల్
మానాతీతులు వేనవేలితర భామా గర్భ వార్బంధులై
నానా శూర వితాన మానహరణోన్మాద ప్రమాథుల్వడిన్ 63

ధీరోద్ధతి వృత్తము

పారిజాతముల భామ కోరఁగా
వారి జాక్షుఁడొగి వాసవున్వెసన్
పోరొనర్చి సతపోరి భూరుహ
మ్మోరి కోరి యిడె నింతి దొడ్డి లోన్ 64

ప్రియంవద

అమర భూరుహము నందు బూయు పూ
లమరఁ బోయి యుదయాన రుక్మిణీ
రమణి వేనలిని రాజిలంగఁ ద
ద్రమణు మాయయని క్రాఁగు సత్యయున్ 65

స్రగ్ధ

అలదేవా నోక హంబందలరు నలరు లవ్వాన్ని యెట్లున్న వట్లే
తెలవారంగా విదర్భాధిపతి సుత తలందేజరిల్లంగ సత్యా

బల చెట్టుం బెట్టి దొడ్డింబడి కడువెతవెం పంగనేc బూనగా
లేములు బట్టై మంత్ర తంత్రాలకుc దిని చననెల్లన్న భట్టన్న మాడ్కిన్ 66

క. అని సత్యభామ కల్పక ప్రసూనవముcదాc గష్టించి తెచ్చికొని నందున నొ(క్రంకనియు నాకల్పమ్ముమనకు నాకల్పమ్ముమం జిక్కవయ్యెనట్లుదక్క మిక్కిలి వెక్కసముగ జింత నొందుచుc జెంత నఱగన్ను మూసికొని సంతత హరినామస్మరణ ధారణలనున్న నారదమునింగని యత్తైఱంగేఱుంగం గోరి యాయనకుc జేయెత్తి మ్రొక్కి లో గ్రుక్కలు ప్రాంగుచు మఱుంగున నిల్వంబడి 67

మ. పటులాలించి తటిన్ని భాంగ మునితోc బల్కెం బ్రసూనమ్ము నొ
క్కటియుం జేర్పcగ నోcచనైతి ముదువంగా నచ్చ వాటున్నదో
యటు లేదో యన నారదుండనియె నోయమ్మా పతిన్ దానమి
మ్మటు సేయన్మటు మాయలాగి విరులక్కా తక్కునీకొక్కటిన్ 68

వ. మునీంద్రుcడట్లనుటయు 69

చ. చనవుగ భర్తదానమిడు చానకుcబూనున గూర్చు పుణ్యముం
జనువుగ సత్యభామవిని యాత్మధవు న్సురమౌని కీయ ని
న్ననువుగc గృష్ణునెత్తుద్రవిణం బిడువారికి శౌరి నిత్తు నం
చును ముని యమ్మ జూపc దనసొమ్మిడెc దక్కట కృష్ణుపై 70

తరలము

తనదు సొమ్ము సపత్నులందఱ ద్రవ్యము ల్పరిరాక బిం
తన దరందుచు శౌరి నాకిcకc దక్కc బోడని రుక్మిణిన్
గనికరంబును వేcడ నామెయుc గాంతు గెల్చికొనెన్నరిన్
గనికరంబునc బెట్టెcదక్కట నన్యమౌ తులసి న్వెసన్ 71

ఉ. దీపవదచ్చు మూర్తులు సుధీమణులాబల కృష్ణు లంత సాం
దీపను తోడు శౌరి పురినేరిచి మోరిచి యెల్ల విద్యలు
ద్దీపన నొచ్చి దక్షిణc బదింబదిc గోరుcడటంచు వేcడి సాం
దీపనుc జేరి కోరి మృతునిన్సుతు నిమ్మన నిచ్చిరట్టులన్ 72

ఉ. పాపఁడొకండు ద్వారకకుఁబాటి హరింగని మన్నడాయెమున్
బాపఁడొకండు నాకిపుడు పత్నికినింగనఁ బ్రొద్దులాయె నా
పాపము బాపవే యనుచుఁ బ్రార్థన సేయగఁ బార్థుడూని యా
బాపని పాపఁ గావఁ దనప్రాణములంగిరవుంచి యంతటన్ 73

కవిరాజ విరాజిత వృత్తము

నరుఁడని పాఱుని నట్టునకుంజని
సారసముల్గొని నాల్గుదెసల్
దిరముగ మృత్యువుఁ దేఱి కనుంగొన
లేని విధంబున లీలను బం
జర మొనరించియు జాగ్రదవస్థను
జాపము నెక్కిడి చాటువడన్
వెరవున నుండఁగ వేచి ద్విజమ్మ ని
వేశ్మము ముందట వీఁక మెయిన్ 74

ఉ. పాఱుడు మోదికొంచు వెసఁబార్థునిఁ గన్గొని నీదురాకచేఁ
బోఱడు పుట్టు కానకయ పోయెను దుందుత ప్రాణి పోయన
ట్లాఱడి నంచు దూఱ నతడగ్గి జొఱంజనఁ గృష్ణుడడ్డమై
పాఱుచు గ్రీడితో దివికిఁ బాఱున కిచ్చెను దెచ్చి పుత్రులన్ 75

ఉ. దేవకి యొక్కనాడు పతిదేవత కంసుడు తొల్లి యార్వురన్
భావజ రూపులం దనదు పాపల రూపణఁగించె నిర్దయన్
నా వగఁ బోవగం గనుమి నందన యంచును నంగలార్పన
త్తావున గావునందిడిన దారిని వారిని శౌరి తెచ్చినన్ 76

ఉ. నందను లందఱింగని మనంబున దేవకి దేవియున్మహా
నందముతోఁ గవుంగిటఁ గొనంగన వారది యేవగించి మా
కెందఱు తల్లిదండ్రులయి రెందఱు ముందఱఁగాఁగ నున్న వా
రందఱిలోని నీవొకతె వంటకు ముట్టుకు మమ్ము మమ్మనన్ 77

క. మాని రహమ్మతి మామతి
జ్ఞానులు మనకతుకఁ బోరుగాన మఱలగన్
సూనుల మఱలుపు మని యాఁ
మానిని దివురుడును వారి మలిచెన్ హరియున్ 78

ఉ. చేలకు లేక చింతయి కుచేలుడు బాలుర నాలుసాకఁగాఁ
జాలక చిన్ననాటి తనసఖ్యము నమ్మి ధనమ్ముకై హరిన్
బోలఁగఁ జూడ ద్వారకకు బోవనెదుర్కొని శౌరి మన్ననన్
జాలఁగ సత్కరించి చెయి సాచుచు నాకెది తెచ్చితోయనన్ 79

క. ఆ మాటకును గుచేలుం
డేమని నోరాడ కూరకే యుండఁగఁదా
దామోదరుఁడాతని యొడి
సామాన్యపుట టుకులుండఁ జవిగొనె ముష్టిన్ 80

చ. అటుకుల నారగించి హరియంతట పామ్మని పంపఁ గొంపకే
నెటువలెఁ బోదుఁ గొంచెమును నీయక పంపెను నన్ను గృష్ణుఁడి
ప్పటికి నభాగ్యదేవి యశుభంబుగ నానడు నెత్తి నెక్కి పై
నటనము సేయఁ గృష్ణునికి నాకిడ నేమియు బుద్ధి పుట్టునే 81

క. ఏటికి వచ్చితిఁ గృష్ణుని
కేటికిఁ గనఁ బడితి
వెటులకే నరుగక యె
చ్చోటికిఁ బోయినను గర్మగతి తప్పునాకో 82

వ. అని ఇటులరియాడు చిత్తంబున నభాగ్యని చోళా వృతోత్త మాంగుడగు
కుచేలముని పుంగవుండు గవుడు విడువ నీమనంబుతోఁ జిన్నమక్కనని
వసతి కరుగ సరిగ ననర్గళంబుగ నిర్గమించి
83

క. పరి కలవంపడి యూరికిఁ
నరిగి తనగృహమ్ము వైజయంత నిభముగా

నిరుపేదరాలి నాలిని
నిరుపాధిక భాగ్యదేవినిఁ గఁగనుఁ గొనియెన్ 84

చ. కని తన నాఁడు తండ్రి తఱిఁగానియుఁదాతల నాడగాని మున్
గని విని యుండనట్టి సిరిఁగాంచుచుఁ గాంచన చేలు సత్కృపన్
బనుపడె నంచటం దనకుఁ బాద్యము గాంచన పాత్రఁ దేఁగ నా
యన తలయాళి నాలిఁదనయాలిని గుర్తిడలేక ప్రామిడెన్ 85

మ. ఒకరే కోకిలవాణి బాణసుత దుఃఖోద్రిక్తయై లేచి చిం
తకు మూలంబెది యానాకో యని చెలుల్త బ్బొబ్బిలాడం చెయిన్
మొక మున్వ్రాలిచి చెప్ప కాత్మగతి నామూలాగ్ర ముం బాడి పా
ల్తుకతా భాండకి చిత్రరేఖ యుష లోతుందియ దానిట్లనెన్ 86

ఉ. ఎన్నఁడు లేని చింత మదినేటికి నేఁటిఁకిఁ గల్గెనమ్మ నీ
తెన్నిటఁ గన్ను కన్నెల సహింపుము నింపుము సంతసమ్ము మే
మింతగఁ జింత వేఁడుకొన నేమియుఁ దెల్పవు కూడునమ్మ నీ
వెన్నకు మన్యగాఁగ హరియింతుము నీమది నంత నంత నాన్ 87

క. ఎడమ యఱచేతఁ జెక్కిలి
నిడికొని కూర్చుండి కనుల నెగఁబొర్లుగఁగా
రెడు కన్నీరును వెడనెడ
కుడిచిటుకొన వ్రేలి గోటికొన మీటుచనన్ 88

వ. ఉషాకన్యతలే షాజన్యవు గోలేని నీకు నేనీకొన వాకొని యెదనన నెదననుచు ప్రియంబున శుంభాండక ప్రియకనయన యగు చిత్రరేఖా కేవలాప్తురాలిగా నన్నెరింగియు నెన్నండను మొగమెఱుంగని దాని వలె వెఱంగుమాట లాడెద వేలనో చెలీ యన బాణపుత్రి డగ్గుత్తిక నిట్లనియె 89

ఉ. అద్దమరేయి శుద్ధమదనాకృతి యాకృతి యొక్కడెవ్వఁడో
నిద్దుర లోన నన్ గవిసి నిద్దముగాఁగఁఱఁగిచి కేళిలో

గద్దఱి తెప్పపాటునఁ గకావిక నూడని బాడెవాఁడు వేఁ
డద్దిర నాకు వచ్చెఁగల యంతటి భాగ్యము గల్గునే చెలీ 90

మణిగణ నీచరము

వినికని యెఱుఁగను వెలఁదిరో యతనిన్
మనమునఁదలఁచిన మఱిమఱి పులకల్
మునుకొని యొడలున మొలచెడి నతనిన్
గనుఁగొనఁ దహతహ గదిరెడు మదికిన్ 91

వ. అదివిని చిత్రరేఖ యిట్లనియె 92

ఉ. ఏటికి బోటినీదు మదినింతగ వింతగ జింతసేయఁగాఁ
దేటగఁ జూడు నాతెలివి తేటలు నీపని గోటమీటనే
మేటి పటంబు నందుఁ బుడమింగల యందఱ వ్రాసితిన్ సుమీ
యాటకు రేయి వచ్చి చనినట్టి వటారినిఁ బట్టుకొమ్మనెన్ 93

వ. దాపటకుందాపట దాపరించి యుండు నాపటుతర బుద్ధి కుశలత గల చిత్రరేఖ చేతియందుఁగల యాచిత్తరవు పటముం దనచేత నుఱికి లాగికొని ముందాపట మందుఁ గల యందరపి దారసిన వాని గలయదరపి యెరపి కనుఁ గొనఁ గనుఁగొనఁ దలంచి

94

సీ. ప్రతి మాలినట్టి యాప్రతి మాలిగాంచి య
ప్రతిమాలిఁ బ్రతిమాఱి ప్రతినలెంచి
సురల నసురుల భాసురుల భూసురులఁగి
న్నరుల వానరులను నరులఁ గాంచి
భాకరు ల్భీకరు ల్శ్రీకరులైన వి
భాకర కులరాజి పాళిఁ గాంచి
భారత రాజి కృద్భారత రాజుల
భారతి రాజుల బారులెంచి

గీ. యాదవుల యాదవుల కయి యాది గొంచు
చేరి సాత్యకి శౌరిని మారుఁ దేరి

పొఱఁగని యంత నొక్కింత భ్రమసి యవలఁ
గని యతఁడ మన్మన శ్చోరుఁడనుచుఁ బొంగె 95

వ. అందుపైన యుండుపైనమున కనుగుణంబుగను గుణించుచు నాజిత్తులమారి
మాయదారి చిత్రరేఖ యుషకు మిషవెట్టి యిట్లనియె

96

క. ఔరా యితఁడటె నీమది
చోరుండిలను నవనీత చోరు మనుమఁడా
మారు కుమారుఁడు మారుని
మీరెడు ననిరుద్ధుఁడనెడు మేటి మగండున్ 97

గీ. ఎల్ల బల్లిదులుండంగ నిట్టి వట్టి
పల్లరపుగొల్లపిల్లని బట్టితమ్మ
లలన కొండను ద్రవ్వి యెల్కను గడించె
ననెడు మాటకు మాదిరి యయ్యెనిపుడు 98

మ. అతివానవ్వుచు మాటసామెతగనే నట్లంటినే కాని వీ
డతివాస్తోష్పతి శౌర్యుఁడుండు పురి మధ్యాంభోధి యత్యాహితా
యతిరానింగన బ్రహ్మరుద్రులకసాధ్యంబేల బేలా బలా
యతి వాదం బతఁడందరాని ఫలమమ్మా నమ్ము మమ్మాటికిన్ 99

వ. అనిన విని యుష విష విషమ భాషణమునకుఁ దోషణము దొఱంగి మిన్నులిఱిగి
మీద నొఱంగిన తెఱంగున వెఱంగుపడి పట లిఖిత చిత్రరేఖ వలె మ్రాన్పడి
యుండ బాణ పుత్రికిఁ జిత్రరేఖ యిట్లనియె

100

గీ. దీననేమాయె నేమాయె ననువు పఱిచి
నగుచతనిఁదెత్తుఁగనుము నిన్ననువు పఱిచి
పెఱనుడువు లేల విను నీవు పెరటిచెట్టు
మందునకు వచ్చెనంచు నన్మదినిమెచ్చ 101

శా. విన్నన్ ద్వారక కేగి వేగ విడినే విన్నేలి విన్నేలఁగాఁ
జెన్నారంగొని వచ్చి నీకిడుదు నాచిన్నారి పొన్నారినిన్
దిన్నంగా నను నీవనన్ యది సుహృద్ది వ్యాప్తదైఃకింఫల
మ్మన్నట్లావల మాఱుపేరిడుమునా కట్లొను దేకుండినన్ 102

వ. అని చిత్రరేఖ యున్నట్లు సేయందలంచి యున్నట్లుండి కొండొక పణ్ణగంబు వన్ని పన్నగశాయి మనుమనిదోడ్తేర మనమ్ము నను వు పఱిచికొని తెఱ నమ్మృద్ధియముదలి సౌదలధరించి కొని మెదలకుండ నటనుండి కదిలి శోణపురి వదలి చదల కెగసి యంతటంతటంబడి యంతటనున్నది యల్లంతట గానిపించి కనుఱెప్ప పాటులోఁగను చూపుమేర మఱి సమీర ప్రేరిత వారిధర వారిదంబు లేరున విహంగమార్గంబున వనగిరి దుర్గంబులు గడచి వాయువేగ మనోవేగంబులందల కడచిన నీడల్లోడలక యెడ నడచుచుంగనువారు తారాయో తారా పథఘటిత చటుల తటిల్ల తయో యని తటకాపడి చూడరావుబాణమ్ము తీరున ద్వారకకు దారకకుఁదార తెగిపడినట్టు మోక్షపెట్టున ఱివ్వునదిగి వ్రాలి

103

చ. ఒకనిమిసమ్ములోనఁజొని యప్సర వీధిని నుప్పు సంభ్రమం
దొక ఘన సౌధమందునఁ బరుండిన యాయనిరుద్ధు నాపె తాఁ
బ్రకటిత మంత్రశక్తిఁగొని బాణుని వీటికిఁదెచ్చి శయ్యపై
వికచసరోజనేత్ర కడవీడి యుషాంగన కొప్పగించినన్ 104

చ. అతఁడట నిద్రమేల్కొని యనగర్ఘ్య గృహమ్మున హంసతూలికా
కృత మృదు శయ్యపైన నళికేశనుషందను గాంచి స్వప్నమో
మతి భ్రమియించె నోయిటులు మంచిది యింత నిజంబయేని నా
బ్రతుకున కబ్బినట్లు ఘనభాగ్యము యోగ్యము నాకు గైకొనన్ 105

వ. మఱియు ననిరుద్ధుండు నిద్రాప్రబుద్ధుండైలోన లోననుండి బుద్బాదంబులు వలె నద్భుద్భుంబులగు బుద్ధుల కొలంది నవ్వెలందిఁ కంజేక్షుని యెలనవ్వెల యనవ్వి వితర్కించుకొనుచు

106

ఉ. కాదిది ద్వారకాపురము కాపురమేరిదోకాని కాని వా
రాదర మేది రాతిరి విహారము తిన్నను దెచ్చినారొయే
మైదొనరించి సొమ్ముగొని మైదొలంగింపగ నిప్పురం బెటన్
నాదెట రాజధాని విధి నన్నిట నన్నిటఁబాపి తెచ్చితే 107

చ. అని యిటులన్ను దన్ను గవియంగని యంగనఁ బిల్వ లేని చె
ల్వొనకును నిల్వలేని తమిబూని యనూన మనోను రాగిణిన్
దనుజ తనూజనైజరుచి తర్జిత యౌవతుండు నా
మనసిజ సూనుఁడార సునిమండిత హారమణింగలంచుడున్ 108

ఉ. ఈగతి నిర్వురొక్కటిగ నేర్పడి నేర్పడ రంగరంగపై
భోగ సుఖంబు లందనివి పొంపిరి వోవఁగఁ మోహముర్వ్యకున్
వేగుట గ్రుంగుట ల్దెలియనేరక యేరికెఱుంగ కుండిరి
ట్లాగెఁ గ్రామానమాన బలువేకట వేఁకటి యయ్యె భామకున్ 109

మ. వినియంతం తనరాని కోపమునఁ దావేగంబున న్మేడకుం
జని బాణుండనిరుద్ధునింగని మహాశౌర్యంబుతోఁదాకి నీ
వన నెవ్వండవు పోఁతుటీఁగ సారసాధ్యంబింత లేనట్టినా
తన యాంతఃపురమెట్టుసొచ్చితివి నిందాబుద్ధివై దుర్మతీ 110

క. కొఱగాని నరుఁడ సీతల
దఱిగి యిదేనాదుహేతిదైత్యావళికిన్
గఱవెల్లఁదీర నీదగు
నెఱచింగఱచికొని తినఁగ నిపుడిత్తుననెన్ 111

క. అనిన నొక గుదియగైకొని
యనిరుద్ధుండతని నెదిరి యత్యుగ్రముగా
దనుజాధమ మనుజాగ్రణి
నను నెవ్వనిగాఁ దలంచి నావాడుదురాత్మా ! 112

శా. నీకూతాశ వరించి తెచ్చికొనఁగా నేవచ్చితింగొమ్మతన్
జేకొమ్మన్నను జేసి నాఁడ నటునానేరంబె నేరమ్మనన్

గైకొంటందగు నాఁతి తాత తగు నానానిప్పుడే విన్మిటుల్
గాకున్నం గలహింప నిచ్చగలదే న్గానిమ్మటే నిమ్మగున్ 113

గీ. నాలుకకు వచ్చినట్టుగఁ బ్రేలఁబోకు
చిన్నవాఁడ నటంచు నన్నెన్నఁబోకు
బాలుఁడో వృద్ధుగెల్పునఁ బడయు ఘనత
పందిఁబొడిచిన వాఁడెగా చింట ధరణి 114

క. అని బాణుని తల పగులఁగ
ననిరుద్ధుఁడు పరిఘమోది యతడవలకిఁబో
మునుకొని దానవసేఁనల
మునుకొని తెగటార్చి నూఁచముట్టుగ గడియన్ 115

క. బాణాసురు సైన్యంబులు
బాణాది విశిష్ఠ యుద్ధ పరికరములు నున్
బాణ యదుబాలు పరిఘుకు
బాణమునకుఁ జాలక వనిఁ బడియెన్లీలన్ 116

గీ. బాణదానవు సేనలు రాణవచ్చి
బాలకుని యొక్క గుదెకింత చాల కొఱిగెఁ
గలనఁ గడవంత గుమ్మడికాయ కత్తి
పీఁటకును లోకువ యటన్న మాట గాఁగ 117

గీ. నిక్కముగ నెంచ నయ్యె వారొక్క యెత్తు
ఘన కమండలు వొక యెత్తు గాఁగ గోప
బాలుఁడనిరుద్ధుఁడెత్తిన పరిఘ యెంతొ
కొల్లకొల్లఁగ దయ్యాల నెల్ల మ్రింగె 118

వ. ఇట్లు నాగయుత ప్రాణుండగు బాణుని సర్వసైన్యంబఖర్వ దైన్యంబు నొంది
మ్రంద సకల స్వపరికరంబులువిఫలంబులగుడు మద మత్త దనుజుండును
దన తనూజంగనుంగొని

119

ఉ. బీతొకయింత లేదపుర పిట్ట యలంతియుఁగూత మెండు నా
ఖ్యాతిగ బాలుఁడల్పుఁ డొకఁడందఱు దైత్యుల నుక్కడంచె నా
తాత తరంబుగాది తనిఁదధ్య సమీకము చేత గెల్వఁగాఁ
బ్రాతిగ నంచు బాణుఁడహి పాశము చేతను గొట్టె బాలకున్ 120

శా. బాణుండాస్మరసూను శోణితపురి న్బంధించెనన్నట్టి యా
వాణి న్నారదుచే నెఱింగి హరి సర్వత్రాత ప్రాతిం జతుః
పాణుల్మోవసు దర్శనాదులఁ బ్రలంబఘ్న స్మరుల్తోడరా
బాణావిందెగఁ గొట్టి పాణుల పడెన్ బాణు స్గతప్రాణుగాన్ 121

పంచ చామరము

పినాకి తాకి కృష్ణు న్మొర్మి పేర్మిఁ బోరిపోరి యా
ఘనాఘనాభుఁడేయు కాండ కాండ మోర్వలేక యా
సనాతనాత్మవిష్ణుతోడ సాటి యేటి కాదు నం
చనాది నాథు సంస్తుతించి యేఁగె భోగి భూషుడున్ 122

గీ. కట్టకడకు శివుడు కలహ పుస్తకమును
కట్టిపెట్ట కృష్ణు కావుమయ్య
బాణు నెట్టులైనఁ బ్రాణంబుతో వీడు
మంచుఁ బల్క శౌరి యాదరించి 123

ఉ. బాణుని నిర్భయుండవయి పాణి చతుష్టయి నుండు మంచు స
త్త్రాణుఁడు కృష్ణుఁడన్నను సుధాయము దేయము కంటె రెట్టిగా
బోణిమి నిచ్చి పంపఁ దనపుత్రిక నల్లుని కంపకమ్ములన్
బాణుఁడు నందనందనుఁడు పౌత్రు నుషంగొని యేగె వీటికిన్ 124

ఉ. ద్వారకకేగి కృష్ణుఁడిటఁదాఁగిలి నట్టి విశేషమెల్ల వై
శారద చిత్రరేక కృతి చాతురి బాణుని కూతు రీతియున్
మారుకుమారు నిద్రదుట మాయముగాఁ గొని పోక లోనుగా
నేరము లెల్ల జెప్పి కడునేరమిఁ బెండిలిసేసె వారికిన్ 125

చ. హరివిభవావతారముల నంతయు లన్నిటికేమి గాని యె
వ్వరు వరమెద్ది గోరినను వారిగ వారికిఁ గోర్కెదీరఁగా
నరమరసేయ కాయదిది యందని యంగ నొసంగు ధన్యుఁడీ
ధర యదుపుంగవుండొకఁడు దక్కమఱొక్కఁడెవండు సెప్పుమా 126

చ. ఎడపక చాల వ్రేల్మిడిది యెంచఁదలంచితి వేని వానినే
నొడివెదఁ గానసాత్వతి తనూజునకు న్నరిమిత్తి యౌటకున్
గడువఁగఁ గాళ్లవ్రేళ్ల బడఁగా హరియట్లె శతాపరాధముల్
గడువఁగ నోర్తు నంచని యిఁక న్వఱ గోరు మెదేని నిత్తునాన్ 127

చ. జడిమన దృష్టి హానియయి సాత్వతి కోరఁగ నోరురాక తా
నడుగ నిఁకేమి లేదనుచు నాఁగెను గాక నిజంబుగా హరిన్
గడుసయి యత్త తత్తనయుఁగావుము చంపకుమన్న మన్ననన్
బడిపడఁదిట్టు గాక శిశుపాలుని జోలికి శౌరియేగునే 128

ఉ. కైదువు నాజిఁ బూనని కట్టడసేసెను శౌరి హేతినా
కైదువు సారులూన్తువని గంగ సుతుండన సంతసిల్లుఁ గా
కైదువు యీతఁదేలువు ననంచును గృష్ణుఁడు పట్టి చక్రమున్
గైదువ మార్పు భక్తి జనకల్పక మేగడె భీష్ముపైఁబడన్ 129

ఉ. అప్పుడు గాదె తేరుదిగె యర్జునుఁడచ్యుతుఁ జిక్కఁ బట్టి నా
గొప్పను వెత్తిసేసి యడుగున్నను జేయుదె రద్ది పాలునా
నెప్పటియట్ల తేరి నొగలెక్కఁడె గృష్ణుఁడు పార్థుపై దయం
ద్రిప్పుచు నల్క భీష్ముపయిఁదేరి హయంబులద్రోలఁడే వడిన్ 130

చ. మఱలక పల్వురేగి యభిమన్యుని నొక్కనిఁజేసి చంపఁదో
డరుగు యుదిష్ఠిరాధులకు నడ్డమువొచ్చిన సింధురాజు ని
బ్బరముగఁ గూల్తు నెల్లి నల భానుఁడు గ్రుంకకమున్నెయన్న యా
నరునుడి నెగ్గ నెల్లుఱుగ నయ్యెడ సంజను శౌరి కూర్పఁడే 131

చ. ఖలుఁడగు ద్రోణనందనుఁడ ఖండమ పాండవ మస్త్రమేయఁగా
విలవిలలాడి కాళ్లబడి వేఁడగ నుత్తర గుర్విణీ స్థితిన్

నళినదళాక్షుఁడాదుకొని నాఁతిని నోడకు మంచు జొచ్చిత
న్నిలయము గాచె గర్భశిశుని న్నలుసంతయు నొవ్వకుండఁగన్ 132

చ. తనదగు విశ్వరూపము నుదారముఁ గన్గొనఁ గోరువారికిన్
దనరగఁ గొల్ల నెట్టిఁ చిననాట యశోదకు నోటఁజూపెఁగాఁ
బనుపడఁ గాండివేయునకుఁ బార్థున కొక్క పిసితేనికిన్
ఘనుడగు నాంబికేయునకు నారదమౌని కుదంక మౌనికిన్ 133

ఉ. ఎవ్వరెదేది గోర హరి యెచ్చును జచ్చును జేయ కిచ్చెఁగా
జవ్వనులౌ మునీశ్వరుల జాయలు కూటమి గోర నాటలన్
బువ్వము లారగించి కడుబుద్దులు నేరిపి నోరు పుల్లనన్
జివ్వను గోర ఋక్షపతి సెసెను మాసము ముష్టియుద్ధమున్ 134

చ. నరకుని కారలోఁబడిన నారులు గోరుఁడుఁదన్ను భర్తఁగా
నరమరసేయ కల్లగ జయానలు మౌనులుగానఁ దొల్లి యె
న్నరమణుల న్వజించె యమనందను రాజును జేసెనుర్వికిన్
నరునకు సర్వమాన్యముగ నైజకటాక్షముఁ గట్టిపెట్టఁడే 135

మ. తొలుకాడించెను శౌరి సత్త్వగుణము న్దూర్వాసుఁడేతెంచి స్వ
స్థలమందుండి యొగర్చికొన్ని పనులేసన్ రుక్మిణి న్మపృంతి
ప్పలు వెట్టించుచుఁ గచ్చడంబునకు నబ్బామామణింగట్టి వీ
ధుల కన్నెల్తని యెండలో సుడివడంద్రోలించి లోలించుచున్ 136

ఉ. తల్లిని దండ్రి సంకెళుల దొంపియు దాపక వారి పిల్లలన్
బొల్లుగ దెబ్బ కొక్కనిగఁ బొట్టను బెట్టుకొనం గడంగుచున్
బల్లిదుఁ దండ్రిఁదానదిమి బ్రాజ్యము రాజ్యము గూడ లాగి కొం
చల్లరిసేయు కంసుని దురాత్ముని గృష్ణుఁడు చంపుటొప్పదే 137

ఉ. బూాలగ భీతుజెంది తనుబ్రోవు మంటచును వేడు వారలన్
బోలఁగఁజూచి భీతు తుదముట్టగ మాన్పను గృష్ణుఁడంత తాం
బూలముఁ బుచ్చుకొన్నతఁడు మొత్తెఁ దివిప్పముఁదావె దావమున్
గాలియు నెక్క త్రొక్కి బ్రజ గావఁగనేర్చెను వేనవేలిటుల్ 138

సీ. బ్రహ్మాది దేవతల్ ప్రార్థించి కీర్తింప
భూభార మణఁగింప బుద్ధిపుట్టి
యల రమాపతి కృష్ణుఁడై యదుకులమందుఁ
దమిని ద్వాపర యుగాంతమగు వేళ
శ్రీముఖ వర్షన భూమాస రోహిణీ
యుత బహులాష్టమి నుద్భవించి
యిల నూట యర్వది యేడేళ్లు నెలలేమి
దినము లెన్మిది యుండి తిరిగి కలియు
గీ. గాదివేళ బ్రమాదియుగాది చైత్ర
సుద్ధ పాడ్యమి వేంచేసె బుద్ధముక్త
నిత్య సత్పూజితుండయి నిజవికుంఠ
ధామమునకు జగమ్ముల సేమమరసి 139

వ. ఇక్కాల పరిమితి లెక్కసేయ నెక్కువ ప్రయాణంబుల నీఁదగిన సద్గ్రంథ దృష్టాంతము లిక్కడ మక్కువకై వక్కాణించెదఁ జక్కంగ వినుము 10

సీ. భాగవతములోని పదునొకండవ స్కంధ
మందు షష్ఠాధ్యాయమందు మఱియు
రాణ శ్రీవిష్ణు పురాణము పంచమా
శము ముప్పదేడవ సర్గమందు
బ్రహ్మాదులరిగి ద్వారకకు గృష్ణుని తోడ
యదువంశమందు నీవవతరించి
నేఁటికి జరిగెను నూట యిర్వది యైదు
వత్సరంబులును మహోత్సవముగ
గీ. బ్రౌమది నికింక రమ్మని పిల్చిరట్లె
యాపురాణ చతుర్థాంశమందె కృష్ణుఁ
డే దినమ్మున దివికేగె నాదినమ్ము
నందునే కలి చొరఁబడెననిరి మునులు 141

తే.గీ. పరఁగ నలి యుగాది వత్సరమ్ము ప్రమాది
చివికెఁ గ్రీష్మఁ దరుగు దినముఁ జూడఁ
బరఁగఁ శుద్ధపాడ్యమి యయ్యె నం
మునుకఁ బుట్టి దొట్టి గణన యిడుము 142

వ. పుట్టి తెత్తెంప శ్రీకృష్ణావతరా కావసరంబుఁ దొట్టి నూట యిర్వదియై దొట్టంబు యేడుమాసంబు లష్టదివసం బులె తన నిర్వాణ కాలమ్మునకు సరిగ సరిపోవును గావున నింతకంటెవేఱు ద్వధాధ్యవసాయమ్ముగవ్యవసాయమ్మొద్దియు లేమిగాన నిదియె రూఢియని యెరుంగునది

143

క. శ్రీకృష్ణుండొనరించిన
స్రైకము కార్యములలోనఁ బముఖము సు
మ్మా కౌరవులను చారిఁ గొ
శ్రీకరముగఁ గట్టి పెట్టె సిరి పార్థులకున్ 144

వ. శ్రీకను యదుపుంగవుండు నొనరించిన ప్రాచీన బర్హిర్ముఖర్హిర్ముఖ గణ పరిగణనీయమైన ధర్మ కార్యములు వాచావు గోచరములై యుండు నాపన్న శరణ్యుండగువాని కల్యాణగుణముల నన్నింటు నెన్న నాపన్నగేంద్రునకుంగాని నన్నుబుట్టించిన బ్రహ్మదేవునకుంగాని గూడ యలవిగానిచో నేనెంత వాఁడ ననుచుఁ గథ వినుచు వైశంపాయనుండు తన తాత ముత్తాతల కథలనువదింప విని జనమేజయుండు సర్వత్రాతయగు యదునేత భారతరాజులకు భారత రాజియందుఁ ప్రవేశించి యపార కృపారసంబు మీఱఁ గౌంతేయుల కేలకేలూఁత యీవలసి వచ్చె వచ్చెఁబో యాజగన్నాటక సూత్రదారుండేల కౌరవులనెలఁగలపి వారిజ్ఞాతులు నగు పంచపాండవులను వారి నేలగెలిపించె వారిధి పరీత భూతలంబునంగల రాజులనేల యాఘోరతరాజిఁమడియంజేసె వారలేలు నేల యంతయు గడించి యుధిష్ఠిరుచే నేల యేలించె నసహాయ శూరులైనవేయులు నగు పాండవేయులకు శ్రీకృష్ణుఁడేల సహాయపడ వలసి వచ్చె వచ్చెఁబోఁ బొచ్చెములేని నెచ్చెలిగ మధ్యమ పాండవుఁ గటాక్షించి కంటికి రెప్పవలెఁగాచి రక్షించె అది యనావమాలాగ్రంబుగా దయదైవాఱ వినిపింపవేయని యడుగుటయు 145

కుసుమ విచిత్ర వృత్తము

అనుస్మృతరాధా యపహృత బాధా
వినమిత వేధా యధికృత బోధా
వినమిత వేధా వినిహత మోధా
మునిసుతగాధా ముదిత విరాధా 146

గద్య

ఇది శ్రీనాథ యామునావతార పవిత్ర శఠమర్షణ గోత్ర బుక్కపట్టణకుల కలశాంబుధి రాకాసుధాకర విద్యానగర సంస్థాన సముపార్జితానేకాగ్రహార బిరుదాంచిత కర్ణాట రాజాచార్య శ్రీవేంకటాచార్య పౌత్ర శ్రీనివాస తాతాచార్యపుత్ర స్వీయ మేతాసమాసాదిత రాజకీయ హూణ భాషా పాండితీ మండిత అష్టావధాన కరణ చణ శిష్టజనహిత వైయాకరణ పండిత రాఘవాచార్య ప్రణీతంబైన కువలాశ్వవిజయంబునందు

## తృతీయాశ్వాసము సంపూర్ణము



# కువలాశ్వ విజయము

# బుక్కపట్టణ రాఘవాచార్య ప్రణీతము

## చతుర్థాశ్వాసము

శ్రీరుక్మిణీ మనోహర
కారుణ్యాంభోధి శౌరి కౌంతేయ సఖా
నారదగేయ యమేయా
నీరద నిభనీలకాయ నిఖిలధ్యేయా 1

వ. దేవా దివ్య చిత్తమున నవధరింపుము.- అట్లు జనమేజయుండు బలు విడిబులు గడిగిన విడి ముత్తెమువలె నలవడి వడినడిగిన వైశంపాయనుడు కృష్ణద్వైపాయన ముని విరచిత సలీలా సుధారసాపార కాసార సకలసారస ససార భారతీ భారతమతిని మతి తనివిదీర వినుపించి పునీత చేతస్కునొనరించు మనీష సత్కాల నినీషనీషత్కాల నిమీలితలోచనుండై యఘునివారక పంచమ వేదంబు నిజజ్ఞాన లోచనమునకు గోచరంబుగావించుకొని యా కథమనోగతంబుగా గ్రహించి యాతనికి శిష్టవిశిష్ట సంగతులను శ్రీవ్యాసముని రచిత మహా భారతంబు వలన నెరుంగుమీయని భారతకథ ఇట్లని తెల్పం దొడంగె 2

ఉ. హస్తి పదాది ఘోటక శతాంగ మహాంగ సమృద్ధి మద్దస
ద్దాస్తిక సాది సారథి యుతారి ధరాపదురాప సాలమున్
హస్తిన బాధ్య గోపురమునై స్థిరమై స్థిరమెప్పు నెప్పుడున్
హస్తిపురమ్ము హస్తి మశకాంతర మాపురి కన్యప్రోలికిన్ 3

క. శంతనుఁ డాప్రోలేలెను
శంతనుఁ డితఁడనుచుఁ దన్ను జనులు నుతింపన్
శాంత సమాధి గుణమ్ములు
సంతసపడి యుండ నిలిచి సడలక యుండున్ 4

ఉ. శంతను వంటి భూమిపతి జన్మశతంబుల కైన నబ్బు నా
సంతత పుణ్యసత్యవతి జాహ్నవి పత్నులు పుత్రుఁడష్ట ది
క్రాంతనట వ్యాసుఁడును, భాగవతాశ్రయ భీష్ముఁడేల నే
లంత సతమ్ము సుమ్మచట నంతయు గూడెను మంచి యంతయున్ 5

వ. రాజకుల సరిద్రాజరాజగు శంతను మహారాజు గంగ యందు ముంగలగఁ దాఁగనిన తనయుడును దిన్రు తనయుఁడును నగు భీష్మునకుఁబెండ్లిసేయఁ గన్నియ నడుగ బోయి యొకబోయ పల్లెయందునందీమున కెందు సరిలేని యొక సుందరిన్ గని దరియంజని అక్కన్నియ మున్నొక్క తటియమునపైఁ దరి గడుపుచుండఁ బరాశరముని వరుండు మార్గ వశంబున నరుగుచు నట తటస్థపడి యాకన్నెపైఁగన్నిడి కన్నెటికంబు వెట్టిచన, సద్యోగర్భంబున ననవద్య జన తరుణోపాయ కరణ పరాయణుండగు బాదరాయణుఁ దనయుగాను వదాతనయుగాను సరణంబుగ నిర్దుష్ట కన్యకాత్వమును మత్స్య గంధినామ ప్రత్యామ్నాయము యోజనగంధి నామంబుస్థేమంబుగ నాముని వరదానం బడసిన వరానీనగా నెఱింగి యాజవరాలి నాలిగ తాగైకొన నాలిగ రాజు తలంచుడు జ్యేష్ఠ పుత్రుడు భీష్ముండు పెండ్లిమానినన మానిని నిమ్మానవ పతికిత్తునని యామె జనకుండు సెప్పిన నా శంతనుండు మంతనమ్మునఁ బెరుగు పెద్దటికము చెఱిచె నన్నట్టు లామెపై బ్రామిక విడలేకయుఁగొడుకుం బెండిలి కెడఁ బాపఁగడు బాపమనియు నెటులుం బాల్పోక యాలుపై నొకయింత చూలుపై నొకకొంత మనసు బెట్టుకొని బియ్యము మీఁదను వియ్యము మీఁదను నాశయుంచి కొన్నవానివలె నుఱియాడు చిత్తంబున నత్తలపడుచున్న తండ్రియవస్థం జూచి సవసవగాఁ దెలిసికొని నిలింప వ్రతుండు చలింపని భక్తి నాజన్మవ్రతంబుగ బహ్మచర్యంబు బూనిన నాస్థవిర నృపతి యాస్థకొలంది నావెలందిని బెండ్లియాడి యాచేడియ యందు జిత్రాంగద విచిత్రవీర్యులను నిరువుర కొమరుల మరువంటి సౌందర్యశాలులఁగని

తనకుఁగానైహికసుఖంబుల నుజ్జగించిన స్వసుతుదేవవ్రతు బుజ్జగించి స్వచ్ఛంద మరణమతనికి వరముగఁ గరుణించి తరుణవయస్కులగు సత్యవతీ సుతుల తరణోపాయమరసి యా యిద్దఱ బెద్దకుమారుని పోష్యవర్గమందుంచి యాస్థవిర రాజు దివికేగిన తదనంతరంబ చిత్రాంగదుఁడ వివాహితుఁడు గా విచిత్ర వీర్యుఁడు వివాహితుండయ్యు ననపత్యుఁడుగా సంతానవంతుఁడు గాకయ మున్న తనదేవు లంబాం బాలికలవిడి కాలధర్మము నొందుటయు, భారత కులాభివృద్ధికి భీష్ముండు జన్మావధి బ్రహ్మచర్యావిధి వ్రతస్థుఁడై యుంటఁ దల్లి సత్యవతి వంశవృద్ధిని గూర్చి బుద్ధి నహర్నిశము తలపోయుచున్నంత 6

ఉ. మిత్రజనోత్పలమ్ముల కమిత్ర మహోత్పల రాజికి న్నిజ
చ్ఛత్రము చంద్రుడై వెలుగ శాంతన వార్యుఁడు నేల నేలఁద
ద్భ్రాతృ విచిత్ర వీర్య నిరు భార్యల శిష్వలఁ గూడి వేడ్కఁద
క్షేత్రములందు వ్యాసముని దేవరన్యాయమునం బ్రసూమతిన్ 7

ఉ. బుత్రులఁగాంచె నిర్వురను మున్నుతర రాష్ట్రుని నంతఁబాండునిన్
నేత్రవిహీనుఁడై యట జనించెను వారలలోనఁ బెద్ద స
త్పాత్రుఁడు చిన్నవాఁడకట పాండు తనుండుగ నుద్భవించెఁద
న్మాతృ కృతాపచారముల మానునె యేరికిఁ బూర్వకర్మముల్ 8

గీ. తల్లిబాధను మౌనిమతల్లి బాద
రాయణుండెప్పి మాతృపరాయణుండు
కడకు రాదాసి నిశి తనకడకు రాగ
గని ప్రసాదించెసుతునీతిఖని విదురుని 9

మ. జనుషాంధుండు వరించెఁ బత్నిగ మహాసాధ్వాద్య గాంధారి నా
వనితా రత్నము చూలుదాల్చి యెటకు న్వాటిల్లమి న్వేడ్కమై
జననంబాపలఁ దోడి కోడలు వనిన్మల్యారినింగంటఁ దుం
దునుకల్గాఁ బడమోదె గర్భమిల నే దోసంబురాదీసునన్ 10

తన్వీవృత్తము

వ్యాసమునీంద్రుడును స్నుషతల వా
యంగను రోతల నిడి తునకల్పో
గేసి శతంబొక్కచిగను సరిగా
నెంతయు బొప్పల నిడిపెనుపంగా
వాసిగ దుర్యోధన ముఖసుతుల
వ్వారిగఁ బుట్టిరి కుజనులు నూఱ్వుర్
భాసురరీతిందనయ యొకతయున్
వ్యాసులు పల్కిరి తుదకొక వాకున్ 11

శా. వ్యాసర్షీంద్రుడు నాంబికొయన్నృపుతో వత్సా! హితం బాడమిన్
మోసంబౌను సుయోధనుండు మనిన న్భూమిం బ్రజానాశమౌ
గాసిన్ వీడొకఁడూడ బీడలడఁగుంగాన న్విడుండంచిటుల్
వాసిందాఁజెవి నిల్లుగట్టుకొని యావ్యాసుండనన్ రాజనెన్ 12

మ. ముని నాధా వినుకోపగింప కిటు నాముఖ్య స్థిరాంతర్యమున్
జన నాశంబయిన స్స్వనాశమయిన స్సర్వం బెట్టైపోయినన్
ధనముం గోటిలభించుఁగాక పదియంత ల్పోవుఁగా కేను నా
తనుజుం జంపఁగ జాలఁగన్న కడుపుందాఁజంపునే వెఱ్ఱియున్ 13

ఉ. ప్రాకట వాక్ప్రసక్తి ధృతరాష్ట్రుడు సూనుని వీడ నంచుఁదా
వాకొన వాని మౌని కని బ్రహ్మయెటు ల్లిఖియించెనీ తలన్
వేకస మట్టు లేయగును వేఱువిధం బెటులౌను మిత్తికిన్
దాకొన దప్పిపోనె తలదాఁకిన యప్పుడయ్యెనఁ గాంచవో 14

వ. అనివ్యాసుండదృశ్యుండగుటయుఁ దదనంతరంబ దుర్యోధన దుశ్శాసన వివింశత్యాది నామధేయులు నూఱ్వురు పుత్రులు దుశ్శలగాని దుస్సల యనునొక పుత్రికయుఁబట్టి ధృత రాష్ట్రునింట దుష్టతయంతయు నొకచో గుమిగూడినట్టులా పట్టున నెట్టుకొని వర్ధిల్లు చుండిరి మఱియు వారిలోఁ గల్యంశము మూఁడు మూర్తులు పూర్తిగాఁబుణికి పుచ్చుకొని పుట్టిన దుర్యోధనుండు చేఁటలోఁబడిన నాఁటఁగోలె నానాఁటికి జగద్రోహియని

యెల్లరు దెల్లమిగ ననుకొని యెడు తెఱంగునఁ దఱుగు విఱుగు లేని చెరికి తనమ్మునఁ బిఱికి తనమ్ము తన మనమ్మున నెన్నండు నెన్నండు. మంచి తనమ్మను మాట వానిలోనే నాఁట నెచ్చోట నెమకినఁ గానరా దీరీతి నవినీతికిఁ బుట్టినిల్లుగా సాధుత్వమను పేరెఱుంగక పెరుగుచుండె నింతవట్టు ధృతరాష్ట్రుని గుఱించి తెలిపి యిఁకనాతని తమ్ముడు పాండు ని గుఱించి వచించెద నెట్లనిన 15

ఉ. కుంతియు మాద్రియుం దనకుఁ గూర్చెడు పత్నులుగా సపత్నుల
శ్రాంతము శాంతమూర్తులయి సర్వముఁ జెప్పిన యట్లు సేయగ
న్నంతున కెక్కి యస్త్రములు నచ్చిన బంటయి తోడఁ బల్కఁగా
బంతము గట్టియేలెనిల బంటు పొలమ్ముగఁబాండు డెంతయున్ 16

ఉ. పాండు నృపాలుఁడొండు తఱిఁ బండుగ గాఁజనివేఁట కాంద్రతో
గండక పుండరీక హరి కందళి సైరభ చిల్లకోలవే
దండ వృకాదులందు నిమిదండర మించు కురంగ యుగ్మమున్
దండిగ సేయఁ బెంటితెగొఁ దద్దరి గద్దరి పోఁతు మౌనియై 17

ఉ. పాయమపాయముం బొరయఁ బ్రాణము బాణము తోన లేవ
యాయతి యాయతి న్నృపతి నంటిన మంటను గల్తువంచు స
ద్ధేయు విధేయుఁ బాండుఁ బడఁదిట్ట నఘం బొడిగట్టికొంటి నం
చాయన చాయ నత్తుకొని యార్చెడు జాయలఁ గూర్చి యిట్లనెన్ 18

ఉ. చేసిన ధర్మము ల్వఱుతఁజేరగఁ బెద్దలసేవ బూదిలోఁ
బోసిన నేయిగాఁగ ఘనపుణ్యము లెల్లను బుగ్గిగాఁగ నే
వాసియణంగ నేడు సరివారలలో దల యెత్తకుండ నా
భాసానరించితే విధియపత్య ఫలాప్తి కురంగ హత్యలై 19

వ. పాండు రాజట్టు తన కటమటమ్ముగ నిరుగెడలంబడి కడునడలుచు నడలు తడఁబడ బడలు తన పడఁతుల నిరువురఁగని కరము కనికరముతో మనమ్మున ఘనమ్ముగ దొనుకు దొనకఁ గను కొలఁ కుల వెంట గడవల కొలందిగఁ దిగఁగాఱు కన్నీరు మున్నీరై పాఱ వారలతో నిట్లనియె 20

ఉ. పత్నులుగారు మీరలు సపత్నులు నాకిఁక శాపయుక్తి స
ద్రత్నము పుణ్యసృష్టి నిజరత్న సుఖంబగు స్వర్గ మీఁగదే
యత్నము నిష్ప్రయోజన మయత్నముగా సుఖ దుఃఖముల్నరున్
బ్రత్నముగాఁగఁజెందు నెడఁబాయును వీనికి నేల చింతిలన్ 21

ఉ. ఏటికి బోటులార యిటు లీరు వసింపగఁ గాననంబునన్
నేఁటికిఁ దీరిపోయె నిహనిర్వృతి మీకును నాకు నింతటన్
నేటుగఁ బొందు ప్రోలికిఁక నేను దహం బొనరింతు రేపుమా
పేటికిఁ బోయి క్రుంకులిడి యేకతమేకత లేక నాకిటన్ 22

చ. అనవిని కుంతి మాద్రియపుడావురు మంచట నేడ్చు చుంబ్రియా
వనమున మిమ్ముడించి చనువారమె భారమె మేము మీకిటన్
బెనిమిటి తోడ నుంగలదె పేదఱికంబును నుంచువిందు మా
తనువు లెటైనను స్సరియ తట్టలు నెండవె వడ్ల తోడుతన్ 23

శిఖరిణి

వశానాథప్రాయ స్థిత భరత రాద్వాక్యములకున్
వశాప్రాయ ల్భృత్నుల్ వసరియని రోనాద విడిసిన్
వశంబే మాకేగన్ సతికి మగఁడే ప్రాపు గదవే
"యశోవా మృత్యుర్వా" యని మనెద మీయాశ్రమమునన్ 24

క. అటు లొక్క వరుస విడువక
కుటిలాలక లేడువంగ గుంజాటుకతం
డెటులన నోరాడక వా
రుట జంబున వింగడించి యుండుట కొప్పెన్ 25

వ. ఆపాండు భూపతి శాపకృతంబుగా బ్రాపించిన యాపదగని యాఁచిపగని సంతాపంబు దీపింపఁ దాపసులందుఁ గొంచటిల్లనిరి 26

ఉ. ఇంతటి భూమి కాంతునకు యెంతటి పాటు తటస్థమయ్యెఁ నీ
యింతులు సేసికొన్న యదె యాతఁడు సేసిన పూర్వ కర్మ మో

యింతకు వేఱె పాత్రులు మఱేరును వారిని వీడి యాతనిన్
వింతగఁ బట్టె మాలవిధి పిచ్చుకపైఁ బడు బ్రాహ్మ్యమస్త్రమై 27

మ. మననాథు ల్విరచిత్తులై సలుపుచు న్మౌనవ్రతంబూని యా
జన నాథుండును క్షత్రియర్షి యనఁగా సర్లీ వ్వపంబిట్టులే
వనమందాయన తోటిపాటుగ ''యధాభర్తా తథా భామినీ''
యనునట్లా సతులిర్వురూని పతికి న్వర్థంబుగాఁ గొల్వఁగన్ 28

చ. కృతమతి పాండురాజటులు కేవలమున్వలమైన భామినీ
రతికృత పుస్తకంబును గరంబు గరంబని కట్టి పెట్టియున్
సుతరహిత తత్వ తత్వమెడనూపిన నూడున కీడుగా సతుల్
వ్రతము ధరించి యుండనొక వ్రంతను మంతనమందు నిట్లనెన్ 29

క. మగపాపలు లేకుండుట
మగువల పొందెడలి తానుమనుట ''నీపుత్ర
స్యగతిర్నాస్తి'' యనెడి నుడి
పగలును ఱేయతనిమదికిని బాధ నొనర్పన్ 30

శా. ఈ పున్నామక భార నారకము నేనెట్లేఁగు వాఁడ న్మనీ
ట్మాపం బాఁపి యగణ్య పుణ్యపదము న్సాధింప దిక్కెవ్వ రీ
పాపం బేపగి డాదొలంగునని యాపాండు క్షితీశుండు సం
తాపం బాఁపఁగ లేక శోకపడఁ జెంతం గుంతి దానిట్లనెన్ 31

క. బ్రహ్మ రహస్య మ్మొకటియ
జిహ్మముగా వినుతు మనవి సేయు మటన్నన్
బ్రహ్మయుఁ దలఁచిన మాత్రన
జిహ్మగ గతి వచ్చి కోర్కె చెల్లించి చనున్ 32

శా. ఉర్వీనాయక నాదు తండ్రి గృహమందుండంగ నేఁగన్నెనై
దుర్వాసుండరుదెంచి యుండి యట సంతోషించి నాపూజకున్
గీర్వాణోత్తము నెవ్వనేని మదిలోఁ గీర్తింప దోతెంచి మ
స్తర్వేప్సల్లయ చేయునంచు నొక మంత్రం బిచ్చె నాకెచ్చుగన్ 33

క. ఆమంత్ర మిప్పుడుప స్థిత
మై మించెడు నాదుమదిని సాంగోపాంగం
బామంత్రించెద నెవ్వని
గా మించెదరో వచింపగాఁదగు మీకున్ 34

క. అనుడిఁకిఁ బాండురాజపు
డేనిక నెక్కినటు తనకు నెగు భుజములుగా
నానవలాప్రతి బహుమతి
నానయగును నీయలేమి నాకని పొగడెన్ 35

క. నాకులము వఱుత పొలగు
నాకులముగ ననుచు వెతలనందఁ జెలుల క
న్నాకులత నుద్ధరించితి
నాకులముగ నాకొలమున కధిదేవత్వై 36

గీ. తల్లివిగఁ బుట్టిక సతీమతల్లివిగను
గనుము ధర్ముని మును మనఁగన్ ననువుగఁ
గనుము కొమరుని మనుమని ముని మనుమని
మనకుదురు బ్రహ్మమానము మనఁ గుదురుగ 37

చ. ప్రియుని యనుజ్ఞగైకొని విరించి సమున్మని నెంచి మంత్రమున్
బ్రియమొదవ న్జపించి పృథప్రీతిఁ బరేతపతి న్వరింపగా
నయమతి ధర్మదేవతయు నాఁతికి బ్రాతిగఁ దోచి యేచి స
త్ప్రియతము బుత్రుగాంతువని ప్రేమను బల్కి యదృశ్యుడై చనెన్ 38

క. రమణికి నెలమసలెను గడు
పమరెను నవమాస పూర్తియగుడు నగడువో
నమర నిభుఁ డలర మగఁడిభ
గమన సుతున్యమ సమానుఁగనె ధర్మజునిన్ 39

వ. అంతట గొంతికిఁ బాండు భూకాంతుడిట్లనియె 40

క. ఒక కన్ను కన్ను గాదని
ప్రకటములో కోక్తిగానc బడు కాన్cబడన్
వికలత యిcకనొక సుతుcగను
మకుటిలబలుc బవనుc గొల్చి యనుటయు నంతన్ 41

గీ. మగని పనుపని పృథయుప మగని పనుప
డినయునుc గన న్మనువునc బండిన యనువున
మారుతుని గొల్చి కనియె గుమారు మారు
మారురుచి భీమ శూరుc గుమారు మారు 42

వ. మఱియుc బాండు మహీశుడు తనయుగ్ర మహిషితోదన కింక నొక తనయుండుండుట బహుజన్మ సాఫల్యం బనియు బహుపుణ్యపరిపాకంబని యార్యాసమయగు నాభార్య గొంతికి ఇట్లనియె
43

ఆ.వె. ఒకట రెంట మూcట నొనరంగ నాల్గింట
ననెడి లోక వార్త కనుగుణముగ
దేవపాలుc గొల్చిదేవి బాలుని నాజిc
గాలుc బోలు వంశకరునిc గనుమి 44

చ. అనుటయు గొంతి మున్నుగనినట్టి సుతద్వయి కంటె దంట పా
వన ఘనచాపవిద్య ననవద్యు నసాధ్యుని దైవభక్తి నీ
తనికెనయేరు లేరనుచు దప్పక చెప్పికొనంగ నందఱున్
దనయుని గాంచె జిష్ణు కరుణన్ శ్రితకృష్ణుసహిష్ణు జిష్ణునిన్ 45

వ. అతని కర్జునుండు ఫల్గునుండు పార్థుండు కిరీటి శ్వేతవాహనుండు భీభత్సుండు విజయుండు కృష్ణుండు సవ్యసాచి ధనంజయుడు నరుడు మొదలగు శుభనామంబులు అనేకంబులు కలవు తత్తన్నామ నిర్వచనములు ప్రసిద్ధంబులు గాన నిందు వివరింప ననగత్యంబని విరమించితి
46

సీ. సవ్యసాచి సముండు సత్తముండోదవునే
ధన్యుండు జన్మశతములకైన

యొక్క పూటయినఁ దానుండెనె శ్రీహరి
బ్రాహ్మణ మృతపుత్రు ఁబార్థుఁడేయఁ
బూని చేయఁగ లేక తానగ్నిఁజొరఁ బోవ
నిజకార్యమును చూపె నిర్వహించి
యాతని నీతని నరయుచుఁ గావఁడే
పృథ సుతులను దెచ్చి మెచ్చి యిచ్చి
మఱచి తప్పున బార్థుండు మానె గాక
వాఁడు వేడ వికుంఠము వ్రాసి యీఁడె
యాదవేంద్రునకును బహిఃప్రాణమతడు
చూడ సామాన్యుఁడే మహాశూరుఁడతడు 47

ఉ. పుట్టిన బార్థువంటి ఘనపుణ్యుడు పుట్టవలె న్జగంబులో
నిట్టిఁడు నట్టిఁడుం గలుగనేమి ప్రయోజన మెల్ల వారలున్
గట్టుపకాసి మాసి యని గట్టిగఁ బార్థుని జెప్పహేతువె
పుట్టున గృష్ణుడే నరుఁడు పార్థుడె కృష్ణుడు గాఁగ నుంటయే 48

వ. అంతగాంతేయు లట్లుదయించి మించి వర్ధిలుచున్న తదనంతరంబ 49

ఉ. మాద్రికి కూడ గుంతి తన మంత్రము తంత్రయుతంబు దెల్పగా
మాద్రికి నేరులేరనఁగుమారుల నిర్వుర మారచాకులన్
సద్రుచి నశ్వినీ సురుల సత్కృపచే నకులున్ శుభాంగు
మాద్రిగభీరు గాంచె సతి యాసహదేవుని దేవభావునిన్ 50

శా. పంచప్రాణములట్టు లేఁగురు సుతుల్భాసిల్లి వర్ధిల్లగా
బంచే స్వార్థిని దాఁకఁబోకు మనుచు న్వారించి నన్వాన కా
పంచాస్త్రోభవలగ్న మాద్రి సతితోఁ బాండుండు క్రీడించి వే
పంచత్వంబును జెందె నామె పతితో పాదైచనం గూడగన్ 51

ఉ. కాంతు ననంతరంబ వెతఁ గందుచుఁ గుందుచుఁ గుంతి భావదోఁ
గాంతు ననంత రాజ్యము సుఖంబని పోవ సపుత్ర వీటికా

కాంతను గారవింప దన కాంతకు జెప్పుచు నాంబికేయుఁడే
కాంతము నస్మరించె దన యాత్మజులట్టుగ బాండుసూనులన్ 52

శా. గాంగేయుండును ధార్తరాష్ట్రశతముం గౌంతేయు మాద్రేయులున్
బొంగార నృనురాది విద్యలను సంపూర్ణంబుగాఁ దీర్పు సే
యంగా ద్రోణుని శిక్ష నర్జునుడు సర్వాతీతుడై విద్యను
ప్పొంగె న్లొంగడు దాయకాయ ననంభున్ భూషించి యెవ్వారలున్ 53

క. దుష్టులని దార్త రాష్ట్రుల
శిష్టులనుచు బాండవులను జెప్పని వారల్
వృష్టికిఁ దడియని వారీ
సృష్టిని లేరేరు వేయు సెప్పనికేలా? 54

మత్తకోకిల

దార్తరాష్ట్రులు పాండు సూనుల ధర్మశీలుర బాలురన్
ధూర్తులై తతిగొంచు నెవ్వగ నొవ్వఁజేసిరి భీముదు
ర్వార్తనుండు సుయోధనుండు గరంబు వెట్టియు గంగలో
నార్తిగా బడద్రోచిద్రాఁచుల నంటగంటి శరీరమున్ 55

క. భీముని కా ముని నావెత
చీమ గఱచినంత బాధసేయక పోగా
సేమ మొసంగ నెసంగునె
బాములు గీములును దైవభక్తికి మీదన్ 56

క. నాగాయుత సత్త్వునకు స
దాగతి సుతున కవియెల్లఁ దాకక యుండన్
నాగాంతక వాహనుకృప
నాగారికి బాధసేయ నాగములగునే 57

గీ. ధర్మరాజని పొగడిరి ధర్మసూను
భీము నలరంగ రణరంగ భీమ బలుఁగ

యోరంతఁ పొద్దునూటిపోయ నూటిపోయ జనకుండు వెనుక కొండొక
తటి వినక పెడచెవిపెట్టియు గట్టకడకు బాండవులకుం దనకు బుణాను
బంధంబు దీరిపోయి బమ్మకైన బుట్టలేయమ్మతోపుల నెడినుడి బడి నడి నడికి
నెడమిచ్చియయ్యంధనృపతి నమ్మతించి

66

మ. ధృతరాష్ట్రుండొక నాడు ధర్మజునితో దీపించి కోపించకే
హితముంజెప్పెద వారణావతమునందేతెంచి తోతెంచు మీ
కృతపుణ్యాఖ్యన నీసహూదరులతోఁ గీలించి మేలెంచి వి
శ్రుతము ల్షోడశదానము ల్మిగుల నచ్చోఁజేయుమీ తండ్రికై 67

చ. అదివిని యాసుయోధనుడు నాప్తుఁబురోచన నాము నామునిన్
బదిలుని బిల్చి నీవునని పాండవులుండగ వాసిఁ గాశిలోఁ
బ్రిదులక లక్కయిల్లు కనిపెట్టి రచింపుము వారలందులో
మెదలఁగ మ్రందఁ జిచ్చిడి తమిందమిఁ దీరిచిరమ్మ రమ్మనెన్ 68

క. పనివాఁడ వనుచుఁగని యీ
పని వాఁడ వటంచు నిన్ను బట్టియటకుని
న్నని పెదఁ బనిదీర్చిన నిన్
దనిపెదఁ బసదనము లిచ్చి తలమునుకలుగాన్ 69

వ. అనుటయు 70

క. తగదనక కాని పనికిన్
దగుదు ననుచు వాఁడు వారణావత మరిగెన్
వగ వఁగ నర్థాతురులకు
నగురుర్పో బంధువనెడి న్యాయము గాదే? 71

చ. అనువగు చోటు చూచుకొని యాతఁడు లాఁతి యెఱుంగ కుండ ని
న్ననువగు ఫక్కి లక్కయిలు నాణెముగా రచియించి కాల్చియుం
డెను గనువారి కీతఁడు కడిందిగఁ బాండవ పక్షపాతి నాఁ
జని చలిచీమ నేనియును జావగఁ ద్రొక్కని పుణ్యకైవడిన్ 72

మ. అదరంట న్దయమాలి పాండవుల నట్లంధాధిపుండంపుచో
సదయుండై విదురుండు వారలను నాస న్సాగ నపించుచున్
నిదు రంధ్రుంచెద రంచు లక్కయిలు హానిం దప్పికొండంచు స
ద్విదురుండూకొన ధర్మపుత్రుడు చెవిన్వేసె న్మరుత్పుత్రికిన్ 73

ఉత్సాహ.
శమన సూనుడును దనయనుజన్ములెల్లఁ దల్లియున్
శమన మూనికొని వెనుకొని సాగిరాగఁ గాశికా
శమన ముందరియ విడిసెను జక్క లక్కయింట నా
శమన లాన ననెడి విదురు శాసనమ్ము నమ్ముచున్ 74

సీ. పగలెల్లఁ బాండవుల్పగ వెల్లడికిఁ దేక
మృగయావినోదులై మృగము లణఁచి
ఱే లక్కయిమ్మున రేలక్క యిమ్మున
నుప నడమ్మున నుండిరి పవనుజుఁడు
వెడల దారిని గని వెడలించి నిదురించు
నన్నదమ్ములఁ దల్లి నఱకడ నిడి
యేయూరి యెఱుకెతో యేవురు సుతులతోఁ
బంచ తగంబండి పంచత గన
గీ. జెఱుపకుర యోరి యొరులను జెడెదవీవ
యనునటుల్విధి యా పురోచనుని దెచ్చి
మాట నాలక్కయింటిన మాటి చిచ్చు
పఱచెదమ నారిఁగొని దవ్వు పవనసుతుడు 75

క. అక్కడి జన యెఱుకుల మృతి
నొక్కటగని పాండవులుగ నూహించి కడున్
వెక్కసముగ దురపిల్లుచు
గ్రక్కన దుర్యోధనునకుఁ గమ్మనువ్రాసెన్ 76

క. పాండవులు ప్రమందిరయకా
మెండుగ రారాజుఁదలఁచిమేత్మేలనియెన్
మండి పురోచనుఁడడగుట
కెండం బెదవు లొక వారమేడిచెఁ బెలుచన్ 77

వ. అంత నిక్కడ భీముండు లక్కయిల్లు చక్కగ బురోచను తోడన తగులబెట్టి తనజననీసోదరుల నిదురపాటునసందిటనెత్తికొని విదురప్రేషితుడైన యుప్పరి సెప్పినఁ జొప్పున నాయుప్పరిగ నొప్పు సురంగంబునఁబడి కడువడి సురంగంబున ముక్త వేగంబున బరుగిడిపోయి 78

క. నడిరేయ చటన్ తనవా
రొడ లెఱుఁగక నిద్రవోవు చుండఁగఁగొనిఁయు
య్యెడ వినిబడి చని యేడా
మడదూరము పాఱి వారి మడుగున డించెన్ 79

చ. వడిముడి నిద్రవోవు తనవారల యొద్దనె కాచియుండగా
దడవులఁబట్టి యాయడవి తావుగ లావుగ నున్న యాహిడిం
బుడు తనపైకి రాఁగఁ బెడమూర్ఖుఁడు నాతని తోడబోరి భీ
ముడు నడునెత్తి నింబగుల మొత్తిన వాఁడిలగూలె రోలుచున్ 80

చ. కనరున వాని నట్లతఁడు గగ్గుల కాడొనరించి వేఁగులో
ననతని వారలుండిన వనస్థలిఁజేరుడు నంతలో హిడిం
బుని చెలియల్హిడింబ తనుఁ బొందమరుల్గొనఁ దల్లి యాజ్ఞచే
వెనుకొని యామెఁబెండ్లియయి భీముడుగాంచె ఘటోత్కచు న్సుతున్ 81

క. రక్కసి హిడింబ తనయుం
డెక్కుడు పనివడ్డఁ బిల్వఁడే నిటవత్తున్
గ్రక్కున నని తండ్రులకున్
మ్రొక్కి తనదు తల్లిఁగొంచు మొగిచనె వింటన్ 82

క. ఆపోవుటదే పోకై
యాపాండవు లంబ తోడ నరిగిరి సరగన్
బాపల రూపులు దాలిచి
మోపిక వారేక చక్ర పురమున కవలన్ 83

క. వ్యాసర్షి యాజ్ఞవారలు
భూసుర వేషముల నొక్క భూసురునింటన్
భాసురగతి నుండగ నొక
వాసరమున నింటివారు వందురఁ దొడగన్ 84

వ. అంతజెంతనున్న కుంతి యుయ్యాక్రందనము తనడెందమ్ముౕనకుఁ దొందరసేయ నొయ్యనొయ్యనాయింటి పాఱుని తోనోయుయ్యా ! యిట్టులొక్కపెట్టున యింటి వారెల్లమల్లడిఁగొని యుల్లంబు తల్లడిల్ల డిల్లపడి యెదరు కలతని దానమెద్దానోదాని నావీనుల వినవలతుంగాన నే వినఁదగినది యైన వినుచుమయ్యా యనిన నప్పారుండు బారి దొలంగు మక్కువనో య్యక్కా! యెక్కడనే నెక్కాలంబున నేని గనివినని యిక్కట్టు మాకు మిక్కిలి మీదు మిక్కిలిగనేర్పడె. నేర్పడరి యొక్కటరక్కసి యొక్కఁడెక్కడనుండియో వచ్చి యీచక్కి కిక్కడ దాపరించి నెట్టుకొని యున్నవాడు. వాఁడొనరించు నాపదలీ పగిదివియని వాక్రువ్వ నాకును నూకొన కొను నీకును దరము గాదైనను బెద్దముద్దియు వెంతయు నాదరమ్ముౕ నీదనాదరము సేయు నాదుకొనియెద వేని నాదుమనమున నున్న వంతనంతయు నావంతయు విడువక నుడివెద నాలింపు మవ్వా !యని యధరాని విలింప మణి చెలంగుచు నెలుంగురాల్పడ నిట్లనియె 85

చ. బకుఁడను నొక్కరక్కసుడు ప్రల్లదుఁడల్లనఁజేరి యిందులన్
మెకమొకపాటున న్జనుల మీద నెగంబడి చెండుచుండగా
మెకముల ఊడు వెల్లవలె ప్రింగఁ దొడంగిన నింటికొక్కనిన్
గకవికసేయ కిత్తుమని కట్టడసేసితిమొప్పె నాతఁడున్ 86

చ. ప్రతిదిన మొక్కఁడేగు నొకబండికి గుంభపు కూడు నింపియున్
జత యెనుబోతు లూన్చికొని సాగి యతండెట నుండు నాడకున్
వెతకుచుఁబోవ రాక్షసుఁడు వేళ యొకించుక మించకున్న నా
మెతకులు నోట వేసికొని మ్రింగును బోతుల బండి మానిసిన్ 87

క. ఇలువరుస నిట్లురాగా
నిలువరముగ నాదుపాల నేఁడది పడె నేఁ
డిలువరస యెట్టులిరవగు
బలువిడి విధి దాఁట నెవరి వశమగు దల్లీ ! 88

క. ఒక యమ్మ కన్న బిడ్డను
నకి ఁబుత్తునా మాటలాడఁజాలని నాపు
త్రికఁబుత్తునా నోరెఱుగని
యొకడే సుతు బకుని నోట నోర్తునె ద్రోయన్ 89

ఉ. తల్లికిఁ గూర్మికాస్పదము ధన్యను గన్య ననన్య నంపగాఁ
దల్లికిఁ దండ్రికాస్పదము దారుణ ధీరుఁగుమారు నంపగా
దల్లిని దండ్రి కాస్పదము దారను దారను ధీర నంప భీ
తిల్లి కిరాతుఁడైన బకు నాహృతకై తగనేన వోదునో 90

గీ. ఎట్టులును బాలువోక మాకిట్టి మెసఁగు
దలఁగఁగల పుణ్య పురుషులు గలరె యంచు
ముంచికొని వచ్చు నార్తిలో మునిఁగి యుంటి
మార్చెదో తీర్చెదో యమ్మ యనగ కుంతి 91

వ. అవృత్తాంతము అంతయువిని గొంతి యాయింటి వారికి మాఱుగ తన రెండవ కుమారుడు మార సదృశ శూరు సమీరసూను నాబకాసురున కాహారార్థమంపెద ననిన నవ్విప్రుండు నవ్వి యువ్వా! నేఁటి దినమేటి దుర్దినమీమ్మలాటి చెడునుడి వినవలసివచ్చె నెంత మాటాడితివి లివిరి నీవ యిచ్చెదవదియైననయ్యయోయెంతపాటిచెడుమాట నాకు వినవలసి వచ్చెనని తన చేతులతో దన కర్ణ కుహరములు మూసుకొని హరిహరీ యనుచు

బ్రాహ్మణుండిట్లనియె

92

క. చుట్టమని చూడవచ్చిన
బట్టైను దయ్యమయి యన్న భంగిని మిమ్మున్
బట్టి యతిథులన వితథుల
గట్టిడి బకు 'నోటఁ బెట్టి' ఁగా నెటులోర్తున్ 93

వ. అనవుడు నాయమయు నౌడు గఱచికొని యింతటి మాట యేలని యెదురు పలవదు డుగుండు కలగుండు వడెడు మిమ్ముగని కరమ్ము గనికరమ్మొద నొదవి నాకునేన పరోపకారము బహుజన్మ సంచిత సుకృతమని యెన్నికొని నాకన్నకడుపు రాకాసికి గ్రాసముగా గాసికిసైన నోర్చి పిల్చి యీాయంబూనితిఁ గాని మీరు కోరినవెలిమెచ్చులకు నిచ్చిన దానను గాను సుమీ యెందరెందఱున్న దరిద్రులకు నెందరున్నను నందనుండు నేనియే తీగెకుఁగాయవ్రేఁగగునే నేనెఱుఁగకున్న దానను గాను. ఇఁక వేఱొండేమియు మాఱాడక కర్తవ్య మెద్దియో తద్దయు గూరిమి నోరిమిగొని పేరిమిగాఁగానిండని మఱియు నిట్లనియె

94

ఉ. ఓడకుఁ డోడ కుండుఁదిదె యుద్ధరణంబొనఁ గూర్తు మీకునే
బోడిమి నాకు నేవురు సుపుత్రులు వారలలోన నొక్కనిన్
దోడుపడంగ నిత్తు బకుద్రుంచి యతండి దియాదిగా నిటన్
జీఁడ దొలంచు మీఱలఱచేయిడి ఱొమ్మున నిద్ర వోనటుల్ 95

క. వారలతో నిట్లని తన
చేరువ గారవము మీఱఁ జెఱలాడెడి కి
మ్మీర విరోధిని గనుగొని
వారని దయ దొలుఁక గొంతి పల్కె సుతునకున్ 96

పం.చా.

ధరామరాళి కీడఁ గూడి దాడిఁ గీడు సేయు నా
శరారు నాశరారులెన్నఁ జక్కఁ జక్కడంచు దు

ర్భరమ్మగా దురమొనర్చి పావన పనీస్థలిన్
'గరమ్ముగమ్ము బాగుసేసి కార్యమార్యులౌననన్' 97

ఉ. ఆమె యనుజ్ఞ భీముఁడరి నార్పఁగ బూని మనస్సునీస్సుపై
నామెత నెక్కి మెక్కుచు తదన్నము సున్నగఁ బ్రొద్దుపుచ్చి పో
నా మునఁదోక ద్రొక్కిన మహాహి వలెన్ బకుఁడుగ్రమూర్తియై
గామిడి యేగుదెంచి తటకా పడి చూచుచు నోప కిట్లనెన్ 98

గీ. జౌరా నేమన నేక చక్రపురమేనా లేదె యేదేశమున్
నౌరా నేమన నేక చక్రముగ నున్నారీ ర లేలన్ననున్
దేరం గ్రుమ్మరుచుండి కుట్టి నపుడే తేలంద్రు తాఁగుట్టకే
తేరం గుమ్మరపుర్వటంద్రటుల గాదే మంచికెందేనియున్ 99

గీ. అనుచు భీముని దనచేత నసురపొడువ
నొప్పిచెందక తడు వానిజప్పరించి
కబళ మెత్తిన పిడికిటఁ గదియఁ బట్టి
నొసటఁ బొడిచిన బకుడు తన్నుకొని సచ్చె 100

తరల

బకుని సోదరు లొక్కపెట్టునఁ బైకిఁదాటిన భీముడున్
బ్రకట సంగరమొనొనర్చితి వ్రతముగా నరమాంస మీ
రికఁ దినందగ దట్లు దింటిరియేని బంపెద మిమ్ములన్
బకుడు పోయిన చోటికంచని పల్కఁబాఱిరి వారలున్ 101

మానిని

అట్టు బకాసురు బట్టి వధించిన
హాలినిదేలిరి యేలుగన
ప్పట్టునఁ బాండవులంబను దోడ్కొని
బ్రాహ్మణ వేషము లొప్ప వెసన్
గట్టిగ ద్రౌపది పెండిలి నావిని
గ్రక్కున నక్కడి కేగిరిగాఁ

జిట్టలుగాఁ గను జుట్టును బాఉులు
చెంతల సంతలు చెప్పుచురాన్ 102

శా. కాంపిల్యంబున సోమకుండు సుతకుం గాల్యాణముం జేయనై
పెంపారంగను బెండ్లియాడు నతివ న్బీభత్సుఁడంచుండగాఁ
జంపెన్వారిని లక్కయింట ధృతరాష్ట్ర జ్యేష్ఠజుండంచు భూ
తం పంబాటకుఁ దానొకండు దలపంగా దైవమొండెన్నగా 103

వ. అని యిట్లు ద్రుపదుడు విపదం బుధితరింపందగు తరిందరికిఁదెచ్చువాడు హరియకాక వేరొక్కండెవ్వండని మనంబున దలంచుచు మఱియు నిట్లనియె
104

క. వారల దేవాంశజులతి
శూరులు దారులెటులా శుశుక్షణ వారిన్
జేరఁగఁ జాలును గాలుని
మీరిన బలులట్టి వారు మిత్తికి వశులే 105

వ. కాన నీ లక్కయింటి వార్త నీలివార్తగా నోపు దైవానుగ్రహ సంపన్ను లాప న్నుల గుదురా? పన్నుగ నట్లగుదురన్న ఖదుగురు నగుదురు గాన నెట్టులైననీ లోనన లాక్షాగృహాది భాధలు లక్షోప లక్షలు తప్పించుకొని యెందైన సురక్షితులై యుందురు వారల నిందులకు రప్పించుకొను నుపాయమునా నేన పన్నెదనని ద్రుపద నృపతి తన పురంబున
106

మ. శ్రమ యావంతయు లేక యేను శరముల్సంధించి బంధించియం
త్రము నేలంబడగోల నేయు నతడే ధన్విభ్యుఁ డీతన్వికిన్
రమణుండంచును మత్స్య యంత్రమరుదారంగట్టి చాటింపభూ
రమణుల్వేడ్క స్వయంవరంబునకు జేరన్వచ్చిర చ్పోటికిన్ 107

ఉ. కర్ణుడు శల్యుడున్ శకుని కౌరవనాథ ముఖాది యోధులన్
భర్ణముసేరి దాని దివియంజని యాపనికేము తాళమం
చర్ణవరాడ్గ భీరులట నాఁగిరి దండము వెట్ట దానికిన్
వర్ణిగ నున్న క్రీడియుఁ జివాలున డుల్చెను మత్స్యయంత్రమున్ 108

సుగంధి

వీఁక దాఁకి పార్థుతోడ భీకరాజి సేయ వా
డూఁకి నూఁతి సేనలన్ని యూఁచకోత కోయగా
నీకు మ్రొక్కు వారమయ్య నేఁడు వీడుమన్న బో
బోకుడంచు ఫల్గునుండు పోర నోర్చె నందఱన్ 109

క. ఆగతి పార్థివ కోటులు
నా గితిరంబుగ నరుండు నాద్రౌపది వే
వేగం దోకొని చన హరి
బాగుగఁ బార్థుల నెఱింగి భ్రాతకుఁ దెల్పెన్ 110

గీ. మత్స్య యంత్రంబు నిలఁబడ మార్కొనంగ
తోడ శల్యారి బసకేగెఁ దొలుతనంత
బక విరోధియు మధ్యమ పాండవునకు
వీఁకఁ దోడ్పడ నిలఁబడె వెన్ను దన్ని 111

వ. అపుడు కృప ద్రోణ పురస్సరంబుగాఁ గురుపతి, కర్ణశల్య ప్రముఖ యోధాను
యోధులు స్వయంవర లబ్ధ విజయుని పైకి జననోడి సంచలిత చిత్తుఁ
బాంచాలుందరమిడి తరమిడి నప్పార్థుంగూడి యున్న విప్రులు నాహోయంచు
నోటమి యేటికి నీపాల మేము గలుగ భూపాలు నసూయా పరవశులై
యురయుక వీకందాకినఁ బార్థుండెదుర్కొని వారిపైఁ జాలఁగఁ గోల్తల
నేయుచుండె నపుడు

112

చ. ద్విజులు తలంచి పార్థునొక విప్రునిగాఁగను చాందసంబునన్
ద్విజగణ పూర్వపుణ్యమునఁద్రెంచె నితండల మత్స్య యంత్రమున్
నిజమున కీతఁడుందరియు నేర్చునె యంత్రము నించుకేని భూ
భుజులగు కర్ణశల్య కురుభూపతి ముఖ్యుల దాక శక్యమే 113

వ. అటులు విప్రులమాయకత్వంబున నర్జునుంగూర్చి యమే యబ లప రాక్రమ
శాలియని యెఱుంగకతెఱంగు మాలినమాటలాడికొనుచునుండస్వయంవరా

ర్థాగత భూపతులీ విప్రుదోషం బేమున్నయది ద్రుపదుండు నృపతుల వంచింపందలంచిమత్స్యయంత్రంబని యొకమిషపన్ని యిందర నిందు రప్పించె. దైవమానుష బల సంపన్నుండు గాన నీపాఱుండేపారనమత్స్యయంత్రం బుదెగవేసి వన్నె వసికెక్కి నక్కన్నియఁదాఁ జేకొనియె నీతని తప్పేమి? యీ విపత్తునకు ద్రుపదుండు మూలమిమ్మనృపతిద్రుంతుమని యందరు నొక్క పెట్టునఁ బైకిరాగ నాఁగలేక పాంచాలుండుబ్రాహ్మణలమఱుంగు సొచ్చి కావుమని వేడుకొన నచటఁ బెంపారు పాఱులోహో పాంచాలా! చాలుచాలు వెఱపేమిటికి మేమిందఱ మఱ లేక నీపాల నుండఁబర రాజుల యాట సాగ నిత్తుమే యను చుండ భీమార్జును లిరువురుబలువుర జులువున శరజాలంబుల ముంచి ద్రుపదు నోడకుమని పరవస మిచ్చిన నతండు వారి హెచ్చైన బలపరాక్రమముల మెచ్చుకొని నచ్చువిడి నచ్చి యుండె నందుఁ గర్ణుండర్జునిం దలపడి యాతని శస్త్రాస్త్ర జ్వాలా సారమునఁ దొప్పదోంగి కాలుసేయాడక మ్రాన్పడి యుండఁ జాలగఁ దవాలిన న్నని నెదుర్కొన బాండవవంధ్యవుండొండెఁ బరశురాముండొండెఁగాఁక వేఱొక్క నికిక్కడిమి యెక్కడిది బ్రాహ్మణ బలం బమోఘంబు. ''ఇదం బ్రహ్మమిదం క్షాత్రం శాపాదపి'' శరాదపి యనెడు రీతి నప్పతి పాతంబుగాన నీపాఱుతోఁ బోర నాతరము గాదని యతనికి జేయెత్తి దండమిడి యారాచకొమరుపై గట్టిపట్టుగ నారాచ ప్రయోగ ప్రమేయ పుస్తుకంబు గట్టిపెట్టి యా యోధనంబు మాని సుయోధను గూడఁజనియె. నట్లు శల్యుండు భీమునితోఁ బెందల కరుగఁదా గదా యుద్ధమునకుఁ దలపడి యతనిచేఁ దలపగుల చావుదెబ్బలుదిని చావుదప్పికన్నులొట్ట వోయె నన్నట్టులై యెన్నఁటి కింక భూసురులతో బరిహాసమున కైనఁ బోరాటమునకుఁ బోఁగూడదనుకొని భీమునిచే యుద్ధభూమిం బుక్కోడు మన్నుగఱచుకొని వెంబడి లేచి యొడలి దుమ్ముదుడిచి కొంచు పోలికలనికిఁదొలగి చనియె నిట్లు ప్రచ్ఛన్న బ్రాహ్మణాకృతి నున్న పాండవులిర్వురు భండనంబున రాజన్యమండలంబుల నూచ ముట్టుగనోడించిరి. సంక్రందననందనుండు స్వయంవరోపార్జితయగు ద్రుపద నృపతి నందనం బొందుగఁ దోడ్కొని చని తనవిడిఁది పట్టగు కుంభకార మందిరంబున నానందము గదురం బ్రవేశించి వాఁకిట గిటుకిట జనంబు సందడింప నిల్చి లోన నున్న జననిం బిల్చి 114

చ. ప్రియతమ బిక్షగంటినని వేడ్కనరుండన గుంతిదేవి స
త్ప్రియతమ కించి ముందది మదిం దినఁదగ్గ పదార్థమంచు నీ
ప్రియతమ కింపుగా ననుభవింపరె యేవురటంచుఁ బల్కి య
ప్రియతమ మింతిగా నెఱిగి పీడత యయ్యెను బిమ్మటన్మదిన్ 115

క. అదిదైవ నియతమగుటను
మదిని కడు న్వంత సిల్లి మతి పాంచాలిన్
మదిమదిఁ బాండవుఁ లేవురు
బ్రిదులక వ్యాసర్షి యాజ్ఞఁ బెండిలియైనన్ 116

క. అపుడట్లు దైవ వశమున
విపదంబుధి దాఁటి పాండవేయులు కృష్ణన్
నిపుణత గొనఁగలిగిరయని
ద్రుపదుడు కృతకృత్యుఁడయ్యె దోషమెసంగన్ 117

ఉ. తమ్ముని పుత్రులవ్వనిత తోడను జావటుదప్పి యెప్పి స్వ
స్థమ్ముగఁ ద్రోవదింబడసి శ్వశ్రుగృహంబున విందులందుచున్
దమ్మును జూడగోరి రనినన్ ధృతరాష్ట్రుడెరింగి పక్షపా
తమ్మును వీడి వారిని హితంబుగ రాఁబనిచెన్ ముదమ్మునన్ 118

క. ఇంద్రసమ విభవుఁడంధ నృ
పేంద్రుఁడు తన యనుజు భాగమిడి యనుపింపన్
జంద్రయశస్కులు పాండవు
లింద్రప్రస్థ పురమరిగి వింత దలిర్పన్ 119

క. నలువురు తమ్ములితమ్ముగ
నలువకు నలుమోములట్లు నలినాక్షునకున్
నలుభుజముల వలె వెలయఁగ
నలువుగఁ దర్మజుడు పాలనము సేసెనిలన్ 120

సీ. ఎంతటి రాజైన నిలగాంచఁ గల్గనే
సత్తమాఖ్య నజాతశత్రు సంజ్ఞ
నెంతటి శూరుఁడే నెన్నిక కెక్కనే
స్థిరముగా గను యుధిష్ఠిరుఁడటంచు
నెంతటి రేనినే నేరేని నెందేని
రహిబిల్చిరే ధర్మరాజటంచు
నెంత పుణ్యాత్ముఁడే గంగఁగల్గనే
దివికి నీమేని తోదెబ్బ దినక
గీ. ఘనత నే సత్తముని నైన గర్భశత్రుఁ
డాడి తప్పని వాడని యాడె నొక్కొ
చొప్పడెనివెల్ల ధర్మరాజునకుఁగాక
మహిత లక్షుఁడు గాడె సామహితుడతడు 121

ఉ. ద్రోవది నారదుండి డిన త్రోవ తిరంబుగఁ బూని యేటన
య్యేవురు భర్తలందొకనినే వరుగాగొని యుండునట్టి చో
నోవర నెవ్వరైనఁ బెఱలొంటిగఁ జొచ్చినఁ దీర్థ యాత్రకుం
బోవలె నన్నకట్టడిని బోటి యుధిష్ఠురు దండనుండగన్ 122

మ. ఒనరన్ భూసురుఁడొక్కఁడేగి యొకనాడు ద్వేగియై పార్థుతో
వినిచెన్ జోరులు, నాదు నైచికని వేళంబందు నో ముచ్చిలెన్
వనర న్నెత్తిని నోరు వెట్టికొని తద్వత్సంబు వాపోవుదా
నిని గన్గొన్న నెటుల్వచించుమది యెంతే నీఱుగాకేరికిన్ 123

వ. అనుటయు ధనుంజయుండు మనంబున ఘనంబుగఁ బెరపఱ లాడి 124

మ. తన గాండీవ శరంబు లగ్రజుని సౌధంబందు నుండంగ వి
ప్రుని యార్తి న్వినువేళఁ బుట్టినకృపన్ బోవచ్చునా కూడదా
యను చింతన్ దిగద్రావి చొచ్చి గృహమా యాకైదువుల్గొంచు బా
ఋని కార్యంబును దీర్చి క్రీడి మదిలో బోనెన్ని జాగ్రత్తిలిన్ 125

ఉ. అంత గిరీటి యేగి తన యన్నకు మ్రొక్కి ద్విజన్ము చింతనేఁ
ద్రెంతు నటంచు మైమఱచి దేవర యోవరఁ జొచ్చి తెచ్చితిన్
మంతు నరంతు నిష్కృతికి మానక యేగెదఁ దీర్ఘ యాత్రక
న్నంతట నన్న బ్రాహ్మణుని యాపద దీఱిచి యాత్రలేటికిన్ 126

వ. అనియన్న యన్నకుఁదిన్న గనెన్నఁగదన్నరాజ ధీరుండగు నగభిన్నందనుండు కొండొక విచారించి వెండియు నిట్లనియె

127

చ. ప్రతినకు భంగమైన నిలపార్థు డటంచు ననవ్వరేజనుల్
బ్రతికిన నాళ్ళు లోకము సెబాసను బాసను బొందు టొప్పుగా
కితరము వోలునే నుడువ నేటికి నేఁటికి బోయి వచ్చెదన్
మతి ననుకూల మందికొని నానతి నానతి యిమ్మనాకిఁకన్ 128

గీ. గట్టిగా నన్నగారికి నొట్టువెట్టి
పట్టువట్టినఁ గానిమ్మ దట్టె యంచు
నెట్టకేల కతఁడు సరియే యనంగఁ
దీర్థ యాత్రకుఁ బార్థుడేతేరగడఁగి 129

వ. అపార సువర్ణ భారంబులు వెంటఁదీసికొని బ్రాహ్మణుల కమిత కనకం బొసంగి

130

ఉ. అంతట లేచి పుణ్యనదులందున గ్రుంకి యులూచిఁజూచి యా
యింతి వరింప బెండ్లియయి యింద్రజుడా ఫణికాంత యందిలా
వంతునిఁ గాంచి వీడి దుది వంతఁ జనెన్మణులూరుఁ దత్పురీ
కాంతునిఁ జిత్ర వాహనునిఁగాంచి వరించెఁ దదాత్మ జాతనున్ 131

గీ. అంగజాకారుఁడర్జును డడుగనిచ్చె
నంగ నామణి యైన చిత్రాంగదను ని
జాంగజాతను జిత్రవాహనుఁడు నామె
యందు బార్థుఁడు బభ్రువాహనునిఁ గనియె 132

వ. కౌంతేయుఁడట గొంతకాలము వసించి పంచతీర్థంబున నవగాహనంబు సేయంబోవ నందుండు నవగ్రాహంబులలో నొక నక్రంబా సింహ విక్రముండ గుకవ్వడి కడకాలు పట్టి కడకాలోనికిఁ దివియ నతండా కాల్మోసలికి మాఱుమసలి దాని వెలుపలికిఁ దిగిచిన నానక్రంబొక యవక్రమముగ నచ్చరయై తనకును దన యనుంగులైన గంధర్వ తనయలకు నీట స॒ ౕకు నొకానొక ముని యాగ్రహంబున గ్రాహ రూపములొదవి యుప్పంచ తీర్థంబునఁ బడియుంట లోను గాగల వృత్తాంత మంతయుఁ గలయంత పట్టు సెప్పిన విని విస్వచ్ఛుఁడచ్చెరువంది తక్కుగ్రాహంబులం గూడ శాపంబను పాపంబున కెడఁబాపి యచ్చరల మచ్చుకంటుల గావించి కొంతకాలంబు నరుడు మణలూరు పురంబున నుండి బభ్రువాహనుని చిత్రవాహనునికి వంశవృద్ధికై దౌహిత్రు ధర్మంబునఁబుత్రుఁ గానొసంగి యభ్యర్ణంబున నుండు గోకర్ణ క్షేత్రంబున కేగి యా పుణ్యతీర్థమున నుండగా దీర్థంబును స్వార్థముంగూడఁ గూడి వచ్చినట్లుగా ద్వారక నుండి వారక యాత్రార్థ మరుదెంచిన వారొక కొందరు పార్థుని చూచి యాదవుల కుశలప్రశ్నములడిగిన నరునకుఁగృష్ణ సమాచారములు వాచామగోచరములుగాఁ దెల్పుచూఁ దద్యశః ప్రస్తావ వశంబున భృశంబుగఁ గృశోదరి కృష్ణ సోదరి సుభద్ర భద్రంబుగా బేర్కొని యాపె సౌందర్యాతి శయంబును దదాశయమున కెక్కుఁబెక్కు విధములఁజెప్పుచు నిట్లనిరి. 133

# సుభద్రా వర్ణనము:

సీ. అతివ చక్కదనంబు నతిచో గ్రాహ్యంబు
గాన వర్ణింపఁగాఁగష్టసాధ్య
మతిశయోక్తిగ వర్ణనాంశ మేమొ యటంచు
విచికిత్స మదిలోన విడువ వలయు
నుర్విలో నుండెడు నుపమాన వస్తువుల్
దగు గగనార విందాయమాన
మగుచుండు సతియవయవములతో సాటి
యొనరింప నొకటియు నుద్దిగామి

గీ. నాలుగైదారు మొగముల నాక వరులు
వెలసి మాధ్యస్థికము సేయవే వెలుంగు
రోదసీ పాత్రమున సముద్రో దమషిని
వ్రాయ శేషాహికినిఁ జెప్ప వశముగాదు 134

ఉ. చందురుఁ డబ్జము న్వెడలి చాన మొగమ్మును బోలలేక లోఁ
గుందుచుఁ గందు వేణిని డికొమ్మకుఁదాశశి రేఖ యయ్యెనే
మందును గంటికైనఁ బురుడౌదు నటంచును దమ్మికమ్మపూ
చందముఁజెంది వాడఁబడి చాలక యప్పులలో మునింగెడిన్ 135

చ. భ్రమరము చంపకమ్మును చిరస్వర పైరమిఁ కేటికంచు వీ
క మదిని వేఱు వేఱుగను గానఁ దపంబొనరించి దైవ యో
గము మెయి భావుకేక్షణ నికాయము నాసఁగఁ బుట్టి యోజన
త్వముగను వైరశుద్ధి సహవాసము గల్గెను రెంటి కొక్కచోన్ 136

శా. లావణ్యాంబుధిగాన నీరమణి చాలన్ నాలు రుద్రారికిన్
ఠీవిన్ గాలి షికారు సేయునని యాళీక జన్మండిడెన్
నావన్న్యాయుగ బద్ధదామముగఁ దన్నా సాత్మనేత్రంపు మీ
శ్రీవండాలుగ వక్త్ర వాపికి బులాకీ లంగరై వ్రేలఁగన్ 137

చ. విచికిల గంధితో నెనయు వేడుక నీటఁదపం బొనర్పఁగాఁ
గుచ పద హస్త నేత్రములకు న్సరి రాదనెఁ దమ్మి యెన్కొకుం
గుచ గమ నోరు మాత్రములకున్ వివిధ స్థితి గల్గె సాటి యా
ప్రచయకృతంబు గాదె పగ పద్మగజంబుల కెల్ల కాలమున్ 138

చ. మధుకరి యామె పెన్నెఱులమాదిరి గానక యొంటికాలిపై
నధరముఁబోలనేగి జితమ్మై చని రెండవ కాలితో సతీ
ప్రథగతి నాదరింపఁ గని భంగమి టొక్కట రెంట మూటనున్
మధుకర వృత్తిఁబూనుకొని మాంద్యము సంకిళులంది కూయిడున్ 139

ఉ. నల్లని త్రాచు పామొకటి నాకువు వెల్వడి గట్ల సందుగా
మెల్లగ సాగు చాపయిని మీలను రెంటిని మ్రింగజూచి యు

త్పుల్ల మయూర పింఛమును బొల్పువగాఁగని యింకఁ బైకిఁ బో
నొల్లక యాఁగె నీ సొబగు నొందిన భద్ర సుభద్ర యేసుమా 140

చ. సుదతి యనంగ రాజ్యపరి శోభిత లక్ష్మికి రాజధాని యే
కద యదియట్లు గాదనినఁ గట్టిన తేరు సెడెమ్ము తేజియున్
వదలక సజ్యచాపములు బాణము లాతని శంఖ కాహళుల్
మదగజ భర్మ కుంభములు మానిని మేన జెలంగ నేటికిన్ 141

గీ. అందమామె మొగమ్ముతోఁ జందమామ
సామెనకు రాక యట యేగె మామ పోల్కి
కందు వృద్ధిక్షయంబుల కందుఁ జెందుఁ
గాననీ కలంక విక్రుతి గాన కౌన 142

క. చిలుకల కొలికి తనూలతఁ
జిలుకును వెలలేని యెఱపు చెలువులు పలుకుం
జిలుకలకుఁగఱవు సుధభ్రము
చ్చిలుకల మృదు వచనరచన చెలువ పలుకులన్ 143

క. పలువరస లలన కలరును
బలువరస లసరసమాడి పకపకనగుచున్
బులు గడిగిన ముత్తియముల
బలువిడి నంచలకుఁ గఱవు బడిబడి నడలన్ 144

క. ఈకాంతయసమయని నా
కీ కథవుండామె నుదుట లిఖియించి నుడుల్
శ్రీకారము తుదమొదలను
శ్రీకరముగఁ బెట్టె ననఁగ జెవులలరారున్ 145

గీ. అంగనను జూచినంత ననంగు బారి
బడి మరుల్గొందురని మరుండడరి తనదు
చాప యుగ్మము నెక్కిడి సశరములుగ
మ్రోలనిడె నన సతి కనుబొమలుఁజూపు 146

శా. ఆకాశంబున సైంహికేయుఁడహిమై యాజన్మ వైరంబునన్
రాకా చంద్రుని మ్రింగ సాగ వెతకోర్వంజాలక బ్జారి భూ
లోకంబందును గందు దాచి యెటనో లోలాక్షికి న్వక్త్రమై
దాకొన్నాఁడని పొంచె రాహువనగాఁ దద్వేణి రాజిల్లెడిన్ 147

చ. బిసరుహనేత్ర బాహువులు వేమరు తామర తూండ్లు సూడుగాఁ
బొసఁగ దటంచు వాదనకుఁ బోకుఁడు మీకు రుచింపఁ జెప్పెదన్
బిసముల కుంతమందు నరవింద సుమంబు వసించి విచ్చున
ట్లెసఁగ సతీ భుజాంతముల నేటికిఁ బద్మము లొప్పుజెప్పుఁడీ 148

సీ. విధు బింబమున నుండి సుధ ముష్టిఁ బెకలించి
విధి వధూముఖమున వేయనదియు
వెలదికి స్మితమయ్యె వెల్తి యేర్పడె నెల
కది లాంచనంబని యంద్రు జనులు
నాకొఱంత మఱల్పనజుఁడామె మధ్యంబ
పాటించి తెగటార్చి పైకిఁ జల్లె
నది చంద్రులోఁబడ కబ్రంబు పైఁబడి
మెరుపయ్యె నెలవెల్తి తొఱఁగదయ్యె
గీ. పైగ సతి మధ్యమందు నాభావమొదవె
నిట్లొకటి సేయఁబొసఁగె వేఱొకటి భక్షి
తేళ్ళ పిలశు నేన శాంతారు జాపరంతు
పూతి గందో్ళ భవత్తను పోల్కి గాఁగ 149

క. పలుకుల కులికిపడును సతి
పలువరసయు మోవి యలును పడతిఁకురులకున్
బలునడలు నడుమునకుఁగుచ
ములు నులుకు నిదేటి చిత్రమో కనుఁగొనుఁడీ 150

క. విచికలగంధి కనుంగవ
కుచయుగ్మము కచభరమ్ము కురువును దీనన్

ప్రచురముగఁ దన్ను దాఁగని
పచరించును భీతిదేమి భయమోకనుడీ 151

గీ. లలనగాదిది లావణ్య జలధిగాని
మత్స్య కచ్ఛపకుముద పద్మ ప్రవాళ
శైవలావర్త మౌక్తిక శంఖభంగ
ముఖ్యమచ్ఛొత్తి నట్లుట యొనయనేల 152

గీ. సర్వలోకోత్తురుండైన శౌరితోడఁ
బుట్టు వగుటనో తత్సమ పురుషవర్యుఁ
పాణిఁ బట్టుటనో మానుభద్రతోడఁ
బోలు సుందరి యెందును బుట్టలేదు. 153

వ. ఇట్లు ద్వారకజనులూరకసౌభాగ్యేన్నిద్ర యగు సుభద్ర రూపరేఖా విలాసాదుల నిడరానివిగాఁ బలు దెఱుగుల నొఱుగు తఱుగులు లేకుండ వ్రాక్కుచ్చి యొప్పలోలుకఁ బూసగ్రుచ్చినట్లుగఁ జెప్ప విన్నచ్చుండు చెవుల పండువుగవిని మెచ్చుకొని యామచ్చకంటిఁ దనకంటఁ గనుగొంట కెప్పుడెదువునో యని నోరువ్విళ్లూర నామెను గూర్చి వినిన యంశమునె సంశయ విచ్ఛిత్తికై యడిగిన వడువున నొకసారి మఱియొకసారి యడిగియు మగిడిమగిడి వేసారులు వేసారక గ్రుచ్చిగ్రుచ్చి యడిగి తెలిసికొనుచు ననుచు కోరిక లీరిక లెత్తనత్తఱి యుబ్బిత్తఱి కడకేగ సమకట్టి యుండ నందునందు నుండక్కడకుఁ జుక్కయూఁడిపడి నట్టు లాడఁబోయిన తీర్థమెదురు వచ్చెనన్నట్టు వెతక బోయిన తీగ యుఱికాలఁ జుట్టివేసి కొనినట్లు తలచినపుడ కొలచిన యిష్టదైవము మునుకొని మొలచినట్టు తలపని తలపుగ విజయము సేయ విజయుండు తనకు బ్రాణబంధువు నిష్టదైవము తోడు నీడయు నేడుగడయుఁగాన నవ్వేణుగాన ప్రియునకుఁ గవ్వడి సర్వాంగాలింగిత భూతలంబుగా సాష్టాంగ దండ ప్రణామంబు లాచరింప నెవ్వరి కెవ్వలను ననలవు చులువుల గోచరంబు గాని శ్రీకృష్ణదేవుండతనిఁతన చతుర్భుజంబుల నెత్తియొత్తి కౌగిలించుకొని యోయీ నీతలంచిన తలంపు లంపులేకయ ఫలింపఁగలవు క్రొత్త పెండ్లికొడుకవు కమ్మని దీవనలిచ్చి కుశలంబడిగి కొన్ని

నిశలందుండి తన చెలియలు సుభద్ర యందతని మనమ్ము ఘనమ్ము గఁదవులుకొని యున్నట్టు దెలిసికొని దవులమున్న వలసిన పని కలిసి వచ్చినట్లు ఘటింపజేయ దుర్ఘటమ్మని యతని మనోరథం బొడఁగూర్చు వాడై ద్వారక చేరికగాన నందనుక రమ్మని దయదొనక మృదుమధురమ్ముగా నోటియార మాటలాడి వేడ్కనతని తోడ్కొని పోఁదలంపున నామతింప నామంతింగల పనియు నంతి యగునని యంతికముగానవచ్చెదనని పార్థుండు తనకు చిత్తము బడిఁజేయుదు నాపై దయ యుంచుమనిననాపై తృష్యస్రేయుని జల్లఁగ దోకొని చనియతని యతివేషంబున నుండుమని తనయింట మరుంగుపడ నొకచోనుండ నియమించినఁగ్రీడి తన యతిమానుష వేషంబు దాఁచి యతి వేషంబు దాల్చియు నతిమానుష రూపంబు చూపఱుల చూపునకు నోపిక పోఁజేయఁదగి యుండె నాకృతక యతికి వరివస్యసేయ నవశ్యముగ లావణ్య సముద్రయగు సుభద్ర కృష్ణు నానతి నేర్పడి విజయుండను సందియ మొదవిననెకప్పుడు మనుష్యుని బోలిన మనుష్యులుండరా యనియు మఱియొకప్పుడు కొలందిరాని నానతీవంబుగా ముసుగిడి యాయతికిఁగాన రాకుండ చాటువడమాటున దాగి తన్ను సత్యారుక్మిణులు నాయతి నాయతి కరుణకు బాత్రురా లవ గుదువులేయని కాలము ననుసరించి మేలము లాడ విజయు మీదదనకుఁ గన్ను దవిలి యున్నను నున్నట్టు లెవ్వరికిం దెలియకుండ నటించుచు న్నాయతి నాయతి శుభప్రమేయమునడిగి తనకు మగడెవఁడగు నోయని యుడుగక తనకు మేనత్త కుమారుడు పతియగునా పెఱవాఁడగునా యని మెత్తమెత్తగ గడువడి నడిగి తెలిసికొని యర్జునుండు వరుండగునని యార్జవముగ నాయతి నుడువిన వినియు వినని దానివలె ముసిముసి నగవుల నామాటలు గీటునఁ బుచ్చుచు సాముద్రికము చూడుడని తన చేయయ్యతి కిచ్చి చూపించిన నిదియగు శుభలగ్న మని యాయతి యామెచేయి బట్టుకొని నీ మనంబున గల వాఁడిప్పుడ నీచేయిఁ బట్టెనని సూచనగాఁ దానె యాపార్థుండనని చూచాయగా నతండు దెలుప నీయతికి నామతి యిచ్చి తాబేలనైతిఁ గదాయని యీతని మెలంగకయ నీతిని దొలంగ బోవనా యన నీచేత నీపతి చిక్కియుండ నెటు తొలంగి పోయెదో యదురాజ పుత్రీ పోబోకుమని యాకుహనా భిక్షువు సుభద్రను వెన్నాడి కూడంబోవ సమకట్టిన జుట్టుప్రక్కలవారందరు వారల నిర్వుర సాక్షాద్దంపతులుగ వీక్షింపు చుండి

యాయతి పార్థుండని దేవకి వసుదేవులకు సత్యారుక్మిణులకు హరివలన బూర్తిగా సుభద్రకు స్వానుభవము వలన సవసవగాను తెలిసి పాణిగ్రహణము కించి న్న్యూనంబుగ నటకు మున్నీ సర్వవిధముల నిర్వర్తిత ప్రాయమైయుండె సుభద్రా పార్థులన్యోన్యరాగంబులు గూఢంబులు గాఢంబుగా సరాగములు గూఢములుగా తగిలి యెుండొరులు నరగడియ యేని విడియుండలేక బాళిని గొన్ని హోళిందేలు చుండిరి. కవ్వడి యెవ్వరికిఁ దెలియకుండ మౌనవ్రతంబుదాల్చికొని దొంగవాకిట మంచము వేసికొన్నట్టు వేచియుండె. వాసుదెవుండెరుంగ నట్టు బలభద్రాదులతో గలిసిమెలిసి యుండియు ముసలికి దెలిసిన వెసలికగా సుయోధనునకు సుభద్ర నిప్పించ దలంచి యుంటచే సవ్యసాచి కిప్పించ నీక యడ్డము గొట్టు నన్న తలంపెఱింగి హలికి హరి తెలియ నీయక యుండె. ఇటులుండ వడ్డించు వాఁడు తన వాఁడైన గడబంతిని గూర్చుండు మన్నట్టుల ఘటనా ఘటన సమర్థుండగు శ్రీగోపాలదేవుండు తనపట్టునఁ గలండని నూావులు నూనెయు నొకటి తెలివిగలవాడె వెలికిబోవువాడు కదాయని యావధూవరులు తఱివేచియుండి కొండొకనాడు వారిరువురు రైవతక గిరిపై గ్రామదేవతకు జరుగు జాతర గనుంగేందమను నెపంబున నరుదారు నరదంబు నధిరోహించి కరినగరికిం బోవుచుండ యాదవులు నారవులిదెయాదిఁగొని హరిప్రేరణంబున దమ కన్నియ కన్నియు బోధించి పార్థుండామె నెత్తికొని పోవుచున్నాడని యాదవులు నాకురు వీరు వెన్దవిలి యాసు సుభద్రముగ విడి యా సుభద్రను విడచును నట్లు పెట్టిపోనియెడ నిన్నుమాశరముల పాలొనరించెదము. నీవు నరుండవైన నేమి హరుండవైన నేమని బెదిరించి శరజాలంబుల విడిన నామధ్యమ పాండవుఁడవలీల వారల నెల్ల నోడించి నోనాడ నేసిన సుభద్ర సారధ్యంబున వారల నెల్ల వెనుకఁ బట్టించి తన కరిపురంబు తెరువుఁ బటించి రధా రూఢులై వధూవరులు పోసాగిరంతట నిర్జితులైన యాదవులు ద్వారకకుంజేరి యాదవేంద్రునకు దద్వృత్తాంత మంతయు వినిపించిన శౌరి నీలాంబరాది స్వజనంబుతో నర్జును పోకకు వగవంబని లేదనియు మన పైతృష్వసేయుడు తన మాతుల పుత్రుంగొనిపోవ నతండు తగడే తల్లి దండ్రులు సమ్మతించి యిడకున్నందనయ సుభద్రనతడేల కొంపోవు వారల యభిమత మెట్టిదో తెలిసి కొనక యతని వెనుకన బోవుట మీది తప్పిదము గాదె యావుండ దూడయుండ గుంజనఱచునే కాన నాతని

పట్ల విద్వేష ముడుగుండని శౌరినివారించి యోదార్చిన విని యంతట బలభద్రాదులు పోక నిలిచిరి. సుభద్రార్జునులు కతిపయ ప్రయాణంబుల హస్తి నగరంబు దరసి సుభద్రను ముందు లోనికనిపిద్రౌపద్యాద్యంతఃపుర స్త్రీల మనస్సులు సమాహితంబులు గావించి సభార్యుండై సభార్యుతౌనన ఫల్గునుండు పురంబు ప్రవేశించి యందు స్వస్థ చిత్తముతో నుండ నింతలో హలి హరి సాత్యకి ప్రముఖ యాదవ వరులు దేవకీ వసుదేవ సహితమ్ముగా హరణమ్ములు సంపూర్ణముగా గొని తెచ్చి వధూవరుల కాప్యాయనమ్ముగా నొసంగి సుభద్రార్జునులు క్షీర నీర న్యాయంబున నుండగఁ గనుల పండువగా గాంచి కతిపయ మాసంబు లచ్చట ముచ్చటదీర వసించి యింపుగ నంపకములంది తక్కిన వారలందఱు స్వపురంబున కరిగి సుఖంబుండిరంత కృష్ణుండు పార్థుతోఁగూడ నింద్రప్రస్థ పురంబున నుండె నంత కొంత కాలంబునకు. 154

గీ. భద్రమతి సవ్యసాచి సుభద్రయందు
మన్యుభాతారి ఘనునభిమన్యు మాన్యుఁ
గనియే సుతు హితు విధు వంశకరుని ధరణి
మరుని నెగతాళి సేయ నమరు వరాంగు 155

ఉ. ద్రౌపది యందుఁబాండవులుదారుల ధీరులఁ జారు మూర్తులన్
బ్రాపున గాంచి రేపున నృపాలురు బాలుర నేవు రేపురన్
జాప శరంబులందెదురఁ జాలఁడు వారిని జామదగ్న్యుఁడు
ద్దీపితు లాజి నయ్యలకు దీటుగ వచ్చును ద్రచ్చి చూచినన్ 156

గీ. మౌని కులపతు లతులముగ
శౌనక ముఖమునులు దీర్ఘ సత్రము సేయన్
బూని యహర్నిశ మాజ్యం
బానఁగ మందాగ్ని బడియె నగ్గికి నెగ్గె 157

క. వివిధ మహౌదధి గాన భు
వివిధము ఖాండవము దగల బెట్టింపుఁడు తీ

వి విధాత్మ జాడ్య మడుగ జ
వి విధము వేడగనగ్గి విని వృష్ణినరుల్ 158

క. ఖాండవము దహనుచే నా
ఖండ లురప మాగి వారు గాల్పింపంగా
మెండుగ సకలోద్దేశము
మండి యడఁగె మిగుల దొకటి మందునకైనన్ 159

గీ. అశ్వ సేనాహ్వాయంబను నహియొకండు
తల్లి తోఁగూడ నందుండి తలఁగఁ జూడఁ
గ్రీడి వోనీక యాగినఁ గీలికెఱఁగ
నరగి కఱఁగెను బగబట్టి యురగ మరెగె 160

క. ఆయురగ మరిగి మరిగియు
యాయుశ్శేషంబు కలిమి నలవడి రాధే
యాయుధముగ మృధమున విజ
యాయువుఁగొన నుండి తానె హతమయ్యె సుమా 161

వ. ఆవిధబంతయుఁ గర్ణార్జునుల ప్రధనంబు పట్ల తన్నిధనంబు తీరు తెల్లమిగ తెలియనగు

162

వ. అంత ధర్మరాజు రెండవ యమ ధర్మరాజుం బోలె నింద్రప్రస్థ పురంబున ననుజ తనుజ తరుణీ సహితమ్ముగ హితముగఁ దమ్ముగని జనమ్ము సంతసిల్ల సంతసమున నివసించి గొప్ప రాజు లెల్లఁ దఱిదప్పకుండఁ దప్పక లూరి యప్పనమ్ములుగఁ గప్పమ్ము లప్పమ్ములప్పనసేసి యరిగాపులై నఖముఖముల నుండి వచ్చువచ్చు బళ్ళు బల్ల కొలంది కొలంది యిడరాకుండ రాఁగ నాగ తురగరధపధాతి చతురంగ బలమ్ములతోఁ దమ్ములు నలువురు నలుదిక్కులకు వెడలి దండయాత్ర సేసి దిగ్విజయమొనర్చిఁ తెచ్చిన కానుకలు కనకపు రాసులు మానక వచ్చి తండోప తండంబులై మెండుకొని యింటనిండుకొని యుండె, వివిధసమృద్ధి నవసెదధులు గల కుభేరుతోఁ దులదూగుచుండి యుధిష్టరుండు తాఁబెట్టినది భిక్షగఁదా బట్టినది రక్షగదానన్నది కక్షగదా బట్టినది

బంగారముగాను బెట్టినది సింగారముగ సూరెల చుట్టములు సేరి తనకలిమి కెలమి సెందఁజుట్టాల సురభియై దైనందినాభి వృద్ధిగ వహౌని బృంద మయమయత్నాగతా భాగ్యతులై విందులఁ దనియఁ బరమ భాగవ తోత్త ముఁడనిపించుకొని గోవిందుని కృపపైనఁ బాలు పక్షి నేలబాకు చీమదనుక సకల ప్రాణి కోటియు నిరపాయమగు నతని పరిపాలనమునఁ గలిగిన హాటుని వేయినోళ్లబొగడ నెగడి విఱుగు తఱుగు లేని మూర్ధన్య పదవి యొదవి తనయందుఁ బ్రజలు ప్రజలు యందుఁ దాను నెట్లుండవలయునో యట్టి యుండి పరస్పరాను రాగంబు నన్యోన్య ప్రేమయు, సుఖప్రదముగాను రాఁజన్య జనక భావసౌజన్యమునకు కౌఁజనక యూసౌజన్యము స్వామి భావ సంబంధములతో నెయ్యముగ వియ్యమొంద నొకనాడు ధర్మరాజు నిండు సభదీర్చి యుండ బుద్ధి విశారదుండును దనురుచి నిర్జిత శారద నారదుండునగు నారదుండరుదెంచి సర్వలోకపాల సభలనందు వసించు రాజులను దెల్పి పాండురాజునకు శ్రేయోదాయకముగా రాజసూయ యాగమ్మొనరింపు మని ప్రేరేపింప విని యావ్యాహారము భవ్యాహారమ్మగ గొని శ్రీకృష్ణదేవునికి వినిపించిన నమ్మహామహుండు హర్షించి

163

చ. ధర్మజుతోడఁ గృష్ణుఁడనె దర్పమునొంది సమస్తరాజులన్
ధర్మము రాజసూయము నొనర్చుట యర్థము గర్హమాన్యమున్
మర్మము విప్పి చెప్పెదను మాగధుఁడుం బెదురింతలేక దు
ష్కర్మఁధర్మఁడిష్పురణ కర్కశుఁడంచును బేరుమ్రోగెడిన్ 164

మ. యశమొప్పారగ వానికిం గుడిభుజంబై పూని తత్సేనలన్
శిశుపాలుండును పాలనమ్మొనరుచున్ జీతమ్ము భత్యమ్ములే
కశనార్థమ్ముగ వచ్చి వానిదయకై యందుండ్రు సేనాధిపుల్
వశులై మంత్రులుగాఁగ హంసరుచికుల్ వర్తింతురే కోదరున్ 165

ఉ. హంసుడు వాని తమ్ముఁడు దురాగ్రహులై యొకనాఁడు నాదుపై
కంసలు లొక్క పెట్టుగవియన్ గని పన్నియుపాయ మాజిలో
హంసుఁడు వచ్చె నచ్చటకు నాదృతి మోడిచికుండ నమ్మి స్వ
ధ్వంస మొనర్చి కొంచడఁగె వార్ధి పడంబడి వచ్చె హంసుడున్ 166

ఉ. చేయఁగలట్టి ప్రెగ్గడలు చెల్లిన వెక్క జరాతనూజుఁడున్
గాయము ఁదిన్న బెబ్బులియు గాయము జజ్జయువెక్క లొక్కటన్
బోయిన పక్కి కోరలుడిపోయిన సర్పముఁబోలుచు న్మృత
ప్రాయుఁడుగా వసించుఁజలపట్టితిమేని పుడోడు వాఁడనిన్ 167

గీ. పేర్చి బార్హద్రథిం దెగటార్చి తేని
యరయ నెఱవేఱు రాజసూయమ్ము యమ్ము
గాన క్రీడిని భీము వేగాన నాదు
తోడఁ బంపు జరాసంధుతోడఁబోర 168

మ. అన శల్వారియనె న్యదుప్రవరుతో నయ్యాహరీ మాకు నా
యనవుం దల్లివి దిక్కుమ్రొక్కుచెలి వియ్యంబొజ్జవున్వొజ్జపీ
వనే నాపను పంగఁదమ్ములను మాకయ్యే పనుల్గార్చుమున్
మనుపం గర్తవు గానఁ జిత్తము బడిన్భావించి తావింపవే 169

వ. అనుడు శ్రీకృష్ణ జిష్ణు పావనులు పావన స్నాతక విప్ర వేష ధారులై యత్యంత
సంతోషమ్మునఁ గదలి
170

ఉ. ఱివ్వున లేచి ముప్పురు గిరివ్రజ మన్పుర మేగి మాగధున్
జివ్వకుఁబిల్వ వాఁడును నిశీధిని బారుల కేల చివ్వనాఁ
గవ్వడి వాఁడు విప్రులము గాము వృకోదరుడీత డే హరిన్
దవ్వులనుండి వచ్చితిమి దాయవు నన్నినిఁ బట్టి చూడగన్ 171

వ. అనియిట్లు యదుపుంగవుండు తమ నిజస్థితి యున్నది యున్నయట్లు తెల్పి
గొల్పుగొనుమతిఁ బోరికి నాయితమ్ము గమ్ము లెమ్మనుటయు
172

చ. అనవిని యాబృహద్రథజుఁడాజ్యము వేల్చిన కేలి పోలికన్
గనగన మండి లేచి చిరకాలము నుండియు వేచియున్న నా
కనువుగ మల్లయుద్ధమిపు డబ్బెను భాగ్యము కల్మినంచు నం
దనునకుఁ గట్టి పట్టమును దాఁదగ దాఁకెను భీము నామునన్ 173

సీ. పడి జరాసంధుతో వడముడి పిడిగ్రుద్దు
లాటకుదిగి చేతి తీఁట దీఱ
నితఁడాతనిని నాఁతడితని నాతతముగ
నోలి నేలను బెట్టి కాలఁజములు
నిట్లు పోరి రోకింత హెచ్చు తగ్గులు లేక
యెట్టకేలకు భీముడెచ్చి దాయ
మెడబట్టి నేలపై బడనెట్టి డాకాలఁ
బెడ కొత్తి పెఱకాలఁ బెనయ బట్టి

ఆ.వె. క్రమ్మి పచ్చితాటికమ్మ చీల్చిన మాడ్కిఁ
జేత మాగధీశుఁ జీల్చివైవ
రెండు పచ్చెములు నొకొండు గాఁగలియుచు
నెప్పటట్లు వచ్చి యెదిరి నెదురు 174

క. దానికి వెఱపడి శతశత
దాని బలుండడుగఁ దద్వధ విధము సెప్పెన్
దా నీరజాక్షుఁడతఁదరిఁ
బోనడఁచెను వ్యత్యయముగఁ బొదిగి తునియలన్ 175

క. ఇటులా కుటిలాత్మని హరి
పటు విక్రము డనిల సుతుని బాహుల కెఱగా
ఘటియించి రాజకోటికిఁ
దటుకునఁ జెఱయుడిపి యరిగె ధర్మజు కడకున్ 176

బంధురవృత్తము:

అనుదినమునుగనియును మఱిఁగనఁగా
నాసలు గొల్పెడు శిల్పములున్
గనుగొను జనులకు బడలికలరుఁగన్
గ్రాలు కెలంకులలంకృతులన్

మనమున కనువుగ నొనరిచి మయుడు
　　న్నానుగ దానసమాన సభన్
ఘనమణి రుచుల శమన తనయునకున్
　　గన్నుల పండువుగా నొసఁగెన్ 177

ఉ. ఆసభయందు ధర్మజుడు నాసభయంబున బెట్టరాజు లా
యా సదుపాయనాలు జనులౌననఁజేసెను రాజ సూయమా
యాసము వాసి వ్యాసముఖులట్టి ముఖంబెటఁ గానమంచనన్
నాసను వ్రేలువెట్టికొని నాలుకనుంగొఱుకంగఁ జూపఱుల్ 178

సుగంధి
రాజసూయ మందు ధర్మరాజు భీష్మనానతిన్
బూజసేసెఁ గృష్ణు సర్వపూజనీయు దానికిన్
రాఁజి యోము మండి చేదిరాజు నిందసేయఁగా
దేజు మీఱఁ జక్రధార ద్రెంచె శౌరి చైద్యునిన్ 179

వ. అట్టి రాజసూయ మహాధ్వరంబున రాజరాజగు దుర్యోధనుండు దానధర్మాదులు సేయఁ బెత్తనంబు వహించి మహింగల ధనమంతయు యుధిష్ఠిరునింట జేరెనని యడిగిన వారి కడిగినట్టు లొసంగుచుఁబొరుగింట జూపరా నాపెద్ద చెయ్యి యన్నట్టు ద్రవ్యంబెల్ల రెండు చేతులంగొల్లవెట్టుచుండి మయనిర్మితమైన యాసభాస్థలి చిత్రవిచిత్రంబులు గనుంగొను వాడై సుయోధనుండందొక నాఁడు తిరుగు చుండి యేపు మీఱు మయు శిల్పనైపుణంబు బెఱువారు వెఱవార నెప్పుడుగన్నను సజలప్రదేశంబుల జలంబుగను నిర్జలములు సజలములుగ సద్వారము లద్వారములుగ నద్వారములు సద్వారములుగ సమతలములు విషమతలములుగ, విషమతలములు సమతలములుగ గానంబడుంగాన నాగాంధారేయుండు శిల్పదిదృక్షా భారదారేయుండై చెప్పనలవిగాని యాగొప్ప సభయందలి విచిత్రములుతొప్పవేయక కనుగొనుచు సందుగొందులు తిరిగి వెఱగందుచు దాని యందము చూచిన కొలంది నింక చూడముచ్చటగనుంట నమందానంద మంది మందు గనియెద గాక యని యప్పటికి తిరిగి చనుచునొక

నిర్జలతలముగని నీరెగఁ దట్టెనని దట్టించి బిగఁగట్టి కట్టుబట్ట నెగబెట్టుకొని సజల నిరాకరముగనిమెట్టనేల యని తత్తరముగ నడిచి కుత్తికబంటి నీటంబడి బుటుకలు వేసి గుటకలు మ్రింగి తడబడుచు దడిబట్టలు పిడిచికొని యొడలు తుడుచుకొనుచు నొకచోగోడ లేదనుకొని వాటముగ నడిచి కవాట మడిచికొని మసలు నెడ నొసలు బొప్పిగట్టిన నొప్పి నప్పప్పాయని పాణిని ఫాలతలము నిమిరికొనుచుమిట్టపల్లములు నొకటిని మఱియొకటిగ నెంచి తత్తనుసారపు కారియలను జెందుచు నీతండ తండ్రికి కొడుకే కదాయన్నట్టుకే యుద్దేశంబు గాననేరక తన దంతరాళము నుండి ప్రోవె తెఱంగెఱుంగ గ్రుడ్డియెద్దు చేనఁబడిన వడవున దరియంచు గానక ముప్పతిప్పలు పడుచుండ బాంచాలీ వృకోదులందరిన యుండి యతని యవస్థలు గనుగొని యప్పట్టున పట్టరాని నగవాగవి ఫక్కున నవ్వ రారాజున కది చచ్చిన చావై కడు సిగ్గుపడినె దాయనని వీరు నన్నింత వింతగ గేలి సేసిరి గదా చొరనేదాయ బారియలేదాయెఁగదా యని నాననూని మగఁడు తనను మొత్తినందనకుఁ గాదు సవతి చూచినందున కనినట్టు యెట్టనో యెట్టకేలకు వెలులాతనికి బదుగుటిలో నగుబాటున కగ్గమ్మెవిడి వెలిమెచ్చులకుఁ బాండవులఁగూడుకొని తోడనె వీడికొని యచ్చట గదలి మెదలకుండ దన కరిపురి కరిగి మలగెడి యుల్లంబుతో తండ్రికడ కుఁబోయి ప్రణమిల్లి తనపాటును భంగపాటును లోనుగాగల తనమది నొప్పినంతయు సెప్పి యంగలార్చిన గన్నీరు మున్నీరై కడవల గొలంది గార నడలుచున్న తనతనయు విగతము నూరార్చి ధృతరాష్ట్రుండిట్లనియె 180

గీ. ఎందనకేవిటికీహా యవకాసరణినెందుల గందెదు హీనుని కరణి
సందియమును వీడు చాల వైభవము సౌఖ్యమ్ము సోదర సహితమ్ము పొందు
యెందున కెందునకీ నీమతమున నేవగించక నొత్తునే పనికినైన
బొందుగఁ జెయంగఁ బూనితి వేని పుణ్యమో పాపమో పూని సేయింతు 181

క. జనకుడు సమ్మత మొదవగఁ
దనకట బరవశము నిచ్చి దయదొలుకాడన్
మనమారఁ గబల్క గొమఁరు
గొనకొని యనుకొనియె కోర్కె కొనసాగినటుల్ 182

క. దుష్ట చతుష్టయ మొకయెడ
నిష్టముగా గూరుచుండి యెట బాండవులన్
గ్లష్టములఁ గుడిపి రాజ్య
భ్రష్టులుగావింతు మంచు భావించు తఱిన్ 183

వ. దుష్ట చతుష్టయాంతః ప్రవిష్టుండు నిష్టుండు నతుల యుక్తి శాలియు మాతులుఁడు నగు శకుని యక్ష విద్యా విశారదుండుగాన భాగి నేయుఁడగు గాంధారేయుని కిట్లనియె

184

చ. శకునిని నక్షవిద్యను విచక్షణుడున్ గెలువంగ నేర్చునే
మ్మకముగ నేరులేరు హనుమంతుని ముందర కుప్పిగంతులా
ప్రకటపు జూజ మేర్పరుప పార్థుల గెల్చి తదీయ వైభవం
బొక నలుసైన వీడకిటు లోడ్చె దనిచ్చె దనీకు సర్వమున్ 185

క. అనిన నిది వోలు నని త
క్కిన వారలు సమ్మతింప గితవ సుబలజుం
డనువుగ ధృతరాష్ట్రునకు స
వినయముగాఁ జెప్పి మతులు విఱువన్ నతడున్ 186

వ. విదురునిఁబిల్చి ధర్మజుని పీడక యాడకు రాగ నక్షకో విదు రుచివుట్టఁ జెప్పి వెసవేడ్కను దోడ్కొని రమ్మటంచు భా విదురుప లబ్ధికై పనుప వేచని యాతఁడు ధర్మరాజు నీ విదురుని తృష్ణ మూనకు ముపాన మటంచు జెప్పి తెచ్చినన్ ధర్మరాజు శకునితో జూదమాడంగ వంగిన భీష్మాది కురు వృద్ధులు వలదుడుగు మని చెప్పి చెప్పి వేసారి కట్టకడ కిట్లనిరి

187

పంచపాది:

చ. ముడి విడి చూడు మాపదకు మూలము జూజము తొల్లి నైషధుడు
దుడుగక యాడి ద్వాపరుని కోడి చనెన్ తన కట్టు బట్టతో
బెడచెవిఁ బెట్టి బోకుమని పెద్దలు బుద్ధు లెన్ని చెప్పినన్
విడువక యాడి యాశకుని పిక్కలలోఁబడి ధర్మజుండు తా

వడముడి లోనుగా ననుజ వర్గము దుర్గము నాలినోడెగా 188

ఉ. హావిధిఁ భాండవాగ్రజుఁడు నెల్ల పణంబుల మోటు వోవుడున్
తీవిని దుస్ససేనుడు వడిన్‌జని యంతి పురంబు లోనికిన్
ద్రోవది నీడ్చి తెచ్చి సభదూఱి బహిష్టను తాకఁబోకుమఁ
య్యా వలదంచు కృష్ణయన నాగక యూడిచె నామె పుట్టమున్ 189

క. ఆమె పతివ్రత గావున
నేమనిఁ దలఁచెనొ మదిన్రమేశుని గృష్ణ
స్వామి కరుణారసమ్మున
నామహిళకు వల్వ లక్షయములయ్యె మెయిన్ 190

ఆ.వె. ఊగి విప్పి విప్పి ఊక్కలు వడి దుస్స
సేనుఁ డూరకుండె సిగ్గు గలచి
వనిత నాదు తొడను వచ్చి కూర్చుండుమ
ఒంచుఁ గౌరవేశుడపహసించె 191

చ. వడిముడి పళ్ళి బాములుకుఁ బట్టిగఁ జాలని యల్క చట్టిలో
నుడుకుచు దుస్ససేనుగని యొట్టిడి నో వదియించి నీ యురం
బడఁరగ వచ్చి రక్తమును నానెదఁబాప సుయోధనున్ వడిన్
దొడలును దెంతు నాగదను దుర్గతి కింజనువాడ దప్పినన్ 192

వ. అని ఇటులత్యాగ్రహంబున వడముడిన యావేడినుడులమ్మదిం దశ ద్వాదశగ్రహాపతుల యోగుడద్యోష్ణతనహసింప లయకాలకేలిపోలికననుకరింపఁ బ్రళయ కాల రుద్రుని కోపంబు భీమరూపం బెత్తినట్లు దపింప బెదవులు చలింప నత్యంత రౌద్రాకారుండైన వృకోదరుండు పెట పెట దంతముల్గొఱుకుచుఁ గన్నులు నురలు విస్ఫులింగంబులింగ లమ్ముల వలె సభవారిపైఁ బడ సహనంబుఁ దక్కి గహనంబు దరికొన్న దవదహనమొక్కో యన నక్కుల పాంసనులగు సుయోధనాధుల మీఁద మండిపడి వీక్షించుచు నుడివిన న్రుడువుల వడువున విని వడముడి తీక్ష్ణపుఁ బ్రతిన లాక్షణంబె నెరవేర్పంగల వాఁడని కడువడిఁ గడగడ వడఁకన్ వారా సభయందొక్కఁడైనఁ గానరారైరి.

మఱియునటకు మున్న కృష్ణను గని తటకాపడఁ జెఱగులక నెఱి తగులమునఁ
దవిలి యుండు దండిమగఁటిమి గల మగని నిందేరనేనేరకొనుము మగువాయని
కారులఱచిన కర్ణుని కఠోర వాగ్ధోరణికి నసాధారణమగు కట్టల్కవాడమి
పుడమి కపింప ఫల్గునుండతనిఁ ద్రుంప నపుడె తెంపు సేయ సమకట్టియుఁ
దమకించక తమకించుక సహనంబు సేయుట శుభావ హరి బగుసేఁత
యనియుఁ దగుసేఁత యనియు నప్పట్టున సమయము తప్పివచ్చె ననియుఁ
దనయన్న మూాలమున వచ్చిన పొచ్చెమునకు గడునొచ్చి కొనుచున్న భీభత్సుండు
భీభత్సరసము మొగమున వ్రేలాడ నెదిరి భర్త్సనఁ జేయుచు నిట్లనియె

193

చ. పలువగ నాఁడు పుట్టనెడి పాడిని పీడిత సాధ్వి ద్రౌపదిన్
బలువగ వేఱె యొండుపతి బల్లిదు నీసభఁ గోరుకొమ్మనాఁ
బలికిన పాపికర్ణుఁదల బాణ హతిందును మాడి యాజికిన్
బలి యిడువాఁడ నప్పనికిఁ బాసితినే న్బడు వాడఁ జిచ్చునన్ 194

వ. అని కర్ణకఠోరంబుగా రిపు కర్ణ కఠోరంబుగా నర్జునుఁడు వల్కి
యభ్యర్ణజనంబుల నెల్లఁ గలయం గనుంగొనుడు హాహాకారం బెత్తి యాసభ
మహార్ణవంబు పగిదిను ల్లోలకల్లోలంబగుట యు నాయార్భటి చెవులార విని
జనుషాంధ నృపాలుండు తనకోడలికి మనః ప్రియంబు సేయం దలంచి

195

ఉ. భీముని కోపవహ్నికి దపింత్రు నిజాత్మజు లిందనమ్ముల
ట్లాము దొఱంగి కన్నవియు నంతటి కాటుక పెట్టనేల నిం
తేమిటి కంచు మామ విడిపించుచుఁ గోడలి కామె భర్తలన్
గామిత రాజ్యమిచ్చి విడెఁ గన్నము లోనలి గుట్టినట్లుగన్ 196

సుగంధి

లోఁగి జావు దప్పి కన్నులొట్ట వోయె నన్నటుల్
జోగియయ్యు నొక్కసారి జూజ మాడి ధర్మజుం
డాఁగ కేగె వెండి కౌరవా గ్రజుండు బిల్వఁగా
సేగి మానుమాట యంచుఁ జెప్ప బుద్ధి పెద్దలున్ 197

వ. మఱల ననుద్యూతంబునకుఁ బిల్వంబడి జద మాడ వెజ్జీఁగొని వచ్చిన యుధిష్ఠిరుంజూచి యక్షకితవుండగు సౌబలుండు హితత ముందునుం బోలె వెంలఁగు వీలు వాలుగనె బ్రాక్కుచ్చొదనెట్లయిన నీసారి పణంబున గుణహీనములగు కరితురగధనకనక వస్తు వాహనంబు లొడ్డవలువ దమ్యని పలు విలువ గలవి గాన వలుదగ దుఃఖకరములు గాన వాని మానివేయుద మని చెప్పి మఱియు 198

చ. శకునియు ధర్మసూతి కనెఁ జంకలు గొట్టుచు నోడువారు గొం
కక చని ద్వాదశాబ్దములు గానను మౌనులరీతినుండి యిం
కొక సమయేరికిం దెలియకుండఁ గనుండ వలెన్ జరానసే
రికి నయినం గనంబడిన రెట్టి శరత్తు లటుండ గావలెన్ 199

వ. అనుటయు 200

గీ. అట్టివ్రైగన యొడ్డున కనుమతించి
మతిసెడి యొకింత యెందఱు మంచిఁదఱమి
సెప్పినను ధర్మజుఁడు పెడచెవినిఁబెట్టి
శకునితో జూదమాడెను జడుడు వోలె 201

క. కుటిల మతియైన శకుని క
పటమున మఱి ధర్మరాజు పణ మోటు వడెన్
జటుల సుసహాయకుండట
పటు ధర్మాత్ముఁడట వెతకుఁ బాల్పడె నహహా 202

క. అదిగని యాసహదేవుం
డదరి పడుచుఁ దోక ద్రొక్కినట్టి ఫణిగతిన్
మదికొదువఁ దగని కోపము
గదురన్సభ బెదుర నవుడు గఱచుచు బలికెన్ 203

క. సకల జనుల్వినుఁడీ మా
సకలైశ్వర్యమ్ములొడిచి శత్రులకిడు నా

శకుని శకుని సాళ్వము లఘు
శకుని వలెం(డ్రుంచు వాఁడ జగమౌననఁగన్ 204

వ. ఇట్లు సహదేవుండ సహ మానా ప్రతిమాన ప్రతి నోద్రిక్తుండై వేడిమి నాడిన ఘన రౌఁద్రోక్తులకు సభాస్తారు లెల్లఁ దల్లడిల్ల జగమ్మతని దగుఁదగు నని పొగడె సదాచారులైన పంచపాండవులు ధార్తరాష్ట్రులకు సదాచారులై యుదారులయ్యు ననపాయమ్మగు న్యాయమ్మునకుఁ గట్టువడి కట్టుపుట్టమ్ములు దక్క దక్కుంగల భూషణాది రాజ చిహ్నంబు లుజ్జగించి తమపోక కుమ్మలిక నొందు ప్రకృతి జనమ్ముల స్వజనమ్ముల వలె బుజ్జగించి కించి ల్లజ్జ నొజ్జలకుం బెద్దలకు నెఱగి వాని దీవనల ఘన భావ నల నంది తోడనె వేడుక దయయుంచుమని వేడికొనుచు వీడుకొను విదురాది క్షేమం కరులంగూడి కొనినవారలు గౌగలించుకొని తమ్మహితమ్ము చెప్పికొని కొంత దవ్వనుగమించి విడఁజాలక జాలి విడఁజాలనెనరులు కాన్పించి యొక్కొక్కరేయక్కడ దిగఁ బడుటయుఁ

205

చ. వడివడి బంధుజాల మరివంచితుడంచితు డుంచి తల్లిన
య్యెడ విదురాలయంబున వసింపఁగ దామట వచ్చునంతకున్
విడువక ధర్మరాజు తనవెంటను దమ్ములు ధౌమ్యులాలురా
నడివికి వెల్వడెంబడి జటాజిన వల్కలములన్ ధరించుచున్ 206

చ. అడవికిఁ దం(డ్రులేగు పఱి నాయభిమన్యుడు ద్రౌపదేయులున్
గడుకొని ద్వారకాపురము కాపురమై హరియుండదండగా
వడి గడితేఱి రన్నిట సుభ(ద్రయె సాగక నందయందఱున్
బడలిక యింటికంటె గుడి భద్రమ యన్నటులయ్యె వారికిన్ 207

సుగంధి

ఓలిఁ బాండవేయులు న్సుయోధనుండుఁ దండ్రియున్
బాలు పంచి యాక పైఁగ బాధవెట్టి కానకి
ట్లేల పంపు వారో వీరికింత కింత కల్గు నం
చాల గోలు బాలగోలునయ్యె నాఁడు తత్పురిన్ 208

# అరణ్య పర్వ కథ

సీ. సాదరంబుగ వెంట సోదరుల్తరుణి రా
మేది నీ పతి కీర్తి మిన్ను ముట్ట
సురసంఘమునకు భూసుర సంఘమునకు నం
తని వివంచన లేక తనివి గొల్పి
జనగణ్య కథలను ఘన పుణ్య నిధులను
మునులచే వినియును మును కలికి యు
మానినీయుతు సర్వమాన నీయునిఁ గృష్ణు
నట్టి నడుమ గాంచి నతులనించి
గీ. ఘోష యాత్ర నెపమ్మున గ్రూరుడగుచుఁ
గానలోఁబాండవులను నిష్కారణముగ
జెరుపగా వచ్చి గంధర్వు చెఱను బడిన
వాని ధుర్యోధనుని జెఱవాపి పుచ్చె 209

గీ. వావి వరుసలు విడిచి ద్రోవదిని వదినె
గాఁదలంచుచుఁ జెఱగొని కాననేగు
సైంధవుని బట్టికొనియు దశ్శలను దలఁచి
ప్రాణములు గాచి పాండవు ల్బావు విడిరి 210

సీ. దుర్యోధనుడు ఘోర దుర్వాసముని తోడ
బదివేల శిష్యులు బలిసికొలువ
భుక్త్యనంతర వేళ భోజనంబిడుమంచు
వచ్చిన శల్యారి వల్లెయనుడు
వారలు గంగకు వార్చి రాఁబోయిరిం
తటఁ బాకమొనరింపఁ దడవు లేమి
భీతిమైఁ జేతులు పిసికి కొనుచు కృష్ణ
యెదనెంచ శ్రీ కృష్ణుడేగు దెంచి

గీ. పాత్ర నంటిన మెతు కఱచేతి గుంటెఁ
డప్టు ద్రౌపది చేఁగొని యారగింప
మునికి శిష్యులకును దలమును కలగుడు
భుక్తి లజ్జనదే పోకపోయెఁదబిసి 211

గీ. పంచపాండవులే కాక యెంచి చూడ
వినుము హరికిని బ్రాణము ల్వేఱ కలవె
యెట్టి యెట్టి మహాపద లెగిరి పోవె
పార్థులకుఁ జీమ కుట్టిన పాటిగాక 212

సీ. ఫల్గునుఁడొక సారి ఫాలాక్షు డీకొని
పందికై డీకొన బలిమి గడఁకఁ
గడకస్త్ర శస్త్రముల్మడిసి పోయినఁగ్రీడి
పిడి గ్రుద్దులకు దిగి విడువకున్న
ముక్కంటి వెఱగంది ముక్కుపై వ్రేలిడి
కొంచు ఁబాశుపతమ్ము లంచమిచ్చె
నింద్రుడు కడు మెచ్చియిచ్చి శస్త్రాస్త్రము
లొక కంట కనిపెట్టి యుండి వాని
గీ. ప్రేమ నమరావతికిని రప్పించు కొనియెఁ
గొన్ని నాళ్లకు నూర్వశి కూడఁ దివురఁ
గూడదని ఱోసి తెల్పుచుఁ గొడుకు వరుసఁ
ప్రియమె సతిపొందుకనఁ జితేంద్రియున కెందు 213

క. అందునకు పగచి యూర్వశి
నందనుఁడని వావిగలదె నాకస్త్రీ కీ
వందుము పేడి తనమ్మని
కొందలపడ శాపమిచ్చె గోపము కొలఁదిన్ 214

క. ఆశాపము ముందొక సమ
యాశాపాశమున నీ కనాయాసముగాఁ

బ్రాశస్త్యముగాఁ గడచెడు
నీ శాపము లాభమంచు నింద్రుఁడు వల్కెన్ 215

సీ. వడముడి మండి వడి వడిగనడవిలో
గడువడిఁ దిరుగుచుఁగడిమి మెఱయ
మేరు ధీరుండయి మీఱు కిమ్మీరుని
జేరి కిమ్మన నీక చీఱి చంపె
గంధ సింధుర యాన కామింపఁ దెచ్చె సౌ
గంధికం బందని ఘన సుమంబు
తమయింట బ్రాహ్మణోత్తము రీతి భుజియించి
శమనజు నకులుఁబాంచాలి నెత్తి 216

ఆ. కొంచుఁదిన్నయిల్లు గ్రుద్దలించిన యట్టు
లరుగుచున్న యాజటా సురాఖ్యు
బిట్టు జంపె గొంతు బిసికి వెల్వడి వచ్చె
వాహనమ్ము మ్రింగ సాహసమున 217

క. బృహదశ్వుడు రోమశుఁడును
మహనీయులు వ్యాసమౌని మార్కండేయుం
డు హితంబుగఁ గనవచ్చి సు
మహితంబగు కథలు సెప్ప మహిపతి యలరెన్ 218

గీ. చేత మలరంగ గడిమాయ జేయఁజేసి
ప్రీతిగాఁ గృష్ణ షడ్రసోపేతము గను
వేడ్క వడ్డింపఁ బదివేల ద్విజులు దినముఁ
బంక్తి భుజియింప నలరిరి పాండు సుతులు 219

క. ఈ విధమునఁ బాండవులకు
భావింప నరణ్య వసతి పండ్రెండేండ్లున్
తీవిఁ బది రెండు దినములు
గా వెళ్ళెను జనులు మునులు గారవ పఱుపన్ 220

సీ. వనవాస దినములు వడిసి పోయెడు తఱి
ధరణి దేవుఁడొకండు ధర్మజుఁగని
హరిణి యొక్కటి తనయరణిని హరియించెఁ
దెప్పింపుమని వేడ దెప్పరముగఁ
బంచపాండవులేగి పఱవఁద్రోలగ లేఁడి
వశ్యముగాక యదృశ్యమగుడు
నన్నదమ్ములు దాని వెన్నాడి యలసి ద
ప్పిని జెంది నీరార్థమనుప నన్న

ఆ. నకులుఁడేగు దెంచి నళినాకరము నీరు
త్రాగఁబోఁగ యక్షుఁడాఁగు మన్న
వినక యింతటి లోన మునిగిఁపోయెడి దేమి
యనుచు నీరమాని యతడు వడియె 221

సీ. అన్న యెంతటికి రాకున్న గ్రన్నన సహ
దేవుడేగియు నట్లెఁద్రెళ్ళుట యును
బెండ్లికై చుట్టాల బిల్వఁబోయిన వాఁడు
రాఁడాయె మళ్లు తోరణము దాఁక
నన్న సామెఁత గాఁగ నన్న లర్జున భీము
లేగి నొక్కఁడొకడే యొరిగి రరిగి
కట్టకడ కుఁబోయి కౌంతేయ వర్యుండు
తనయనుజన్మల దశకు నడలి
యేల వీరలిట్లు నేలపై కొరిగిరి
కారణంబు లేని మారణంబు
కలహమ్మైన జూడ కానరిదిచ్చోట
దైవ మేల వీరిఁదప్పఁ జూచె 222

సీ. ఆన నేమాయె నేనైన నీమాయను
సలిలమాని యొకింత చక్కఁబెట్టు

నా యనటన గను వేడుక
నాయన వచ్చితి వటంచు నవ్వుచుఁ బల్కెన్ 226

శా. పారం బారయ దూరమైన వనవాసం బనాయాసమై
యేరాజే భువినేలె నోయనఁగ మీకీ ద్వాదశాబ్దంబులున్
దీరెన్ ద్వాదశ వాసరంబులు వలెన్ దెల్పన్మనుల్నిత్యము
శ్రీరామ స్మరనైషధేడ్గుహ సతాశిబ్యాది చారిత్రముల్ 227

తే. సరవి నజ్ఞాతవాస వాసరము లరుగు
తెఱఁగు నెఱుగంగ గానలోఁది విరిదుఱలి
యరణి హరియించి మిమ్ములఁ హరిణి కరణి
బఱచి నాడను దయఁగనఁబఱచినాడ 228

క. అనుటయుఁ గౌంతేయాగ్రణి
తన జనకున కెఱఁగి భక్తిఁదమ్ములుఁదానున్
విని యొక కలగనవేఁగునె
కనుఁడీ కడతేఱు నట్టి గతి మాకనినన్ 229

వ. ఆధర్మ దేవత ధర్మరాజున కిట్లనియె 230

లయవిభాతి:

తనయ విను నీనడత మనమునకు నెక్కె నిఁక
ఘనముగను గాంచెదరు కనుకని శుభంబుల్
మనియెదరు సౌఖ్యముల గని యెదర భిఖ్యనొక
ఘనపురిని మన్కిఁ గని జనములు నుతింపన్
గనుఁగొనఁగ లేరు మిము మనమనుజు లేరు నటు
లనువుగను జేరువర తనువులను బేరుల్
వెనఁకువను వైరులను జెనకి నురుమాడి జయ
మును జగమును లొననగఁ గని యెదురు వత్సా 231

చ. అనియిటు పాండవాగ్రణికి నాయన నాయన గానఁదోన దీ
వన లరణి న్వరమ్ములిడి వారికి వారకదృశ్యుఁడై చనం

గ నుటజమేగి వారల అకాలికిఁగన్నులు వచ్చినట్లు
నెనరునఁ దెచ్చియిచ్చి రరణిస్థన విప్రున కింది దీవనల్ 232

చ. పితృపతి వీక్షనో యరణి విప్రు నపేక్షనొగాక యీ జగ
త్పతి యదుభర్త శిక్షనో శుభంబుల భంగురమైన యట్టులా
కృతు లెటనుండి వచ్చెనో ముగింప నరణ్యని వాస మబ్బె
కృతులకు వారివారికిని గేవలమర్థములైన యాకృతుల్ 233

క. జన్యమ్ముల స్థిరుండని
మాన్యతను యుధిష్ఠిరాఖ్య మహిబడసిన రా
జన్యశ్రేష్ఠున కలవడె
సన్న్యాసికి నర్థమైన నవరణ లెల్లన్ 234

క. నలపాక భీమపాకము
లల రారెడు సుప్రసిద్ధి మవనీస్థలి లో
నలవల్లవ సుగుణంబులు
నలరె వృకోదరుని యందు నద్భుత శయ్యన్ 235

గీ. సర్వలోకోత్తరుండైన సవ్యసాచి
కూర్వశీ శాపకృతముగానుర్వి షండ
రూప మింద్రుని దీవన ప్రాపు కతన
నబ్బ భోగ్యమ్ముగా నపుడావహిల్లె 236

క. సతతము నా సత్యులు సుత
తతి కగదంకారులగుటఁ దజ్జులవశ్యం
పితురాచార మనెడి నుడి
గతి హయపశు వైద్యములకు ఘనులైరందున్ 237

క. ఆరయఁదలవని దలఁపుగ
నారీమణి ద్రుపదరాజ నందన కలరెన్
సైరంధ్రీ రూపంబును
బేరిమి మాలిని యటంచుఁ బేరునొకటియున్ 238

క. ఆయా రూపము లాగతి
నాయె బహిర్గతము గాక యనవాత్తముకై
బాయక వారలనుప స
ర్గాయుక్త పృధాతువందు నర్థములువలెన్ 239

వ. ఇట్లజ్ఞాతవాసకాలమున కనురూపంబులుట్టిపడి యయ్యాయ్యూర యదావ పాల్లి తఱియ వచ్చునంతవరకు బహిర్గతము గాక యుపసర్గ ప్రయోగమునకు బూర్వము దాతువుల యందు నవహితర్థములై యుఁకొండొక యర్థాంతరముల వలెనుండ బాండవులు పరిజన సహితులై సహితులై చని తీయపరిజనుల పరిసరోప వర్తనముల కనిచి ధౌమ్యుల నగ్ని హోత్ర పురస్సరమ్ముగా ద్రుప ద్రుపద నృపతి పురమున కనిపి యెవ్వరేని మాస్థితిగతుల నడిగిన నడుగిడ నెడలేక చీమలు దూరని చిట్టడవిం గాకులు దూరని కాఱడవింబడి యెయ్యెడ నడిఁగి రో పాండవుల యడపొడ గానరామి కతంబుననె గదా మేమేకతమ మరలి వచ్చితిమి వారుమని మఱలవచ్చి మనల మఱలఁగను గొనిన పిదపగదా మనవారని వారని ప్రేమ వారిని మనము పిలువువీలగునని యనుఁడీ యీనుడి మఱవక మరియొక తెలుఁగున మఱచియై వీ నొండె వెఱచియైన నొండెఁదఱచ ఁబోకుఁడీ యని కఱపి పుచ్చి యుధిష్ఠిరాది పాండవులు తెఱపిగని సహచరీషష్ఠ లై దుస్పృహ నిష్ట వరిష్ఠమగు నమ్మత్స్యనగరమందు నా వత్సరం బుత్సవముగ నుందమని డెందమున నందరు గుదిర్చికొని కొందలము దిగఁద్రావి యా త్రోవగొని పాదచారులై నడవినిబడి విడివడి నరుగుచున్నంతఎన్నండు నెండకన్నెఱుగ కెన్నగఁదిన్నఁగ బోతుటీగయు నన్న చొఱన్వశింపదని యంతిపురంబున నుండి నట్టి యాయన్నుల మిన్న కృష్ణ గహనాంతము విధి తప్పఁ జూచుటన్ పొన్నారి పాదచారి యయి పోవుచు నాకటదప్పిఁ దూలుచున్ 240

క. ద్రోవది యనెఁగడు డస్సితిఁ
ద్రోవదిటం బడగె నాకుఁదాఁటి వెనుడి వో
లా వడుగామడ యాయెను
బోవలసిన యూరునెందుఁ బోయెనొ యేమో 241

చ. అనవిని ధర్మరాజతి-చయన్ సతిగొండొక కొంతదవ్వు నా
మును గవలామెఁ గొంత తటి మోసియు నేలగిలంబడంగన
ర్జునుఁడు నిజాంస పీఠిఁగను జూపె యిదంగల మేరనూరుచున్
చిన దనుకన్ మదిన్ దొనక చేడియనుం దయదెచ్చి దించగా 242

క. ఇది గోపుర మదిగోపుర
మిదియదె యని వచ్చినారమే నామడ లిం
కెడి బుద్ధి చేవయంతయుఁ
బదివె నడుగు దీసి యడుగు బెట్టం జాలన్ 243

గీ. వారలందఱు నొకచోట జేరితేరి
తీరి మఱుఁగునఁగూర్చుండి యేరికోరి
యొండొరులఁ బాఱ చూచుచు నుచితభంగి
నంత గర్తవ్యమిద మిత్థమనుఁచు ఁగనుచు 244

వ. అజ్ఞాతవాస వాసరంబుల యందు జ్ఞాతరాజసేవా ధర్మ్మ లగు ధర్మరాజునకు
నాతని తమ్ములకును గొమ్మకు నుద (్రీతివి నీతిని లోకోక్తులతో గూర్చిపేర్చి
తెల్పువాడె ధౌమ్యుండు తనయొద్ద గూర్చుండఁ బెట్టుకొని వారల కు
నూరిపోయువాడై యిట్లనియె

245

ఉత్సాహ

ఊరఁ జేరియుండు తటిని నోర్పు నేర్పు గూర్పుఁ డన్
నోరు మీరరాదు పెఱల నొచ్చి యేని మెచ్చి యున్
గోరి ఱొమ్ముచిగిది పల్కు కూడదెట్టి పట్టునన్
పూరిపుల్ల యేని నొరుల భూతి దాఁక బోకుడి 246

ఉత్సాహ

అంత కంతహా.ి పెఱల యంతిపురములోని కే
కాంతమందు హాస్యరసము నందగూడ దేయెడన్

జెంత భర్తలేని తఱిని స్త్రీల తోడ బ్రాతయున్
మంతనమ్ము లాడఁదగదు మానుడట్టి కర్జమున్ 247

ఉత్సాహ

నోటి మాట జాఱ నవల నూఱువేలు వోసినన్
దీటు గాదు మాట పరువు దీనివోసి పోవుగా
కోటు వోలు మానుషంబు గోటిలోనఁ జెడ్డన్
నోటినిండ మాటలాడ నోట ముత్తెముల్ పడన్ 248

క. వనితాధర్మము మర్మము
వనితాల్మి నరుంధతికి నవశ్య మొనయు జ
వ్యని తాఁద్రి కరణశుద్ధు ల
వని సీత పతివ్రతలఁ బ్రశస్తలు సుమ్మీ! 249

క. శమవతి సతిసావిత్రి య
సమశీల యరుందతియును సాధ్వి సు కన్యా
దమయంతీ మదయంతుల
సమసీత పతివ్రతలఁ బ్రశస్తలు సుమ్మీ 250

ఉ. సీతసమాన మానవతి చిక్కదెట ద్దివిటీలు వేసి యా
భూతల మెల్ల చోటులను బూనికతో వెదకించి చూడఁ బ్రా
చేతసుఁ డాది కావ్యమునఁ జెప్పఁడె తప్పెట సాఁటి భూమి వి
ఖ్యాతిని రావణుండు తమకంపడి యామెను తాక గల్గనే 251

క. అవని తనయతో సరియయి
న వనిత నయ మహితయంచనంగ నెపుడు త
న్నవని తన యశము బర్వదె
నవనీతనయాంచి తోక్తి నామము వెలయన్ 252

సీ. ఉర్వి నీయూరి కాయూరెంత యాయూరి
కీయూరు నంతగా నెఱుఁగ వలయు

గికురింప వడ్లగింజకు వడ్లగింజయు
వట్రు పెట్టదటన్న వార్తఁ గనుఁడు
నిద్ర వోయిన వాని నెఱిలేపవచ్చు మే
ల్కొన్న వానిని లేపఁ గూడ దెందు
ముప్పతిప్పలు బెట్టి మూఁడు చెఱ్ఱువుల నీరు
ద్రావించి రిపు తలఁదఱుగ వలయు
నొనరంగఁ దాను బట్టిన కోడి కొక్కటే
కాలంచుఁ గూర్చున్నఁ గలఁత పొసఁగు
నెపపెట్టి మసిపూసి నేరేడు కాయగాఁ
జేసిన వెంటనే చేటు పొసఁగు
మంటి యెద్దైనను మాయెద్దె గెలువంగ
వలెనన్న నదియ పో వాదమందు
రొరుల కల్మికి నేడ్వ నొక కన్ను పోయెను
దనకు లేదని యేడ్వఁ దక్కు కన్ను
పాపంబు గల్గిన భయము గల్గుచునుండు
నదిలేని నాఁడు భయంబు లేదు
నోరున్న ఁదలఁగాచు నీరున్న మడిఁగాచుఁ
దారున్న బండి కల్తనరఁగాచు
చెడ్డ చేనికిని మంచెలు మూఁడు నేటికిఁ
బనిలేక పొరుగిల్లు చొరుట తప్పు
పఱచి మూల్గెడు నక్కపైఁ దాటి పండుర్లి
పడి నట్టులగు బీద వాని పాట్లు
పగటి పెత్తనమెన్నఁ బనులకుఁ జేట గు
రాత్రి పెత్తనము నిద్రకును జెఱుపు
ఊరివానికి లేదు నీరి భయం బెన్నఁ
గనులాఁ పికిని లేదు కాటు భయము
కసిఁగొని ప్రబలుతోఁ గలహింప రాదంద్రు
మించిన పనికినై క్రించు పడకు

పరభామ తోడను బండ్లికిలింపకు
కొఱగాని పనిని జేకొనకు యెందు
గుణహీను చెల్మి చేకొనఁ బోకు రాజు తో
బరియాచకము నిమ్మి పట్టరాదు
బంధుల తోడను బగఁ బూనఁగారాదు
పాఁడితో నోపదు పంట చూడ
నచ్చి వచ్చినచోట నడుగెడైనను జాలుఁ
నవ్వుచు మాట్లాడ నష్టికలుగు
నడుగని మాటల కంది యుత్తర మీకు
భక్షించుచును నడువంగ రాదు
పిలిపించుకొని పొమ్ము పెండ్లికిఁ బిలువకే
చనవచ్చుఁగనుగొనఁ జన్మమునకు
బరగంగ నొంటుగా బయన మేగుట తప్పు
పదుగురిలో బడ్డపాము సచ్చు
పరుగెత్తుకొని పోయి పాలుద్రావుటకంటె
నెఱి మేలు నిలుచుండి నీరుద్రావ
నేఁ ప్రాణికైనను హింసచేయుట తప్పు
సత్య మెప్పట్టున నడలముప్పు
నొచ్చియు బరునిపై నుడవనబద్ధంబు
కీడు మాటను జెప్పఁగూడ దెపుడు
వేశ మన్యద్రవ్య మాశించ బోకెందు
పామునకు విషము పంటనుండు
జ్ఞాతివానికి నుండు చక్షువులందున
నేతరికిని నిలువెల్ల విషము
అన్యుజంపుటకంటె నాత్మహత్య వరమ్మి
విప్రుసొమ్ములకంటె విషముమేలు
గీ. ఇంక నిట్టులు ధర్మము లెఱిగి నడువ
నరునకు శుభమ్మి లేతెంచు ధరణిలోన

గానను సలక్షణమ్ముగాగను వచించి
నాడ విస్తర భీతి నిందార లేదు 253

వ. ఇటుల సోదరులకు సాదరమతి యుధిష్ఠిరునకు ధౌమ్యుండు తెలిపిన యనంతరంబు

254

# విరాట పర్వ కథ

క. తమ యజ్ఞాత వసతి కెం
దమరునో యేదేశమగు నోయని తలచి విరా
ట మహీపతి పుటభేదన
మమరాలయ సమర మాశ్రయమ్మని వారల్ 255

వ. సవ్యంబుగనవ్యగతి భవ్యంబగు నుపప్లావ్యంబరయననతి దూరంబున గలదుత్పురి సరారణ్యంబగణ్య పుణ్యులగు పాండవులు దారులు సదారులై దరియం జొచ్చి

256

క. తమ యాయుధమ్ములనొక
శమి వృక్షము మీదగట్టి శవము నొకటి పై
న మరిచి యెవ్వరికిని సా
ధ్యము గాకుండంగ జేసి యరిగి రవలకున్ 257

క. కంకుడను పేర ధర్మజుఁ
డందు వివేకుండు వలలుడని భీముండున్
గొంకక బృహన్నలాఖ్యను
శంకర సన్నిభుఁడు నావిజయుఁడమరె నొగిన్ 258

క. దామగ్రంధి సమాఖ్యను
సేమంబున నకులుఁడశ్వ శిక్షకుఁడయ్యెన్
హోమికఁ దంత్రపాలుఁడు
గా మహి సహదేవుఁడాలగాఁ పరియయ్యెన్ 259

క. వరుసగఁ జని యొక రొకళులు
పరుసము వెడలించి మత్స్యపతి పురమున భూ
వరు సన్నిధి నిలిచిరి యె
వ్వరు సద్రూపములు తెలియవశపడకుండన్ 260

క. పాండవు లందఱు విరటుని
యండను నాయాయి పదము లందమరఁగ వే
దండగ మన పాంచాలి య
చండ సుధేష్ణకడ నమరె సైరంధ్రి గతిన్ 261

గీ. కంకుభట్టు పాచికలనాడు నానాఁడు
ధర్మ సూక్ష్మములయు మర్మమెల్ల
విప్పి చెప్పుచుండి విరటుని మది కెంతొ
సంతసమ్ము సేయు సంతతమ్ము 262

క. వలలుఁడు సూదస్థితిఁగొని
కలమాన్నాదులను రుచులగడి మాడఁగ దా
నలవఱిచి విరటునికి మది
నలరించు జయించి జెట్లహరులం గరులన్ 263

క. క్రీడియుఁబేఁడిఁగఁదన మగ
పోఁడిమి విడనాడి యాడు పుట్టువు రీతిన్
జేడియలకు నట్టుఁడై మ
న్నీఁడుత్తరకు నటనమ్ము నేరుపు చుండెన్ 264

క. నకులుడు విరాట నృపుకడ
నకులీ నాశ్వచయములకు నధిపతియై తా
నకుటిల విమర్శనమ్మునఁ
బ్రకటుఁడు దినమొక్క రీతిఁబ్రబలింపించెన్ 265

ఉ. [illegible]దేవ్పుండయులయు
[illegible] సాహసాదనుచు నృపతి యండ కరిగి యా
[illegible]హారణము గ నలవడి
[illegible] సహసింపుచు నెలిరటు నాలను నేలెన్ 266

సీ. [illegible] వారిచార్పరయ్యె తావులఁగుదురుకొని విరటు నెదకు రంజిలంగ
[illegible]ప్రియంబు నాటి ప్రియగౌరవంబులు గదుర బెదరు లేక దినములు
[illegible] నంత గొండొక నాడు

267

ఉ. [illegible]పాల పుత్రియపురూపపు రూపము కాన జెందియున్
[illegible] సమాన బలుండు సకాముడై మహో
[illegible] వధింబడంగడఁగి విప్పిని జాధిని జెప్పియప్పకున్
[illegible] దాని పడిగా నొడగూర్పుము నాకు సోదరీ 268

వ. [illegible] నంత 269

ఉ. [illegible]గాడని మహాగ్రహముగ్రముగాఁగదట్టి యా
[illegible] నిప్పుడుప్పటినిఁ జొప్పుగఁ జూచెద వొక్కు తమ్ముఁడా
[illegible] స్వదుము దీని పతుల్గల రగ్ని సన్నిభుల్
[illegible] రొప్పదిది మూర్ఖులిదేటికిఁ బొమ్మటంచనెన్ 270

క. [illegible] జెప్పిన బుద్ధులు
[illegible] ములుకులట్టులగుడును జెవికిన్
[illegible] మండిపడుచును
[illegible] పిలిచి దానికనియెఁ గటువుగాన్

271

మ. [illegible] కార్చి యావనిత నన్నింపార గూడంగఁ జే
[illegible] యూనక యుంటివేని యిపుడే నుగ్రానలంబందు గ్రమం
[illegible] యటంచు సింహబలుఁ డౌత్సుక్య స్థితిం బల్కగా
[illegible] బ్రహ్మవీని తల నట్లేకాక వేఁటెట్లగున్

272

సీ. [illegible] మనంబున సుధేష్ణ దలంచి మాలిని బిల్చి యల మాయన్న యింటి కరిగి

హాలఁదెమ్మని పంపుటయు నామె యామె కిట్లనియె 275

ఉ. ఈరసమెత్తి సింహబలు నింటికి నన్ననుపంగ నానె కల్
దేరఁ గఁ బొమ్మటంచును సుధేష్ణరొ యీ పనిపన్ని వానికిన్
దారువు కత్తివోలెఁ బరదారఁ బవిత్రత నేరి కోరి నే
నేరను నీకు మార్మసల నిప్పునకుం జెదలంటునే చెలీ! 276

వ. అనుటయు నీకు సందియమ్ము వలదు నామాట వినుము కూడని పనియైన
నేనునిన్నంపెదనే 277

మ. అని సైరంధ్రిని హాలపాత్రగొని మాయన్నయ్యకే యిచ్చిర
మ్మని పంప న్నృపపత్ని ద్రోవదియు నాహా మీఁద నెట్లౌనొకో
యని యుల్లంబురియాడగాఁజని తదీయాగారమందుంచి పా
త్రను రాఁబోవగఁ బట్టెవాడు సతిహస్తమ్మెట్టులో యామెయు 278

గీ. పట్టు దప్పించుకొని సతి బయలు కుఱుకఁ
గీచకుండామె వెంటను నీచుఁడగుచుఁ
దవిలి పట్టంగఁ జూచిన దవులనున్న
వారలదలింప నాఁగె నాపామరుండు 279

ఉ. ద్రౌపది భీమునింగదిసి తాఁబడినట్టి పరాభవంబునున్
దాఁపక పూసగ్రుచ్చిన విధంబునఁ జెప్పిన నేఁడు వాని సం
తాపముఁ దీర్చు దాని వలెద్రక్కులు పెక్కులు చూపు వాఁడు రా
నాపయిఁగాగలట్టి పని యంతయు నేఁగడ తేర్తు నంచనన్ 280

ఉ. ద్రోవది యేవగింపకొక త్రోవను రాఁజని భావగర్భ వా
క్యావళులన్వచించి కలియంజనుదెంచెద నాట్యశాలకున్
నీవట కేగుదెమ్మన మనీషను గీచకుఁడో చెలీ దయన్
ఠీవిని నన్ను నేలితి వడి న్నరునేలితి కూలి బంటుగాన్ 281

వ. అని మణియు 282

క. ఓటికి మాటికి వలపులు
మాటుగ మదినెసఁగ నూరుమాటు మణఁగఁగా
సీటుగ నర్తనశాలకు
వాటముగా సింహబలుఁడు వచ్చెఁగులుకుచున్ 283

క. తనమనోల్లలితము ఫలితము
గానున నిశి యెప్పుడెప్పుడు గడలుకొనునొకో
యని వేచి కీచకుండు న
ర్తనశాలకుఁ బోయి కదిసెఁదామసి శయ్యన్ 284

వ. అంత సింహబలుండు శయ్యపైనున్న మహాబలసూను, సైరంధ్రిగా దలంచి సరంభ్రమగు నయ్యంధ కారంబునఁ గామాంధ కారంబున నొడలెఱుంగక మహామెతో ననురాగంబున సరాగం బులాడందలంచి తనటేకుటా కుటిలవికటంబుగా ఘటించుచుగడు గోటున గాలి ముచ్చెలఁగొనగాలి వెళ్ళఁ దవిలించికొని రంగస్థలి యొల్లగ్రక్క వలనొయయ్యారంబుగా నడచి శయ్యాతలంబు తనకరతలంబున నిమిరి దరికి దరిసి సరస వాక్యంబుల జోక్యమ్మునకు దిగి యిట్లనియె 285

మ. లలనావేషు సరోషు భీముగని యేలాజాగులీ లాగునన్
వలరా జోర్వడు రమ్ము లెమ్మబలయన్నన్నీ ముఁడే జాగు సే
య బలం బీయ బలేతి వాక్కునకు ముఖ్యార్థంబు నేనాదు నో
లవి నీ వాదు యొకింత చూడుమని వేళాకోళముల్వల్కుచున్ 286

క. వడముడి యాసింహబలున్
వడి సింహము కరినిఁబట్టు వడువునఁగొని కాల్
ల్మోద పెడ తలమొల కీల్కొ
ల్పడి చప్పుడు సేయకుండ సడల న్విఱిచెన్ 287

క. తక్కుచు భీముడు కీచకు
గ్రక్కున బసిగటిక కోల గగ్గరనిడిన

ట్లక్కడఁబడఁద్రోచి నిశన్
దిక్కా మొగమగుచుఁ బాఱఁద్రెక్కొని చంపెన్ 288

వ. అట్లు తమయన్న త్రెళ్ళినవార్త నర్తనశాల కాపరుల వలన సవసవగా విని యతని మృతికిఁ గారణమేమని వగచి యందొకచో డాగియున్న సైరంధ్రియే కారణమై యుండునని

289

మత్తకోకిల
వాని తమ్ములు వచ్చిద్రౌపదిఁబట్టి యన్న శవంబుపైఁ
బూని కట్టి చనంగఁగాటికి ఘోరునన్నతి యేడ్వగా
వీనులంబడ నేగి వేగమె భీముఁడా మసనమ్మునన్
గానకుండగ నిల్చి వారలఁగాటికంబలిదీసినన్ 290

వ. ద్రౌపది కడుసంతసిల్లి నిజభర్త కడిమికి మిగుల నుత్సాహ మందు చుండె నట్లు
291

క. ఉపకీచకులగు నూఱ్వురు
చపలాత్ములఁ బట్టి చంపి జాయకు బంధం
బపహృతమొనరిచి భీముడు
విపరీతము గాక పాక వేశ్మము సొచ్చెన్ 292

గీ. జార సింహబలుఁడు నౌసింహబలుఁడూర
నూఱువుర వరజుల నూరుపేరు
లేకయుండఁ జంపె నేకాకిగా భీముఁ
డెంతవాఁడొ వేఁగు నంతలోన 293

చ. బలుబలుతెల్లవాఱ నటఁబాసి పృథాస్నుష తానమాడి యా
వల వలల్నులిన్ సరస వాక్యములంగొనియాడి పేఁడితో
వలపులు వెల్లివెట్టఁ బెఱవారికిఁదోపఁగనీక వచిం
చి లలితమౌనటు ల్విరటు చేడియ పాలికిఁ జేరనామెయున్ 294

ఉత్సాహ

వెన్నబెట్ట మ్రింగలేవు వ్రేలువెట్టఁ గఱ్ఱవలే
విన్నిటికిని నేమికాని యేమి యెఱుఁగనట్లు నా
యన్న సింహబలుని మూఱ్వురతని తమ్ములన్నిశన్
మన్నిగొల్పి తీర యెంత నంగనాచివే చెలీ 295

శా. సైరంధ్రీ పని యెంతసేసితివి మేల్చాల్చాలు లోకైక స
ద్వీరు స్నీదగు పొట్టఁబెట్టుకొని భావింపంగ నాభ్రాతలన్
మారాకారుల మ్రింగినావు గద సామాన్యంబుగా మూర్వురన్
నేరన్నిన్నట నుంచఁ బొమ్మిటకు నేనీ కాళ్ళకున్రమ్మ్రొక్కెదన్ 296

వ. అనిసుధేష్ణ కృద్ధోష్ణంబుగా నుడువిన నుడువును విని పృధాసుషవృధారుష ఱంతయేల ఱంతవఱకు జరిగినంతకాల మిఁక జరుగవలసిన పనిలేదు.పనిలేదని యుఱకవని వినవిని యోగమేమి మేమిఁక నొకఘన యోగమున గొన్ని వాసరములు వాసిగ నిట నివాసముండి యెటకేనియుఁ దొలంగు వారము గాన ధీరవై యోరిమి సేసి నేరమేమేని మాయెడనున్న బాయ మన్నింపు మేమేని యేమే నుపకృతి నీపతి కొనరింపక పోయెడు వారము కాము వేకాముకుఁడైయూముకొలది కొలఁదిమీరిన చేదుకోరిక మీరు వలదన్నను వదలక మీయన్న నన్ననదగఁగనియనదగనివియని మనదగిన కాలంబు లేమి నాలంబున కాలంబుసేసె నాతనిభ్రాతలు నన్నును బోలువారై నన్నునాదరంబుసేసి తమయన్న మృత కళేబరంబుతో నన్నుంగట్టి దాని తోడన గాల్పమసఁనంబునకు గొంచుపోవగొరిచనాదరంబు నీదబాద సేయ నోర్వరాని తాపమున నాపతులు గంధర్వులు లో పలవలవల నాపదరముగాని కోపంబున నాపదనొందించిరి.నను నిందించకుము గాసిపడనేల చేసికొన్న పాపము చెడని పదార్ధము గాదె.ఒరుల దూరిన ఫలమేమి? చలమేమియుఁ బూనక యెలమిం జూడుము పోడిమిగల చేడియవు గాన నోడక యింతగ నేనాడితి నాడితని కీవు తర్ద యెత్తి బుద్దులు సెప్పిన దానవే కదా? తోడి చేడియలు నగ నొగల నేల. నేల బుట్టిన వారెల్ల గిట్టకపోరు.నేఁడొండె మఱి యింక నూఱేండ్ల కొండె మానవులకు మృతి రాకపోదు అరనిము సమేని మితి దప్పదూరక నను

దూరకు దూరినc బోయిన నీవారు మరల రాబోరు పోరునష్టి పొందు తుష్టియను మనుస్మృతి వాక్యము స్మృతి నుంచి పెక్కు జోక్యములకుc బోక సఖ్యంబున మనుట మన కనుకూలమై్మన తెరంగని యెరుంగుమనిన. సుధేష్ణ వెఱcగుపడి యిcక మీద మిక్కిలి యేమియనిన మీది మిక్కిలి యేమి పొసcగునో యని యేదియు నన నొల్లక నల్లనల్లన సరియేయని మిన్నుఅగి మీcద బడినట్లు మిన్నుమిన్న మన్ను గన్గొనుచు మిన్న కుండె నంత 297

క. అజ్ఞాత వాసరంబునc
ప్రాజ్ఞతతోc గడుపుచుండc బాండవు లెలమిన్
విజ్ఞాన హీనులాకుమ
తి జ్ఞాతి నృపాలురొక్క దినమున సభలోన్ 298

వ. కష్ట చారిత్రమగు దుష్ట చతుష్టయ మొక్క చోcగూడి మంతనమునకు దిగి పాండవుల వనవాసకాల మనాయసముగ ముగిసె నింకc బదమూడవ యేడు కూడ దరిసి మూగి యందఱియయ్యె. వారల యునికి పట్టట్టిది యని మనకింత దఱకెఱుక పడదయ్యె దయ్యము వారి కెయ్యడను సహాయమయ్యెడి నీవత్సరము ముగియు లోన గుత్తిది నిశ్శంకముగc బాండవుల శంకరగిరి మాన్యముల బట్టించకున్న మచ్చరంబున విచ్చుc డకు నేఱవు వలికరువలి చూయనులి కరువలితో వెలువడి వచ్చి విచ్చల విడి తమ్ముందఱ దఱికొని మాడ్చి మంబరము సేయు నొండె గాండీవ కుఠారంబున నూచ ముట్టుగ నూచకోత గోయు నొండెcగాని చూచిచూడని వడువున వడిగ వచ్చి మనను మనమొనలను గాచి విడువండు. వారలయెడ మనమొనరించిన కారియ ములెట్టివియో యెఱంగమే కాన మౌనమౌనము మాని మీ మానసద్ర ధిమ కొలందియోజించిసహేతుకంబుగా పాండవులము క దేశస్థులనియు వారలగనుcగొను తెఱంగిద మిత్థ మనియుc బ్రాకటముగా నాకుc దెల్పుడీ యని సుయోధనుండడుగ భీష్మాది కురువృద్ధులు కొందరిట్లనిరి 299

ఉ. సింధురసత్త్వుcడైన యలసింహబలుం బరమాద్భుతంబుగా
సంధులగిల్చి చంపె సడి చప్పుడు సేయకెవండా యాజరా

సంధ యదుప్రబర్హ హలి శల్యులలో సరిదూగు వీఁడు డే
గంధ మహాత్మజుండు కడకం గడతేరిచి యుండు గీచకున్ 300

చ. విరటుని దేశమందిపుడు వింతగ నెంతయుఁబాడి పంటలున్
సిరివిగ విస్రవీగునఁట వీనికి హేతువు పార్థులుంటయే
తరిమి తదీయ గోగణము తప్పక పట్టినఁ దత్సహాయులై
వరుసను బాండవుల్ వెడలి వత్తురు గుర్తిడవచ్చు వారలన్ 301

గీ. ప్రాని భీష్మాదులిటు తలపోసి వాసి
తుటుము దక్షిణ దిశ పసిదోలికొంచు
రమ్మనుచుఁ బంపగసుశర్మరాణ నేగి
సరగఁ బసి బట్టె విరటుఁడు సనియెనటకు 302

క. దీటుగ సుశర్మతోన వి
రాటుండని దాకి యెదిరి ప్రదరము చేవన్
వ్రేటుదిన సొమ్మ సిల్లిన
గోటుగ నతడి వని కట్టుకొని పోదొడగెన్ 303

గీ. విరటుతోఁ జనిరి ముందుగగవలు యు
ధిష్ఠిరుండు పసులఁ దేరఁబూని
భీమ బలము సూపి భీముండు విడిపించె
బశుగణమ్ము విరటు బంధనమ్ము 304

వ. భీముండుసుశర్మను ప్రాణావశిష్టంబుగావదిలియిష్టుడైనవిరటుబంధవిముక్తుని
చేసి తెచ్చిన నా మత్స్య నాథుండు పరమ సంతోషము నొంది పసులతోగూడఁ
బురంబునకు గదలె

305

క. ఉత్తర గోగ్రహణమునకు
నుత్తములగు యోధవర్యులొగి పదివేలున్
దత్తఱబడులో రాదం
డెత్తిచెని సుయోధనుండ హితమతిఁ గృతియై 306

చ. గురుకృప ముఖ్యులా విరటు గోగణ మెల్లను యెల్లఁ జూచు లా
గురుకృప ముఖ్యగోపకుల నొంటిరి పాటునఁబట్టి కాలవీ
గురుకృపణ ప్రవృత్తి గితికొంచును గొంచును బోవనందు నే
గురుకృపవచ్చు రాజునకు గోగతి జెప్పిన నంచుగోపకుల్ 307

ఆ. వేగఁబోయి వీట విరటుఁడు లేమిని
నుత్తరునకుఁదెల్పి రుత్తరంపు
దెసను మేయుచున్న దేవరపసులను
ముట్టి కురుబలంబు పట్టెననుచు 308

ఆ. మలయ విరటువీట మగపురువొకఁడేనిఁ
దనర నుత్తరుండు దక్క లేమి
జిఱుత యతడు వోవ సిద్ధించెఁ బోరికిఁ
తగరు వోలెఁబులుల దళము పైకి 309

వ. ఆల కాపరులు నుడు లాలించి యుపలాలించి వారలఁ బశుపాలురగు బాలురతో
బాలుండగు నుత్తర కుమారుండు పోరాటమునకు ఁబోవ సమకట్టి యల్లన
దల్లి కడకేగి కడఁక విడక యామెతో గొడుకగు భూమింజయుండు దుడుకు
తనమ్మున నిట్లనియె
310

క. వింటివె యిపుడమ్మా మన
యింటి కతన్ మనపసులకు నెంతలు పుట్టెన్
దంట తనమ్మునఁ గురుపతి
వెంటునఁ బట్టిఁబసి గిల్లికలహము తేనై 311

చ. సరిపడనాకు నిష్ఠురథసారధి చిక్కినఁ బాఱఁదోలనే
కురుబలమొక్క వ్రేటునను గుక్కలఁబోలిన యట్టు లంచు ను
త్తరు డతి వాక్ప్రగల్భములు దల్లికడన్ నుడువంగ నంత ను
త్తరకు బృహన్నలంగొన హితంబు పదేశము సేసె గృష్ణయున్ 312

ఉ. అన్నకుఁజెప్పి యుత్తర బృహన్నల సారధిగాఁగఁ గొమ్మనన్
మన్నన గొన్న యుత్తరకుమారకుఁడేడనొ పేడి యేడనో
పిన్నలు పెద్దలున్నగరె పేరుప్రతిష్ఠలణంగి పోవె నే
నెన్నికఁ బేడి దోడుగొని యేగుట కంటెను హైన్యమున్నదే 313

క. అని యతఁడు బేడినిం దన
కును సారధిగాఁగఁ జేసికొన నొల్లక వీ
యని యెదురుగాక మరీ
కొనఁజాలను బేడికెన్ని గుణములె యున్నన్ 314

గీ. ఉత్తరుని గని సైరంధ్రి యుత్తరంబు
సెప్పె నృపపుత్ర యిపుడు నేఁజెప్పనేల
నీవ తెలిసెద వన్నియు నిన్నుగావ
నల బలఘుఁద్రోలు నెడ బృహన్నల బలమ్మె 315

క. కొండ తలక్రింద నిడికొని
గండ శిలకుఁగాఁగ వెదుకగా నేమిటికిన్
దండి బృహన్నల మనకడ
నుండగ నీ తేరుఁగడప నొరులేమిటికిన్ 316

క. యేటికి నేటికి సంధియ
యేటికి నేటుగను బేడియే తగు నీకా
మేటి గడపుఁబని గొను ము
మ్మాటికి నేఁబూట వేయుమాట లిఁకేలా 317

క. అని యిట్లు ఊయి గ్రుద్ది న
యనువున సైరంధ్రిసెప్ప నయ్యుత్తరుడున్
విని యెట్టకేలకొక విధ
మున విధిలే-కొప్పినట్లు మొగమొగవేసెన్ 318

వ. అంత భూమింజయుండు విజయుం గనుంగొని 319

తరల

సరఁగ దేరిని దెమ్మనంగను సాగి పెండ్లికిఁ బిల్చిన
ట్లరదమొక్కటి దెచ్చి యాతడు నంటగట్టిన జావడా
లరసి యుత్తరుఁడెక్కెదాని బృహన్నలా గొనిరండు నా
కరిది సొమ్ములు బొమ్మపొత్తిక లంచు నుత్తర గోరఁగన్ 320

క. ఉఱ్ఱూఁతల నూటాడెడు
గుఱ్ఱాలట నూరుదాఁట గుఱుకొని చెవిలో
గఱ్ఱిజపించిన మంత్రము
జఱ్ఱున జాఱినటు వాఱె సరఁగ దురగముల్ 321

క. కనుఱెప్ప పాటు లోనన
చని గొప్పగఁ గురుబలమ్ము సరసకుఁ జేరెన్
మనమును మీఱెడు సత్త్వజ
వనమున వనమునను బాఱి వారువములటన్ 322

ఉ. కౌరవసేన నుత్తరుఁడు గన్గొనెఁగన్గొన భీతుదొట్టి నా
కౌరవసంచె యీ బలము నాఁపఁగ నాపగదైవమీ గలఁగా
కౌరవసందియంబు విడుమావల మావులనున్నఱల్చినన్
గౌరవ సంపదం గనెదఁగావున గావు మునన్ బృహన్నలా 323

చ. అనవిని పార్థుఁడుత్తరున కంతట బల్కెనుఁ దల్లియొద్దనీ
వనినవి యెల్ల విస్మృతము లాయెనొ నాయన యింతలోననే
యని యొనరించు మంచును బృహన్నల తిన్నగఁ బ్రోది సేయ గా
దను విడుమింకఁ బోరుగతి దయ్యమెఱుంగ నటంచు మాత్స్యుడున్ 324

క. అరదంబు డిగ్గనుఱికియుఁ
బరుగెత్తుడుఁ దోడనుఱికి పార్థుఁడు తాను
త్తరు నొడిసి పట్టుకొని శమి
తరువు కడకు ద్రోలి యాయుధములంగొనగన్ 325

క. అత్తఱిఁదాఁ బార్థుఁడ నని
తత్త ఱ్పదములను నన్నదమ్ములు సతియున్
హత్తుకొని యుంటఁ బురిలో
నుత్తరునకును న్ధనంజయుండెగిఁదెల్పెన్ 326

వ. అంత నావైరాటి కిరీటియానతిఁబడి వ్రూనతి త్వరిత మ్ముగ నెక్కి యాయుధముల మూట విచ్చి వాని సర్వాకృతులను గాంచి యచ్చెరువంది వానినన్నిటిని వేవ్వేఱుగ నివ్వెర గందుచు నెవ్వియెవ్వి యవ్వరివని వని నడిగి తెలిసికొని యర్జును గాండీవాక్షయ తూణీరంబులనుబైకిఁదీసి యాతని కందిచ్చి తక్కుసాధనమ్ము లెప్పటి యట్ల బంధించి యావృక్షంబునను సంధించి చెట్టు గుబాలున దిగి దుమికి పేడి పార్థుండని తెలిసినంత మాత్ర నింతింతని చెప్పరాని సంతసమంది కొండంతటి సత్త్వవ చేకుఱి యా యుత్తరకుమారుండు తనయొడలు గుప్ప గూఱ నుప్పతిల్ల పులకలతో నతని పాదంబులపైఁ బడి భాష్పాశ్రుల నతని కాళ్ళు గడిగి నతి యొనర్చినఁ గ్రీడి యతనిజేత గ్రుచ్చియెత్తి నిండుకౌగిటం జేర్చిన నుత్తరుండు తత్తరపాటు వీడి క్రీడికిట్లనియె
327

క. పదినామమ్ములు నీకుం
గద యవి నీకేలకల్గెఁ గ్రవ్వడి లోకుల్
చదలుఱుము వేళ నేలొకొ
బ్రిదులగ దలఁచెదరదేమి ప్రియము మహాత్మా 328

క. ఎన్నాళ్ళకుఁ గంటిమి మిము
మన్నగరము నందు మీరు మన్నన నున్నా
రన్న నుడివింటి నింతటి
కన్నను భాగ్యంబు వేఱకలదే మాకున్ 329

క. పాండవ జగదేక మహో
ద్దండ నృపుల్ వారలేడఁ దాకొనఁగ విరా

టుండేడ పాలె గాండివి
యుండను మీరుండు టెట్టి యాశ్చర్యంబో 330

క. ఎన్నాళ్ళ నుండియో నా
కున్నది మీ తేరుగడప నొదవెనదియు నా
కిన్నాళ్ల కిపుడు నాచేఁ
దిన్నఁగఁ బనిఁ గొమ్మటంచుఁ దేరతఁ డెక్కెన్ 331

మ. ఇటులా యిద్దరు తేఱి నేగిగని యేదీ యాగణంబెయ్యి వే
పటుశక్తి న్మఱలించి కాపరులనుం బార్థుండు కాఁపుంచియ
తట గౌరవ్యుల సేనకుంగవిసి భీష్మద్రోణ ముఖ్యార్యులన్
గటు తల్వాయఁగ నేసె నంపఱ నమస్కారంపు బాణా లొగిన్ 332

ఉ. ద్రోణుని భీష్మునింగృపుని ద్రోణజుఁగర్ణుని దార్తరాష్ట్రులన్
బాణపరంపర ల్గురిసిపాఱఁగఁ ద్రోలియు మోహనాస్త్రమున్
ద్రాణ నిగుడ్యగ్రిడి కురురాజులు మూర్ఛ మునింగి వ్రాలఁగాన్
బ్రాణము లూడ్చినట్లు తలపాగల్గోసిన రాజు మాత్యుఁడు 333

ఉ. ఎప్పుడు వచ్చినాఁడు పసినెప్పుడు బట్టి మఱల్చినాఁడతం
డెప్పుడు తాఁకి నాడు పరి నెప్పడు గాండివమెక్కు పెట్టినాఁ
డెప్పుడు గూల్చినాడు శరమేపరి యాపరి మూర్ఛమున గా
జప్పుడుగాక పార్థుకృతి సైన్యము హైన్యము సెప్ప శక్యమే 334

క. ఇంతటి శరలాఘవము మ
ఱింతటి శౌర్యమ్ముఁ గంటిమే యెందయినన్
వింతగ నిందఱ మూర్ఛా
క్రాంతుల నలవోకఁ జేసెగాన నరుండాన్ 335

గీ. అనుచు మూర్ఛను దేఱి భీష్మాదు లార
కోరి మనతలపాగలు కోయు నప్పు
డంతపని కర్ణనుడుదిగఁడాయె గాక
తలలు గోసినఁ దప్పింప దాతలెవరు 336

గీ. ఇంతయేటికి మనమితఁడేగు తెంచు
వేళ మంచిదిగావున వేడ్కమరల
బురికిఁజనునంత భాగ్యము పొసఁగె మనకు
గాకయున్నను శిరములు పోకయున్నె 337

గీ. అనుచు నందఱు వెఱవున ననుచు నాన
లేచి పార్థుని ప్రక్కను జూచి కొంచ
తండు కను చూపు మేరను దాఁటు దాఁక
బ్రతుకు జీవుఁడాయని దారి బట్టిరంత 338

చ. విజయుడు ధార్తరాష్ట్ర పరివేయులవోకగ గెల్చి గోవులన్
రజని ముఖంబు గాకయ విరాటుని వీటికి తోలిపెట్టి య
క్కజముగఁ దొంటి రూపుగొని గాండివ ముఖ్యము లెప్పటట్ల య
క్కజమున నుంచి యీ కథను గుప్తము సేయుమి యుత్తరా యనెన్ 339

క. వైరాటి వల్లెయని తన
తేరక్కా బృహన్నలయును దేజులఁ దోలెన్
వారిటులరిగెడి లోనన
వారణ గతి విరటుఁడలరి వచ్చెను బురికిన్ 340

క. వచ్చి కడగొట్టు తనయుం
డెచ్చటి కేతెంచినాడొ యింటగనుపడం
డిచ్చటికి మరలనెప్పుడు
వచ్చు నటంచిట్టులతని వార్తల నరయన్ 341

క. ఉత్తరగోగ్రహణమునకు
నుత్తరుఁడు బృహన్నలన్మహోద్ధతిగొని తా
నెత్తిచని కురుబలంబును
హత్తి విఱుగ మొత్తి గెల్చి యాలమరల్చెన్ 342

వ. అని యిట్ల కొలఁత లేని చిఱుతకు మరువిజయోత్స వంబు పరిజనులు

తెలుపఁగవిని జనపతి యత్యంత సంతుష్టాంత రంగుడై మన యుత్తరు జయవార్తఁ బత్తనమునఁ బలుదెసల సాటింపుడని పనిచి ననిచి గడలుకొను సంతసమ్మున నొడలు మఱచి పఱచి నెత్తమ్ము దెమ్మని పరిచరుల ననిపిన వారలటునె సేయఁగ శౌరి ఫలంబున గోరిక దీర గొండొక వినోదింపుచు మనమున బుట్టిన తమకంబు పట్టఁజాలక నాడు తనతోనాడు కంకభట్టుతో విరాటుండిట్లనియె

344

క. మన యుత్తరుప్రజ్ఞలు విన
విన నద్భుతమయ్యెఁ గౌరవేయులు నాయో
ధనమున గెల్చి వెసం బశు
ధనమును మఱలించెఁ బుటుక ధన్యముగాగన్ 345

క. ఆమాటలు విని కంకుఁడు
భూమింజయుఁడేడ కౌరవుల బలమేడన్
స్వామీ గెలుపు బృహన్నల
భీమ భుజాబలము చేత వెలయఁగ వచ్చున్ 345

క. ఇందులకు న్సందియమా
విందువుగా కిపుడ యచటి వృత్తాంతంబున్
తొందరపడకు బృహన్నల
పందగ నీకొడుకు వాఱఁ బగఱ జయించెన్ 346

క. తినఁబోవుచు రుచులడుగం
బనియేమిటికానవచ్చు పనికింతగ గ
ట్టున నెక్కి చూడవలెనా
మనమిప్పుడు విందు మితని మించినిఁజెడుగున్ 345

క. అని కంకుడా బృహన్నల
గొనియాడగ నృపతి నాదు కొమరుని జయమున్
విన నోర్వవొ మూయుము నో
రని యాడెడి సారె తోడ నడచెను గంకున్ 347

క. ఆసారె కంకుబట్టున
కాసారె లలాటకుడఁచి యటగాయముగా
కాసారమ్ముగ నెత్తురు
కాసారముగట్టి కారఁగా సభలోనన్ 348

చ. బిలబిలగారు నెత్తురును జీర చెఱుంగునఁ గ్రిష్ష యొత్తగా
వెలది యిటేల చేసెదవు విప్రుడునుం బర పూరుషుం డతం
డలికచ సాధ్వి నీకుఁ దగునమ్మ యనంగను విప్రురక్త బిం
దులు ధరకారఁ గీడనుచుఁ దుడ్చితి నంచనె నామె రాజుతోన్ 349

వ. అదియట్ల జరుగు చున్నంతలోన 350

క. ఉత్తరుడు వచ్చి తండ్రికిఁ
దత్తరమున నెఱఁగి చూచి ధర్మజు నొసటన్
నెత్తురు గాయము వీరికి
నిత్తరిగానేమి కతమొ యెఱఁగింపుఁడనన్ 351

వ. ఉత్తరునకు విరాటుండిట్లని యుత్తరమిచ్చె నెట్లనిన 352

ఉ. నీవు జయించి కౌరవున నీకని నీకొని యాలఁదెచ్చియు
న్నావని నేననం ద్విజుఁడు నచ్చక యిచ్చక మెచ్చఁజేరి నే
నేవపడంగఁ గొంట పాడవెత్తి నుతించెను గోపమెత్తి నే
లావుగసారె నేయ నిటలంబున నాయన కాయె గాయమున్ 353

వ. అనిన జనకునకుఁ దనయుండు వినసొంపుగాని యానుడి విని వినయంబున్నఁ
బ్రసన్నంబుగా నిట్లనియె
354

క. జనకా మనకడ నున్నా
రని వీరినిరాకరింప నాయువు శ్రీయున్
జనకామినిగా మనకడ
జనకాయనకున్నె నాదు జయమును వినుడీ 355

చ. కడిగ జగంబు మ్రింగఁగల కౌరవ వీరుల సైన్య మెచ్చటో
దొడుకులఁ దెచ్చుటిచ్చటనొ తోసినఁదొంబది యొజనంబులన్
బడియెడు వాఁడ నేనెటనొ నందను నిన్నును నీవెఱంగవే
చెడితిని బడ్డినంచుఁజని చీమ తరించునె క్షీరవారిధిన్ 356

చ. ఉఱకజగంబు నొక్కొకఁడ యుగ్రుపడెంబుగ మ్రింగజాలు బల్
చుఱకరు లాపగా సుతుఁడు సూర్యసుతుండు గురుండుద్రోణి యం
చెఱిఁగి యెఱింగి మీరలెటులేని జయించితి నంచునమ్మ నం
దఱ నతిశూరులంగెలువ నాతరమే తమకేను క్రొత్తనే 357

చ. తొడరుచు భీష్ముఁగర్ణుఁగృపుద్రోణుని ద్రౌణిని లోనుగాను శ
క్తుఁడ నను గెల్వ మీరెఱిగి కూడను వారిజయించినట్లు న
న్వెడగును నెట్లు నమ్మితిరి వెఱ్ఱిగఁ బుత్రుని మీఁది ప్రేమచే
విడువక యింత మాత్రముఱిపెంబునకై ద్విజనొంచు టేటికిన్ 358

క. నేనాపగలనె కౌరవ
సేనాపగఁ గలన నచట జితకాశి యొకం
డేనాటి చుట్టమోవలె
పూనిక నరుదెంచి దివ్యపురుషుఁడు గాచెన్ 359

క. ఆపావన నరసింహము
చూపట్టును రేపమాపొ చోద్యముగ నిటన్
చా పగు మనకందఱకును
గోపము శమియింప వేడుకొనుడీ కంకున్ 360

చ. అనితరమెన్న రానివగ నత్తఱి యుత్తరుఁడొత్తిపల్కఁగా
నని తరవారుబోని కరణంబున నేసితిఁగంక భట్టు మి
మ్మనితరు నన్క్షమింపుడిఁక నాదట మీఁదట నేదెట్టైననున్
మును తరియించు నాతని మహోమహుఁజూపుడువే గమే యనన్ 361

గీ. వేటువడి కంకభట్టుఁ డింతేటికిపుడు
మించి పోయిన పనికి క్షమించ మంచు

వేడ నీవిట్లు నేలాటి వాడవయ్యె
వేటు గీటును లేదని గీటు వుచ్చే 362

క. మఱునాడు పాండవేయులు
ముఱిముఱిఁజీఁకటిని లేచి ముదితయుఁదామున్
దెఱఁ గొప్పఁగ సభదీరిచి
వెఱచఱవక కూరుచున్న విరటుడు వచ్చెన్ 363

క. తనుజూచి వారలూరక
కనుఁగొనుచు నొకరి మొగము లొకరు లేవకయు
న్నను వెఱగందుచు విరటుం
డనె నిటు నాగద్దె కంకుఁడర్హుఁడె యెక్కన్ 364

చ. అనుటయు ఫల్గునుండు నగి యక్కట లోకము లేలఁజాలు నీ
ఘనుడు యుధిష్ఠిరుండు చిఱు గద్దియ నెక్కదగండె మొన్న ని
న్నను నరిపట్టి గోగ్రహణ మందుఁ బసి న్విడిపించినట్టి యా
యన బకవైరి భీముడు మహామహులీ కవలంచుఁజెప్పినన్ 365

ఉ. అంతట లేచి భీముఁడు బృహన్నల సాయము తోడ నాట్యసి
ద్ధాంతము నేర్పి యుత్తరకుఁ దత్తర పాటున నుత్తరాశకా
క్రాంతము సేయఁబూనుకొను కౌరవవార్ధిక ఖండ సేతువై
రంతులు మాన్పి యాతఁడు తిరమ్ముగ నర్జునుఁడీతఁడే కదా 366

వ. అనుటయు 367

చ. ఒనరఁగ నాలకించి యది యుత్తరుఁడంతన తండ్రిఁజూచి న
న్నను నొకదివ్యపూరుషుడు నామిషపెట్టి వచించినాఁడ న
ర్జునుఁడె సుమా సుయోధనుని శూరుల గెల్చి మఱల్చె గొవులన్
వినుమటుగాక నాతెలివి నేర్చునె యోర్చను గౌరవాంబుధిన్ 368

ఉ. దైవ వరప్రసాదులు సధర్ములు మాన్యులు పంచపాండవుల్
దైవ వశంబున న్వెడలి దైన్యము నాకతి హైన్యవృత్తి నీ

తావున కేగుదెంచి తలదాఁచి కొన న్మన భాగ్యమంచు నీ
దీ విధులమ్మహామహుల దృప్తులఁజేయక లాఁతి నీతియే 369

క. అదియంతవిని విరాటుఁడు
మదికెంతయుఁ జింతగదురఁ బ్రూన్పడి పెదవుల్
గదలింప నేరకుండిన
సదయుఁడు ధర్మాత్మజుండు సరసతఁ బల్కెన్ 370

చ. బెదరఁగ నేలనయ్య యొక పీడ యెఱుంగక యొక్క యేఁడు నీ
యుదరము లోన డాఁగితిమి యుక్త సుఖంబులఁ గడ్పులోనినున్
గదలక యుండునట్లు మముగాచి తవిన్మఱపించి తీవు స
ద్హృదయుఁడ వౌట నీఋణము దీర్పఁగ జాలము జన్మకోటికిన్ 371

వ. అని ధర్మరాజా అడిలం బలికిన నంతకు మునుపుల్ల బు డిల్లంబోయి వెల్ల బోయియున్న మాత్స్యుండు. ధర్మజు పలుకులకు గలకదీరి మెండుకొని కొండంత సత్తువ చేకూఱి యూరాట మెడలి విరాటుండిట్లనియె
372

ఉ. నాసుతనిత్తు నుత్తరఘనంబుగ గ్రీడికి ధర్మపత్నిగా
దాసుని తప్పులన్ని యొక దండము తో సరిజేయుక పోలికన్
వాసవి మూసికొంచుఁజెవి బాపమటుల్ గొన శిష్యురాలి బల్
మాసటి మాసమానుఁడభిమన్యున కిచ్చినఁగొందు నుత్తరన్ 373

వ. అని నట్లే శతమన్యు పౌత్రుఁడగు నభిమన్యునకు నుత్తరనిచ్చి తన జన్మ మంతటి నుత్తమముగ ధన్యమ్ము సేసి కొని యెదనను కొని యెదను గుదుఱు పఱచికొని
374

చ. క్రియకును నిశ్చితార్థమొనరించి విరాటుడు కూతు బెండ్లికిన్
బ్రియమున రాజ బంధులకు వేగముగా శుభలేఖలంపి వే
సియు బురమెల్ల యెల్లగయు సేసియు బంపగ వాహనమ్ములన్
రయమున వచ్చిరంత యదునాయక ముఖ్య సమస్త బంధువుల్ 375

క. శుభదివసమ్మున విరటుం
డభిమన్యున కిచ్చె నుత్తరాంగన వేడ్కన్
విభవమున నావధూవరు
లుభయులు నన్యోన్య సౌఖ్యమొందిరి మిగులన్ 376

ఉ. ఆకసమంత పందిరి మహత్తర వేదియ నంతయంతగా
నాకసమాన పట్టణమున న్విరటుండిడి మాసటేంద్రక
న్యాకసమ ప్రభారవి ధనంజయ సూతికి గూతు నిచ్చుచున్
నాకసమబ్బెనంచలరె నాకులు లోకులు మూకలై కనన్ 377

ఉ. హెచ్చుగ దిద్ది తీర్చ జగమేలెడి కృష్ణుఁడు పెండ్లి పెద్దయై
మచ్చిక మేనయల్లుఁడభిమన్యున కన్నియునేర్చి కన్నియన్
దెచ్చి విరాటుడీయ జగతిన్విరుఁడుత్తర జేయిబట్ట వి
వ్వచ్చుఁడు వీయ మందెను సుభద్రను కూడి వేడుకన్ 378

వ. మఱియు సదస్యము నాడవశ్యప్రార్థితులై దస్యుగజకేసరియగు వాసవ పౌత్రుఁడభిమన్యునకు మాన్యులు సామాన్యులునగు సభార్యులు దార్యా శాపానుగ్రహ నిగ్రహ సమర్థులైనసురముని వరులు పళ్ళారముల భాసిల్లు సేసలుగొని విశేషా శేష భాషా కోవిదులై యుపర బాషాపతారు లనిపించుకొని శ్రుతులవిశ్రుతులై తులలేని ధృతి శతధృతిని గూడ నేలుకోజాలిన యేలు కోటి బ్రాహ్మ్యమ్మొక కంఠ్యముగ శుభతర ఉదాత్తానుదాత్త స్వరిత ప్రచయ ప్రచుర స్వరము లెత్తి యావదూ వరుల పేరులెత్తి వీరలోరిమి కలిమి గలిమి మిగుల గులమునకు వన్నెవాసిదెచ్చి హెచ్చి మీసర మాసరికి మాసరము మాసరికి బెరవారు రాలేరు సుమీ యనదగి యనదగని కరి మిదమి త్తమనదగని కనికరము తోఁజేయూత యిడి మనుచు నీ మను మనుమడను వీనివలె సంకల్పిత సర్వకార్య సిద్ధియు వాక్పతివలె వాక్సిద్ధియు బుద్ధియు కలిగి యుండు శ్రీకరమగు నీ కొమరుని కొమురునకు ననంగత యనకత యనుగత ముగాకయున్న నతఁడు గొంతయెనవచ్చున వచ్చు నీ సత్తముండు సమాను డయ్యు నసమానుండై సమానులలో నుత్తమ శ్లోకుండు గావుత సమానానా ముత్తమ శ్లోకోస్తు అను ననువాకమును యదార్థపరచ గలవాఁడు గలవారిలో

ముంగలవాఁడై యరికి లోఁగని వాఁడై యవిచ్ఛిన్నపుత్ర పౌత్రాది సంతతి నాచంద్రార్క స్థాయిగా నుండగలవాఁడు సకల సంపత్సమృద్ధి వర్ధిల్లు నని వేదోక్త రీతి నాశీర్వాదము లొనర్చిరి. ఇట్టులమోఘ బ్రాహ్మణాఁశిష మనుగతి ననుగత సర్వశుభాస్పదముగ నభిమన్యు వివాహమహోత్సవమ్ము నిటనేనాట విని కని యెఱుంగని తెఱంగున జగన్మోహనముగా వర్ధిల్లుడు

379

## ఉద్యోగ పర్వము

క. అభిమన్యు వివాహమునకు
శుభముం గనవచ్చి నట్టి చుట్టాలు మహా
విభవముల నంపకము లయి
సభదీరిచి యుండ ననియె శౌరి సదయుడై 380

ఉ. విందు రోకో మదుక్తి మనవిందులు పాండవు లిందరుండగా
విందుల చేత గోలుపడి విత్తము రాజ్యము శౌర్యముండి లో
విందుల గానలంబడి రదెంచ గలంచదె వైరి చిత్తమే
నిందుల కించి రాజ్యమును నేరిమి వెండియు జెందుటొప్పదే 381

ఉ. పాపుఁడు ధార్తరాష్ట్రుఁడట బన్ని దురోదరమందు రాజ్యమున్
బాపుడు ధూర్తుఁడా శకుని పాల్పడి గీడ్పడ గృష్ణ శీలమున్
బాపురె ద్వాదశాబ్దములు పాండవు లబ్దము పడ్డ బాధలన్
బాపు నుపాయ మారరసి బంధుబుణంబును దీర్పగాఁదగున్ 382

తే. కావునను బాండవులు తముగావు మనుచుఁ
బోవువారలొ మిన్నకపోవు వారొ
బారి మున్నేలఁ దగు రాయబారి నంపి
మనుడు మైత్రిని భాగమిమ్మనుడు మొదల 383

వ. ఈ సంధి వాక్యము నాదుర్మదుఁడగు దుర్యోధనుడు వినడేని వడిగల వడముడి కవ్వడుల బెడిదమ్ములగు నడిదమ్ములతని బుద్ధిమంతుని జేసి వినిపింపఁగల వపుడు కూడ వినక కౌరంతలాడి గంతులు వేసిన నతనిరంతులు నిరభ్యంతరముగ శాంతినంద నెంతయు శాంతి నవచాప గురుముఖ

మహాయోధాన యోధులు వడిన పిదప యైన దనకు దానయనికొనకెంతకుఁదెచ్చె
నని యాదుర్జనుండని కొనడే యనికొనకేమి సేయు నప్పుడుంగూడ దప్పిన
దప్పిన పనికేమి సేయుదునని చెప్పి చప్పుడుగాకుండ నూఱకుండి మోరకు
తనంబునకు దిగినేని భీమార్జున నకుల సహదైవులు వారి వారి ప్రతినలు
ప్రతిహతంబుగా ధుర్యోధన దుశ్శాసన కర్ణ సౌబలుల నార్చితేర్చి పేర్చి వారల
తండ్రి పెత్తండ్రుల యిరువుర రాజ్య భాగంబులు ప్రాజ్యంబుగఁబూజ్యశ్రీః
పూర్వకంబుగాగ లోగక చేకొని వీర్యులగువీరలె భాగించక బోగించకల వారని
రుషవిట శగ భగలు విడఁజెప్పి వారి ప్రాయంబు ప్రాయికంబుగాఁదెలిసికొని
పిమ్మట కాగలపని కాగలమేని వేచియుండక లేచి యాచక యప్పటి స్థితి
గతులను బట్టి యొక పట్టు పట్టి చూచికొంద మిందుమనకందరుకు వ్యవహార
తరుమూల కందమనదగిన ద్రుపదులు కార్యఖడ్గము లకు జాలి పారిన వాఁ
గాన వారు దయదైవార సంప్రతించి యిందునకు మందేమి యందురో
ముందరగ వినఁగోరెదనని మాన్యాతీత మహిమాను భావుండగు శ్రీకృష్ణ
దేవుండు తర్జనీ ప్రదర్శి తంబుగా నానావిధ వాఙ్మధురమ్ముగ నానతిచ్చిన
ద్రుపదరాజు వినతుండై వినసొంపగు వచనరచన నిట్లనియె 384

ఉ. నన్నిక పెద్దసేసి యదునందను డందరి ముందరన్ వడిన్
బెన్నికతో దయంబలికె నిట్టులు నీయది నాయదృష్ట మా
నెన్నికసేయ నేడుగడ యేయన పార్థుల కెంతొగూర్చు వా
డెన్నిక నెట్టులైన హరి యీాయన యేగుట సంధికర్షమౌన్ 385

శా. తీయంబెట్టి సమర్థుడచ్యుతుఁడు కౌంతేయార్థ సిద్ధ్యర్థమై
తీయం బుట్టిపడంగ నేగినను సంధింగూర్చు నిందేమి లే
దీయం బెట్టను భాగమంచు ధృతరా ష్ట్రాత్మజుండడ్డు వా
దీయం బెట్టిదముల్వచించి హరి ప్రాధేయంకరం జేయడే 386

క. ఆ మాటలు విని యందరు
మోమాటముగాదు నిజము ముమ్మాటికి సు
మ్మీ మాటలె మామాటలు
నీమాటలికేల శౌరి వేంచేయఁదగున్ 387

ఉ. అచ్చట నున్నవారు ద్రుపదాధిపు మాటకు మెచ్చి హెచ్చుగా
నచ్చపు రాజ తంత్రమున కందెనువేసిన చేయి యాతఁడిన్
ముచ్చట పాఱజూచి వినముచ్చటగాగ వచించెఁగాన నే
మిచ్చిన నీయవచ్చునొ కడిందర కిట్లు ప్రియంబు వల్కనే 388

వ. అని యిట్లు దేవదేవుండయిన శ్రీకృష్ణుదేవుండు వరానుగ నుడివిన మానుడలవులకు గడు సంతసిల్లి యందుండు నెల్లవారు నీమహామహుండు బావికార్యంబు నొప్పుగ నొడఁగూర్పఁదీర్పరి యని శూర్పశ్రుతిధపురమునకు భారంబగు రాయబారంబు పొంటె వేంచేయుట కడువంచిదని తత్సభాస్థానమందలి సభాస్తరులందరు నైక కంఠ్యముగ బలుక జగదేక నాథుండ బాధకముగ వారి మనవిని విని యటుల సేయ ననుమతింప బాండవులేగురు శౌరి యండ కరిగి వేర్వేర నిట్లనిరి. యోదేవా దేవరదివ్య చిత్తంబున ననుమతి నుంచి కౌరవ వాదముతో నామాటగా మోమాట వీడి తడయక వెనుదీయ సామదానాది చతురుపా యంబుల నపాయంబుగ జెప్పిఁయుఁ జెప్పించియు సంధికార్యము సఫలపరిచియు బలపరచియు తురీయోపాయము ప్రబల పరిచియు జతనమ్ములు విఫల పఱచియు వెఱవవలదని వెనుజరచియు వెరచి వెనుదీయక డాయకు దాయక యెత్తెరంగున నయిన యొక్కతెరగునకుఁదెచ్చి సంధినెరవేర్చి తత్తరమున బెందలకడ నిటరమ్మా యావలదేవర చిత్తము మాభాగ్యమని మఱల వేర్వేర నుడివి యేవురు గూడి యేకవాక్యతగఁదగ నిట్లనిరి. 389

క. మనయొక్క బుద్ధిలో వి
త్తనముల నితరులు నగంగఁ దగవేటికి బె
త్తనముం దక్క మనఁడు పె
త్తనమున నెమ్మదిగఁబ్రతుకదగదే మనకున్ 390

ఉ. పాలును నీళులుంగలసి పాయక పాయకరంబుగాక భూ
పాలురు సూచిసంతసిలఁబంచి భుజింతము మీరు మేము మీ

పాలును మీరు మాజనకు పాలును మేమును జెల్మికల్మి మా
పాలును బంచి యిమ్మనుచు బల్కు సుయోధనుతోడ మాధవా 391

శా. ఈ రీతిన్ మృదు నీతి వాక్కులకు వారీకొన్న మేలేగదా
కారాకూరము లాడివాఁడు మనభాగం బీక డాకొన్న చో
క్షీరంబందు ననాజ్యమొల్కుటయగా చేతీట పోఁబోరనా
క్రూరున్ సానుజు నాకసర్వపరిచారుం గూల్తు మంచాడవే 392

కం. ఈ దృశ మార్దవ వచనము
నీ దృశకును వెలుచికాదు నీతి గనుక మే
మాదృతిఁజేసితి మీగతి
మాదృశులకు నిన్ను బ్రతిమలాడుటయేలా 393

వ. అని యిట్లు పాండునందనులు వసుదేవనందనుని తోడఁ దమతమ మనోగతంబులుఁక యెఱుక పఱచి మఱియు మరలి పాఱఁ జూచికొని వెఱసఱచి మే మొఱఁగి యెఱుంగక మాట తెఱంగునకుఁ గడు వింతగా నుడివితిమి. నీకు నేర్పఁగాఁగల వారమా స్వామీ! హేమాహేములగు మీకు నెఱంగరాని మఱుంగు లెందేనియుఁగలవే మాకుఁగార్యఖడ్గములకు మమ్ముంగడవం బెట్టి మీర యేడుగడయు గాన మీరెయ్యది క్షేమం కరంబో యయ్యది తియ్యనగనొడగూర్చి యొనగూర్చి క్షేమాన బోయి లాభానరమ్మా. స్వామీ జగన్నాటకసూత్రధారులగు మీకుమేమునేర్పగలవారమే హనుమంతుని ముందఱ కుప్పి గంతులాయెను నట్టుగావె. తాతకు దగ్గునేర్పవలెనా యని యనేక విధముల వినయ విధేయతలు సూపి సర్వాంగాలింగిత భూతలంబుగా దనకు నమస్కరించిన ఫల్గుణాదులను సగౌరవంబుగాఁ గౌగలించుకొని శ్రీకృష్ణదేవుండు వారలనందఱు నువ్వెత్తుగా వీడ్కొని సాత్యకిసహితుండై సౌపర్ణధ్వజ యుక్తంబై సుపర్ణ మయంబగు నిజ రథం బధిరోహించి వెడలి యుపప్లావ్యపు రంబు నిర్గమించి కతిపయప్రయాణముల హుటాహుటినడల గరినగరంబున కరిగిన హరిరాక విని సుయోధనాది కురుకుమారులును భీష్మ బాహ్లికాది కురువృద్ధులును ద్రోణవిదురాది గురు సద్బుద్ధులును నెదురు చనిన వారల నందఱ నందనందనుండు యథార్హంబుగా గారవించి గౌరవించి

జగన్మోహనంబుగా బురప్రవేశంబు గావించి ముందుగాఁ గురురాజ మందిరమ్మున కేతెంచి యందు సరసమధుర సంభాషణ పురస్సరంబుగా ధృతరాష్ట్రువీడ్కొని విదురసదనంబున కరిగి యాతండు వినయమున జేయు నాతిధ్యాతి సత్కారంబుఁ బ్రీతి పూర్వకంబుగా నంగీకరించి యంద విడిసిన వినవచ్చి దుర్యోధనుండదరి పడి యదునందనా యర్హనీయుల మైన దేహబంధువుల మమ్మందఱ విడనాడి గర్హణీయుఁడగు చతుర్థనింట విందారగించుట యర్హమే యని నిందించి పలికిన గోవిందుండన్నిటి కన్ని సదుత్తరములు చెప్పి నొచ్చనీక వత్సా మాకత్యంతాంతరంగ భక్తుండగు విదురుండేమిటఁ గొఱంత గోరంతయు విచారించక దూషించి భాషించితివి మాకు సద్భక్తులగు పాండవుల యెడ ద్వేషివైన నీవు మాకును ద్వేషివై యుందువు ద్వేషియింట భుజియించుట ద్వేషికన్నంబిడుట తగదని పెద్దలు వచింతురు గాన మమ్మభజింపనొల్లని నీయింట భుజింప నొల్ల మైతి మింతియ కాక నీతోడ గొండొక రాచకారియము పొంటె నిచ్చటికి వచ్చితిమి గాన గతికిన నతుకదని యెడి లోకోక్తి మదినిడి నీయింటికి రానొల్లనైతిమి. ఇందు విందులా నని మాత్రముననే మనము విందులము గాక యుందమే యని గోవిందుండ చదురులాడి యప్పటి కా తప్పులెత్తి తప్పించుకొని విదురు సత్కృతి నాదరించి ప్రకృత మనుసరించు వాఁడై శ్రీగోపాలదేవుండు కౌరవ సభకు మనోభావ నిశ్శంకుఁడై విచ్చేసి తనకై తెచ్చియిడిన కనకరత్న సింహాసనంబున సుఖాసీనుండై ధృతరాష్ట్రు భీష్మ బాహ్లీక ప్రముఖ నిఖిల కురు వృద్ధులు ద్రోణాది గురు వృద్ధులు పరివేష్టింప రాధేయ ద్వితీయుండై యిరుగెలంకుల శకుని దుశ్శాసనుల హస్తముల యందుఁ దనహస్త ద్వయము ప్రశస్త ముగ నుంచి యుచ్చ సింహాసనంబున వచ్చి కూర్చున్న గాంధారేయ జ్యేష్ఠునిన్ శ్రీహరి తన శ్రేష్ఠంబగు మేఘగంభీర నిస్వనంబున మంచిని బోధించ దలంచి యోయీ సుయోధనా యని యామేటి నోటి యారబిల్చి సంబోధించి సురముని లోకంబు లాకసంబున నొనర లోకంబుల స్తోక సభాంగణంబునను జెవులు వొరఁ బెట్టుగొని నెట్టన వినుచుండ మురహరుండిట్లనియె

394

చ. పనివడి దార్తరాష్ట్రులును బాండవు లొక్క తెఱంగు మాకునున్
బనివడి సంధి గూర్ప నిటవచ్చితినేఁ బనివేళగానని

ప్పని వడి వారిభాగ్యము సమంబున వారికినిచ్చు టొప్పు నొ
ప్పునివడి యేలఁగూడుఁడిక వారును మీరును బాలు నీరటుల్ 395

క. అదివిని సుయోధనుఁడు కడు
నదరి పడుచుఁ బడుచుఁ దనవు టదిరిపడుట కూ
డ దదితగదంచు నందఱు
బదరఁగ నేఁబాండవులకుఁబాలిడ ననియెన్ 396

ఉ. అంతటఁ దల్లిదండ్రు లపుఁడాత్మ తనూభవు తోడ బాలకా
యింత యఖర్వ మిప్పుడన నేటికి మాధవుఁడానతిచ్చిన
ట్లంత యొనర్చి సంధిపడు మందున కొప్పక తప్పితేని నీ
చెంత వసించఁబోదు వెన శ్రీయును నాయువు నిన్ను వీడ్కొనున్ 397

ఉ. మమ్మలరంగఁజేసి పెడమాటల నింకను గట్టిపెట్టి నీ
మమ్మలరంగఁ బార్థులకు మంచిగ భాగము పంచిపెట్టు మ
మ్మమ్మలభించు నష్టికలహమ్మనఁబొందు నఁదుష్టి నీదు గో
మమ్మల పాలు సేయకు మహాత్ములు పాండవు లేల వైరమున్ 398

వ. అందుల కంధనృపాగ్ర నందనుండు మొగమ్ము మురకటించు కొనుచుఁ
దరకటింపులు మాని దురభిమాని తన తల్లి దండ్రుల మాట గేటునఁ బుచ్చి
యెల్లరు విన నందనందనుఁజూచి యిట్లనియె
399

ఉ. ఏది యెట్లైనను న్సరియ యెందఱు నెన్నియుఁ బన్నివచ్చి న
న్నేది యొనర్చినన్వెఱవ నీఁతకు మిక్కిలి లోఁతు గల్గునే
నా దురదృష్ట మెట్టు లయినం జననీ విధివ్రాత తప్పునే
సూదిని మోపినంతయును జోటిడ వారికి వేయునేటికిన్ 400

చ. అదియునుగాక పాండవులె యక్రమవాదులు కాదటంచు వే
చదివిన నేమి సార్థకము సారెకు వారికి రాజ్యమెట్లు రాఁ
గుదురును గుడ్డికూర్చికొని క్రొవ్విన జూదము లాడి యోడిమా
కది విడరప్పుడట్లు విడనొనెటు లిప్పుడు దేరఁగా హరీ 401

వ. ఇంకొకటి కూడ వంకర బుద్ధులు మాని మానిత మార్గంబు శంక దిగ(ద్రావి
కింకిరిపడక కడఁక విడక వినుమని సయోధనుండిట్లనియె 402

చ. రయమున రాజసూయమును రాణను జూడఁగఁబోయి నేనటన్
మయుసభఁజూచుచండగను మానము వాయగఁగ్రుష్ణభీముడున్
భయము దొఱంగి నాకుఁదలవంపుగ నిప్పని యొప్పనే హరి
ప్రియముగ నన్నుఁజూచి వెఱపింపకఁబక్కున నవ్వి రొక్కటన్ 403

గీ. ఇట్లు బహు వైరకారణమెల్ల వారి
పట్ల నిడుకొని నిర్దుష్టు లట్ల మమ్ము
పొడిదెఱఁగితి మని తూలఁబల్కు లొకటి
కనగ గురిగింజ తననల్పు గనునె చెపుము 404

క. అదివిని యాదవ నాథుడు
కవకవనగి యట్టి చెడుగు ఘటియించుటలో
లవలేశము సందేహం
బవునే ప్రథముడవు నీవటంటకు వత్సా! 405

చ. తనరఁగ నెవ్వడీ తనదు తప్పును దానునెఱుంగఁడంచు నీ
వనినది నీకె తాఁకె నిపుడన్యునిపై నడిమోపనేటికిన్
గొనకొని కోరుదేని వినుఁగొన్ని వచించెద వ్రేల్మిడంచుమీ
మునుకొని దోషమన్యపయి మోపినఁబోనె నిజాఘ మంతయున్ 406

ఉ. పుట్టిన నాటఁగోలెఁ జెడు బుద్ధులు నీకవి యుగ్గుపాల తోఁ
బెట్టినవే కదా తలఁపఁబెక్కు వెతారము వీవు వారికిన్
బెట్టవె లక్కయింట శుచి వెట్టి రగిల్చియు మాయజూజ మం
దట్టులు రాజ్య మూడ్చుకొని యారడి సేయవొకో ప్రజాపతిన్ 407

గీ. ఘోషయాత్ర మిషన్వారి ఘోష వెట్ట
బోయి మృతిఁదప్పి కనులొట్టఁ బోయి తుదకు

వారు కరుణించి విడిపంప వచ్చి బ్రతుకఁ
గంటి వీవు మఱచితివో కౌరవేంద్ర! 408

క. మఱచితివే వారలవే
మఱచి శపింపంగఁ జండమౌని ననిపి యే
మఱచితి వెంచక వెతవే
మఱచిరముగ దైవకరుణ గ్రుందరు వారల్ 409

ఉ. శ్రాంతి నిశాంతమందున విచారిగ భీముఁడు గూర్క వానవి
శ్రాంతిని శాంతమందున విచారుకురాంఘ్రుల నంటగట్టి నీ
వంతట గంగద్రోసి సవిషాన్నమిడ న్ప్రణిఁ గీలు కొల్పితి
ట్లెంతకు లేవు నీ వహహా! యెంచిన మంచమునిండ గన్నులే 410

ఉ. ఉప్పన పట్టె నూఱవుర కొక్కఁడె పావని యుద్ధిమై మిమున్
ముప్పడఁగ న్నఖాగ్రముల మోయగ మీరలు మూఱు మోయగా
యప్పుడు కాలు దంష్ట్రలకు నన్నలుదమ్ములు నైన యల్లుడున్
గుప్పున నెత్తి వాని నొకగుండము నంబడఁ ద్రోయలేదొకో 411

మ. అవి యన్నింటి నటుండనిమ్ము సభలో నన్యాయివై నీవు పాం
డవ సర్వస్వమునూడ్చి జూజమున దానంబొక నవ్వంగ న
న్నువు లాశించితివారి పుట్టముల నీనోరెట్టులాడెం బరా
భవమే పో ఘనకార్య మంచనితివో పాపాత్మ నిన్నేమనన్ 412

క. నీచేతనైన వఱకును
నీ చత చేసితివి వారినిజమే వారిన్
గాచెను గాకవి యేటికి
నీ చేతలు వేఱయింక నేననవలెనా 413

క. అవి యెల్ల పాట్లు వారను
భవమందియు మఱచి మఱల పరాభవ మందిటుల్
సవినయమునఁ బాలడిగెద
రవినయ మేమిటికి వారి యంశము విడుమా 414

ఉ. ఇంతియకాదు మీరుభయు లెంతయు మైత్రిని గూడి యున్న మే
లింతయు నంతయంచనని హెచ్చరికం గనువారమయ్య మే
మెంతయుఁగాదె వేఱుగతి హీనము నెత్తురుకూడు మేలొకో
శాంతనవాది బుద్ధియనుసారము సారము పాఱఁజూడుమీ 415

ఉ. నీవు సుయోధనుండ వొకనింబని లేదడు గంగ నెద్దియున్
రీవిని బాండు భాగము విడిన్విడి పుత్రులకింత నీవువా
రీవిధి మైత్రి నుండుఁడిఁక నేటికి మాటలు సంధిగాని చో
భావినిగాఁగలట్టిది యభాగ్యమో భాగ్యమొ యెంచి చూడుమా 416

చ. వెడముడి కవ్వడుల్కలహమబ్ధి నినుంబడముంచి యోధులన్
గొడవక నూచముట్టుగను గొంతులు గోయఁగ నీవు నొంటిమై
గడపఁగ దిక్కులేక యదికామొగమై ననుచోఁదలంచవో
కడుదయఁగృష్ణుఁడాడినటుగా విన్నైతి నటంచు దుర్మతీ 417

వ. ఇట్లు దాసపోషకుఁడగు వాసుదేవుండూని యానతిచ్చిన యసామాన్య సామాద్యుపాయంబుల ననుబంధించిన సంధిననుసంధింపక జననీ జనకుల మాట పాటింపకప్పాట నిరాకరించి నరాకృతినున్న దురాగతకలి పురుషుండగు సుయోధనునకు మహాయోధులగు భీష్మద్రోణ కృప విదురాదులయుఁ బారాశర్య నారద భృగు భరద్వాజాత్రి మైత్రేయ ప్రముఖ మహర్షులయు సంధికృత వాక్కులను వినక నిరాకరించినను బరాకు దెల్పు నట్లింక మఱియొక సారి చెప్పిచూతమని యానిరాచారులు నిరాఘాటంబుగా నరాకృతియగు నాదురాచారునకు నైక్యకంఠ్యముగా నిట్లనిరి 418

చ. రజనికరాన్వయాన ధృతరాష్ట్రుఁడు కాఱుఁడనర్హుడేల్బడిన్
సుజనుఁడు గానఁబాండుపతి చూచెను రాజ్యమునన్నదిం బలెన్
నిజమునకెంచి చూడధరణీతల మెల్లను బాండురాజు దీ
గజపురినేలఁ బాండవులె కర్తలుగా కెటునీకు వచ్చురా 419

చ. అయినను బాండవేయులు మహాత్ములు గావున రాజ్యమంతయు
నయమునఁబోదలంచి తమనాయన లిద్దఱుకైన యట్టు గా
దయను దలంచి పైబడక తండ్రి సగంబునె కోరి రిట్టి చో
నయముగ సంధికొప్పు కనయంబును జూపుట నీకుఁబాడియే 420

వ. అనిపెద్దలు సెప్పిన బుద్ధిని విననొల్లక పెడచెవిని బెట్టి కూర్చుండిన సుయోధనునితో మహానుభావుండగు శ్రీకృష్ణ దేవుండు పాండవులు కోరిన సంధి పర్యవసానాంశంబుం గూడ వినుమని మఱియుఁ జెప్పందలంచి యకలంకంబుగ నిట్లనియె 421

చ. కడకొక మాట సెప్పెదను గౌరవమొప్పగఁ గౌరవేశ్వరా
యెడపక పాండవేయులకు నేవురి కేనుపురమ్ము లేలగా
వడివిడు వారణావత మవంతియు నింద్రి యామాదిప్రస్థముల్
గడుకొని హస్తినాపురము గాదన కాదన కారణంబుగాన్ 422

వ. అదివిని గాంధారీ నందనుండ దరిపడి చెదరక సుళ్లుజూపిన కెరలు మత్త కరీంద్రము కరణి దురాగ్రహమ్ము సూపుచు వసుదేవనందనా వారొండె వీరొండె పోరఁబగలుఁ బొగరడంచి మగపోడిమి జూపి రాజ్యంబు చేకొనుట యవశ్య కార్యమ్మనియు నది యవశ్య కార్యమ్మని యెంచు వారవశ్యులకు వశ్యులై వారుసెప్పినట్లాడిగము సేసి మను వారుగాఁదీఱుమానము సేసితిని గాన నత్తీరుమానము గలవారు కానకుఁ జని మౌని వృత్తి మనువార విదియను హృదయమూ ఱకనుఁ దూరక యదేపనిగ బోరక యింకనొకటి వినుము 423

ఉ. ఇచ్చెడు వాడటంచు నను నెందఱు నన్నను నోమి భూమినే
నిచ్చెడు వాఁడఁగాను గలహించక మించక గోపనందనా
వచ్చిన దారి బట్టు మిక వారక యూరక పెక్కు లార్చినన్
ఱిచ్చవడంగ నిన్నుఁబెడఱెక్కలు గట్టి చెఱందవిల్చెదన్ 424

వ. ఇట్లు క్రిందు మీదు గానక కౌరవ నాథుండాడిన యగౌరవ దురాగ్రహ ఖర్వ గర్వహ ధూర్వహ వచనరచనకు నీయ గోవిందుండును సర్వమంగళా

స్ఫదుండునగు శాంత శమాద్యనంత కల్యాణగుణుఁడును శ్రీహరి దరహాసగ్ర
సిష్ణుగండ యుగళుండై కౌస్తుభాలంకృత గళుండై కలకలనగి యిట్లనియె 425

ఉ. ఏలర త్రుళ్ళు నీకిటుల నేలను నేలగ మీరు మీరు పో
రేలర యంచుఁ బంచి తినుఁడీ కొనుడీ కొనకిష్టమయ్యె నీ
కాలము సానుజాప్తతను ఖాళిగ నీవనిఁబెద్దనిద్ర వోఁ
గాలము చేరువౌట సుమీ గాలము మ్రింగెడు మీల పోలికన్ 426

చ. ననుఁజెనకంగ నీకుఁగురునందన యిందనకాదు ముందుఁగా
నను దలక్రిందుగాఁ దపమొనర్చుచు జన్మము లెన్నికోట్లు నె
త్తిన వశమౌన బ్రహ్మకును దీరని కారియ మీవునేర్తువె
త్తినఁబడద్రోసి కొందు వలతిన్ జని మూరెడుకుంగఁ బారెడున్ 427

ఉ. చిట్టలుగాగ నిందఱికి చిల్కకుఁజెప్పిన యట్లు నీకిటుల్
బిట్టుగ బుద్ధి సెప్పఁ జెవిఁబెట్టవు భూప్రజ నీవె కాకపోఁ
గొట్టుదు దీనఁదాఁ జెడిన కోతి వనంబును జెర్చి నన్నయ
ట్లుట్టిని గట్టికొంచు నికనూగెదవో జగముండునంతకున్ 428

ఉ. వన్నెయు వాసి గోల్పడిన వాని జడున్ వెసరాజ్యలక్ష్మి తా
నిన్నును వీడి ధర్మసుతునిన్ వరియించుఁ దిరంబుగా నిదే
తన్నును నీతలన్ బక విదారిగ దాహతిఁగూల్చి నీతొడల్
నన్నును నన్ను యప్పుడయినన్ మదినెన్నవొ నొచ్చి కౌరవా 429

వ. అనియిట్లు దేవదేవుండైన శ్రీకృష్ణదేవుండు దుర్యోధన దుర్వ్యవసాయంబ
సమాధాన ప్రాయంబుగాఁ దెలిసికొని నీకుఁబాండవుల తోఁబొందెడఁగూడఁ
గూడని కార్యంబుగాఁ దోచి కూడని కార్యంబగు యుద్ధమె సిద్ధమని బుద్ధి
నుంచితివేని మంచిది వచ్చు నమవస నాఁడు నాడ నంగ లనీసేనలతో నీవు
కట్టాయి తమ్మైమ్మె తృణ కాష్ఠజల సమృద్ధమైన కురుక్షేత్రమునకు వేరమ్మున
వేరమ్మని యానతిచ్చి తన్నుఁబట్ట దలంచిన గాంధారేయు దురభిప్రాయంబతని
కషాయకరంబుగాను భానుని మ్రింగను బిడుగును బిడికిలించను జడధి
బుక్కిలించను జదిల ప్రక్కలించనుదమకించు వెంగళిగ రారాజు తన్నుఁదాదూ

రుకొని యూరకొను నట్లుగ సభనున్న వారలెల్ల వెల్లడిగ వెఱగుపడి యొఱిగి నోళ్ల దెరిచికొని వెఱచి యుఱ్ఱులెత్తి తత్తరపడుచుఁగొను చుండ నీతి మానుషరూపంబగు విశ్వరూపంబు జూపి యాదివ్య రూపంబు చూడగోరిన ధృతరాష్ట్రునికి దివ్య దృష్టి యనుగ్రహించి భక్తులకు సంతుష్టి యొనరించి యపారకృపారసంబు నించి యంధనృపుప్రార్థనదివ్య రూపంబుపసంహరించి దుర్యోధనాది దుష్టచతుష్టయికి శృంగ భంగంబు కావించి వారల లజ్జాబ్ధిముంచి పెర వారల సంతోషాబ్ధిడించి నోలలాడించి మరల యోగ మాయగొని యద్భుతమెల్ల వెల్లడించి యుద్ధసన్నద్ధులై కురుక్షేత్రమునకు రమ్మని భీష్మాది కురువృద్ధ యోధులకు సమర్మకంబుగాఁ దెల్పి తన తమ్ముడు సాత్వకి తోడరా విదురుని మదిరింజిల్లఁజేసి కుంతికి జింతవాయనుడివి మరల పాండవుల వద్దకు విచ్చే యువాడై యావరదుండ రథంబెక్కి రాధేయు మది దెలియ తనయరదంబుపై లేచి బిలిచికొని రాధేయా నీవు కౌంతేయుండవుగాని సూతపుత్రుడవు గావని చతురుహాసంబుగార కాస్యంబు ప్రకాశముగాఁతెల్పి నీవుపాండవులఁ గలియ వచ్చిన రా లచ్చికి నిన్ను రాజు జేయుదునని నక్కర్ణుని దాకర్ణించి యోయదు నందనా నాపై కృపారసంబున నీవు పలికి తింతియ చాలు నిప్పట్టున బాండవులనేఁ గలియ వచ్చుట సర్వథాయ నాదరణీయం బుసువూ పాండవులకు దివ్య వారింగలసితినని నాకును నాకువెఱచి మధ్యమపాండుండు నన్ను నీ మూలంబున లోఁగొనెనని ఫల్గుణునికిని ననిసడిసన్న మాయిరువురకిట్ల లోకోప వాదంబు శాశ్వతముగా జగంబున నిలుచునది యట్లుండనిమ్ము చిరకాల సర్వజన కాంక్షణీయమగు యుధిష్ఠరు సింహాసనా రోహణమునకుఁ గొంత కాకున్నఁగొంత యేనంత రాయంబు వాటిల్లునతండు రాజ్యంబు సేయుట నేనుజేయుట కంటెనా కతిప్రియంబుగాన నాతని రాజుంజేయు మింకొకటి కూడ మనంబున ఘనంబుగ నుంచఁదగినది యాబాల్యంబుగ నన్ను నమ్మి తనయెత్తు మానిసింజేసి వాసిగఁ జూచు సుయోధను నే నిప్పుడు మోసము సేసి నేఁడు విడనాడి పాండవులం గలిసినఁ బదుగురు మఱియుఁ గుప్పగూర దూరుదురు నాకనిమిత్తముగా మిత్రద్రోహంబు గూడ వాటిల్లుఁ గావున నీమాట నిరాకరించితి నని యెంచక య్యది మదినుంచక నన్ను మన్నించి సుయోధనుని పట్ల నన్నుండనీ నీదయ జయంబు పాండ వులదని నీవు నేను గాక యాబాల గోపాల మీ జగ

జ్ఞాలమ్మెఱింగిన పనియె గాన యో గోపాల దేవా నన్నుక్షమించి యాప్రశంస ప్రచ్ఛన్నముగా నీమదినుండ నిచ్చి నన్ను నెమ్మది వీడ్కోల్పవే శ్రీకృష్ణాయని సవినయంబుగా బ్రార్థించి యుత్తరమిచ్చిన యత్తరణి సుతుని స్థిరాంతత్వమునకు మెచ్చి యాకర్ణుని దనయరదంబు డించి సాత్యకిం గూర్చికొని వసుదేవ నందనుండు పప్లావ్యంబునకు విచ్చేయుడు నంత నిక్కడ ధార్తరాష్ట్రుధూర్తతకు నసహ్యపడి భీష్మాది కురువృద్ధు లిట్లనిరి

430

సీ. శ్రీకృష్ణునకు మీరు సిరిగల్గమన్నింప
కల్గును శుభమని కనలి రొకళు
ఏది యెట్లైన నీమీఁద గాగల యది
బాధకే యనిరి భీష్మాది కురులు
కాను వీసము సేయదీ సువాసిగ సభా
వాసోక్తి వినుమని వ్యాసముఖులు
విదురుని మాటకే యెదురు చెప్పఁగఁబోక
యదరకు మంచును విదురమతులు

గీ. వేయునేటికిఁ గొను పాండవేయుల నిల
నెందరేగిరి వారితో నేగకయ్య
భూమి కలకాల మీవుండఁబోదు వాక్కొ
వసుధ నీవేగ నీతోడ వచ్చునొక్కొ 431

వ. అని పల్కిన సుయోధనుడు బెల్లముకొట్టిన ఱాయి చెందముండెన్ 432

వ. అంత నక్కడ దేవకీ నందనుండనుజ సహితుండై యుపప్లావ్యంబునకు సవ్యంబుగా భవ్యగతి సమీపించ వచ్చె నని కర్ణ సుఖవాణి నాకర్ణించి

433

క. ధర్మజుఁడనుజ సహితుఁడై
శర్మదుఁడగు హరికి నెదురుసని యర్హగతిన్
నిర్మల భక్తి గనుంగొని
భర్మాంబరు తోడ నిట్లు పలికెంబ్రీతిన్ 434

గీ. అనఘ దుర్యోధనుఁడు సంధికనుమతించె
నేయనఁగడగి శౌరి నీవెఱిఁగి యాఱు
నెలలు వాయించి విడిన మద్దెలదిగట్టి
యదియొ యోటిదియో యని యడుగ నేలా? 435

క. కనగా ముంజేతి కడెం
బున కద్దంబేల చిత్తమున నుండు తలం
పనువుగ మొగ్గమున వ్రేలఁగ
మనమునఁ జెయియడ్డువెట్టి మదికన వలెనో 436

క. చెప్పఁదగినంత చెప్పితిఁ
జెప్పందగు వారిచేతఁ జెప్పించితివాఁ
డొప్పుండు సంధికి నాచే
నప్పటి కయినంత పొర్లు కాడితి సుమ్మీ! 437

ఉ. ఊపిరి భీష్మముఖ్యులోకయూపు సుయోధనువాఁడు గొంతులో
నూపిరి యుండగా మనకు నొప్పడు చొప్పడ భాగమీగ గా
నోపిత రేని ఱేనినని నోర్చికొనుండిఁక నేల బేలవై
యోపిక బట్టనేల గలియుంచిన పిమ్మట నుట్టిఁగన్నటుల్ 438

వ. ఇట్లు కరిపురమున జరిగిన సంధికథలెల్లఁ జల్లగ శ్రీకృష్ణుండు పాండవుల కేమియు దాచక పూసగ్రుచ్చినట్లొప్పుగ జెప్పి యనువుగ మీకనుగులగు వారలఁ జారుల నంపి మీ చుట్టముల పొత్తి నాయా పొర్తి నాయా పట్టుల కిప్పట్టున ఁబట్టుదలతో సందేశము లంపి జంపు సేయక యాయాదే శాధి పతులఁ బదాతి సంహతులతో నిటకు రప్పించి కాని యనికి నన్నిట సన్నద్ధులై నన్నిటకు రప్పించికొనుండిదె నెచ్చులులారా యచ్చెరువుగఁ బోయి వచ్చెదనని పుండరీకాక్షుండు పాండవుల వీడ్కొని వారక ద్వారకకు విజయంబుసేయు విజయుండదే ప్రకారంబున నాహ్వాన పత్రికలందరికిఁ దొందరగ వాసిగ వ్రాసిపంపెనంత 439

చ. అరిగెలు తోడరా హరిసహాయము గోర సుయోధనుండు ము
న్నరిగిన ద్వారకాపురికి నర్జునుడున్ జనె నాఁడ కౌరవుం
డరగిలిఁ గూరుచుండెఁ దలయంపికడన్ హరిపాదమొత్తుచున్
నరుడును నిల్వ శ్రీహరి ధనుంజయు మున్గని కాంచెనన్యునిన్ 440

వ. అప్పుడు గొప్ప గద్దియపై గూర్చుండి కౌరవనాథుండు గౌరవంబుతో
యదునాథుని కిట్లనియె
441

గీ. మున్న వచ్చి తివిరితి సమున్నతి విర
తిని నొనర్పక తోడరుదెమ్ము నాకు
ననఁగ విని శౌరియనియె నన్నన్నవిజయు
ముందుగంటిమి గానయే ముందు యెందు 442

వ. అయిన నింకొక్కటి గల దిందుగల యోధుల నందఱ నరమర విడఁచెప్పి
వారివారి తరముతోగూడ మాముందఱ మఱసేయక యెఱిఁగించెద చెదరని
మదిఱోసి వాసినేమెనొఱుగులున్న సవఱఁగ సవరించుకొంచుఁ గించుతనము
సేయక మంచి చెడుగు లెంచి పాఱఁ జూచికొని తోచిన తెఱంగున
యోచించుకొని కొనుండని వారలిరువురకు నెఱుకపఱచి శ్రీకృష్ణుండు
మఱియు నిట్లనియె
443

చ. నిజము నిరాయుధుండనగు నే నొకయెత్తు మదీయ సేన పూ
ని జముని రాయశక్తిగల నేర్పరి సాయుధ యొక్క యెత్త వీ
నిజము ఖలందుఁగొండికయు నేరిమి నేరికొనంగ నన్నవో
నిజముగ వీడి చక్రధరుని న్వరియించెఁగిరీటి కృష్ణునిన్ 444

క. గోపాలుఁడు నారాయణ
గోపాలురతోడి సాటి గొనఁదగఁడని యా
గోపాలుఁడు విడి కృష్ణుని
గోపాలువరించి చనియె గొబ్బునఁ బురికిన్ 445

వ. అంత గుంతీనందనునితో నందనందనుడు కూరిమి మీఱ మేలము లాడుచు

నాలమునకు జాలిన నారాయణ గోపాలురగాలు బలంబుబోని బాలుర
గాలు బలంబుల విడనాడి తోడుపడ జాలని నన్నేల కోరితివి నన్నిటు
లేరికొంటన న్నిట వెట్టి వైతివి గదా యని గదాయుధ ధరుండు కోడిగంబు
సేయ గ్రీడియుఁగ్రీడగ దగు నుత్తరంబిచ్చె నెట్లనిన

446

క. కనుగొంటివి పొరపాటున
ననఁగొంటిగ శౌరి పార్థుఁడనె ననఘాఁనే
ననికొంటిఁ జాలుదును ని
న్ననికొంటిని గొంటిఁబరముఁడని కొంటినెనెన్ 447

గీ. ఇట్లువెలలేని సల్లాప మెంతవింత
సంతసమ్మున జేసి రోరంత ప్రొద్దు
నరుడు నారాయణుండును నరుఁడు మున్ను
విరటునగరికిఁజనె హరివెళ్ళె వెనుక 448

వ. సయోధనుండు కరినగరు కేగుచో బలభద్రు సౌధంబునకుఁ బోయి హాలింగాంచి
యిట్లనియె

449

మ. అనఘాకృష్ణుఁడు పాండు సూనులకు ముఖ్యాప్తుండుగా నుంటకున్
తనరన్ మీరలె నన్నుబెంచి కడుబెద్దంగ జేసి యుందాక నా
యునికిన్ వీడకనుగ్రహంబును గదాయుద్ధాదులన్ నేర్పుటల్
నను మీశిష్యుని నాప్తుగాఁ గొనుఁడు దానన్ గెల్పునాకౌననిన్ 450

చ. అనవిని రోహిణేయుడనె నాప్తుడవౌదువు నాకునో సుయో
దన విను కృష్ణువీడి కలతున్ నిముసంబు వశింపజాలనే
గొన నిమురాఢి కృష్ణునకు గూడని పార్శ్యమునందు నుందు నే
జనియెద దీర్ఘ యాత్రకిటు సాయముపోనని యొట్టు పెట్టితిన్ 451

చ. అనుటయు నాసుయోధనుఁడు నచ్యుతునగ్రజు చూచి వెండియున్
ననుగొను వీడు మెట్టులయిన న్పరియే విను మొక్క మాట నీ

యనుజు పురోద్భలంబునను నైనను గూడకు మయ్య పార్థులన్
గొనకొని యట్లైె నీవు ననుగూడుట కంటెను జాల హెచ్చుగున్ 452

వ. వీరలేగాక యింక దుశ్శాసన దౌశ్శాసనలును జిత్రసేన వృషసేనులును నింకశకునులును లక్ష్మణకుమారుండు నలంబు సుద్వయమ్ము్మను లోనుగా గరకరులగు గట్టు పకాసులా యోధనమ్మున సుయోధనునకై తమతమ ప్రాణమ్ములు తృణప్రాయంబుగఁ జూచి దాచక విడుచునైన బిడికిలందు మనుచునున్న వారికీ బాండవ బలంబునగల దండిమగల వినుము 453

సీ. శ్రీరాము నంతటి శూరాగ్ర గణ్యుండు
హరికి బహిఃప్రాణమర్జునుండు
హనుమత్సమాన మానాతీత నాగాయు
తత్రాణుడల వృకోదరుడ దరుడు
మహి బుష్పవంతుల మాద్రి మాద్రేయులు
ద్రౌపదేయులు బలస్వాపతేయు
లనిదారి ద్రోణ భీష్మసువసుల్ద్యాచి
గాన దృష్టద్యుమ్నుడును శిఖండి
గీ. అనెడు ఘనమార్గచోరులు నపరపార్థు
లగుదురభిమన్యుసాత్యకులాఘటోత్క-
చుండురెండవ పంక్తి కంతుండునమ్మ
మనుచు బల్కెను బలరాముడపుడువినగ 454

క. సాత్యకి బార్థద్ర ధుడును
కృత్యజ్ఞుండైన దృష్టకేతుడు విరటు
డత్యంతాద్భుతి ద్రుపదుడు
బ్రత్యేకాక్షౌహిణులన్ బద్రంగొని రాగన్ 455

క. కెల్లగ గేకయు లట్టులె
మెల్లగ నక్షౌహిణీ సమేతుండయి రాఁ

జిల్లర మల్లర పనులుం
జల్లగ దాదాపు సప్తసంఖ్యకు నిండెన్ 456

శా. ఏడక్షౌహిణలయ్యె బార్థులకు నాల్గెచ్చుయ్యె లాతుల్ బరుల్
మోడంజేయుచు మేము మేమనుచు బల్మోర్వించి యేదెట్టులై
నీడం బోవక చంపుటొండె రిపుగాదేఁ జత్తు మొండె న్మఁటిం
కేడన్ మూడవ బాట లేదనుచు జీవేచ్ఛన్విడన్ సైన్యముల్ 457

క. క్రొత్తగ శల్యయవన భగ
దత్తులు భూరిశ్రవుడు సుదక్షిణ నీలుల్
కృత్తరిపుడు కృతవర్మయు
సత్తుగ విందానువింద సైంధవు లంతన్ 458

క. వీరొక్కొక యక్షౌహిణి
నూరెల నేతేర దోడు సూపిరి పెరవా
రీ రెండక్షౌహిణులన్
భోరునదుర్యోధనునికి బొడసూపుట యున్ 459

క. అదియిదియు బెరసి వెరసికి
నదనుగ బదునెనిమిదయ్యె నక్షౌహిణు లా
యదను బదనగుచు సరిపడ
బదునెనిమిది దినములకును భారతకలికిన్ 460

క. అరిదిగని రువాగులు నిటు
లరిగె గురక్షేత్రమునకు నాలముసేయన్
హరిహరి కరికరి గిరిగిరి
శరధి శరధి దాకునట్టి చందముగాగన్ 461

వ. సర్వసేనాధిపత్యమున కెవ్వరు వరులని యజాత శాత్రుండడిగిన విరాట ద్రుపదు లర్హులని మాద్రేయులును దృష్టద్యుమ్నుండు యోగ్యుడని ఫల్గునుండును జెప్పి 462

క. జిష్ణుని మతిముంగని శ్రీ
కృష్ణుండ భిషిక్తు జేసె దృష్టద్యుమ్నుం
జిష్ణుని సేనకు గుహువలె
జిష్ణునయోనిజుని సర్వసేనాపతిగాన్ 463

వ. మరియు నట్లె విరాటద్రుపద బారాసంధి దృష్టకేతు చేకితానయుయుధాన శిఖండుల ప్రత్యేకాక్షౌహిణీ నాయకులు జేయుదు నెదిరి బలంబున 464

క. దుర్యోధనుడును నతిగాం
భీర్యాంబుధి తనదు తాత భీష్మా చార్యున్
గార్యా కార్యజ్ఞుని ఘన
శౌర్యుని నభిషిక్తు జేసె సైన్యాధిపుగాన్ 465

వ. మరియు కృపద్రోణ ద్రౌణి కర్ణశల్య బాహ్లిక భూరి శ్రవ శ్రుతవర్మ శకుని కాంభోజ సైంధవుల బదునొకండ్ర యోధాను యోధుల నేకాదశాక్షౌహిణీ నాయకులుగ ప్రత్యేకంబభిషేకించెనందు. 466

చ. హరికృతికి న్మనుష్యకృతి కంతర వయ్యెచలాణులంతగా
హరినియమింప నొక్క ద్రుపదాత్మజుడేలెను బార్థుసేన సు
స్థిరుఁడయి యాజి సొంతమున ధీజథ నూర్గురు కర్ణ శల్యులున్
గరుపతి సైన్యనాధులయి కూలిరలంతి దినాల కొక్కరై 467

వ. అనవిని జనమేజయుండు తదనంతర భారత కధనానతిమ్మనుటయు 468

కమల విలసిత వృత్తము :

కమలనయన ధృత కనక సుచేలా
దమత దనుజదిత దనక కచేలా
విమల హృదయ ముని విదిత సుశీలా
సమదవర వరదనత శుకలోలా 469

వ. కురుక్షేత్రంబుననతి మాత్ర జయకాంక్షఁ బోరునక బోరున కాయితమ్మై తారసిల్లియున్న యవసరంబున నిరువారలకు మధ్యస్తుండె కురువృద్ధుండగు భీష్ముండు గురుబుద్ధిగ నాసుద్దిగైకొనుండు కొనుండ పారా నర్గళ జయభాగం బొండె వీరస్వర్గ భోగం బొండె నని శూరులెల్ల విననెలుంగెత్తి యిట్లనియె

క. వైకుంఠైకాదశికిని
బ్రాకట ఘనముక్తి యుత్తరద్వారమటుల్
చేకొన స్వర్గద్వారము
నీకినికిని దెరవఁబడియె నేడని కనియెన్ 471

చ. అదియదనుంచు నన్నుతమి నందఱ ముందర ధర్మరాజనెన్
మదిమది డిళ్ళపైఁ భరుతమల్లిన వారలు మళ్లుఁ డిళ్ళకున్
బెదరక ధార్త రాష్ట్ర పరివీడినముంగలియంగ నెవ్వరే
నెదఁదమిసేయుచున్నఁ బఱయెంచక రండిటఁ గాతువారలన్ 472

చ. ఇటుల యుధిష్ఠిరుండనిన నెంతయు వింతగ స్వాంతనమ్ము
దటుకునఁదాయి యుత్సుఁడొగిఁదత్పరి వారము వెంటరాగ నె
క్కటు విడనాఁడె యన్ననిఁగావలుఁ డంచెనె యెంచి చేరె న
క్కటు రిపుఁడైన ధర్మజునిఁ గారణమీతని ధర్మశీలమే 473

మ. అగుణుండైనజనున్సహోదరుఁడు హేయంబంచుఁబాయుంజుమి
సుగుణుండైన నమిత్రుపాలికి జనున్ శోధింప నీరెంటికిన్
దమదృష్టాంతములా విభీషణుఁడు భ్రాతన్ వీడి రామున్గనెన్
బగతున్మెచ్చి యయుత్సుఁడిప్డు విడియున్నం బార్థునింగూడుటల్ 474

వ. అట్టియెడ నిరువాగు దొరలత్తుకొని కత్తుకొని కత్తులార వెడలించి సత్తుగ నొడలు వెంచి చిందమ్ము లలర నొత్తి తోరంబుగ బోరఁదారసిల్లు తఱి ధర్మరాజు తేరు దిగున డిగ్గనుఱికి నిరాయుధకవచుండై వినీత వేషంబుతోఁ బాదచారియై పరసేన కభిముఖంబుగ నెగ నడచి పోవునెడ వివ్వత్సుఁడు లోనగు వారిది యేమి యచ్చెరు విట్టు లీరాజు వెఱ్ఱి యెత్తి విచ్చుకత్తులపై

కేగెననియఱ్ఱులెత్తి చూచుచుఁజిఱుండవఁ బోవు వారై వాసుదేవువలన శమనసుతగమన కారణంబు పూర్ణంబుగాఁ దెలిసికొని మన్నన నున్నచోటు విడువక తిన్నగ నతని నొకకంటఁగనిపెట్టి యుండి కనుఁగొను చుండ యుధిష్ఠిరుండరిసేన జొచ్చి భీష్మాచార్యునడుగు దమ్ములపైఁదమ్ములతోఁగూడ వ్రాలి తాతా యీ తరుణంబునఁ ద్యూత వినీతిని సమరంబునకు (సం) సమర నీతిదమగు నను జన్నవడయం దలంచి సన్నిధి కి బనివిన్న వాఁడతిగా ననిందార నామనోరథం బార గూర బండునట్లు ఘనభావన మీదీవన బెట్టి యనికి సెలవిండు అని సవినయంబుగాఁ బ్రార్థించిన నాతని వినీతికి బ్రీతుండై గాంగేయుండు నీవిప్పుడు నాపాలికి తోతెంచి మేలు సేసితి వట్లు రానినాఁడు నీకు నావలన మనస్తాప కరంబగు శాపంబు ప్రాపింపనై యందె నీయట్టి బుద్ధిమంతున కోరులచే జెప్పించుకొన వలసిన కొఱంత గోరంతయైన నే నీకు నామనఃపూర్వకంబుగా న నికి సెలవిచ్చితిఁగాన ముమ్మాటికిం జయముగొని ప్రాజ్యంబగు రాజ్యంబు సత్సామ్రాజ్యంబుగా పరిపాలించుము వత్సానావాక్కు మోయమ్ము కాఁబోదు నాయనా పోయి రమ్మని నోటియార మాటాడి వీడ్కొల్పిన నతండట్ల నవ్వేళ కృపద్రోణ శల్యులగని వారి దీవనలకైవడినే గైకొని తిరిగి యేగి యెప్పటియట్ల తన తన రథంబధిష్ఠించి యుద్ధ సన్నద్ధుండగుటయు 475

శా. గాంగేయుండు సుయోధను ధ్వజిని కేక చ్ఛత్రసేనానియై
సింగం బాకొని వేటి కూటవకు వాసిన్ దూకు చందంబుగాఁ
బొంగారన్ దినమొక్క రూపుగొనుచున్ బోకార్చి వీరావళిన్
బ్రుంగించెన్ బదివాసరంబులు దనున్ భూషింపఁగా జాపఱుల్ 476

క. భరముగ నిరుమొనలును ని
బ్బరముగ బవరమున కడర వసుదేవ సుతుల్
నరుఁ డిరుమొనలను గనుఁగొన
నరదము నడుమ నిడుమన్న హరియటు సేసెన్ 477

# భగవద్గీతా ప్రారంభము

కం. ఘనుడర్జును డిరువరులన్
గనులారగ రెప్పవేయక యరిది యరదం
బున నిల్చి పెలచ నందర
గనుగొని తన మనము నందు గరుణ గదురడున్ 478

ఉ. తాతల భ్రాతలన్ సుతులధన్యుల మాన్యుల నెల్ల బంధులన్
నీతి విఘాతినై గెడపి నెత్తురు కూడు భుజింపజాల నా
కీతరి చేత విల్లమరకెంతయు భ్రాంతిని యే వణంకెడిన్
జేతము భీతమయ్యెనని సేయగ లేనని జారె దేరిపై 479

చం. అదిగని సర్వలోకగురు డచ్యుతు డర్జును జూచి ఫల్గుణా
యిది తగునయ్య నీకు నతిహేయము ప్రాణము కంటె మానమే
మది ఘనమంచెఱుంగవె సమానులు మాన్యులు నవ్వ నెవ్వగన్
వదులుదురే కరస్థమకభి వాంచిత లాభము వెఱ్ఱివై యిటుల్ 480

చం. వినుమొకమాట సెప్పెదను వేయునికేటికి జావు వేరు జీ
వునికిని లేదు పుట్టువభవుండవినాశి నెవండు సంపు దే
వునికిని బాయనట్టి వరవున్ ఘను శాశ్వతు శేషభూతు నీ
యునికికి కారణంబు తనుయోగ వియోగము కర్మ చేనగున్ 481

చం. కనుమిహలోకమందు దనకర్మగతిన్ దనువున్గొను న్విడున్
మనుజుడు ప్రాతవల్వవిడి మారుపటంబు ధరించుకైవడిన్
తనువును వీడిగైకొనుట తప్పదు జీవునికెన్న ముక్తిదా
కనుగొనకన్ జగంబున నొకండతనిన్ గెడప న్సమర్థుడే 482

ఉ. ముక్తికి మార్గము న్వినుము ముఖ్యము రెండు విధంబు లంద్రు మ
ద్భక్తి యునుంబ్రపత్తియును భక్తికి జ్ఞానము సాధనమ్మగున్
శక్తికి సాంఖ్య కర్మములు సాధనమందురు జ్ఞానసిద్ధికా
సక్తిని గాన శ్రీహరికి సాగిలి కాళ్ళబడు బ్రపత్తియౌ 483

ఉ. భక్తి భజింత్రు మౌనులు నభంగుర శీఘ్ర తపః ప్రభావులై
శక్తులు గాన మానవుల శక్తులుగాన బ్రపత్తిఁజేసి త
ద్వ్యక్తిని సర్వదర్మములు దూరముగాగఁ బరిత్యజించి స
ద్వ్యక్తిని ముక్తినిమ్మనుచు నొక్కని నన్ శరణన్న గాచెదన్ 484

చ. విరివిగ బీష్మముఖ్య కురువీరులు వీరలు మున్నె సచ్చిరీ
వరయ నిమిత్తమాత్రమగు మందున బొందెదు కీర్తి పూర్తిగా
సరి యిటుచూడు మంచు హరిసర్వము గర్వము వాయజెప్పి యా
నరునకు విశ్వరూపముగనన్ ఘనదృష్టి ననుగ్రహించియున్ 485

చ. సకల జగంబు జంతులకు సత్త్వ రజస్తమముల్గుణంబు లా
ప్రకృతిన్ని గల్గి తంతువుల రంగు పటంబున కెట్టు లెక్కునో
ప్రకటము లాగుణంబులు ప్రపంచములోనికి వ్యాప్తమైనటుల్
కకవికగాక సాత్వికుడు కంచును మోక్షము నాదు సత్కృపన్ 486

చ. తనర చిరాకు లేక విని తత్వములా చిద చిత్తులీశ్వరుం
డన జని మూడు మూటికి లయంబును పుట్టువు కేడ చిత్తునం
దునగన సత్వమున్ రజమునుందమ ముండును చిత్తుతఁలోన
త్తును జొనిపించి కర్మగతితో సృజియింతు భరింతు ద్రుంచెదన్ 487

వ. మఱియు నింక దత్వత్రయు వివరంబు వినిచెద వినుమని హరి నరున కిట్లనియె. 488.

సీ. చిత్తన జీవుండచిత్తన బ్రకృతి యా
ప్రకృతి మహత్తుగా బరిణమించును
నది యహంకార మౌ నద్దాన మనసును
జ్ఞాన కర్మేంద్రియ సంజ్ఞ చేత
బది యింద్రియమ్ములు పంచమహాభూత
పంచ తన్మాత్రలు పరిఢవిల్లు
నిట్టులు ప్రకృతియౌ నిరువది నాల్గు త
త్వము లిర్వదేనవ తత్వమాత్మ

గీ. యిట్టి ప్రకృతి విశిష్టుడైనట్టి జీవు
డీశు శరణనివేడి రమేశుకృపను
ముక్తుడయ్యెడు నందాక పుట్టుగిట్టు
చుండు బద్ధుడనం జెల్లియుండు వత్స 489

వ. కావున జనన మరణమంబులు లేని జీవుని జంపు వాడెవండు జీవుండు తనకు శరీరంబుగ నున్న బ్రకృతిని దానుగ భావించి తాను గృశించితి దాఁబలిసితినని తనునుగా భావించి తన శరీరంబు తానగునా యదియు విపరీత జ్ఞానం బట్టి వచించి విపరీత జ్ఞానంబు నొందనేల ప్రకృతి సంశ్లేషంబు విడుచుట కించిత్కాల విశ్లేషంబుగాని జీవునకది మృతిగాదు అట్టి విశ్లేషం బొండొక శరీర ధారణాపాదకంబు గాని బద్ధుడగు జీవునికి ముక్తావస్థ పర్యంతము వేరొండుగాదు. అజ్ఞులు దాని మృతియందురుగాని వాస్తవముగా మృతిగాదట్లు మృతియను కొనుటచే జనుల ప్రార్థకు లనబరగుదురు గాన నీయవస్థయొండు శరీరముజ్జగించి వేరొండు శరీరంబుగాకొనుట ప్రతిపూరుషు నియతంబని తలంచుము మఱియు దేహాత్మ జ్ఞానమ్ము చేతనేగదా. భీష్మ ద్రోణాదుల యాతత దీప్త దేహమ్ములు సూచి తాతలు జ్ఞాతులనుచు వెఱ్ఱిగ దలంచితివి. ప్రకృతిలో నుండు జీవునికి నట్టి పెలఱ జీవునితో నెట్టి బాంధవ్య మెచ్చటినుండి మొలుచుకొని వచ్చె నీ భారతాజి నిపుడు సమకూడిన నీ వైరి వీరుల కెల్ల మృతియును శరీరాత్మ వియోగమ్మ దైవ యోగమ్మున గవ్వడి వడి నిత్తరమువ్వెత్తుంగా గానున్న పనియైయున్నది. గాన నది యింతకు మున్న యైయున్న పనిగా నెఱుంగు మర్జునా నీకిహపర సౌఖ్యమ్ములు పార్జితములయ్యె. నిన్నుంగడ తేర్చి ధన్యుంజేయు సంకల్పం బుగ నీకిన్ని యుపదేశించి యీ ప్రదేశంబున నీకలతయంతయు దీర్చి తేర్చితినని శ్రీహరినవ్యాజవత్సలత నానతిచ్చిన విప్పచ్చుండు ధన్యునైతినని తనుదా మెచ్చుకొనుచు దేవేంద్రాదులకు భావింపరాని దేవదేవ స్వస్వరూపంబు మనస్థాపంబు దీరగని కర్వుదీర గనుగొని పెన్నిది గనిన నిరుపేదవలె విడువజాలకప్పుడు 490

చ. విజయుడు సంస్తుతించిహరి వేయివిధంబుల వేదవాక్కులన్
నిజముగ దేరెనాకలతనిర్మలమయ్యె భవంబునీకృపన్

భజనయొనర్తు నన్నెపుడు పాలనసేయుము దేవదేవ నీ
నిజతనవీగి తొంటి మెయినింగునుమయ్య యటంచు మ్రొక్కినన్ 491

ఉ. శ్రీహరి యట్లసేయఁగ గిరీటిధరించి కరంబు నందులో
బాహర పోవగాండివము బాణము పోళిమ నస్త్రశస్త్రముల్
సాహసమూనె నర్జునుడు చయ్యన నేవురు వుట్టె నట్లుగా
నాహవభూమి తేరిపయి నాయితమాయను సంతసంబునన్ 492

ఉ. పార్థుని జన్మమెట్టిదో సుభాగ్యము యోగ్యము చెప్ప శక్యమే
సార్థకమే మహర్నిశము చచ్చుచు బుట్టుచు నుందు రెందరో
వ్యర్థముగాగ నెవ్వరికి నబ్బెను శ్రీహరి దివ్యరూపమున్
బార్థున కట్లు శౌరికృప భాగవతోత్తమ నామ మీమహిన్ 493

# యుద్ధ ప్రారంభము

సీ. తొలినాటికల నిల్వఁదొలితాకు బలితమై
కలితమై యిరువాగు చరితమగుడు
నరుడు భీష్మని వృకోదరుఁడు దుర్యోధను
సహదేవుడు సలూక శకునులగొని
నకులుండు చిత్రసేన కురురాట్సూతుల
ధృష్టద్యుమ్నుఁడు ద్రోణుసాత్యకియును
జొచ్చి భూరిశ్రవ స్సోమదత్తుల నభి
మన్యుండు నన్య లక్ష్మణ కుమారు.

గీ. అద్రౌణి యుపపాండవుల శల్యుధర్మరాజు
సురవరు నలబసు ఘటోత్కజుఁడు విరాటు
దుస్సేనుఁడు కర్ణుఁడునుద్రుపద నృపతిఁ
గెరవి కృతవర్మయును ధృష్టకేతుదాక 494

వ. ఇట్టు లింకంగల వెంకలు యమకింకరులవలె బలువీరులై మహోగభీరులై నగధీరు
గొంకక పొంకము దరుగక విరగబడి యొండొరులపై కరిగి వీరు వారనక

మొనలవారని కనక కనుగొనల దనుకదొనక చేతికి దొరికిన వారినెల్ల దలనఱికి వెనుక కుఱికి వేరొకనిఁ జీఱి కనవి వీఁకఁదాకి వితాకు పఱచుచు నేఱిని జీరికి దొనక పోరికి రమ్మని పిలచి నిలిచినవాని నిలువనీక నూకుచు బైకి బ్రాకుచు మైమఱువుల్లఱువుళ్ళొనర్చుచు దొనర్చుచు.

వైరిపై కురుకుచు లేత మాటలకు దిగి తరచుగ చేతు జెబ్బలవరకు దెగనఱకుచు గొంతులు గొఱుకుచు బ్రేవులు ప్రోవులు వడఁబెఱుకు చుఱగు నగు నగునుకు పరువు విడుచ గురువులు వారుచు దూరుచు జేరుచు తీరు నఱకుచు గద్దరి తనమున గద్దించి మర్తించుచు నర్దించుకుమని గద్దించుచు నిన్నిదె పెద్ద ిప్పుర చెందించకున్న నన్ను నీపేర బిల్వక మారుపేరుడుమని గట్టి పట్టుబట్టి యెట్టిడికొనుచు దన్ను నెవరో పట్టుకొన్నట్లు నిడువిడుమని బదరి యెదిరిఁ బెదరించుచుఁ బదాతుల ఁబదాహతుల నొండొగ దాహతుల నొండెహతులుఁగావించు నాస నాసబంటి రోసము రావించుచు స్వజితుని హతునిగా నెంచి మృతునిగ భావించి యావలికి బోవ నింతలోన నరితెప్పిరి నాయరి నీకురియుఁడనని వెనుకొని చని మెయిది కలిసికొని సికవట్టికొని యింతకు మున్ను నన్నేమంటివిరా రారా మఱలక మఱల గూయుము నీగాయము నీకాయము దప్పించునా? ముప్పు దప్పికొంటివేని యాయువు దప్పిన గాయమంతనుగ మేదియు లేదనట్టు లేదుకోవచ్చున నిన్నిదె గెడపెదనని పెదవి నుండి నుడి వెడలకయమున్నె వెడదయురమ్మున భరమ్మగు నీరసమున నారసిమ్ము జొనిపి జముపురి కనిపి తన్నుఁ దాఁరనిపి చనుచుండ నండనె మృతుని సుతుడెండె హితుడొండె నడపడి యేడబోయెద నీదుంబోక యీనాడ నిలుమని యడిదమ్మున బెడిదమ్ముగ వానింబొడిచి గడచి పోనీక గెడపియు నిట్లు బాధించి తనవాని పగసాధించియు నింతట మరియొకండు వచ్చి హెచ్చుగ బంతమ్ములకు జొచ్చి కుంతమ్మున గృచ్చిన బ్రతికృతి వీడునట్లె యొనర్చిన నిరువురు సొమ్మని మునింగి యనంగి యొండె నెలకండు తెప్పిరిల్లి చన మరి యొక్కండు కొనయూపరితో బడియుండ యొండె నిప్పటికి నాచే దప్పి పోదివిపో యింకొకసారి నాబారి కగ్గమయ్యెదవేని కయ్యంబున నీకయ్యెడి పాటు నీకు తలమున నీకుఁదలమును కలుగ గాగ దీయ యెరుంగ గల విప్పుడేమయ్యె నీవె కనియెదవు గాక యింతట నీవిక బొమ్మని పంతము

లాడి దెప్పుచుఁ దల ద్రిప్పుచు నొప్పి నొప్పుచు రొప్పుచు వేరొండుబో నొండొరుల మొదళ్ల నోళ్ల గిచ్చియు రాళ్ల గ్రచ్చియుఁ గురంగటు తురంగముల గముల గోలల గ్రోల్పుల లె నవలీల ఖండించుచు సాధుల నసాధలవలె నవలీల దుంట్రించియుం ద్రించుకోపము నాపలేక తాపమ్మునఁ బాపము దలంచక నింగినొరయు యేనుంగల యెనుంగుల ఁబీనుంగుల జేయుచు మావుతుల లావుతొలగించుచు స్యందనంబు లందంద బాణాగ్నికి నింధనమ్ములవలె దంధనమ్మొనరించుచు మొనక సురుగ నడిచి మొనక సురుసుటెనరించుచు జోదుల నాదమ్మునకుదింపి పాదమ్ముల కంట నఱికిన మఱుగాళ్ళు విఱిగిన నేలఁగూలు కీలుబొమ్మలవలె గగ్గొలుగ గూలఁగూలిఁకూలి నగుచుఁదను తగుననుచు నెగుచుచుఁబరవాని బట్టుకొని నేలబెట్టి కాలఁజమురుచు జముపురి కనుచుచు గరవాలవుునఁ గసుటువోనిమిరుచు నిట్టులా వరుసలా నరులూచకోతకోయ జేతులు మూతులు శిరంబులు కరంబులు చెక్కిళ్లు పొక్కిళ్లు కన్నులు వెన్నులు కాళ్ల వ్రేల్ల నోళ్ళు గోళ్ల పిఱుదులు బిరుదులు తునిసి తుందనకలై చిందర వందరగ జిద్రుపలై యదవదలై యవురు సవ్రై కళేబరంబులు రేబరంబుగ దురుంబునిడి భీరంబగు భీరంబుగ యధాయిదలైపడి భూతప్రేత పిశాచ శాకినీఢాకినీ కరాబోత్తాలాభీల భేతాళాదులకు సామెతగదగు మేతయ్యై యుండ వ్యోమ తలంబున వ్యోనయానంబుల దేవాధి దేవత లిట్టి దారుణ ప్రవిదారణము వావగ మరణమ్మునకు బిమ్మట నెన్నడు గనివిని యెఱుంగమని బెగ్గలంబగు నగ్గవికానగ్గించు చుండి రట్టి కన్నె కయ్యంబునందు 495

క. విరటుని కొమరుడు యుత్తరుఁ
డురువడి వడినురవడించి యొగిశల్యునిపై
ఖరతర తచ్చరహతిఁబడి
దురమున భూతాళికయ్యెఁ దొలి కబళముగన్ 496

చ. పగటుఁగ దూఁచఁదక్కొటను బార్థుఁడు భీష్ముడు మొగ్గ తగ్గలే
దొగి సరితూగి పోరి రొకరొక్కని మీఁద మహాస్త్ర జాలముల్

నిగుడుగ జేసి నిర్జరులు నింగిఁదముంగని సంస్తుతింపగాఁ
దెగిఁదెగి భీష్ముఁడర్జునుడు ద్రెంచెను ద్రెంచెను లేదులేదు నాన్ 497

ఉ. కచ్చె వహించి భీముఁడును గౌరవరాజును జేరి పోరఁగా
హెచ్చును జుచ్చు దానఁబడ కించిక సేపటుండ భీముడున్
నొచ్చి యొకింత తెప్పిరిలి నొంప భరంపు శరంబున న్రిపున్
జచ్చె సుయోధనుండనుచు సారధితేరు దొలంచె నాజికిన్ 498

కం. నకులుఁడు విరథుం జేయగ
సికముడి జీరాడ జిత్రసేనుడు వాఱెన్
శకుని యులూకుండటువలెఁ
గకవిక సహదేవుఁడడపగాఁ దొలగి రనిన్ 499

క. యుయుధానుఁడు భూరిశ్రవ
సుయుధార్చుటి నొంచె వానిసుతుతోడను ని
ర్భయముగ జంపె నలంబసు
మెయివెంచి ఘటోత్కచుండు మేదినియద్రువన్ 500

క. అభిమన్యుడు లక్ష్మణుని దు
రభిమానుని బట్టి పదుగురౌనా ననగా
సభయుఁడయి జనకువెనుకకు
నభయార్థము నరగ సురుగు నట్టులు మోదెన్ 501

గీ. ఎంతవాడు యుధిష్ఠిరుఁడెంత వాఁడ
నగజగంబని శల్యును నగవిరోధి
బలునివలె ధర్మజుఁడు పట్టి బలుశరముల
నొంప మూర్ఛిలి మృతునట్టులొరగె నతడు 502.

క. అంతట సారధి తెలివిని
వింతగ రధముం దొలంచ వేరణమునకున్
సంతసమున మద్రేశుఁడు
చింతనువిడు మనియె బ్రతుకు జీవుడ యనుచున్ 503

క. ద్రోణుడు దృష్టద్యుమ్నుడు
తూణంబులఁబఱిపి యొకరితోనొకరడరన్
ద్రోణఅంతకుఁడనగా ఁదగి
శోణిత దిగ్ధాంగు జేసె సోమకుడు గురున్ 504

చ. విరటుడు దుస్సేనుఁడును వేకొని తాకి పోరుచోఁ
గరటుల యట్లు బెబ్బులులకైవడి గారెను పోతులట్టులన్
మొరటుతనంబు జూపివెడమూర్ఛుడుగాగ విరాటుకేయ దు
ర్భరమయి దుస్సేనునికి ఁబారెను గాలికొలంది నాతఁడున్ 505

వ. అంతంబోక దుర్యోధనానుజుండు తనయను జన్మలు కుందఱెదురై తన్నుంగని యోయన్నా బెదరనేల నిట్టిచులక దనంబేల బేలగఁ జాలుగ నిటు వాఱినఁ బాఱపోఁతవని యన రోటుపోటరి మానిసి వగు నీవోటుగొని చేటు పాటెఱంగకసురింగెదవేల యెదిరి బెగడుగదుర బొదివి యదురంట బెదరగొట్టి చెదరనీక వీఁకదాతి నిదురింపఁజేయుమని బదరినఁ గుదురుకొని యెదిరి నదురంట బెదరించి చెదరగొట్టికాని మఱలనని మఱలదుస్సేనుఁడు కెరలి యరలిచని మత్స్యనాథునిఁ దాకి పెద్దయుంబ్రొద్దు తద్దయు బెనంగి 506

చ. విరటుడు దుస్సేనుడును వెన్కను తిన్కను బోరిపోరినని
బ్బరముగ వృద్ధుంజంపఁడెగఁ పాపినఁ దూపును దుస్సేనుఁడు
వ్విరటుడు వాని దప్పికొని వీరిడి నేబొలియింతు నంచు వే
శరమున నొంప వాడెపుడొ సచ్చిన యట్ల రథంబుపైఁబడెన్ 507

క. కృపుడున్ ద్రుపదుఁడుఁదల ఁపడి
కృపదొరగి పరస్పరంబు కెరలిశరములన్
నిపుణత నొప్పించుచు గడ
కపవాదులఁ బడక యభయు లరిగి రభయులై 508

క. ఉపపాండవులును ద్రౌణియు
నుపమింపఁ గ రానియట్టి యుద్ధతిఁగొని మా

నుప శక్యముగాని పగన్
గుపితిలు బ్రాణములు విసుకఁ గొట్టికొని రనిన్ 509

క. కృతవర్మ రిపుని దలపడి
శతవిధముల బోరి నిలువఁజాలక తుదకున్
మతిసెడి ధృతివిడి మృతికిం
గృతి తప్పంబాఱె ధృష్టకేతుని వేతన్ 510

క. ప్రథమ దినంబున జరిగిన
ప్రధనంబున గొలుపుగలిగె పాండుసుతులకున్
బ్రథమా వస ధీయస్య
ప్రథిత సుఖంతస్య సర్వ వర్త్మని తన్నాన్ 511

ఉ. శాంతనవుడార్యుఁడష్ట దివసమ్ములు పోరొనరించె లీలగా
స్వాంతము పాండవేయుల దెసం బనికౌరవు పట్లఁగాఁగ నా
చెంతను దేహదారకము సేయుచునుంటను బట్టి ధర్మమే
చెంతనొ యయ్యెడన్ జయము సిద్దమటంచు నెఱుంగు గావునన్ 512

చ. అదిగని కౌరవేశ్వరుఁడు యామిని హామిక భీష్మ పాలికిన్
బదిలముగాగ నేగి కడు చర్చనసేయుచు బల్కెఁద్రాత నీ
మది యిపుడంతయుం దెలిసె మాకడఁ బాండవపక్షపాతవై
యొదుగుచుఁ గట్టి గంటు పడకుండఁగ గాటెదు వారిసేనలన్ 513

ఉ. ఆర్చుగఁదీర్చుగర్తవని నిన్నిట నన్నిటనమ్మి తాత నేఁ
చేర్చి దురంబు నిట్లు తలపెట్టితిఁగాకరి మూకఁబట్టు పా
లార్చెడు వాఁడ వీదువని యక్కట నిక్కమొకింత తెల్పికో
నేర్చిన నేర్పు కర్ణువిడి నీకిట బట్టముఁ గట్టు వాఁడనే 514

ఉ. ఇంతకు నేమియైన సరియేయని నింతట మానుమయ్య యో
శాంతన వార్య పెద్దలకుఁ జాలఁగ నాలము దుస్తరమ్మగున్
జింత దొఱంగి యింటికడ జిహ్మకు రుచ్యముగా భుచించుచున్
దాంతి వతాంపు మాపయిని దయ్యమెఱింగెడు నాయవస్థలన్ 515

గీ. ఇట్లనంగ భీష్మునకు గోపమెత్తి పెలుచ
నెడలుఁ దాపక నీకయి యోపినంత
వట్టిటుల్బొట్లు పడు పెద్దవాని నన్ను
బిట్టుకొని, తూలనాట పాడి యొక్క 516

చ. ఇదియునుగాక పార్థుపయి నెత్తంగఁ బూనెడునాడ యా..నే
దనములోన నర్జునుని కట్టెదుటంబడి ముజ్జగంబులన్
బతికెడువాఁడు వీఁడనుచుఁ భార్థునితోననిసేయ నేన కా
దొదవఁగ రుద్రుఁడుందొడర నోపడటంచు సజాటు చెప్పనే 517

చ. పెడచెవిఁబెట్టు నానుడులు పేరిమి వేరమి లావుసేసి య
ప్పుడు కడుగ్రివ్వి నీదు తలపుండ్లను గర్ణుండు పూర్ణశక్తితోఁ
గడగు నంచు నమ్మియిటు కార్యము భ్రష్టమొనర్చి రేయిన
న్నుడుకుచు వచ్చి దూఱఁగనునోటిపుడేనియుఁ బూనుసంధికిన్ 518

మ. కనియంటువా వినుము కర్ణుని నీవల దుస్ససేను నా
దనున నీదు మామ నెలమింగొని ఫల్గునుఁడాంతి నాఁటు యా
గాంద మదేమి లెక్కయని జూదమునన్ గెలు మిప్పుడన్యులన్
నాదగు మున్ను నందిడు జనంబులఁగూర్చెదఁ జాప చుట్టగన్ 519

క. అయివచ్చును బయివచ్చును
నయ విదుడగు కృష్ణుమాట నమ్మి నడచినన్
బ్రియమగుఁ గాదె విన కది
జయమగునని కర్ణునమ్మి సాగితివనికిన్ 520

ఉ. మంచిదిరేపు చూతమని మంచిగ నాతని బంపి వేఁగుడున్
బెంచి యొడల్ను దీసుతుఁడు పేర్చి పదాతులపైకి నర్జును
న్మంచిన బాణవృష్టి హరి మోఱకుఁ జంపెద భీష్మునంచుఁగు
ప్పించి రథంబు దూకిచన భీష్ముడు రమ్మని పిల్చె నమ్రుడై 521

ఉ. కూడనె దూకి క్రీడి హరి కూడునె నన్నిటుచిన్న పుచ్చఁగా
నోడఁగ ముజ్జగంబునకు నూకున నీకితఁడేమిలెక్క- నా
తోడ నెవండు పోరు నని దోర్వ్యగ పుష్టినిఁ గృష్ణుఁబట్టి నా
తోడికిఁ బోకుమీ యని యదుప్రభు నొట్టిడి చిక్కఁబట్టినన్ 522

ఉ. ఈరస మాఱితేరి నొగ లెక్కుఁడుఁ గృష్ణుఁడుష్ణతల్
దీరక చేరి శాంతనవుఁ దీవ్రశరంబుల నొంచె నాతఁడున్
బేరిచిపోరి తొంటియల భీష్ముడుగాఁడనిపించెఁ బాండవుల్
గోరినఁదన్ను జంపుటకు గొండొక మందును జెప్పవారికిన్ 523

క. పదియవదివసమ్మున రవి
యుదయమ్మున లేచి భీష్ముఁడు రవడిసేసెన్
బదివేల భీష్మలొక పరి
నుదయించి రటంచుఁ జూప ఊహింపంగన్ 524

వ. అట్టులురువడించి భీష్ముండు వెడలుతఱినాతనికి నపశకునమ్ములను దెల్పు నపశకునమ్ములగతులు నశివశి వారు తమ్ములును వికృతకరి బృంహితమ్ములు నహితమ్ములగు హయ బాష్ప ద్వజపాతమ్ములు లోనుగాగల ననేక దుశ్శకునంబులు గానిపించిన నవి శాంతన వాగ్నికి శాంతికాల సూచకములుగ నుభయ బలంబుల యందెల్ల వారుల్లేకించి రట్టు గాంగేయుండ జేయుండగు పాండవేయ మధ్యముతో స్వజీవన సందిగ్ద మానసుండయ్యు నయ్యాది తలంపక నరుతోఁ దలంపడి దుర్భరమ్మగు దురమ్మునఁ బోరి యారుతఱి గుప్పున మండి పైకెగసి ముగిసి రూపుమాయు దీపంబుఁ బోలెఁ గోపంబొసంగి బాపం బొకనిముసం బేనాడు కయాపగా నందనుండు కుంతీ నందనుతో పోరు తీరుఁగని చూపఱులు నేఁడు దేవవ్రతుండొండె దేవరాజ సూనుండొండె నుండుఁగాని యిరువురు నుండ నసువు పడునాయని యనికొని నని కొన శిఖండిని మున్నిడుకొని కిరీటి తాటసిడెపుటన్నని నెన్నరాని శిఖిశిఖాసఖ విశిఖంబు లడరించి మహాస్త్రంబు లెన్నేనిఁ జిత్త విత్తుగఁ బఱపి తెఱపిఁ గని యత్తఱి నతని కుత్తుక నుత్తరింప నుత్తమాస్త్రం బరివోసి యేసి గాసి పఱిచిన

నాఁటి సాయహ్నంబున 525

ఉ. నేఁడయు భీష్మమయ్యె నవనీతల మట్ల యపార్థమొండె నా
నేఁడనిఁకిందటస్తపడు నిర్వీర ముట్టికటంచుఁ గ్రీడితాఁ
బోఁడిమి వాఁడి తూణ మరివోసి వడింగెగలాగి వీడినన్
వాడి శరమ్ముర మ్ము చొరఁబారిన యట్టులు గూలె భీష్ముడున్ 526

క. అది దక్షిణాయనమ్మని
యదితి సుతవ్రతుడు ముక్తి కనను గుణమునె
మ్మది నుత్తరాయణము దా
క దివంబున కేగ నన్న గాండీవి తోడన్ 527

క. సదయుఁడు మధ్యమ పాండవుఁ
డెద పెఱపెఱ లాడఁదాత యెడఁగుశలుండై
ప్రదరములఁ గట్టె శయ్యను
బదిలముగా భీష్ముఁడందుఁ బవళింపంగాన్ 528

ఉ. తాత తగన్ జలంబులను ద్రావగఁగోరినఁదక్కు పౌత్రకుల్
నూతుల కంతగోతులకు నుంజన నీరముతే నతండి సీ
క్ష్మాతలగాంబు ద్రావననఁగాఁ బెఱయిాఱక యుండి రస్త్రని
ష్ణాతుడు క్రీడితెచ్చెను రసాతలగంగ నిజాస్త్రశక్తిచేన్ 529

ఉ. శాంతనవుండు వద్దనని శాంతిని గౌరవ పాండవేయు లా
వంతయు వైర ముంచికొన కాయనఁ బాయని భక్తిఁ జేరగాఁ
జెంతకుఁబిల్చి రాజు పయిఁజేయుడి భీష్ముఁడు వత్స నీవు పా
లింతటనైనఁ బాండవుల కిచ్చి దురంబు దొఱంగు టొప్పదే 530

క. అని చెప్పినఁ గౌరవపతి
విని విన నూట్లరకుండె వృద్ధుని మాటల్
విన మనసురాక పోకడ
కును దను విధిలాగ మంచిగొనునే యెవడున్ 531

ఉ. అంతకు మున్ను శాంతనవుఁడాడిన వేడి నుడుల్గలంచఁగా
జింతిలి కర్ణుఁడాతఁజని చేయు దినమ్ములు పోరనంచుఁదా
నెంతప్రతిజ్ఞ సేసియు నదించుక యెంచక భీష్మ పాలికిన్
వంతను బోయి మ్రొక్కి యభివాదనముం దగజేసి యిట్లనెన్ 532

ఉ. సూతసుతుండఁ గర్ణుఁడను జూడుఁడు నన్నను విచ్చియున్న మున్
జేత నదీ తనూజుఁడతని న్స్పృశియించి మొగంబుఁదచ్ఛ్రుతిన్
బ్రీతిని దార్చి వత్సవిను నీయెడఁ గోపము లేదు నాకుఁ గుం
తీ తనయుండ వీవు గణితింపగఁ బ్రహ్మరహాశ్యమింతయున్ 533

ఉ. నీవును బాండవేయుఁడవ నిక్కమెఱింగితి వ్యాసమౌనిచే
హోవడి నేఁడన న్వలసి యంటి నిటొంటిని నీకు వారటుల్
ద్రోవకు వచ్చి సంధీపడలోఁబడ నీపడఁద్రోయకందు దన్
దోవరి నేమి నీయొడిఁబడు న్విడుమీ చెడుగంచుఁ దేల్చెదన్

క. అది నీకు బుద్ధి సెప్పుట
యది నమ్మను రద్దిసేయు టావంతయుఁ గా
దది నమ్మ నాదు పట్లను
మది నున్నను గలుష మెల్ల మఱవుము కర్ణా 535

వ. అని మఱియు గాంగేయుండు రాధేయుతో నిట్లనియె కట్టకడ కింకొకమాట
సెప్పెదఁ గింకవిడి కింకిరి పడక యప్పల్కు నీకొప్పైనఁ బరికింపుముతప్పైన
నొప్పరికింపుమని కర్ణుని చెవినుండి తనమొగంబు తివియ కపాయోపాయములు
పరిశీలించి పరిపాలింపు మని మెల్లగ సమీప చరులనెల్లఁ గనుసన్నల నెడగలుగఁ
బొండని యొక్కొక నెపంబున బలికి వెలుపలికి బోబుచ్చి పొచ్చములేని
మచ్చికను ధర్మపాధేయుండు రాధేయుని కిట్లనియె
536

క. నీదేమి పోయెఁ జెపుమా
వాదింపక కలియ వీరువారును జెలిమిన్
గాదన నేటికి నేఁటికిఁ
బోదుగఁ బాండవులకడకుఁ బొమ్మీవనుడున్ 537

క. కానీనుఁడిట్టులనె సరి
గా నీ నుడి నాడు మీఁదఁ గరుణను గాదే
కాన నుడివెద శ్రావ్యము
గా నీనుడికారమంత కాకయు పోనీ 538

గీ. ఇంతకాలము విడనాడి యిప్పుడేను
ఇంతకాలము విడనాడి యేగనన్ను
గానని కదర్యుఁడంచును ఘనులు నగరె
కాన నిఁకఁ బంపు దయనన్ను గలహమునకు 539

గీ. నన్ను దుర్యోధనుడు కడు నమ్మి నెమ్మి
వాసి తనయెత్తు మానిసిఁ జేసెఁ గాన
దానికి ప్రతిగా నాచేతనైన వఱకుఁ
బోరి సఖు ఋణమును దీర్చి పోవువాడ 540

వ. అదియునుంగాక మొదలనుండియు గురుపాండవులకు నడుమ మెదలకుండ నేనుండి యపారమగు వైరమ్ము లావు సేసితి నంతటనైన మిన్నకుండక మనమెఱియు మాటల వారల మనముల నప్పసమునొప్పించి కంటమూట గట్టికొంటి నంతియగాక కర్ణుని తల భారతమని సడిసన్న నాకిఁక బాండవులఁ గూడఁ బోయినను నను నీజన్మమ్మునందు నమ్మరు మఱియు నమ్మరు నయ్యె పాండవులకు దండగ నుండుట విజయున విజయమున కగునని స్వతసిద్ధమగు మాటయే గద యేగద మందులకుఁ బూఁట అదిమీ యెఱింగిన యదియకాన నెఱిఁగి యెఱింగి నన్నేల నలంచెదరు. తాతా చెదరని మనమ్మున నిన్నిఁక నన్ని కలసి పరునట్లుగఁ జెదఱఁ గొట్టక బదరక నీపావనమగు దీవన నిడి యాజికిఁబో నాకిఁక దయనాట ముమ్మాటికి సెలవిడుఁడని యంగాధిపుడు యేపాంగారఁ దాఁ బట్టిన పట్టు విడక తనకడక యంతయు గడకు విడజెప్పిన గంగానందనుండు విని పరమానంద భరితుండయి యోయిననందనా నీమనంబట్టిది యైన నట్లేకానిమ్ము కుమారా మాఱాడక మిత్ర కార్యమ్మునందు నిండు లక్ష్యముంచి సంతోషాబ్ధిముంచి వెనుదీయక కనుమూయక పెనఁగుచు గట్టియాసక్తితోఁ బగులని పట్టుదల వదలకుండ

మిత్రతేజ సంజాతుఁడవగు నీకిది తేజంబకాదెయని శాంతనవుండు సాంత్వన వచనంబుల వీడ్కొల్పి సనాతనికి రాధేయుండు మ్రొక్కి నెఱిఁగి గాంధారేయుని కడకరిగెదనని యరిగె తదనంతరంబు

54

# ద్రోణ పర్వము

శా. గంగాసూనుఁడు వడ్డద్రోణుఁడవలం గౌరవ్య సేనానియై
యంగాధీశుఁడు ఊనికిం గుడిభజంబై నిల్వవె(న్రొక్కి)-బల్
సింగం బాఁకొని మేకలం బొదువు పోల్కిం బాండవా నీకినుల్
బెంగం బంచదినంబు లాజి మొనరించెం దున్మి తూటాడుచున్ 542

ఉ. ఏర్పుచు పాండవేయుల జయించనుద్రోణుఁడు నేఁడొ రేపొ యం
చోర్చి యహర్నిశంబును సుయోధనుడుండగ వారిఁబట్టి పా
లార్చుచునున్న ద్రోణుఁగని యాయని నాయన ధార్తరాష్ట్రుడున్
మార్చి మనంబునుం గడుపుమంటను బట్టగ జాలకిట్లనెన్ 543

శా. భారద్వాజునితో సుయోధనుఁడు మీభారమ్ముగా నమ్మితిన్
పైరంబార నజాత శత్రు ననిలోఁబట్టింతు నాద్రోణుఁడే
యూరన్లేనిది పేరఁ బిల్చెదగునే నోర్వంగ లే నర్జునున్
వీరాగ్రేసరుఁడాతఁ డడ్డపడఁడే నేవఁబట్టుదు న్దర్మజున్ 544

వ. అట్లైె వల్లనంటివా చెప్పెదవిను. 545

చ. మొదలనె వీరసింహమ్మైలు పుట్టెను బార్థుడు దాన్కిఁ దోడుగాఁ
బదిలముగాఁగ పర్థితన పాశుపతంబును గట్టిపెట్టె బైఁ
జదలమునందు సారథిగ శౌరియుఁ గంటికి ఱెప్ప చందమై
పొదులుచు రేఁబవళ్ళుతనిఁ బ్రోచు నిఁకెవ్వడు పోరు వానితో 546

క. ఆమాట విని సుయోధనుఁ
డామాటకు కర్ణుఁడుండ నర్జునుబలమే
యామాట యదేమాటగ
వేమాఱును బట్టువోలె వినిచెదరేలా? 547

వ. అని మఱియును దుర్యోధనుండా చార్యుతో నిట్లనియె 548

ఉ. ఈవును భీష్ముడిందు వసియించియుఁ బాండవ పక్షపాతులై
కావలి కూననుంచెను పగండయి మెండయి కూటికుండకున్
దావునఁ జేరెనన్న నుడి తథ్యముసేసితి రారడింబడన్
నావుడుఁ గుంభ సంభవుఁడు నవ్వుచు నిట్లనె ధార్తరాష్ట్రతోన్ 549

ఉ. వింతగఁ జెప్పనేల మనవీటికిఁ బెట్టనికోట మేటియా
శాంతనవుండు యుద్ధ సువిశారదుఁడోడెను బార్థు చేత న
న్నింతట లేని వానిఁగనె యెంచుము భీష్మునితోడి పాటునన్
జింతల వంతలం బెలుచఁ జీకగనేటికి సంధికొప్పుమీ 550

ఉ. ఏటికి నీదుపాల వసియించితి పుక్కట దిక్కు మాలిమున్
నోటికి వచ్చినట్లు మము నొవ్వఁగ దూఱకు దూఱుటేగడున్
మూటను గట్టుకొందు వఘమున్ మఱి యేమియు గల్గ బోదుము
మ్మాటికి నింతటైనఁ గడుమంచిగ సంధి నొనర్పు బాలకా 551

చ. తరణి తనూజనమ్ముకొని దాయలకాయువు శ్రీయుయాసమున్
వరుసగ గోలుపోక వినువాసిగ సంధికిఁ బూను మింతటన్
ధరఁ బరుగెత్తి క్షీరములఁద్రాపుట కంటెను నీరమున్ దగన్
మఱలక త్రావుటెంతయును మంచి దటంచును నీ వెఱుంగవే 552

ఉ. ఇప్పుడు చాల యుద్ధమయి యేలయుధిష్ఠిరుఁడొప్పె సంధికిన్
దెప్పరమిప్పునిందలఁ పఁదేలదు పోలదనంగఁ బోకు నేఁ
జెప్పిన ధర్మరాజును విని సేయును భీముఁడు నన్నమాటకున్
దప్పుడు సవ్యసాచి జవదాటఁడు నాదగుమాటకుంగవల్
సెప్పరు మారుమాట నిరసింపక నీవు తథాస్తు నాఁదగున్ 553

శా. సంధింగైకొనుమంచు నీకు నిటువేసారు ల్విచారించి ని
ర్బంధంబైనను నొత్తిసెప్పు టెపుడుం బాల్మాలికా దాజికిన్
బందీభూతు లరాతులంగొని మెయింబ్రాణమ్ము లున్నంత దా
కంధీభూతులఁజేసి వైరుల నపాయంబందఁ జెండడాడుదున్ 554

ఉ. మానక సంధిసేయు మనుమాట వచింపక దేమి పాపమో
న్యూనముగాఁగ నీకుఁదలనొప్పియెసంగుఁ బరాన్న భుక్తిబల్
హీనము నీదుపాల వసియించిన తప్పునకై విడంబరా
ధీనతఁ బోరి నీఋణము దీర్చెదఁ దాపక ప్రాణమానముల్ 555

వ. అని ద్రోణాచార్యుఁడు దుర్యోధనునధిక్షేపంబునకుఁ దగు తెఱంగున సమాధానము సెప్పి పొట్టకూటికై యతని పాల వసించుటం బట్టిగదా యిప్పగిది నీతని దెప్పుపడవలసివచ్చె నైనఁ దదృణంబు నేతద్రణంబునఁ దీర్చెదనని కడంగి యొరులకు దురవగాహంబుగా చద్మ బాహుళ్యంబుగఁ బద్మవ్యూహంబు పన్నిఁ దన జనకుండు సంశప్తకులతోఁ బోరు చుండుటం బట్టి దర్మరాజు లోనగు పెదతండ్రి పినతండ్రులచే ప్రేరితుండై యభిమన్యుండు యుద్ధాభిమానుండై యిదె నే నీ వ్యూహంబు ప్రాంతదోమ తెఱచేతఁ జీఱినట్లు చించి జీరుకాడించెద నే తన్ని రూపకుఁడగు చాపగురు నిప్రొద్దత్రుంచి ధార్తరాష్ట్రులనందఱఁ దఱముడినొంచి సంపూర్ణ గర్వకర్ణు నఖర్వ గర్వంబు ఖర్వపఱిచి నాతండ్రు లేపురికి భావుకంబు ఘటింపశ్రమించి శ్రమంబున నివారణ సేసెద నవారణగతి రణగతిఁ దప్పక నాతోడఁ గూడరండని ధర్మరాజాదులకుఁ జెప్పి ప్రణతిపూర్వకంబుగా వారి వేర్వేఱ వీడ్కొని సరథుండై సంపూర్ణ మనోరథంబున మొగ్గరంబునకు డిగ్గిడిగ్గు పడగ్గఱి తళుక్కుమెఱుము మేఱసి నట్లెగసి యొఱసికొని పోవుచుఁ గసిమసంగి కవిసిబాహా బాహాటి నైనఁ గుజోదులు బాహిరపడి మోహటించ వ్యూహం బర్ధనిమేషంబున నవగాహించి నిప్పులేకయు దహించుచున్నవాఁడు వీఁడెవ్వండుకో యుని యర్జును మఱిపంచెడు నాతనికొమరుండు గావలయు నని కావలుల యోధాను యోధులందఱుఁ గను తెప్పవేయక దన్నుంగనుంగొను చుండ నెవ్వానినిం డగ్గఱకుఁ జేరనీక వీఁకనుడగ్గఱిన వానినెల్ల డిగ్గునఁ దలఁపడి పెడతలదీసి రణస్థలికి బలిదీసి విడుచుచుండు వీఁడిఁక నిమేషమాత్రంబు మనమోర్చిన మోహరమున మనవారినెల్ల మనతో మననీక శమనుప్రోలికి నతిదులుగఁ బంపకమానండు గావున న్యాయుద్ధంబుచే సాధ్యుండుగాఁడని యెంచి ద్రోణకర్ణ దుర్యోధన దుశ్శాసన సౌబలాద్యనేక యోధుల న్యాయంబున జయింపందలంచి రథహయధ్వజ సారథి జ్యాధనుర్మర్మ చర్మాది విచ్ఛిత్తికై వారుచెఱి యొకపని

సేసి విరథుంగావించినఁ దన్ను విరథుంగావించిన గురు కృపకృతవర్మాశ్వత్థామ
కర్ణ శల్య దుర్యోధనాధు లందఱు కన్ని రూపులై యందఱ నర్ధముహూర్త
మాత్రంబున విరథులం గావించుటయకాక విగత ధర్ములను విహతమర్ములను
విస్రుతాస్త్రులను విగళితా శ్రులను బలాయితులను బరాఘాతులను గావించి
లేడుల గుంపు నింపుగఁ దరుము తోడేలని యందఱు తేలమొగంబు వేసి
యిది యెక్కడి పిల్లల పిడుగోయని యచ్చెరువంది తోక చిచ్చని చూపఱులు
మెచ్చి కొనుచుండఁ గంట గనఁబడ్డ వాని నెల్ల మంట గల్పుచు నిండు
కమలాకరంబు జొచ్చి విచ్చలవిడి వడివడి వడిఁజేకాక పఱచు గంధ సింధురంబు
చందంబున నుండ నాతనికిఁ దోడుపడఁ గూడఁ బోవు యుధిష్ఠిరాది పాండ
వ చతుష్టయంబునకు రుద్రవర మహిమ నారణ మహాసైంధవు డడ్డపడి పోనీక
పెను వీఁక నాపిన నప్పుడొంటి యట్ల బలుదంట వాసవ పౌత్రుండనిసేయ
నన్యాయంబుగాఁ బలువురు దలపడి తన్ను గాలు సే యాడనీక పెనంగినను
నణంగక పెనంగి కడు డస్సియుండ దుశ్శాసని తలపడిన నతనితో బాహాబాహి
పెనంగి

556

మ. తగ సౌభద్రుడు మించి మించువలెఁ బద్మ వ్యూహముంజొచ్చి మ
త్తగజం బొక్క తటాకమందు దిగి పద్మవ్రాతముంద్రొంచు రీ
తిగ దుర్యోధను పుత్రులందు నిమిబ్రాంతిజేతి తీటారఁగాఁ
దిగ యక్షౌహిణులార్చి యొక్కఁడనిలోఁద్రెళ్ళెం బదుంద్రొంచగన్ 557

ఉ. పుత్రుని పోక కర్జునుఁడు ఘోరన యేడ్చి తదార్తి కారకున్
శత్రుని సైంధవుంగదిసి సర్వజనంబులుఁ జూడ నెల్లియే
గోత్ర మడంగఁ గూల్తు రవిగుంకకమున్నని యొట్టు పెట్టి త
న్మిత్రము కృష్ణు సత్కృపను మించి వధించె సంబంధుసైంధవున్ 558

శా. నాఁడాఁక్రీడికిఁ గోప మెత్తిన తఱింగన్నెత్తి ఫాలాక్షుఁడుం
జూడంజాలనె ద్రోణ కర్ణ కృపరాజుల్ ద్రౌణి శాల్యాదులం
దేఁడే నడ్డము సొచ్చెనే తనదు ప్రాణేచ్ఛన్వడిం బాఱెఁగా
దే డక్షౌహిణులూఁచ కోతను సతాయింపన్నుండెతానొక్కఁడున్ 559

చ. ప్రచురము సేసి యొండునిశి భండన మంచు సుయోధనుండురా
త్రి చరుల నూలుకొల్పె హరిదీటుగ నాటుడూ నాఁటిరే ఘటో
త్కచునాతఁ డొంచి రక్కసులఁ గర్ణునిఁ దల్పడి పుట్టిముంచఁగాఁ
బ్రచలితుడై కొనె న్విజయు ప్రాణముకై యిడికొన్న శక్తినిన్ 560

ఉ. ఉవ్వున భైమియంతఁ జెలరేఁగి చివాలునఁ గర్ణుమీదికిన్
నవ్వుచుఁదాకి సారథిని నాలుగుమావులఁ జంపి తెంపునన్
గెవ్వున నార్చి కర్ణనినుగీ టడగించెదఁ జూడు మిపుడే
దవ్వుల గొంచుపోయి యొకతావునె మింగెదఁ దేరితో ననన్ 561

క. అని వినువీధికి నాతఁడు
పనివడి వడినెగసి పగఱపైఁ బడి వారిన్
మునుమిడి మూఁడక్షౌహిణు
లను జంపెను సురల సురలు లావుగఁ బొగడన్ 562

వ. అంత ఘటోత్కచుఁడు కర్ణునిపైఁ గన్నికి తేరితోఁ గూడ నీసారి యీ సూర్యసూనునెగనెత్తికొనిపోయెదనని వినువీధికెగసి భూమికి దిగివచ్చుచుండ సమీపవర్తులు నివ్వెఱగంది కుంది కర్ణున కిట్లనిరి
563

చ. విడువిడుశక్తి గర్ణ వినువీధి ఘటోత్కచు డేగుదెంచెడిన్
దడయక నిన్నుజంపు నటదాఁచిన నేమి ఫలంబు గల్గు ము
న్నడి నిటఁజావుదప్పినను నాఁటికి దైవమొకండు గల్గదే
గడువగఁ బెట్టు కస్త్రియన కర్ణుఁడు భైమిని ద్రుంచె శక్తిచేన్ 564

వ. ఇట్లింద్ర దత్తాస్త్ర ఘంటాశక్తి భైమిపయి న్విడువంబడి వానితోన పమ్మగుట నర్జును బ్రతికింపఁ గంటి నని మురారి నరాదుల ఘటోత్కచ మృతికృత చింతనుడిపి స్వాంతమ్మున నెంతయు సంతసించె నని సంజయుఁడు ధృతరాష్ట్రునకుం జెప్పిన నయ్యంధ నృపతి సంజయున కిట్లనియె.
565

చ. కొనుమని ఇంద్రుని స్సహజ కుండలవర్మము లిచ్చిపుచ్చుచోఁ
దనయమను రక్షసేయునని తానటు గొన్న యమోఘశక్తినిన్

బనివడి కృష్ణులందొకనిపై విడకేటికి వీడె భైమిపై
వెనుకొను బెబ్బులిన్వదలి వీడె శతఘ్నిని గొత్తెపిల్లపై 566

వ. అనుడు సూతుండు ధృతరాష్ట్రున కిట్లనియె 567

చ. అనుదినము న్నివేశనమునందు నవేయనుకొందు మింక రే
పనువుగ శక్తిఁబార్థుపయి నాదినె వీడక తప్పు మంచునాన్
వెనుకను నిద్రబోదు యట వేఁగిన చోట నదేమి చోద్యమో
చనుతఱిఁ బోరి కెవ్వరికి శక్తినిఁ గూఱిచి యాదిరాదనిన్ 568

చ. గొనకొని శక్తి మాటనిశి గొంగుననమ్మడివేసి గట్టిగాఁ
బెనకువ కీము పోదుమట విస్మృతి గల్గి దినాంతవేళఁదాఁ
కనుస్మృతిరాద యేరికిని గవ్వడి చెక్కు చెమర్పకుండఁ బో
నునుదిన మిట్ల యేగె నరునాయువు కల్మినో దైవమాయనో 569

వ. సంజయుమాటవిని యంధనృపునకేమియు నన నోరాడక యురకుండెఁ
దదనంతరంబ దతనంతర యుద్ధం బిట్లు జరిగె నెట్లనిన
570

చ. విరటుని వారు సోమకులు వీకను ద్రోణునిఁ దాకి పోర గ్రా
వ్విరటుని వృత్తి సేసెదను వీరల నంచు గురుండు నుగ్రుడై
వీరటుని వానితో ద్రుపదు వ్రేటున కొక్కనిగాగ జంప న
వ్విరటుని టుంగలట్టి ఘన వీరులు ద్రోణునిచేత కాతరిన్ 571

శా. విశ్వాసంబున ద్రోణుడాత్మ వధకున్ వీలాప్పితాఁ జెప్పగా
విశ్వాత్ముండగు శౌరి బొంకుమనగా భీముండు గోజాడఁగా
నశ్వత్థామ యడంగె నంచెలుగు రాయన్ జెప్పి యాచార్యుతో
చశ్వత్రప్రఖ్యుడు వెన్క గుంజరమనెన్ చెల్వారిలో గొణ్గుచున్ 572

గీ. ధర్మరాజు మాట తథ్యంబు బట్టి కొం
చశ్త్రములను ద్రోణుఁడ సుల తోడఁ
దొఱగెఁ దేరిపైకిఁ దూకి ధృష్టద్యుమ్ను
డతని శిరముఁ గోడి యవనిఁ ద్రోఁచె 573

క. ఆపని కోపక తోడనె
యాపని కోపంబు తోడననెఁ బార్థుఁడు బల్
పాపము పొఁసగును గురుకుల
నాపకన మొగము నుగ్గనంద గనియెన్ 574

ఉ. ఆపని వల్దు వల్దనుచు నావల నార్చుచు ధర్మరాజనన్
జాప గురుండు ఫాల్గునుని జంపె నధర్మపుటాజి బాలునిన్
బాపండు గాఁడు వీడు కృతపాపుడు పాపము దల్పవచ్చునే
కోపము నాఁపలేక యటుగోసితి ద్రోణుని శీర్ష మీర్ష్యతోన్ 575

చ. అని మఱి సోమకుండరిగి యర్జునుతోఁ దన తప్పుఁదానె వం
డునుగనఁబోనె నిన్ను నెవండు న్వడినెంచమిఁ గాదె యిట్లుమొ
న్నను మన సాత్యకిం గలితనంబునఁ జంపను రమ్ము నెక్కి యె
త్తిన యలసీమ దత్తి చెయిఁ ద్రెంచితి వీవది విస్మరించితే 576

వ. అనుటయుఁ గ్రవ్వడికి శిష్యుండు యుయుధానుండు దాని కోర్వం జాలక మండిపడి

577

చ. అకుటిలుఁడైన సాత్యకి మహాగ్రహుఁడై యఱకాలి మంట నె
త్తికి నెగఁదట్టి సోమకుఁడ! దెప్పెడు వాఁడనె నీవుమమ్ము నో
పిక విను గ్రుడ్డు వచ్చి యొక పిల్లను చెల్లున వెక్కిరించి న
ట్లకట దురాగ్రహంబునను నాడిన గోయుద్దు నీదునాలుకన్ 578

వ. అనుటయు 579

క. ధృష్టద్యుమ్నుండును నో
భ్రష్టుండని యేల యిటు లడిసి పాటులు నీకుం
గష్టము కాలము సేకుటె
దుష్టుండ యిఁకఁ జక్కనగుము ద్రుంచెదనిన్నున్ 580

వ. అని యిట్లు సాత్యకి దృష్టద్యుమ్నులుభయు లభయులై యకాలపుఁ గా తాళము

లెత్తి మదించెదరు గదుర మీగన్నుల నిప్పు కలురుల నొండొరుల నెదిరి యకారణ మారణమ్మొనరించకొన బెడిదమ్ముగా నడిదమ్ములఁ చిలకడ లెడలించి తలలు తెగనటికి కొన నుటికి తాఁక నూఁకించుతఱి వారల నిరువుర శ్రీకృష్ణ వృకోదరులు చెఱియొకరిని గౌఁగిటఁ గుదియ నెట్టిగుదియబట్టి పట్టుదలతోఁ దలతోక లేని యీపని యేమిటియని యదురంటఁ గదరికొని బదరులఁ బదరుచుఁ జెదరనీక కుదురుకొన నిలువరించిపట్టి యదరు పాటు ముదురునక నీకిది తగదు నీకిది తగదని వారిని వారించిన వారు తద్భుజాంత రాళంబున వల్మీకంబు నుండి వెడలను సులీక బుసకొట్టుచు దిరుగుండ్లఁ బడి తిరుగు కోడె సెలప్రాచుల వడువున వడిసుడివడుచుఁ గొంత వడికి వారి సాంత్వ వచనమ్ములఁ దెప్పిటిల్లి యుల్లోలకల్లోల వ గనుప్ప తిల్లి నంతఃకల్లోలములఁ దొఱంగి యా దొరలుదాదర తరంగి తాంతరంగులై కెలఁకులఁ దమ్ముఁ గని యిది యెట్టి మగపాఁడి యని నగువారలఁ దగు కార్య భారనిర్వాహకులఁ గని యీపనికేల దిగితి మని లజ్జించి యది వర్జించి సరగ సురఁగ నెఱుంగ నట్టు లెవరిదారిన వారరిగిరి వారరిగిరి భీరులుగాన బలుగాకుల వలెఁ బలుపోకలకుఁ బోక యేకతమ యేకతమంబునఁ బడి మడియక తమ తమ పనుల మీదికి దామెఱుగ నట్లరిగిరి దామోదర వృకోదరులును మేదురమోద రసంబులు సరసంబులందిరి, తదనంతరంబ

581

లయగ్రాహి:

దీప్త బలుఁడై దెసలనాప్తులు సెలంగఁగన
నాప్తులను భీముఁడవలుప్త గతిహస్త
ప్రాప్త ధృతరాష్ట్ర జాలదృప్తులను నూఱ్ఱురను
సప్త దశకోటి రథ సప్తి గజపత్తి
వ్యాప్తమగు సేనఁగని గుప్తగతిఁ జంపెఁగద
కాప్తతమ పర్వముగ శప్తులటుగా సం
శప్తకుల శూరుల సమాప్తి నొనరించెను బ్ర
క్లప్త శతకోటి సితసప్తి యొక చేతన్ 582

కర్ణపర్వకథ

ఉ. చాపగురుండు చెల్లుడును సైన్యపతిత్వము కర్ణునందిడన్
చాపఁగూడూద్యహుండు రవిజాతుండు గైకొని మూడుప్రొద్దులున్
జాపగుణంబు లొక్కని మునంబెడలేక నటింపజేత స
చ్చాప గురు ప్రసూహరి వృషక్షితి శల్యుల పాల్పడం దెగెన్ 583

వ. అందులఁ బూర్వోత్తరంబు వివరించెద వినుమని యిట్లని చెప్పదొణంగె 584

దశపాది

ఉ. కదిసి యహర్ముఖంబునను గర్ణుఁడు సాధనసేయఁ దూపులన్
మొదవొకటడ్డమై తెగిన భూసురుఁడుం బడఁదిట్టెఁ గర్ణుభూ
మి దిగఁబడ రథారి యనిమిత్తముగా నని మిత్తిగాఁడటం
చదర శపించె భార్గవుఁడు నస్త్రము వేళకుఁ దోపకుండగా
నొదిగి కులంబు దాచి తన యొద్ద న జాస్త్రము సంగ్రహించుటన్ 585

ఉ. కదియగఁ గ్రీడి కంఠమునకై గుఱివెట్టిన పాఁపతూపువో
నదిమె రథంబు శౌరి దివి జాధ్యులుడు కంకతకుండలాలొనెన్
మదినిఁగలంచె మద్రపతి మాటలు నాటఁగ నాడి కుంతికిన్
మొదల నిడె న్వరం బతఁడు మూఁడె ...పన్నియుఁగర్ణుహానికై 586

వ. శల్య సారథ్యంబు కర్ణున కెప్పగిదిఁ గలిగెనో తన్మూలంబు వినుమేయని
యిట్లని వినిపించె 587

క. నరు సారథ్యంబునకు ను
హరి కుదిరెను గనుకఁ దనకు నట్టిఁడు లేమిన్
తరణి తనూజుఁ డెడరు గ
గురు ధరణీపతికిఁ దనదు కోరిక దెల్పెన్ 588

ఉ. మనరథంబు దోలు యదునందను చందము సూతుఁడున్ననే
నరు నరుదంద గొల్వనొకొ నాలిని రాజెన శల్యుతోడనో

నరు నరునేరునుంగొను మనంగనె శల్యుని c గర్ణుడొప్పి కో
నరు నరులోగుబాగు విధి నాచికొనం బెడదారిc ద్రొక్కినన్ 589

వ. యాదవేంద్రుతోc దా సముcడని మత్సరించు వాcడుగానమద్ర నాథుండు శ్రీకృష్ణుకంటె హెచ్చువాడుగాని లొచ్చు వాcడుగాcడు తనకు సారథ్యంబునకు వేఱొక్కcడు తగcడని కర్ణుండా మద్రేశు దనకు నను ాల సారథిగా ననుకొనిచేకొన సమ్మేతించె నంత దుర్యోధనుండు శల్యుకడకుం బాదచారియై చని వినీతగతి నిట్లనియె

590

మ. వనుcడీ కర్ణుని సూతకృత్యమునకున్ వేఱెవ్వరుం జాలర
ర్జున సారథ్యము c గృష్ణునట్లు తగమీరు న్వారితో పాటు జే
కొనుcడంచు న్నుతి యింపc గర్ణుడలరంగొంకేగి శల్యుండు క
ర్ణుని తేరెక్కియనంతరంబ తొడcగె న్నోనాడcగాc గర్ణునిన్ 591

మ. తనకు న్సారథిగాcగ శల్యుcగొని రాధాసూతి తేరెక్కినం
తన కొండాడుచు వేయినోళ్ళ నరు మద్రక్ష్మాధిపుండొక్కటొ
పనిగా నోటికి వచ్చి నట్లినజు లోపాలన్నియుం జూపి య
ర్జునుతో నీవటెతాcకు వాcడ వనిలో రుద్రుండు సాలండు నాన్ 592

వ. అంత నిలువక యింక మఱి శల్యుండు శల్యకృత కర్ణ వంచనము 593

మ. కని ఖద్యోతను జ్యోతిరింగణము దాcకం జాలునే కాకి హం
సను దాcబోలునె యంచు c గర్ణుమది పెల్చుందాcగలచంగ నె
ట్టును దారింజను బ్రహ్మహత్యcగొని బొట్టుంగాటుకం బెట్టి యిం
దనుక న్నమ్మని పిల్చినట్లితని సూత త్వార్థముం బిల్చితిన్ 594

మ. క్రమలభ్యుండగు సారథిం బడసి పోరంబోక నేనేల గొం
తెమ కోర్కుల్గొని శల్యుమద్రపతినేcదెమ్మంటి నాతండు దె
ప్ప మదింజింత స్వయంకృతాపకృతికిం బాటిల్లె నెట్లుగ్ర కో
పి మఱల్తుం బెడదారి ద్రొక్కు విధిc దప్పింపంగ నెవ్వాcడిలన్ 595

వ. అని రాధేయుండు మదిలోనింక నిట్లని చింతించె చనుచున్నం

జనఁడీతఁడిప్పుడపు డాసం బిల్చి నీవిపుడొప్పనగం బోయెడు వాఁడనే
చెవులుతప్పంగుట్టిరే నా కటంచును మున్మాటికిఁ జాలుఁజాలు నని పించు
న్మాటలన్మాటికంచును మద్రేశుఁడు మ్రింగరాని కడియంచుం గర్ణుఁడుఱ్ఱాడు
చున్

596

వ. అంతగొంతవడి చింతించి కొంతవడి తఱిగియు నెఱుంగని యట్లు
మఱుఁకువ మఱుఁగు పఱిచి తఱుచు సైనికుల కేకలు బొబ్బలతోఁ జూపఱు
వెఱగు పడ వెడలి

597

శా. రాధేయుండును గ్రీడితోఁ దొడరి పోరం బోరు ప్రాణాంతమై
బాధంజెందిన రేయులన్నిలువ నెప్పాటం గరం బాడమిన్
సాధింతు న్నరు నంచు సర్పశరమున్సంధించి చాపంబునన్
బ్రాధన్యంబుగఁ గ్రీడి కంఠమునకుం బట్టించి దట్టింపుచోన్ 598

ఉ. శల్యుఁడు సూచి కర్ణగుఱి జాఱెను గ్రిందికిఁ దేమి యర్థికిన్
దుల్యముగా నమర్పు మనఁదూపును లేపెను బేకతండు చాం
చల్యమతి న్యయాద్వహుఁడు స్యందనముం దనకాల నొత్తినన్
స్థౌల్యదశ న్నడంగుళము ధారుణిఁగ్రుంగెను దేరుభోరునన్ 599

గీ. పాము తూపుడుల్చి పార్థు కిరీటమ్ము
ఖాండవమ్ము నాఁటి కసిని వెసను
దిరిగి క్రీడిపైకిఁ దెరిలిన శ్రీహరి
కఱప నరుఁడు దానిఁ గత్తి నఱికె 600

ఉ. పించఁగ దుస్ససేనునని భీముఁడు దాఁబడవైచి భూమిపై
మించఁగఁ గూరుచుండి మెడమీఁద దురాత్ముఁడ నాదు ద్రోవదిన్
వంచన నీవువల్వ లొలువంజని కూసిన కూతలెల్లఁ గ్ర
క్కించెద నిపుడంచు నఱికెన్ ఛురికం వాని కంఠమ్మునున్ 601

చ. హఠమున దుస్ససేను దెగటారిచి యక్కును వ్రక్కలించి నె
త్తుట నటఁ దోగి త్రాగి యొక దోసెడు రక్తము జల్లికొంచుఁబై

నట దలయూచి లేచి గదనాని భుజాస్థలి నాప్రతిజ్ఞలం
దిటు లొకదాని దీర్చితి నిఁ కేగెద రెండవదాని దీర్పగన్ 602

క. ఆమాటవిని సుయోధనుఁ
డామాటకు భీముఁడింక నాగఁడనుచు నం
దేమన నోరాడక తనవేములు
నేమఱకుఁడనుచు వేఁడె బలియురన్ 603

క. మూడవ దినమున నాయువు
మూడవగం గర్ణుఁడడరె మొగి రధ చక్ర
మ్మూడవడి నతని ప్రాణ
మ్మూడువ నరుఁడా శుగమ్ము నొగి నరివోసెన్ 604

ఉ. ఆశర మాశరారు ఫణియైరసఁ గౌరవరాజ్యలక్ష్మిఁ గీ
నాశరసజ్జనా వెడలి నాల్కలు గోడుచుఁ నాటునంది త
న్నా శరతి న్వడిం తరణి నందను నందుచుఁ బ్రాణవాయుల
న్నా శరయానఁ గ్రోలునతఁడబ్బిన హర్షతి యట్లనిం బడెన్ 605

వ. అంత బార్థుపై సురులు, సుమవర్షంబు గురిసె రిరు వాగుల వారతని కడిమి
కచ్చెరువందుచు వందులవలెఁ గొనియాడుచు శిబిరమ్ములకుఁ జనిరి
తదనంతరంబ

606

శా. అంగాధీశుఁడు వర్ధనాఁడు కురుదేశాధీశుఁడత్యంతమున్
భంగంబందితినంచుఁ బర్ధవెత చెప్పందీఱ దావంతయున్
గంగాసూనుఁడు సైంధవుండు సుతుఁడు స్వభ్రాత దుశ్శాసనుం
డుం గోదండ గురుండునుం బడిన నాఁడుంజెందఁడాదుఃఖమున్ 607

శల్యపర కథ

ఉ. కర్ణుడు వర్ధనాటికిని గౌరవసేనయు పల్చవల్చనై
పూర్ణనదీ ప్రవాహజల పూరము వేసవి దీసి పోయిని

ర్ఘూర్ణతఁ జిల్పచిల్పగను గుంటల నిల్చిన నీరుతీరునన్
శీర్ణముగాఁగ శల్యుఁగురు సేనకుఁ బట్టము గట్టె రాజొగిన్ 608

ఉ. బట్టముఁ గట్టఁబోవుతఱిఁ బట్టికృపుండును ద్రౌణి రాజుతో
బెట్టని కోటలీమొనకు భీష్ముఁడు ద్రోణుఁడు నర్క సూనుఁడున్
బట్టుగలట్టి పోటరులు బల్వురు సెల్లిరి యింక ఁబోరుదే
యుట్టికి నాల్గు చేర్లుదెగియుం గలహించిన నవ్వరే జనుల్ 609

ఉ. వాటముగాఁగ మమ్ముల నవధ్యులుగాఁగొని పోరఁబోకు మీ
వేటికి మేటి పోటరులు భీష్ముఁడు ద్రోణుడు స్వైరపంచతుల్
వ్రేటున కొక్కరై తెగిరి వీరుడు పార్థునకేము లెక్కయే
నోటను మీటఁడే మములఁగూడను గూడిమిఁకైనఁబార్థులన్ 610

ఉ. తేటగఁ జెప్పినారమని తీరని పోరఁగ బద్ధకించి కా
దోటమి గాదు నీపయిన నుండిన మేలని యంటిమన్న రా
జేటికి లేయి యింతవఱ కిట్లయి యిపుడు లొంగఁబోదునే
రోట శిరంబు దూర్చి పయి రోకటి పోటున కేల భీతిలన్ 611

చ. అని యట్లు శల్యునింగొని కృపాదులఁ దోడ్కొని రాజరాజు తా
నని కరిగెన్ జయంబుఁగొను నాసను దుర్దశ నయ్య వస్తలో
నొనరఁగ రావణుండును సుయోధనుఁడిర్వురు కట్టు మూర్ఖులం
దును బెడమూర్ఖుఁడందురు కనుంగొన నేరమి నంధరాట్సుతున్ 612

చ. రణమున కట్లువచ్చు ధృతరాష్ట్రతనూభవ వర్యుఁబాండవుల్
గనుఁగొని విస్మయంబొదవగాఁ బొదువంగను దాముదాయపై
కనువుగఁ దాఁకి రత్తఱిని యాదవనాథుని పంపు పెంపునన్
బెనఁకువకు న్యుధిష్ఠిరుఁడు పిల్చెను శల్యుని దన్ను దాఁకఁగన్ 613

వ. నిరుపద్రవంబుగా నావలికిం బోవు మద్ర నాథుండుమేనల్లుని పిల్చునకున్నిద్ర నేత్రుండై కన్నుదెఱచి కనుంగొని రెండవ దండధరుండును బోలె దండధర నందనుపైకిఁ దరలి చెలియలి కట్టఁ బొరలివచ్చు సముద్రుండనందగినమద్రేసు

సముద్రునుంగాంచి ధర్మరాజు మర్మంబులుగాఁడనాడుచు నిట్లనయె

614

చ. మనమొక చెయ్యి చూచికొన మాతుల నేడు ఘటించెఁగాన నా
మనమునఁగొంకు తీఱె నను మార్కొని నీవు వధింప లెస్స నే
మన మురియంగ వచ్చునని మామను గెల్చితి నన్న కీర్తి వ
మ్మనమున నేఁదలంతు నిటులంచును శల్యుడు దాఁకె ధర్మజున్ 615

క. ఇతఁడాతని నతఁడీతని
నితరేతర మారణాశ నేయుచు శరముల్
మతి మఱచిరి బాంధవ్యము
తతిఁగొని వధియించు వేళ దయయుండునొకో 616

ఉ. పోరున శల్యునింగెడపు బుద్ధినిఁ దానరి వోసి బాణమున్
వీరుడు ధర్మరాజు దయవీడక తూణము మేనమామపై
నారసి యేయ కింక నొక యాశుగయుందెగలాగి వీడుఁద
చ్చూరుని ప్రాణహాని కది చుట్టరికంబులు చూచువేళయే 617

ఉ. తోడును నీడవేఱయని దూఱుదురేసిన నంచు శల్యుడున్
గూడదు మేనయల్లుఁ బోరిగొంట యటంచును మాని కాలుసే
యాడఁగ నీక ధర్మజుడు నావలఁదూపులగుప్పఁబోరఁగా
క్రీడను కొందురంచు విధి లేకయ నొంచును శల్యుఁడాతనిన్ 618

క. ఈరీతిని వారిరువురు
వారణగతి నాజినోజ వారణగతులై
పోరుచు నసమానులుగ వి
చారము విడి ధర్మరాజు శల్యునిఁద్రుంచెన్ 619

చ. శకుని నులూకునుంగదిసి సాదియుతు న్సహదేవుఁడల్కతో
శకుని కులాధిపుండు విషసర్పయుగంబును జీల్చుపోలికన్
సకలాభమత్త సామజముఁ జండు మృగేంద్రము త్రుంచుమాదిరిన్
శకలము లొనటు ల్దునిమి చంపె నిజాగ్రజులెల్ల మెచ్చగన్ 620

ఉ. కడక సుయోధనుండు తనకన్నులఁగ నొనిమేనమామ చా
వడటయు మున్నె భీష్మగురులాత్మజకర్ణులు శల్యముఖ్యులున్
జెడుటయు పీల్లెపట్టిన సశింబరి పోలదికామొకంబునె
దడయక యొంటిఁ దేజిడిగిదాఁ గెహ్రదంబునఁబోయి కాల్నడన్ 621

మ. తనతోడం బదివేల రావుతులు వేదండంబులుం గొల్వగాఁ
జనుదేరం బెనుదేరులెక్కి తన పజ్జన్రాఁగ యోధావళుల్
మను దుర్యోధనుఁడప్పు భాగ్యవతి నిర్మానుష్యమై యుద్ధ బూ
మి నేఁ ప్రక్కఁగనుంగొనంగ నెవడున్మిట్టాడలే కొంటిమై 622

మ. వని ద్వైపాయన నామక హ్రదములో స్తంభించి నీరంబు స్తం
భన విద్యందన చేతఁ బూనిగద మహారాజరాజంచు గా
పొను గొన్నట్టి సుయోధనుండు మృతి దప్పండాఁగె నాబ్రహ్మయుం
గమనే కాలము తప్పివచ్చి తనకుంగాఁబోవు సంతాపమున్ 624

ఉ. తగ శతతాళదఘ్నమాహ్రదంబున డాఁగిన ధార్త రాష్ట్రు తోఁ
వెగఁబడి మాటలాడ నటఁదీరము చేరి కృపాది యోధులం
బగఁగొని భీముచారు లటుఁబారి వృకోదరు తోడఁజెప్పఁగా
నగు చిడె వారికిం బసదనంబులు కొల్లఁగ భీమసేనుడున్ 625

చ. రణమున నొంటిఁ బారి కురురాజు హ్రదంబున డాఁగియున్న వా
ర్తను బవనాత్మజుండును ముదంబున నన్నకుఁజెప్ప ధర్మరా
జును వడిలేచి సానుజుఁడు సోమక మాత్స్యయదూద్యహాదులున్
వెనుకొనిరా రథంబులను వేచనె నాహ్రద తీరభూమికిన్ 626

ఉ. ధర్మజుఁడట్లు లేగి తనతమ్ములు కృష్ణుఁడు కృష్ణసోదరు
ధర్మిలిఁ గృష్ణసోదరులు నాదటగాఁదట సీమనిల్వ న
త్యూర్మి మహోగ్ర నక్రఝషతోయ వదంబగు నాహ్రదంబునన్
దేర్మిపసించు కౌరవుని బేర్కొని కోర్కెయొసంగ నిట్లనెన్ 627

ఉ. ఆడుది వోలె నీహ్రదము నందున నీగతి డాఁగనేల నీ
వాడుదు మున్నుఁద్రుంచి మము నందఱ రాజ్యముఁగొందునంచు నీ
వాడుక లెందడంగె నవి భానుజు తోడనె పోయెనొక్కో నీ
వాఁడును నీవు దెచ్చితిరి వారని వేరము నోసుయోధనా 628

ఉ. లెమ్మిటు లేల వారిఁబడ లీలను నాలము సేయరమ్ము ని
న్నెమ్మెయి నేనియుం బ్రతుక నీయము రమ్మనియన్న రాజెడం
గ్రమ్మెడు సొమ్మతో నెలుఁగు రాలఁగ నాజనమెల్లఁ బోయె నీ
తమ్ములు నీవు చుట్టములు దక్కితి రేలుము రాజ్య మిచ్చితిన్ 629

చ. అనవిని ధర్మరాజనియె నచ్యుతుఁ డప్పుడు సంధికేగి మం
చిని వినిపించి పంచుమని చిక్కకుఁజెప్పిన యట్లు చెప్ప నా
మున నిలవాడి సూదిమొన మోపిన యంతయ నీయనంటివే
వినుమనయంబు లెందడఁగె వీఱిడి మాటలకేమి రమ్మిటన్ 630

చ. అనవుఁడు ధార్తరాష్ట్రుడనె నాగ్రహ ముంచక ధర్మరాజ నా
మనవిని నాలకించి యొకమాసము కాలము విశ్రమించ నే
తనరఁగ గొన్ని నాళులు నిదానము సేసిన సేనఁగూర్చి నేఁ
చెనఁకువ కేగుదెంతు నటువెన్క జయించెద మిమ్ము నందఱన్ 631

ఉ. కాదన కాజి యేమనకుఁ గావలె నంటివయేని నేను నీ
మేదిని శ్రద్ధ సంపదల మెండుగ నేలితి దీర్ఘ కాలమున్
బీదగిలె న్మహీతలము నీతలనే వడిఁగట్టు కొమ్మికన్
సాదరమొప్ప నిచ్చెద ననాదృతి సేయక యట్లు సేయుమీ 632

వ. అనుటయు ధర్మనందనుండు గాంధారీ నందనా పొందెఱుంగ నీ వెలిమెచ్చు మాటలకెవ్వడు మెచ్చుననుచువిరి శ్రీకృష్ణుపలుకు లాదరించెడు వాఁడవయిన నింతలు పొసంగ కుండుఁగదా భీష్మాది కురువృద్ధులకు ద్రోణాది గురువృద్ధులకుఁ చేటు వాటిల్లకుండుఁగదాఁ ఇప్పుడీ యొడ్డారపు మాటలు నీటి మూటలు గదా గదా యుద్ధము కూడఁ గడవెళ్ళఁ గళ్ళుగాంచి యావల గావలసిన పని వలసినట్లు చూచికొందగు గాక పీకసెడి నీటిలో డాఁగి పరుగెత్తలేక

నాపీఁద బలదూరనట్లు నేల నీకిచ్చితి

633

వ. నేలుమనుట యశక్త దుర్జనతగాదే యిట్లాడిన బాగగునే మాటల కేడ మందల పెంచలకడ లెమ్ము రమ్మనుడునంధనృపతి నందనుండు నిరానంద హృదయమ్ముతోనిరుత్తరుండై యూరకుండిన సదయుండగు ధర్మతనయుఁ డతని కిట్లనియె

634

ఉ. మీర లనేకు లేనొకడ మిమ్మట మిమ్మట నెట్లు గెల్తు నం
వారయ పల్వ దైదుగురియందును నీగురియందుఁ దొలునె
వ్వారినినైనఁ గోరి గెలువన్మహిలోకము లొంగ నాకమే
తీరునఁ గొమ్ము లెమ్మని సుధీమణి ధర్మజుఁ డోలిఁ బల్కినన్ 635

ఉ. ఆదర మొప్ప నాపలుకు లన్ని సుయోధనుఁ డాలకించి నా
నాదర మీగి నీదువచనమ్ము శిలాక్షర మంచు నమ్మి నే
నాదర బుద్ధి వత్తునని యగ్రజు ధర్మజు సంస్తుతించి తా
నాదరహాస మొప్ప గదనాని భుజంబునఁ జేరె దీరమున్ 636

వ. ఇట్లు నిజభుజాదండ మండిత గదాద దుండై రెండవ దంధరుండుంబోలె సుయోధనుండు తన జలస్తంభన విద్యా కౌశలంబునం దత్పుష్కరిణీ జలంబుపై శుష్క కర్కశ స్థలంబు మీఁద వలె నడిచి తలముడిచి దిండలవరించి పారంబు చేర వచ్చుచుండు నంతనంత నందనుండు ధర్మ నందనుఁగని కనలి యోశమన నందనా మీ యేగురిలో నతని వంతి కభివంతు నొకనితోఁ బోరి తద్రాజ్యనంతరము రాజ్యమ్ము సకల సామ్రాజ్యమ్ముతోఁ గొమ్మని హితమ్ముగ దాయకు వెనుదీయక వెరవాయఁ బలికితి విదియె గదా యీనఁగాచి నక్కల పాలొనరించిరన్న లోకోక్తిని జ్ఞాపక మది యెట్లన్న నపరిచిత గదాయుద్ధ నిష్ణునెండె గవలలో నొక్కని నొండె వనవాస చిరోప వాసాది నానావిధ మనశ్శరీరాయాస కృశీభూత శ్వేత వాహను నేని కోరి యేరికొని వాఁడ శ్రమంబున జయించిన నంతటితో మాత్రమో దశాబ్దాను బూతా భూతా వశ దుర్దశానిష్పిష్ట కష్టములు నష్టా దశవాసరాయోధన ప్రాప్త నానా విధాప్త బంధు మిత్రాది ప్రాణి నాశమును భస్మాహుతి ప్రాయములై తఱవేయిది యలంకృత్య

శిరశ్ఛేధమను వాక్యమునకు దృష్టాంతము దృష్ట్యాంతికముగ నుండను గాదె జూదము నాఁటఁగోలె నేటి తుదగా నీకును నీసోదరాది పోష్యవర్గమునకు మితిలేని యాపదకు నీ సాహస కృత్యమే నిదానమ్ము కదా ఒంటని వాడగు దాయ కంటఁ బడి కైదండగ్గె కందకుండ నంటఁబట్టి తల నెగురఁ గొట్టి నడిచప్పుడు గాకుండ బుడమితేఁడు పగఱ నేగతినైనఁ దెగటార్చి పగ నగుట బాగు చేతఁగాక మొగమోట మాటల మీదు మిక్కిలి తటస్థపడు నెదిరి యిదే నీ చరణాశ నా చరణా భ్యాసమునకు దీరమునకు దార సిల్లెడి నీ మాటల కెడలేదు మీఁద నీవెట్టులయినఁ జూచికొందము లావుచేవలు పూని గదచేఁ బూని దాయన్ డాయము తొడలు విఱుగనేయు ముత్తీర్ణ సంగరుండ వగు మని సర్వప్రాణిత్రాణంబగు తన పాణితలంబున జగత్ప్రాణనందను భుజ మప్పళించి యప్పళముగ రణస్థలి కరిగి యరిగెలువుమని సెలవిడి వెన్నుం డతని వెన్ను జఱచి బరవస మిచ్చిన వడముడి మై పరవశమై కొండంత సత్తువ చేకూరి శౌరిఁగని యయ్యా యుధిష్ఠిరు నిష్ఠురంబు లాడం బనియేమి నీమహిమ కలిమి నీమహిపతి కలిమికై యాపనియేన తీర్చి యజ్ఞాతన్యాయు మాజ్ఞాతి నిప్పాపాత్ము నూరులు నూఱు వ్రయ్యలుగ విఱుగ మోది నాగదకుఁ బండు గొనర్చెద తప్పక యిప్పుడ నీ మెప్పు నొందెద నని శ్రీకృష్ణుతో సమీర నందనుండుఁ సల్లాపించి తత్త్వరణవమున రణవమున కాయితమై దుర్యోధనుంగాంచిన మాత్ర నతని చేవయంతకు నూఱంతలు పెరిగి సరఁగ దలచక్కవుడిచి చిక్కగ దిండు బిగియించి లయకాలాంతకు వలె నాయోధనము సుయోధనుందాఁకి

637

చ. గదఁగొని భీమసేనుఁడు వెగాదిగఁ గన్గొని ధార్తరాష్ట్రునం
గదగొని నీవు ధర్మజుని కాళ్లను బడ్డను వీడ నిన్ను నా
గదకొనరింతుఁ బండువ నిఁకన్నిలు నీతొడలం బగిల్చి పాం
గఁ దగ నిను న్వధించి ప్రతిన న్నెరవేర్చెద నంచు దాఁకుడున్ 638

చ. మదమొదయించి యిర్వురటు మార్కొని పేర్కొని మోదికొంచు దు
ర్మదమునఁ బోరుచో గదల మారుతిమార్తుని చేతి వేఁతన

మ్మదమురులంగ నొచ్చుతఱి మాధవు బోధను గ్రీడి సన్న కా
మదముగ భీముఁడెంచి పరిమార్చె సుయోధను గూల్చి పెందొడల్ 639

చ. వడముడి వ్రేటునందొడలువ్రస్సి యుమస్థరణస్థలి న్వడిన్
బడియెడు రోహణాద్రిగతిఁ బద్ధ సుయోధను శీర్ష మీర్ష్యచేఁ
గడువడిఁ దన్నె భీముడరకాలను ద్రౌపది భంగపాటు నాఁ
డడరుచు మూట గట్టికొని నట్టి ఫలంబిదె మెక్కు మంచొగిన్ 640

వ. ఆయవమానంబు నంగన్నులారఁ గనిసీరి కౌరవేంద్రుండు ప్రియ శిష్యుండు
గాన నోర్వలేక

641

ఉ. బద్ధ సఖిత్వమూని బలభద్రుడు భీమునిపైకి లేచి నీ
యుద్ధ మధర్మ మెట్లు గద యుద్ధములో నరినాభిక్రింద స
ద్బుద్ధులు మోదరాదనఁగ బోరున మూరలద్రెంచితీవు నిన్
సిద్ధమకూల్తు నంచెగయ శ్రీహరి మాన్పెను సీరికోపమున్ 642

మ. రణభూమిన్ గదచేఁ దొడల్విఱిగి కౌరవ్యుండు నేలంబడన్
గనఁగా వచ్చిన ద్రోణనందనుఁ గృపున్హార్దిక్యుని న్రాత్రిఁ దా
ననియెన్ రాజు సుయోధనుండు మదిలో నార్తింబ్రలాపించుచున్
నను గావంగను మీరు ముప్పురిటులున్నారా యదృష్టంబునన్ 643

వ. అనిన ద్రోణ సుతుండనతని కిట్లనియె 644

ఉ. నేమును జెప్పినట్లు విన నీకిటు రావుగదా వృధాపదల్
మేమిఁక నీకుఁజేయగల మేలేదియేని యున్నఁ జెప్పు మీ
నీమది రంజిలంగ నవినీతిని నొండెను నీతినొండె నీ
సేమము సేయుదు న్విడక చెప్పుము తప్పక సేయ కాయతిన్ 645

చ. అనవుడు రాజరాజనియె నంతకుఁ జాలుదు వీవెయుంగవే
ఘనుఁడవు ద్రోణసూనుఁడవు గావున నీనిశ నీదులావునన్
జెనకి వధించి పాండవుల సేనల నెల్లను నూచముట్టఁగా
బెనకువ నీజయంబు వినిపించిన నెమ్మది నుత్క్రమించెదన్ 646

చ. అనవిని ద్రౌణి యిట్లనియె నాదృతి నాదుప్రతిజ్ఞ దెల్పెదన్
వినుఁ వడినేగి యీనిశన వేగము పాండవసేనఁ గూల్చెదన్
కినిసి వధింతు నడ్డపడఁ గృష్ణుఁడు వచ్చిన బ్రహ్మరుద్రులున్
గొనియని కడ్డపడ్డ విడఁ గూల్చెదఁ బాండవ సోమకాదులన్ 647

క. అదివిని కృపముఖ్యులచే
నుదకముఁ దెప్పించి యపుడ యుర్వీశుఁడు దా
నెద సంతసిల్లి ద్రౌణిని
ముదమున నభిషిక్తుఁ జేసె మొనకుం బతిగన్ 648

మ. పగసాధించెను జచ్చియున్నటులుగాఁ బాపంపు దుర్యోధనుం
డగతిం బోవుచు వేఁడద్రౌణి నిశి నిద్రాసక్తులై యున్నచోఁ
దెగఁగోసె న్నృప దాత్మ జాదులతలన్ తీష్ణాపిచే వ్యాధు రీ
తిగ ద్రెల్లెంబరి శౌరి సాత్యకులు కౌంతే యుల్కవల్లక్కుగన్ 649

వ. ఇట్లత్యంత దుర్లయంబున ననయంబు నయాస్పదంబు జిహ్మగమనుండగు బ్రాహ్మణ బ్రువుండును దామస శీలుండును గామిరియు ననంబరఁగిన యశ్వత్థామ శస్త్రార్థముండునై యారాత్రి భండనార్థము పాండవశిబిరంబు నిబీడాంధకారంబునఁ జొచ్చి యచ్చట నాపగటితోఁ బగలెల్లఁ బగఱ పొగరడఁగి నిశ్శేషంబుగాఁ దెగి వెనుక దిగులేమియు లేమింజేసి నిర్భయులై యరమర యఱచే యురమ్మున నిడికొని దండితారాతులై యారాతిరి బాండవ శిబిర గతులగు పాంచాల పాంచాలీ సుతాదులగు యోధులు మూఁకలుగ నిద్రించు చుండఁ గాకముల ఘూక తతులు హింసించువేళ య్యగుడు లోన నిగుడు కాతాళమునఁ బాతాళమ్మున కైన నేగి సురక్షితులైనను దాయుల నెల్లఁ బెల్లగింపందలంచి తన యిష్టదైవతమగు హరి బూజించి యాతండు మెచ్చియిచ్చిన హేతిచేత ధరించి పలుమేలు కట్లతో మెలఁగు పట్ల శతవిధ దీపికా దేదీప్యమాన గృహమ్మున హంసతూలికా తల్పంబున శయనించి గాఢ సుషిప్తి నొడలెఱుంగక నిద్రించు ధృష్టద్యుమ్నుం ద్రౌణి పాదివి క్రిందికి దిగలాగి రొమ్ముపైఁ గూర్చుండి యక్కటిక మెడలి యక్కటిక వానివలె నాతని గొంతుకోసి గంతుఁ గొల్చి పేర్చి తనజనకు ఋణంబు దీర్చితిననియు

దదనుజు శిఖండిని మొండి యిరుదల శిఖండి యనుచుఁ గ్రూరదనుజుండ పోలె శిఖంజేతికిఁ బెనవేసి తలఁగోసియు ద్రౌపదేయులఁ బ్రతి వింధ్యాది నామదేయుల నజేయుల సుజన విధేయుల నాయువులకు నెడఁబాపియుఁ బాపియై యాఁపఁజాలని కోపమ్మున నాశిబిరమ్మునఁ గలప్రాణులను మావులను గోవులను నరదమ్ముల ద్విరదమ్ముల గాలరుల బాలురను ద్వారపాలురను సర్వనృపాలురను వేరమ్ము దీరం గరవాలమ్మున శరీరమ్ములు చీఱి చూఱగ దనపాణి కృపాణికి బలి హరణ మ్ము వేల్చి కూలి మదిఁదాల్చిన కోపంబు నాఁపలేక పాండవేయులు తప్పి పోయిరని వగచుచు నీరసమూరక నీరసమైన నిరామిష పాండవ స్కంధా వారమున దనచేత మారణింపఁ దగిన జంతు విఁక నేదియు లేదని చింతిల్లి పిల్లివలె మెల్లన నడుగు లిడుచుఁ బాండవ శిబిరంబుఁ బరిత్యజించి వెడలి కృతవర్మలఁ గూడికొని తాఁజేసిన నిర్వాహకంబెల్ల గర్వధూర్వహత వారికిఁదెల్పి దానొనరించిన యాదవాష్కార్యంబు మహోఘనకార్యంబుగఁ గొనికొన యూపిరితోనె గటొప్పుచుఁ బ్రాణము లప్పుడ యుత్క్రమింపఁ బోవుతరి దుర్యోధనుఁగని ద్రౌణి యోనృపా దృష్టద్యుమ్న శిఖండి ప్రముఖ సర్వసోమకులును బ్రతివింధ్యాది ద్రౌపదేయులను బంచోప పాండవులను మాత్స్యులను యాదవులను శ్రీకృష్ణ సాత్యకి పంచపాండవులను నీయేడువురు దక్క దక్కిన పాండవ శిబిరంగతం బగు ప్రాణి సంఘంబు నెల్ల నొక ప్రాణినైన వీడక గతప్రాణులంజేసి నాపాణి కృపాణికి బలివెట్టితిఁ బాండవు లెట్లరిగిరో యెందణంగిరో కానరారైరి వారియడ పొడ కానవచ్చిన వడెండె నేనెండె దండధరాగారభ్యాగతులము గాకుండ నుందుమే యేది యెట్టయిన నీకింతవట్టు సువు వెడలకయ మునుప నీ పశువిశసన సమాన మదీ మానకృత కృతిఁ గృతివగు నీ చెవింబడవేయఁ గలిగె నాకింతయు సుకృతము చాలు నని వ్రాక్రుచ్చి యూరకున్న ద్రౌణిని దుర్యోధనుఁడాముదొరగి సాముసచ్చి నేలపైఁ బడి ధూళించొరలి లేవలేక లేచి మండిపైనెట్లనో కూర్చుండి యతి కఠినముగఁ దనచేసాచి ద్రౌణిని నిండారఁ గొగలించికొని యిట్లనియె 650

శా. అశ్వత్థామ భవద్భుజాబలము నాకగ్గింపఁగా శక్యమే
శాశ్వత్కీర్తికి నాస్పదంబయితి ప్రాశస్త్యంబు నన్నాదురా

జైశ్వర్యంబులు పాండవేయుల కవశ్యం బౌట కీ దోర్బలై
కాశ్వాసాంతము సేసినాఁడ వరి కాహో వేగ నీ వడ్డమై 651

ఉ. నాపయి నీదు మైత్రి నెఱనమ్మిన యందున కీ నిశీథినిన్
గోపము నాఁపలేక చని ఘోరముగా రిపు రాజిఁబట్టి నా
తాపము దీఱఁ ద్రుంచితివి ధన్యుఁడనైతిని నాదు జన్మము
దీపిత మయ్యె నీబుణము తీర్పఁగ శక్యమె ద్రోణ నందనా 652

వ. అని యిట్లు దుర్యోధనుండు ము మూర్ఛితుండయ్యు డయ్యుచు నొక చెయ్యి గురునందనుపై నిడి యాతండొనరించిన యతి పాపకార్యంబు మహాఘన కార్యంబు గానందన దివికేగుచున్న తనకొక ప్రాజ్యసామ్రాజ్య మబ్బినట్లుగా నుబ్బి తబ్బిబ్బుల గుచుం గొనియాడి యోయీ గురునందనా నీవొనరించిన యీ మహత్కార్యము నీకును నాకును గురువైన ద్రోణునికి త్రివిష్టపమున నిష్టముగాఁ జెప్పవలయుఁ గావునఁ బోయి వచ్చెద నన్నొప్పటికి మఱువకు మీ యని వీడుకొని కృతాంతుని నిశాంతమునకు నిశాంతవేళ నాగాంధారే యుండరిగె నట్లు పదునొకండక్షౌహిణులలో మ్రందక మిగిలిన ముప్పురిలో గృప కృతవర్మ లిరువురు తమదారిని దామేగి యెందేని తలలు దాచుకొనిరి. మూఁడవవాఁడగు నశ్వత్థామ శశ్వద్ధామ ధౌరేయులగు పాండవేయుల వలన దనకుఁ దోడనే కీడు మూడ వచ్చునని "నయలుకున్న యమ్మకుఁ గులుకెక్కువ" యన్నట్టు తాఁజేసిన ఘోర పాపములు "అత్యుత్కటైః పుణ్యపాపైరిహైవఫలమశ్నుతే" యన్నట్టు తనమదిఁ దానెఱుగు గాన గుండె గూడు బట్టక కాలుకొలంది నుఱుక యారేయి వేఁగు లోన వేగ గంగాతీరమున కేగి కృష్ణద్వైపాయను నాశ్రమమున కనతిదూరమ్మున నెవ్వాని కెఱుంగ రాకుండ "భగ్నా కృషి ర్భాగవతా భవంతి" యను న్యాయంబున గాషాయ దండధరుండై యొక త్రిదండి ముండిగ నొండె నంత నిట తరువాత వరువాత పాండవులు లేచి యున్మత్త వారణమ్ముచే నవారణమ్ముగ నవసాదింపఁ బడిన నవవారణవుంబు సావనమ్ము తీరున నున్నగఁ బాడరియున్న నిజశిబిరంబును గని శ్రీహరి సహితులై విచ్చేసి యచ్చేరువ నచేతన ప్రాయులగాఁ బడియున్న స్కంధావారపు పారివాంద్రలో నదృష్ట వశంబున సప్రాణుండై ప్రాణంబులఱచేత నిడికొని కొనయూపిరితోఁ బడియున్న ధృష్టద్యుమ్ను

సాంఘిచే నవ్యాజన్యంబు ద్రౌణిచేతఁగాని యన్యకృత్యంబు గాదని సత్యాపంతయుఁ దథ్యముగాఁ దెలిసికొని యాఘాతుకుండేగిన తెరవున వడవగా నడె యాలంబుల వలన నధ్యాహారంబు సేసికొని సహదేవ సాత్యకులం బాంచాలీ రక్షణార్థమ్ము శిబిరమ్ముకడ నిడి తక్కు పాండవులు దేవకీనందన సహితులై రథారూఢులై వెడలి పోవుచో వారలందఱుఁ దలకడచి వడముడి నడిచిడని రోషంబునఁ గడువడి నరిగి భాగీరథీ తీరంబునఁ బారాశర్యు నాశ్రమ సమీపంబున సన్యాసివలె ధన్యాసంబున ముక్కు బట్టుకొని యొక్కటే కిరుసి ఒకధ్యానంబు చేయుచుఁ బాయక మౌని వలె గూర్చుండిన ద్రోణనందనునిఁగని పవమాననందనుండోరీ భారధ్వాజ కులాంధమా రేయెల్లఁ ప్రాణివధ యాచరించిన ప్రబుద్ధుడవు నీకుఁ దత్పాప పరిహార ప్రాయశ్చిత్తార్థమై చిత్తవంచన కెతలో గరిష్ఠనిష్ఠ చేకూరె నీయాషాఢ భూత్యాది యత్యుపయోగోపకరణములు తొల్లి యొకయతి ప్రతారకుఁడగు నాషాఢభూతి యను మోసగాని స్థితినుపస్థితి సేయుచున్నది. ఓరీ! నీచబ్రాహ్మణా నీచరిత మతి నీచతరము కురుపాండవ ప్రథమ చాపార్యుఁడగు ద్రోణాచార్య కడుపు సెడఁబుట్టితి విట్టి కట్టిఁడివి విన్నేమిసేసినను దోసమ్ము లేశము లే దొకవేళ నరిగి ననుభవించుటకైన నోర్చెదము గాని యీదుష్కృతికి నిష్కృతిగ నీకింగోసి నిన్నిప్పు పాతఱం బెట్టక పోము విప్రుఁవై యుండి నిద్రాసక్తుల బాలుర నీ జోలికి రా॥ నృపాలుర హత్యచేసి మూటగట్టుకొన్న పాపంబునకు మున్నె నీకు బ్రహ్మ నొసట వ్రాసి ధారవోసిన చిరంజీవిత్వము పాపి చిరాయువను న్యాయమునకు పస్థాపకంబగుట విధివిధానము శ్లాఘానిధానమ్మై యున్నది. వాని నీవు కష్టపడి యార్జించిన యీ పంచమహా పాతకఫలంబు నీ కిప్పుడు దక్కు కుడువక మిన్నక పోదుగదా యని కడుపు మంట కొలందిఁ గడువగ మాటాడుచుండ నింతలోన యుధిష్ఠిరాదులు గాడ్పుచూలికి దోడ్పాటుగ వచ్చి కలసి

653

.. ద్రౌణిని బట్టి ముట్టుకొనిఁ ద్రౌపది కోపము దీర్ప బాండవుల్
పోణిమిఁ బట్టి తెచ్చి తల భూషణరత్నము నూడ లాగి మేఁ

ప్రాణము తోడ వీడుడు నపాండవ యస్త్రము ద్రోణివీడె స
త్ప్రాణుఁడు శౌరిగాచెఁ దనపాండవుల న్మనుమన్ బరీక్షితున్ 654

ఉ. భారత భరతంత్రకురు పాండవ భాండ విభాగవైర స
త్కారణ కారణంబగుచు బదునెన్మిది దండి పౌఁజులం
దారస తారసిల్లి విజయంబుగొన న్మదిఁ జేర్చియుండొరుల్
బోరఁగఁ బోరఁ గృష్ణుదయఁ బొందె జయంబల పాండవేయులన్ 655

చ. మునుకొని ద్వాపరమ్మిఁకను ముప్పదియాఱనరాబ్దముల్సనం
గను దుదుముట్టునన్న తరుణంబగుడున్ శుభకృత్సమాబ్దమం
దనువు శమంత పంచకము నందుఁ దొడంగి యు మాసముండి యా
యెను ఘనభారతాజా పదునెన్మిది ఘస్రము లొక్క తీరునన్ 656

ఉ. కూర్కికరేబవల్ దురము ఘోరముగా నెఱవేర్చి శౌరి తన్
బేర్కొను ధర్మరాజునకుఁ బ్రీతిఁబతివ్రత చేతి భిక్షగా
గార్కొను పాపముల్దొలగఁ గట్టెను బట్టము శాశ్వతంబుగాఁ
గోర్కెల నెల్లవారలకుఁ గొల్లలుగాఁగొన సాగె నెల్లెడన్ 657

శా. దైవానుగ్రహ పాత్రుఁడౌటనె కదా ధర్మాత్మజుండాదిలో
లావౌ దుఃఖములంది కట్టకడకు న్లాభించి సామ్రాజ్యమున్
శీవిన్నార్ది సమాజినిం జయము వాటిల్లంగ నేలె న్భువిన్
గావంగాఁ దనవాఁడుగా నిలిచి శ్రీకాంతుఁడు కన్పెట్టఁగన్ 658

ఉ. కవ్వడి మీఁద గృష్ణునికి గల్గిన యాదయయింత యంతయే
కవ్వడిఁ బట్టి సోదరులఁగాచెను గంటికి ఱెప్పకై వడిన్
నొవ్వఁగ నీక పాండవుల నొంచి సుయోధనుఁగృష్ణుఁడాజిలో
నెవ్వదనంగఁ ద్రవ్వితల కెత్తెఁడె రాజ్యము ధర్మసూతికిన్ 659

వ. అని చెప్ప జనమేజయుండు భారతకథ ధర్మరాజు పట్టాభిషేక పర్యంత
మాకర్ణించి కువలాశ్వదండ యాత్ర కథ కూడా జాలింపక మదిఁ గదిరిన
ముదంబున నానతీయుమని యడుగుటయు

660

పంచచామరము

సురేంద్ర సూనుసారథీ విసుద్ధ సద్గభీరథీ
నరేంద్ర ముఖ్యవందితా సనంద నాభి నందితా
జరాసుతాది భంజనా ప్రజామనోను రంజనా
శరార్వగ ప్రభంజనా ప్రశస్త హృన్నిరంజనా 661

గధ్యము:

ఇది శ్రీనాథ యామునావతార పవిత్ర శఠమర్షణ గోత్ర బుక్కపట్టణ కులకలశాంబుధి రాకాసుధాకర విద్యా నగర సంస్థాన సముపార్జితానేకాగ్ర హార బిరుదాంచిత కర్ణాట రాజాచార్య శ్రీ వెంకటాచార్య పౌత్ర శ్రీనివాస తాతాచార్య పుత్ర స్వీయ ప్రతిభా సముపాదిత రాజకీయ హూణ భాషా ప్రాభావ ధుర్య అష్టావధాన కరణ చణ శిష్టజన హిత వైయాకరణ పండిత రాఘవాచార్య ప్రణీతంబైన కువలాశ్వ విజయంబునందు

# చతుర్థా శ్వాసము సంపూర్ణము

శ్రీ

# కువలాశ్వ విజయము

# బుక్కపట్టణ రాఘవాచార్య రచితము

## పంచమాశ్వాసము

## దుందుమారు దండయాత్ర

శ్రీకృష్ణాయదునందన
స్వీకృత కౌంతేయపక్ష జితచేది పయః
ప్రాకృతమంగళ విగ్రహా
వ్యాకృత శరణార్థి విద్య వసుదేవసుతా 1

వ. దేవా దివ్య చిత్తంబున నవధరింపు మట్లు మేయ నయుండగు జనమేజయుండు ప్రస్తావవశంబున విస్తార పాలిత జన సంభావిత పారాయణ పరాయణమగు శ్రీమద్రామాయణము యొక్కయు నగణ్య పుణ్య కథా భాగవతంసమగు శ్రీభాగవతము యొక్కయునసార సంసార మహాభారతరణ చణ మహాభారత రణప్రకరణాది విశిష్టమై వ్యాసభట్టార కోపదిష్టమై సకలవేదసార మహాభార తరమగు మహాభారతము యొక్కయు వివిధ కథాసుధారసమ్ము కర్ణపేయమ్ము గావించి యనంతరంబ దుందుమారు దండయాత్రా శేషమ సేషము వినమనీష యయి తదుపరి వృత్తాంత మెత్తెఱంగునఁ బ్రవృత్తమయ్యె నయ్యది యెఱింగింపుమని యడిగిన వైశంపాయనుం డిట్లనియె అట్లు కువలాశ్వ కువలయేశ్వరుండ సమానవరముల సమవర్తి సమవర్తిగాఁ బొగడ్త కెక్కి విశేష విజయాభిలాష దుందుపైకెత్తి పోవుతఱిముందుగ నప్రతిహతగతిఁ గతి పయగ వ్యూతి మాత్రయాత్ర వడి బలువిడి వడిసేసి నడిచి యావెనుక మొనలుమొనకుల్లి వెనుకంజవేసి జడను వీడిన నెడనెడముడ గలువడి యడుగిడలేకసుడివడుచున్న భూపతి యాడరాని కోపంబు దీపింప నావరినెల్లఁ బరికించి కసరి చేవిసరి యిట్లనియె 2

ఉ. కాలుకొలంది వేగఁజనఁగావలెఁ గావలె నాదు పూన్కి ప్రాల్
ల్మాలిన దారి తగ్గనొకొ మానదు మానదురాప దైత్యుతో
నాలము నాలమందు పులియట్లు తడుండగ వానిఁజంపకే
మలను మీకుఁ బెండ్లి నడలేటికిఁ జాలును వెండ్లికన్ 3

గీ. ఈపగిది భూపుఁడా పరిగోపగించి
పట్టుదల తోడ నెంతయు బట్టు పట్టి
దారిఁ బెట్టినఁ బేజంత దారి బట్టి
హెచ్చి నడచెను దోడ్తొనఁ బెచ్చు పెరిగి 4

వ. ఇట్లునూన సేనాపరివృతుండై కువలాశ్వుండు కతిపయ వాసరపు యాణమ్ముల
నుదంకముని ప్రదర్శిత పథవినిగొని చనిచని సకల వస్తు సమాజ సమావేశ
బ్రాజమానంబగు నొకవనంబుగని వసంతాది షడృతువు లొక్కచో
నుపస్థితంబు లగుటయు నిట్లని తలంచె
5

క. శుకమునకు బడిపంతులు
పికములకు స్వరోపదేష్ట ప్రియకరుఁడగ మా
లికి మధుకర కులమునకును
మకరందాన్న ప్రదాత మాధవు డలరెన్ 6

ఉ. పూయక కాచున్ మేడివట భూరుహ పర్కటి షిప్పలాదులున్
బూయుచుఁ గాయు రేలయును మోదుగు మామిడి దాడి మా దులున్
గాయకపూయు మొల్లలును గాంచన ముఖ్యమిగర్చిఁ గంటిరే
కూయిడుఁ గన్న తల్లిఁగని కోయిల పంపుడు తల్లి వీడ్కొనెన్ 7

చ. సకల మహోరుహమ్ములు వసంతు నెదుర్కొని తేఁటి పాటఁబా
యక శుక వాకులం గుశల మారసి యెత్తుడు మంగళారతుల్
పికకుల కాక లీకలనఁ బెట్టిన ఁగట్టము లాతఁడాన పాం
శుకములఁ దాల్చె నావదవి శుష్క దళమ్ము లిగిర్చె వృక్షముల్ 8

చ. పవనుడు నాకు రాల్పుతటి బత్రములేక చిగుర్పు ప్రాకులీ
యపగడ మాలకింపుమని యామనికి స్పిరియాదు సేయఁగాఁ
దివిరి విచారణార్థ మరుదెంచె వసంతుఁడు రండటంచు వే
కువకవ గూనె మావులను గోవెల చారుఁడు వాదులంబడెన్ 9

ఉ. ఏళుల నీళు లెండఁ బడె నెండలు మెండయి దూఁకె నేళముల్
దూలుచు నెండమావులకు ద్రోలగ నీచెవిగాడు పాచెవికిన్
జాలగ బిట్టు ప్రేలి పడి చావఁ వడిన్ పెను గాడ్పు తోడ్పడన్
నేల పటుక్కనం బగిలి నెఱ్ఱెలు విచ్చె మతింగెనం బుధుల్ 10

చ. వడ తఱి నౌదు కానలను బాఱెడు నీరెగఁజల్లి చుట్టునున్
గడుకొని వట్టివేళ్ల తడికల్దిగ వ్రేలగఁ జల్వ పందిటన్
దడియను కందు వాసెనలఁ దార్చి నక్రొత్తపనంటి నీటికై
వడ సుడివడ్డ యాయికులు వత్తురు సొత్తురు సేద దీరగన్ 11

శా. ప్రీతిం గొల్వెడు లేఁత బొండ్లములతో పెచ్చింత చీల్పించ వ
ర్యాతంద్రాలును మెల్చి కల్జులకు జాడం గట్టి నీటంబడన్
నూతంద్రోఁబి వెడల్లి యెండతఱి మున్నోటించి పెన్మెచ్చి కల్
భ్రాతింజక్కెరఁ గూర్చి తజ్జలము లాస్వాదింతురావేసవిన్ 12

చ. లవణము శొంఠి చూర్ణము దళమ్ముగఁ జేర్చిన, యాపయిన్ ఖళీ
వివరముగాఁగ లేఁత కరివేప దళమ్ముల నుల్చి కల్పియున్
సవరని నిమ్మకాయల రసమ్ముగిఁ బిండిన తేట మజ్జిగల్
చవిగొను భాగ్యమబ్బునొకొ శక్రుని తేనియు మండువేసవిన్ 13

శా. వేసంగ న్వడపప్పు శీతలములు న్వేచోపు లేబొండ్లముల్
ఘనాచ్ఛాదిత శీతలానిల శిరోగారంబులు నంధవి
న్యాసేశీనరమూల విస్తృత కటర్యాసక్త బిత్తి స్థితిన్
వాసంతిన్ కుసుమాది సౌరభములు న్వాచింత్రు వేసంగిలోన్ 14

క. వేసవి పలుగాసికిఁ జూ
వే సవితముఁ దోడు పడియె వేధింపఁగ రా

వేసవివిధమునకు మీసర
వే సవిశేషముగ నంచు వేడెదురు జనుల్ 15

క. మీసరముగ వేసవి తుద
మీసర బిందించి వేఁడిమిని ద్రిమ్మంగెను సు
మ్మీ సారంగఁ గర్మ సాక్షిత
మీసర దంధం తమస్సు ద్రిమ్మంగెడు కరణిన్ 16

ఉ. ఆకసమెక్కఁ గార్మొగులు హోలిక కోటి పాలాల కెక్కఁ జీ
కాకుగఁ బన్ని కొంచుఁ దొలికారున నెద్దులు నేరగుల్బలన్
వేకటి కోకిలల్మెమకె వేగ నరిష్ట కులాయ వృక్షముల్
మూకొని యేణము ల్మెసవె ముక్కుముణుంగను నేలతాడులన్ 17

# వర్షాసమయము

ఉ. ఈకొని పాంథకోటి తమ యిండ్లకుఁ జేరెను దీఱనాంద్రకున్
గాఁకలు కాకులూళులను గట్టెను గూళుల అచ్ఛమ్రాకులన్
ద్రోకలు గట్టి మానస సరోవర భూమికిఁ బాఱె హంసముల్
బ్రాకట దావమల్లె వనపాళిని జాతకి కోరె దాహమున్ 18

ఉ. అంతట మిన్ను చిల్లు వడి నట్టొకపెట్టునఁ గుండపోతగా
సంతత ధారలం గురిసె జానుగ వానలు వాన కాళ్లతో
గొంతులు లేచి బేకములు గూసె బెకా బెక నీటి పట్టులన్
జెంతల గుంతలం జెవులు చీఁదఱగా వినువారి కెంతయున్ 19

ఉ. వానలు వెన్కఁ బట్టెఁ గడవానలు న్యూనములయ్యె ఘస్తముల్
హీనములయ్యె సస్యమునఁ దామన తంపర చూడసొంపయెన్
మానుగఁబూసె మొల్లలును మల్లెలుగాసెను, బండు వెన్నెలల్
గానము నేర్పెఁదేటి తెగగాసెను విష్కుట శాకపాకముల్ 20

శరద్హేమంతములు

చ. కఱకఱఁ బొద్దు పొడ్పు తఱిఁగార్కొని భాను హిమాని గప్పెడిన్
గుఱుచలుగాఁ బవళ్లు సమగూడె బొరింబొరి కన్నుమూసి కన్
దెఱచెడి నంతలోనఁ గడతేఱెనుగా హిమమంతమందు నే
కొఱతలు లేక సస్యములు కొల్పుల నీనెను గుచ్చులంటగన్ 21

ఉ. మించి నెగళ్లు వీధులను మెండగ బండెను ఱేబవళ్లు నా
శించిక వోష్ణ భోజనము సేయుచుఁదానము వేఁడి నీట నుం
గొంచెము కాలు మేకెరువు కుంపటి మంచము క్రిందఁగ్రాలగాఁ
గంచుక కంబళంబులను గప్పెను హాళిక కోటి సేతునన్ 22

ఉ. తత్తరమెత్తి వేసవిని దాల్చి భరించిన సైత్య కృత్యముల్
బొత్తుగ హత్తవయ్యె నొకపూటయు సీతున సీతకాలముం
దెత్తిన యుష్ణ కృత్యములు హేయములాయెను వేసవిన్ జలిన్
గ్రొత్తులె యెత్తనాళులొక కొన్నియుఁ గోడలి నాళ్ళు కొన్నియున్ 23

ఉ. పావనుఁడయ్యె గుస్త్యుఁ గని పంకము లింకె నదీనదంబులన్
మావులిగిర్చి పూసెను వనప్రియ కోటి రసాల శాఖిపై
లావుగఁ బూటకూళ్ల బసలంగొనె మాధవు రాక నార్చుచున్
లావుగఁ బూటకూళ్ల బసలంగొనె మాధవు రాక నార్చుచున్
వీవనఁ గాఁగి లించికొని వీడ్కొని శీతము మంచు కొండకున్ 24

## శిశిరర్తువు

చ. సుమము లొసంగ నింబమిడఁ జూతము సూడిదె జీడి పిందెలన్
మమతను గొల్పు తోరణపు మండలు గుజ్జుపుఁ బీటలెక్కఁజ
క్రము నవమాన్లు లోణిక సుఖింబిడ నీయ గుడంబు నిక్షువున్
భ్రమత నుగాది నింబసుమ భక్షణసేసిరి హైందువులోమహిన్ 25

వ. ఇట్లు షడృతు సముపస్థితి కంబై యొప్పారు నప్పావన వనంబునందు 26

సీ. సరిసమానమ్ముగా సయ్యాట లాడుచుఁ
గరుల ముద్దాడు సింగము లగములు
పాటించి లేఁబూరి నోటికందిచ్చుచు
నాలదూడల మేపుఁ గ్రోలు పులులు
నుప్పుప్పుఁ గోనెల ద్రిప్పి వీపునఁ గూర్కు
పాముల జోకొట్టు బర్హిణములు
నేవేళ కావేళ యేర్చి యేఁతము నీళ్ళు
బెట్టి గొఱ్ఱెలసాకు వృకచయంబు
పడగ నీడను గూర్కు కప్పకును నిద్ర
భంగమగునని సెలత్రాఁచు పాము నింగి
భానునకు నడ్డముగఁదన పడగ విప్పి
త్రిప్పి కాపాడుఁ గంటికి ఱెప్పవోలె 27

వ. ఇంక మఱియును 28

చ. శుకశిశువు ప్రభాతమునఁ జొక్కుచుఁ గోటరసీమ నాఁకటన్
నకనకలాడఁ బిల్లి యెద నాటిన కూరిమి నోటనున్న కూ
నకు నొక యెల్క నెడ్డియు ననంటి ఫలంబులగుత్తి శాక శా
బకములకిచ్చి తెచ్చి క్షుధ బాపెడుఁ గంటిరె వీని సఖ్యముల్ 29

ఉ. కాకము ఘూకముంబవలు కన్గలవాఁడది లేనివానిన్
జేకొని దారిజూపుగతిఁ జెచ్చెర నచ్చెరు వొప్ప మెప్పుఁగా
జీఁకును దోకవెంటగొని చీఱుచు వెల్తురు లేని చోటికిన్
దోకొని పోకఁ గంటిరెయ నోకహవాసుల యైకమత్యముల్ 30

చ. పొలమున ధేనువీనఁ బడఁ బొంతనె మంతరసాని వోలెబె
బ్బులి యొడలార్చి లేఁగకును యేపిన యోపికఁ బాలు గడ్పునీ
పులిగుణమొ పొలమ్ము గుణమో మునినాథు తపో మహత్యమో
పులి పసికూఁడిగమ్ములను బూని యొనర్చుట లెందుగ

చ. మహిఁగన సింహకుంజరము మాకలిఘూకము మోతు
మూషిక మ్మహీనకులమ్మును న్మశకశాదనము న్పణి దర్వి రమ్మునున్
మహిష తురంగ మమ్ము హరిణమ్ము తరక్షువు గోవు వ్యాఘ్రమున్
సహజ విరోధు మంద్రదది యసత్యముగాఁ గనిపించె నీవనిన్ 32

క. తనరఁగ నది మున్యాశ్రమ
మని యొకళులు సెప్పకయత నంతటఁదానీ
వని జంతువుల ప్రచారం
బున మౌని తపో మహత్త్వమును దెల్పెడిగా 33

చ. ఇటులను రాజుమాటకు మునీశ్వరుఁడిట్లను నర్థి దేవతా
విటుటిదియే మదాశ్రమము వెట్టుము బట్టఁగ దాడి వెట్టుమా
యిటకొక నల్పమాత్రమున కెచ్చొ యొకించుక చొచ్చియుండు నా
కుటిలుడు పండు తావు ఘన కోవిద వాని గనంగఁ బంపుమీ 34

చ. అనవిని రాజు నందనులనందఱఁ గన్గొని పుత్రులార యా
దనుజకులాధముండెచట దాగెను యేగడు విల్లువీఁగి యా
తని యవుగాము లారసి వృథమ్మున కాయితపర్చి రండుగాఁ
డనువుగఁ జింక దుడ్డు శరణార్థిగ నుండును మోసపోకుడీ 35

చ. తనరగ దానవుండెటనొ దాకొని తాఁబొడ సూపకుండినన్
గనుపడు నంతదాక కడఁకన్విడకెన్నక వెన్కముందులన్
గునపముల న్ఖనిత్రముల గ్రొచ్చిరసంగనుఁడంట ద్రవ్వియా
వనధికి నేతమేత్తి చలపట్టి జలమ్ము వెలార్చి యేనియున్ 36

సర్కుటము

చ. అనియటు సూనులంబనిచి యాకువలాశ్వుఁడు ముందుగా వడిన్
దన శిబిరంబు నాశ్రమము ముందు నిడుండని పంచి చెప్పగా
చిన నటుసేసి రాజులట సేనలతోనల చోన్వడిన్ జనన్
జనపతి హాళితో విడిసె శాత్రవ జైత్ర మతిన్ దలంచుచున్ 37

అంబురహావృత్తము

చ. పాఱులు పల్గులు భోరునఁ జేకొని
ఫౌజులు నౌఁజులు గూడరాగనా
ధీరులు దారులు దారల వారిధి
తీరమారసి బాలురా యనన్
ధారుణిఁగానక దైత్య మరుస్థలిఁ
ద్రవ్వఁగ ద్రవ్వఁగ ధన్వమున్ గనెన్‌జేరెడు
నేలను వీడక వాఁడవ
నింబడి పండి కనంబడె వేగమే 38

మానిని

కానక కానక కష్టము మీదట
గన్పడ దుందుఁడు మున్పడ వా
రేనుఁగు నెక్కిన యంతటి సంతస
మెచ్చగ మెచ్చుగఁ దండ్రి తమున్
గూనల సలసల గ్రాగెడు సీసము
గూబల నిండను బోసి మహా
ధ్యానము జేసిరి శంఖముఖాదుల
వారణముల్పయిఁ బడిమెట్టన్ 39

సీ. తన నిద్ర గుఱకలు విని వనవ్యాఘ్రముల్
సాటి మెక్కమ్మంచు ఝుంకరింప
వన వరాహ సమూహ ఘన ఘుర్ఘరధ్వని
భ్రమ సారమేయము ల్భౌకళింప
స్రక్విణీ యుగగళ తృణి కావృతానన
ప్రపకు దంశాళి పిపాసు మూఁగ
నిట్టూర్పులకు నింగి నెగయు విమానమ్ము
లొడ్డ గెడవు గాఁగ నెఱఁగి తూఁగ

నాస్యగుహాకును రసన వాహానముగాఁగఁ
గూడి శ్మశ్రుల గిజిగాళ్ళు గూళ్ళు వెట్ట
నొడలెఱుంగక నిద్రించుచున్న యసుర
యెంత లేపినఁ గదల డావంత యేని 40

క. అందుల కల్యాశ్చర్యం
బందుచు నృపసూనులసుర యావంతయుహో
గందడు గుందఁడు డెందం
బందుల మాతఱమె లేప నీతని నంచున్ 41

వ. మఱియు నింకం కొంతదూరము భారమనకమనకు జేతనైనంతవఱకుఁ యాతనఁ జేసి చూతమని యారిపు జేతలు,పరాతుల కానతీయ వారలు చేసితఁ జేసినగాసి యెట్లనిన

42

సీ. ఒకవంకన కలంక సకలాంకుశ ప్రజ్ఞ
దేవవర్ధకులు బాడిసెలఁజెక్క
నొకదండ నౌజులు నుద్దండ ఘనదండ
గండిశిలల్మీదఁనిండఁడొల్ప
నొక మూల నొక్కో ల మత్తాలపు ఫిరంగు
లార గూరగ గుండ్ల బారువేప
నొక చెంత నొడలంత హొంత కారులుసేరి
వింతగాఁ గీల్లెల్ల విఱిచిపెట్ట
గమతముల గ్రుచ్చి చెమట కాకలకుఁ దెచ్చి
గునపముల నెఱకలన్నియుఁ గుములఁగాల్చి
నల్లి మడ్లగు నీళ్లెగిఁ జల్ల మేన
నల్లి గుట్టిన పాటియు నాటదయ్యె 43

వ. ఇట్లు నానావిధ బాధలొనరించి ప్రాణములు విసిగి కసుగందని యా రక్కసికిఁ బ్రాణాంతకరముగ నింక ననేక యాతనల నొనరింప నొక్కతఱికి మధుకైటభాత్మజుండగు నాపిసాళి రాకాసి నొసాళ మంటె విడిన ఫిరంగి గుండుదెబ్బ

జెబ్బలు దెగ నురంబును గాఁడి వెన్నున వెడల బడల్పడి యావులించి యావలి నుండి యావలికి నుచ్చివనఁ బొరలి యకాల సంభవ దంభోధర గర్జా సముజ్జృంభణనిభనిజ గాత్ర విజృంభణ సమయాయత్న వక్త్ర నిర్యద్దంభోళి ధారావిచ్చిన పక్షుకుల శైలగు హోద్యద్విరావాను కార్యారావ బధిరీ భూత భూనభోంత రాళుండును గారాళారాళ దంతాంతర్దష్టార్ధ భషితార్ధోష్ట్ర యుగళమ ధ్యగళత్కృపణక్షపణ కుణప భక్షణా శావ శాంతి క గమనోత్తర రక్షణ శ్రమా గోచరీ భూతప్రభూతాకుంఠ భైరవ నిజ కంఠరవా కర్ణన మాత్రాతి మాత్ర విద్రావణ పరాయణ శరారు మృగ విహగనివహ వివిధ వికృతి రుతుగతి సూచితాత్యాసన్నావసాన కాలుండునునై లయకాల వాసరమ్ములఁ గీనాశుని బలు మాసరమును మోసి కొని గాసిపడి గూర్కు కాలును కాసరము వలె గుఱక విడుచు నాముకొని భూమీశు కొమరులు సేయు పలుబాములలో బామరపడి శూలిమ్రోలమై పరవశమై ఖడ్గముల పఠించు వీరశైవుని మేనఁ గుచ్చు వాసములఁ బోని పెనునారీసమువీరస మెత్తి మొత్తి యొడవెల్ల నెడలేకుండఁ జొప్పించి దెప్పరముగ నొప్పింపఁ గుప్ప గూర నస్రధారలలోఁ దెపున దొప్పఁ దోగి యప్పాపాత్ముండు కొందొక చుఱక యెత్తి యద్రులద్రువ నార్చుచు నిద్రదెలిసి యావులింప నాయులివు నీకు సైనికులదరి భయభ్రాంతస్వాంతులై బడి పంతుల రంతులకు గంతులిడుచు బాఱు బాలురవలెఁ బరవస మీఁగి పరవసాఁగి రెట్లనిన

44

సీ. పల్లముల్బడ వేసి కళ్లెము ల్లైగఁ దీసి
పఱచెడు తట్లపైఁ బాఱువారు
కైదువుల్బడఁ డించి కత్తాళ లెడలించి
నుడివడి వడి గాల్ల నురుఁగు వారు
హస్తిమస్తకముల నాగలేకిలఁదూఁకి
చాటుమాటుల డాఁగి దాటువారు
తేరులలో దూఱి తాఱుమాఱుగఁద్రోలి
యొడ్డగెడపు గాఁగ నెఱఁగు వారు

కానకయ కానవచ్చె రక్కసి యటంచు
విఱిచికొని చెప్పికొంచునె వెఱచిపాఱె
సీస చట్రాతిపైఁబడిం చిట్లు పనఁటి
చిద్రుపల నీఁగను జెల్లాకు చెదరు గాగ 45

వ. ఇప్పుగిదిఁ జెప్పనలవిగాని చప్పుడుగాని చప్పుడుప్పరం బెగయ రక్కసి బిట్టు సేసినయట్టి హాసంబు సెవింబడఁ గువ లాశ్వుండు స్కంధా వారంబు నుంకి యయ్యమరారి పండిన బొండిసుక మరుదేశమునకుఁ జయ్యన నేతెంచి కొమరులుఁ దానును దానవుఁ రాక సమకట్టుడు నాతని వికృతాకృతి సూచి సూచితారిష్టులై సూచిత కార్యా కార్యానభిజలై పాఱుచున్న బారులదూఱి ధారుణీ ధవుండు ధారుణీ ధర ధైర్యుండై యిట్లనియె 46

ఉ. అమ్మక చెల్ల యిల్వెడలి నప్పటి గప్పము లెందడంగె మే
యమ్మక చెల్లునే బలిమి నాశరు నాశమొనర్చి రానెని
క్కమ్మని లేఁత లొఁత సొరకాయలఁగోసిన మాసటీంద్రు మీ
కిమ్మెయి వైరిఁగాంచి పరువెత్తిన నవ్వరె పర్వుపోవదే 47

క. గొంతున నూఁపిరి యుండెడు
నంత వఱకుఁ బోరి రిపుని యంతయొ తనదే
హొంతమొ కనవలెఁ గొనవలె
నంతట సుఖ మైహికమ్మొ యాముష్మికమో 48

గీ. అట్లు గాక విఱిగి యపకీర్తి పాలయి
పఱవనేమి మీకు ఫలము గల్గు
మాట లింకనేల మూఁటికి ముడివేసి
పఱవఁగోర్కి యున్నఁ బఱచిపొండు 49

సీ. ధరణిలో సంభావితస్య చాకీర్తి ర్మ
రణతో తిరిచ్యతే యనఁగ వినమె
పదుగు రేగెడు నట్టి బాటనేగుట లెస్స
పదుగురుతోఁ జావుపరిణయమ్ము

గాన మహాజనో యేన గత స్సపం
    థాయ ను లోకోక్తిఁ బాయఁదగునె
రణమున జయమే న్మరణమేని ధర్మశ
    రణమైన శూరలక్షణ మటంద్రు
వృథము విడి పాఱి పోయిన మేలుగలదె
యేలవెట్టిగఁ బఱచెద రిహముఁ బరము
చెడగనేటికి మృత్యువు గడవు గడచి
యేగునేఁ డేని నవల నూఱేండ్లకేని 50

గీ. పేరు ప్రఖ్యాతి బోఁద్రోలి పెఱలు నవఁ
జెంగి పోనేల పదుగురు సేయనం గ
మాల కిటురండు డీ కొన మార్తుపైకిఁ
బైన నేనుండ మీకేటి భయము సెపుఁడ 51

వ. అని తమప్రభువుజని తైకప్రభుతన్ జనితగునట్లు హెచ్చరిక సేయఁ బెచ్చు పెరిగి మచ్చిక హెచ్చి పెచ్చారి తనమ్మున నచ్చు విడిచి విచ్చలవిడి యచ్చేరువ చేరువ లచ్చెరు వందఁ దేకువ చేకొని తిరిగి తరుగని గరగరిక బరగి బలంబు చలంబు పెరిగి యలవు దొఱంగి మెలవు లెఱింగి యలవు చులువుల రిపుపైఁ బడఁ గడంగి నేరుపు మీఱ ‌ఁ దారసిల్లుచు దారని ముఫలాద్యాయుధములతో నాయోధులా యోధనమునకు ధనమునకై చను నధనులవలె దాయపైఁబడి వడి సడలక బడలక యొడలిక, గడలుకొను కీడువడి హాళహాళిక లెసంగ ఁగసి మసంగి కదలించి కండ్లగవిసె వదలించి కుదిలించి విడిచిన కేటి కూటువునకు డచ్చాటుమాటు కొనవంగి లంఘించు సివంగుల భంగిఁగఁ గవిసెన వెడలించిన బడల్పడుఁ బూరేటి వేటకై పాసారణంబుల కరణి నురువణించుచుఁ బఱ వళ్ళు ద్రొక్కి యొక్కుమ్మడి ముక్కడి రక్కసి యెక్కడెక్కడని దిక్కులు కలయ వెదుకుచు సిదకు నొదవు గొదకొలందిఁ బరుగిడి తమనరవరుడు వెఱుగుఁ పడునట్లుఱికి పిరికి తనమ్ము నఱికి గొంతు కొఱుకు దమను రక్కసి పైకుఱికిన 52

చ. దనుజుడు నంగదంగొని గదంగొని చేతఁబదాతిఁదాఁకి మీ

దనుజులు కందల ల్టులుష దాళఫలంబులు వోలె రాలె రా
ట్తనుజులు కొందఱాదుకొనిడాఁగొన వారిని మ్రింగ సాఁగె నం
దనుజులు దక్కువారరిగి యాశరుముంచిరి యాశరావళిన్ 53

ఉ. ఆయసురేంద్రు డేగి ఘనమాయన మాయెడ మాయ మాఁ ...ం
డాయె సురేంద్రుడై యిటులు నా నృపుతోననె దుందుఁడో డెఛో
నాయసులైన నాకులకు నాకును నాయెను సంతసమ్ము సు
మ్మాయన మాయె నీకుఁ జను మాత్మజులంగొని వీటి కింతటన్ 54

చ. అనుటయు రాజుచూచి యిదియాసుర మాయయె కాక వేఱొకో
దనుజ విరోధి యేడ నిటుతా నరుదెంచుట యేడ వచ్చె బో
చను మిఁక నూరికంచనఁగ శక్రునకేవి యవస్థ గల్గె నం
చని కువలాశ్వుడేసె శరమాశర మాయట మాయ నాయెడన్ 55

ఉ. అంతట దనవుండడరి యాగ్రహ ముగ్రముగాఁగ భీతి యా
వంతయు లేక సింహ శరభాదుల రూపము లెత్తి రాఁగనా
వింతల నెల్ల మాన్పి నృపవీరుఁడు తత్పరిహార శస్త్ర వి
క్రాంతిని జూప వాఁడు పరిఘంగొని నిల్చియ నెన్నుపాలుతోన్ 56

ఉ. ఓమతి హీనుడా నృపతి యెవ్వమి నాకిటఁజేయబూని నీ
కీమతి మాలినట్టి ముని యేమని చెప్పెనొ పొమ్ము నాకిసీ
లేమను మూఁడు కాళ్లముసలింగొని నాపయికెత్తి వచ్చితీ
వే మహతంపహొనర్చితిని యేమహితంబగు నీదు ధాత్రికిన్ 57

చ. అదియటు లిండనిమ్మధిపుఁ డాత్మబలంబునులాఁతి బల్మియున్
బదిలముగా నెఱింగి చనినం గనవచ్చు శుభంబు గాక దు
ర్మదమున ఁగొండ్లయంతరిపు మాద్పశు మార్కొనఁ గన్ను గానకి
ట్లదరి పడంగ వచ్చిన మహాపదగాక జయంబు గల్గునే 58

చ. వినుమొక మాట నంబరిభవింపగ నీతరమౌనె తొల్లి నా
జనకుడు కైటభుండు నను జన్మని తో జనబ్రహ్మమీఁది కా
యన తన తండ్రి చాటునను నల్లన తల్లడమంది డాఁగఁడే

ననుఘనుఁడత్పుతుండ నఁగ నాదిట వేర గణింప నేటికిన్ 59

ఉ. ఈఁచిఱుధన్వ మేరుమునికిచ్చిన మాన్యము వీసి కిద్ది కా
ణాచియె తాత తండ్రుల ధనంబుగ నేరిని చేరనీయఁ డీ
నీచుఁడు నేను నిందు శయనించిన నీతని ముల్లె యేమి పో
నే చఁగ నేల నన్నితఁడు నిందఱతోఁ గబళింతు నీమునిన్ 60

చ. అనిన నృపుండు దుందుగని యాఁపగ శక్యముగాని కోపమున్
గొని యనియె న్ఖలాశి యిది గోవిను యేయెడకేని బోక నీ
వనవరత వ్రతస్థుడగు నాశ్రమవాసికి గాసి సేయు చిం
దన శయనింపనేమిటికి దాపసికిం గయిలాట కాఁడవై 61

క. నీకేటికిఁ గైలాటము
నాకలముందినుచుఁగానన నసెడు మునితోఁ
జేకుఱదె యిట్టి ధన్వము
నాకంబో బ్రహ్మ పదమొ నాకిదిసెపుమా 62

ఉ. ఇట్టి మరుస్థలంబులు మహింగల వెల్లర సామ్ము సుమ్మమున్
మెట్టిన వాని కెట్లయిన మిక్కిలి హక్కుగుగాన లాతి మున్
బట్టిన వాని సమ్మతిని వానము సేయుట నీతిగాక యే
నుట్టు బడంగఁ బ్రాధమెకు నొత్తిన నాతఁడు దండ్యుఁ డెన్నగన్ 63

ఉ. కావున నీస్థలమ్మునకు గాఁడె స్వతంత్రుడుదంక మౌనియే
భూ విదితంబుగా మనువు పుట్టిన నాఁటను గోలె నీతఁడే
యావరణంబమర్చికొని మాశ్రమ మిందొనరించి యుంట నిం
దీవన వాసి యొప్పక శయింపఁగ జెల్లునె బ్రహ్మకేనియున్ 64

ఉ. నీవిటఁ జీరి సారెక వనీతల మెల్లను దల్లడిల్లను
న్నావిధి చాలదే పయిుగ నామహి కీవని వేఱ సేయఁగా
రావలె నోటు సాధులకు రాయిడి కంటెను గంటుకల్గున్
కావున మిన్నకింతటను గ్రక్కునఁ బొమ్మెటకైన దుర్మతీ 65

చ. అదియును గాక యింకొకటి యాడెదనేఁడు పరాకు లేక నీ
మదిగొని యింకనుం బ్రతక మానసమందుఁ దలంచితేని నా
పృథుల పృషత్క వహ్నిఁ బడి ప్రేలక కూలక యెందునైన నున్
బదిలపు చోటికేగి యటఁ బండు మికీ యుటజంబు వీడుచున్ 66

వ. అని మఱియు నిట్లనియె 67

ఉ. దా నవమానమంద మతి ధారుణిలో మననున్న యాతడున్
దానవమాన మందడు గదా వృధమ్రందకెట్టైన బొమ్మ లే
దా నవమాన మానిత మదాంధుడ నీదగు ప్రాణ వాయు విం
దాన వమద్విషాగ్నికిడి యాకలి దీర్చెద నాశరాహికిన్ 68

ఏకాక్షర కందము:

క. నానను నానిన నానను
నేనని నూని నను నిన్ను నేనన్నను నా
నా నేనను నున్ననో నా
నేనె ననున్నాను నెన్న నీనను నానన్ 69

వ. అనుటయు జనపతి దనుజున కిట్లనియె 70

ద్వ్యక్షర గీతము:

లావు వోవు లేవ లే వెవలా వలి
వేల వోలె వాలవేవలేవ
వాలు వీలు వోల వాలు వీలీవేల
లేవ లీల వీవు లోవి వోలె 71

వ. అనియిట్లు మనుజేంద్ర దనుజేంద్రుల న్యోన్య సంవాదములకు దిగి పగ
యెదిగించుకొని యించుక వారింక వాదించఁ దలపడి యిట్లనుకొనిరి 72

సీ. నీ చమత్కృతి నిన్ను నేల పాలొనరింతు
నీచమత్కృతి నిన్ను నేలఁ గల్పు

బోరాము లేఁక గాల బోరాము నీపైకి
　　బోరాము లేఁక గాము బోరమునికిఁ
బాచితమేఁ గూర్తుఁ బాపి నినెడ పియు
　　ప్పాచితమే గూర్తుఁ చాపి నిన్ను
నీరసననుగంచు నిన్ దునిమెదఁ బట్టి
　　నీరసననుగంచ నిందునిమెద
నీ దురంతార్చిరుగ్రావ మాదముడ్తు
నీ దురం తార్చిరుగావ మాదమూడ్తుఁ
బోరణ చేఁదెగన్నీకు బొమ్మ వ్రాసెఁ
బోరనాచేఁ దెగన్నీకు బొమ్మ వ్రాసె 73

వ. అని యిట్లు యిరువురు వడిఁ బరువళ్లు ద్రొక్కుచు బరువడి నురువడించి వెఱవుమై మొఱకు తనమ్మపై కుఱకఁ బైకుఱక జూఱకని మాటల నెఱకలునొనాడికొనుచు నొండొరులఁ జూఱ చుఱ గనుగొనుచుఁ గనుగొనల నిప్పు కలురల నొరుల హెచ్చును మెచ్చక తచ్చెనలాడుచు నాయిద్దరు దొరలు దెలరలేని మానంబుల నభిమానంబు దెఱలఁ దెఱలక యున్నచో మనుజాధిపుడు దనుజాధిపుని ప్రాణము మానములు దక్కనీయ ననియు నొక్కవేళ జక్కనై తనమ్రోల నిలువఁ బడిన నుక్కి వమ్ము వమ్ముగా నతనిఁ దనబాగాలికి బలిఁబుడు వాడ నందనుక వెనుక దొడిగిన జోడూడు వననియు గట్టిగ రాయి గ్రుద్దిన యట్టొట్టు వెట్టి రాజు బెట్టిదమగు కట్టలుక ప్రట్టిచులు కధనంబుట్టి పడఁ బలికి మెలకువ మొలకలెత్తఁగయ్యమునకు గాలు ద్రువ్వుచు బడల్వడక వెడలు వనియె 74

ఉ. నావడు దుందు దానవుడు నాకిటి నాఁకటఁ గొట్టు మిట్టుగా
నావుల గుంపుక్రోల్పులికి నందిన చందము మిమ్ము నిమ్మని
న్నావిధి తెచ్చియిందు విడెనాకడ నాకడ నాల్క తప్పువోఁ
గావడి మిమ్ము నొక్క కడిగాఁ దిని తీర్చెద ముందు నాక్షుధన్ 75

తరువోజ

అని యిట్లు దనుజుండు నచ్చోటు దొలంగి
నగపడకుండం గా నభియాతిపైని
నని వారితాశనుల దరి పడంగ
నపరితమ్ముగా నభము భంగి
ఘన కరకా వృష్టిం గావింప రాజు
గని గాడ్పు టంప ఖండన సేయ
నని చీంకటికి వోయి నల్లర్క దీప్తి
నవిసి పోయెను మాయల మ్ముహూర్తమున 76

లయగ్రాహి:

అందునకు దుందునకు నందం దగ నట్టి రుష
జెంది యొకప్రాణియును గంది తపి గందం
డందరుల యందరులు గ్రందుకొన ముందరను
నరిదరిక నందరికిడన్ దుడుకు నాకున్
బొందికను బొందనగు బొందికమ బొందం బడె
దెందనుక వేంగుద నరిందముల తోడన్
మ్రందు వఱ కిందఱును మందునకు నేన్విడద
ఱిందరిని మ్రింగెద నిటందరి నటంచున్ 77

వ. ఆకెలంకులం గలంక లేక మెలంకువ మెలంగ నుదంకముని మృగాంకుంజూచి
యా బూంచుల రేండిట్లనియె
78

కరిబృంహితము:

ఒరి తబిసి మదించి యుఱికి య
యోధ్య కబలు నృపాధమున్
భీరులను గసుగాయలను బడి
పిల్లలను మఱికొందఱున్

సారతములని నాదు పయికిని

జంక నిడికొని నీవు నే
తేర భయమిట నేరికిఁక గడ
తేరి బ్రతికెదు లెమ్మురా 79

మత్తకోకిల
పటికి పసికూన లన్నల హీనుల న్నృహుదీనులన్
బోటు మానుసులంచుఁ దెచ్చితి పుణ్యమాపుష్టమా
పీఁట వెట్టి వసించు నాకిట భీతొకింతయుఁ బుట్టునా
తాటియాకుల చప్పుడులకునుదా శశం బళుకొందునా 80

చ. అదివిని రాజనెన్ దనుజయూశర మ్రింగెద మమ్మటంచ నీ
మదరెదవేల నిన్దను జయాశ శరారువు నాశరమ్ము నిన్
యెదువుచు మ్రింగు నందనుక భోరునఁ బోరున నోరు మూయుమా
యది నిజమేని జూతమెది హోమిక యుండిన మ్రింగు మందఱన్ 81

క. అనుటయు సత్యాశ్చర్యము
గనుగనుగొన రాజు నిప్పుకలు బులువిడిగాఁ
గనుగను గొనల వ్రాలం
గనుగను మంచసుర కడుపు మంట లెగయఁగన్ 82

చ. ఇరువది యొక్క వేవురు మహీశతనూజుల లక్షసేనతో
నిరవున దానువుండడరి యార సమారి మసంగి నట్టుగా
నిరవు పడంబడం దిగిచి హేలగ మ్రింగి నిమేష మాత్రలో
నిరవధి కోగ్రుడై నిలిచె నిమ్మకు నీరము నెత్తి నట్లుగన్ 83

వ. ఇట్లు ధృడాశ్వ భద్రాశ్వ కపిలాశ్వులను వారు ముక్కంటి మూఁడు కన్నులుం బోని రాజు సూనులు మువ్వురు మాత్రము దవ్వులంబడి యుంట నొవ్వక యెవ్వలను నగోశరారుఁడగు నాసురారి బారికిఁ దప్పి తప్పి జాఱి బ్రతికిరి తక్కిన వశిష్ట మహీశ నందనుల నందఱను దురంగాది చతురంగ బలంబులను రణరంగంబునఁ దాళఫలంబువ వలెఁ దలలు పగిల్చి మధుర భక్ష్య నిర్విశేషంబుగా మ్రింగి యందఱను దింటినని తనివి సనక తనమనమున వినువక తనుకు నింకఁ

గబళింప బలంబింక కయింకనేమి శేషించిన దేమో యని యాలమెసవి చవిదీఱక
యాఁకటి పెల్లున సెలవులఁ దాటించి నాలుకతో నాకుచు నాకటి క్రొల్పులివలె
నారక్కసి నలుదెసలు కలయం గనుంగొను చుండ గువలాశ్వ మహీశ్వరుండు
తనమనంబున

84

తరల

నగుచు నవ్వుచు నాకి దస్యుఁడు నాదు నందను లిందఱన్
జగతికిం గడుఁ వ్రేఁగు నాఁదగ సైన్యమెల్లను మ్రింగె హా
తెగిన దాఁక బిగింపరాదని తెల్పియుం దినుమంటినే
మిగిలెఁ గార్యము నింకఁ దడసిన మీఁదు మిక్కిలి వచ్చుఁగా 85

వ. ఇట్లు మనుజనాథుండు తనమనమున ననుకొను నెడ దనుజ యోధుండు
మహాయోధ గాన మృగయూథంబున కురులొడ్డి పట్టఁ దివురు వ్యాధుండు
బోలె నవశిష్ట రాజసైన్యయూథంబు పైకివ్రాలి యాబాధ కంతటికి నీ యనాథ
మునియ కదా మొనగాఁడు మునుగా ముని వామదేవుండు వోలె గాముల
ఊనిరాహువు వోలెఁ గబళించి ప్రబలించి యామణగించెదఁ గుండె చెదర
బండగఁ బడి చెదరఁ గొట్టి కాలమట్టి మల్లామట్లొన రించెద నిదె చదలమునఁ
జతురంగ బలంబును వలెఁ జతురతతోఁ దురుతుగ నీ మతకంబు ముతుకని
బ్రతుక నీక వీఁకఁ గుత్తుక గొఱికి నాబ్రతుకున కతి కుతుకమ్మొన గూర్చెద
నీయాత తాయికి నాచేతివ్రేత దినిపించి సాధనగా నీధరణి నిర్బాధకము సేసెద
వీని తాత యేఁవాడడు పడి యెడునో చూచెదుగాక యొకవేల వ్రాలి వీలుకొలంది
నడ్డపడఁ బోవాఁడెవ్వడైన నగుంగాక యెవ్వడైన నగుఁగాక యెట్టైన నగుఁగాక
వానిని వాని యబ్బను నిబ్బరంబుగ దెబ్బకొక్కనిగఁ దలఁద్రొంచి దెసలెల్లన
సమమగు నసమునించెద మించెద నొడలు వెంచి రాయబడల్పడ నెందాయె
మెంచెదఁ బట్టి యీ వెట్టుము పుట్టి ముంచెదనని యెంచి యెద ననుచు
తమినదను గని మదిఁ గొదఁగొని యకలంకు నుదంకు తలద్రెంపగమకించుచుఁ
దమ కిం. క చేరువనున్న రాకాసిఁ గని రాకురా కాశికిఁ బోయినఁ గర్మము
మానదురా మానదు రాపులమగు మాపైన నొండె నమాన దురాప్తుడగు నీతాపసి
కెండె నెత్తి వచ్చితివేని చచ్చిగీ పెట్టెదవు కాక నీకు గాఁబోవు ఫలమెద్ది లైదు సుమా

యని సుమాలించుము క్షమాధీశుండద్దపడి యొద్దారించి యాగద్దరకాని గ్రద్దన గద్దించి యిట్లనియె

86

క. సంతత కృశుని నిరాగసు
దాంతు మునింజంపి యేమి త్రవ్వి కొనదొడు
స్వాంతుండను పేరుదక్కున
హంతవ్యో బ్రాహ్మణ యన నాలింపవొకో 87

మహాస్రగ్ధరాహం

విడుమీ కంటింతటైన న్వెడఁగు దనమున న్విల్లు వీగంగ నేలా
పడు సుమ్మీ పోటు వాడుంబడఁ ఎపుడు ధరం బండు వాఁడుండు నట్లే
యడు సుంద్రొక్కంగ నేలా యడుగుఁ గడగ నేలా మునింజంపనీ నో
గడుసా నేనిత్తు నిన్నుంగలనికి బలిఁగాఁగం తముంద్రుంచి హేతిన్ 88

స్రగ్ధరా

అంచు న్నొంచంగ నిట్లా యధిపుడ సుర మాయావి మాయింప మాయల్
ప్రొంచతేసందార యుక్తిం బరపఁ బరపుగా బాణ వర్షంబు వాడున్
గొంచెం బెన్నుంచకు న్పైః కుధరగతి క్రూరుడై యేర్చి పేర్చెన్
జంచత్త్రోంచారి తుల్యాశయుడతి శయుఁడై శస్త్రము వ్విస్తరించెన్ 89

వ. ఇట్లు విస్తార శస్త్రాస్త్రములిసుము జల్లినట్లు విసువక వెల్లిగొల్పఁబ్రజల్పింపక యున్నట్టున్నగా సేసిన నప్పుడు నవుక కలుయుచునచురను సుఱసుఱుపఱచినను బెఱుచ నమ్ములు చయమ్ముల చయమ్ములకు వెఱచఱచ కతఁడు తఱుచు గదరము చుఁదరు వరజంతుసంతతులత తు లతులిత భీతి నదిరిపడి పఱచు నట్లుఱచుచు ఁబన్నిదంబు నఱచి ఖరతర శరము లన్నిటిని జన్ని విడిచిన యాఁబోతు నన్నెమువలె బెన్నగమెసవి మిసి మింతుఁడు గాక మిసమిస లాడుచు విసవిస దిరిగి తరగని కసిఁ గసి మసంగి పసగల దొసందులు పొసంగవెసంబసగదొ సంగక యె సంగుచుయునొదయుఁడు దడయకదయ్యక వానిగ సరునఁ గొసరి కరవాలమున విసిరి సరిగ నరి గెలఁగొవి యురిపై కరిగి యెూరి నిన్ను మన్ను కరిగి కరుగున ఁబోసి యచ్చొత్తి యెత్తి గండారపుం బొమ్మగా నిమ్మ వాకొమ్మయి నైన

నెమ్మె ద్రుష్టి బొమ్మను గావింతునని యామొఱకునకుఁ జాఱకతెత్త చిందమ్ము నొత్తి యొత్తి యాడి మెత్తని వాడికత్తి చేకొని చూపఱు వెఱగుపడ నుఱికి కఱుక్కున దెగనఱకిన గాయమునకుఁ జోటీయక పడి గంటు వెనువెంటమాని గంటియే పడలేదనుకొనునట్లుగా నుండి యా మానిసి దిండు సంధాన కరణికి ఒరణియో విశల్యకరణాగ్ని కరణియో గాకున్న ఛురికఁదెగనఱికిన బొరక మాత్రమేని చఱకపుట్టదయ్యె నిదిదయ్యమో పెనుభూతమో యాతఁడేత నిమిరి దుడుచునట్టు లీతనికిఁగమలి నంతమాత్రమేని మేనికి గంటియే కంటికి గానరాదు కానరా దుర్మాత్ముని సరణిని నేరు నేకరణి వీడు మరణింప మికి గారణము పురణింపకున్నయది గాన మౌనివరా వెరవు కరుణింపవే యని సకరుణంబుగా నొడివిరా వెరవు కరుణింపవే యని సకరుణంబుగా నొడివి జననాథుండు మఱియు ముని నాథుంగనుంగొని యో మునిలోక గ్రామణీ యీ గామిడి దానవు పిడిసిపాట్లు గంటిరే యేను మగంటిమిని గరకరి ఛురికచే నఱికిన వీనికొక పరక పాటి నొప్పియేని నరుకేని యొదవ దాయె వీని పానమున కపాయకరమగు నుపాయము గలదా యీ మాయదారి దానవుఁడు గఱచికొని నాపఱచు పాట్లకి సుమంతయు మిసి మిసిమింతుఁడు గాక మిసమిస లాడుచు గసికందఁడు కుందడు బ్రిందడు నా ప్రేటి యాట్లని కాటలుగా నుండెడిఁ బైగా గాట్ల పులి పులి వలె నన్నుకొని నన్నుగొని మన్ను మిన్ను గానక నన్ను నిన్ను బ్రింగ నోరు దెఱచికొని మనమీదికిఁ బరచిరా నాయితమై యున్న వాఁడు నాయిత మయ్యానీకు నాయత సుకార్యమని మీరలె యెఱుంగుదురు గాన నేను వేఱ విప్పి చెప్పనేల నేనెన్నండు నిట్టి జగజెట్టి క్కనపు రక్కసి నెక్కడను గనివిని యెఱుంగ నతీ నాగతముల యందుఁ దమకు గోచరంబుగానిదీ చరాచరంబున లేదీ విశే, బు లేవియు లేవుగదా? కావున నీకావలుని యాయు శేషంబ శేషంబును దేపర దివ్య దృష్టిం బరికించి వీని బ్రమందింప మందెయ్యది యేనున్న యెడల నయ్యది నాకాముల గ్రముగా ననుగ్రహింపుఁడీ యన నత్తపోనిధి భూత భవిష్యద్వర్తమమాన కేదిగాన త్రికాల ప్రవర్తనలు తెస్సగ బాఱచూచి యోజనఁ జేసి యోజన నాథా ఈదీన దానవు నాయుర్భాగ్యమ శేష మల్పావశేష భోగ్యమై యున్నది మఱియు నాశ్రమవాసులయు భాగ్య విశేంబునఁ దోషంబుగ నిర్దోషంబుగ నాస్రవ నివారణ రానై యున్నది. యదిగాన నృపాలా యాలము సేయక యాలము సేయుము భయహానక దిటమానక మొగమాట దక్షి-

మొగి నా మాట దక్కించుము. మఱియు నామనవి విని వినియ వాతధవమతి శుచివై యరదంబు డిగ్గి యరుదుగడం బుడిగి యరిది బత్తి నొదిగి శ్రీపతిని మతినూని ధ్యానింపు మనింపు ముదంబున నియందా దేవదేవుండా వహిల్లి దాయను దునుము సుమా సుమాళింపఁ బగమై నీవీ సురారిని సురాళించి త్రుంప బోవు తఱికి హరి తన సుదర్శనము నిదర్శనముగా నీవాలున వీలునఁ బ్రవేశింప నాదేశించు నంతటఁ నీవు సంతసమున నంధ తమసము నుండి చదలున కెగఁ బ్రాఁకు లోక బాంధవు చందబున వేఱెక్కి తేరెక్కి చదలమున కెక్కనడచి పదిలముగా నారక్కసిని జక్కఁగఁ జక్కాడెదవు. ఆమ్రుక్కడి రక్కసి రాకకు దక్కినవు దిక్కెదురు సూచించు చున్నది. యదియట్లుగా నున్నయది గానున్నవి యున్నట్లు కలరూపు నిరూపించి చెప్పెద నీ మార్తునకు నిమేష ముహూర్తమాత్ర మింక నాయువు వుండ బోవు నావల నింకఁ బోవు సుమీ నా మాట రూఢియన రాజువిని తానామౌని యాదేశించిన యట్లే యొనరించుడుఁ బరమేశ్వరుండైన రరేశ్వరుండు కళా మాత్రమూన వేశ్వరునందుఁ బ్రవేశించి తదుత్తర క్షణమునం దుత్తమ జనరక్షణ దక్షమై రమేశు దక్షిణ హస్త న్యస్తనం దర్శనీయమైన సుదర్శన మా నీచ దానవుఁ గచాకచిఁ బట్టి పచారించి పట్టి చుట్టుకొని యెత్తి కుత్తిక గొఱక నుఱక తానుఱికి రాజు తరకసమున కుఱికి తనయందు దనుజారి వలె నాసుడివాలు నుడవోని కడిమిఁ దన వాలున నావహించె నంత బృహద్భ్వ సూనుండ నూనమానుండై సహస్రహరిదస్వసూనుండ నూనమానుండై సహస్రహరిదశ్వ సమానదీప్తి జాజ్వల్య మానుండై వెలుంగుచు 90

సుగంధి

మించి కొంచె మించ ఉమించు మించు నెంచు కేతువె
త్తించి మేరతీరు నారితేరి తేరు తేరిపై
వంచి తుంట వింటి బంటు వంటి దంటవింటి బల్
మంచి రూపు మోపి రూపుమాపఁ జాపెఁ బాపునిన్ 91

ఉ. ఆశర మాసురుందినెడు నాశను నాశతకోటి ధాటి గీ
నాశుని పాశముంబలె ఘనమ్ము జనమ్ము సుదర్శనమ్మనన్

గీశము లేశము మీఁగకిడి కేశవ కేశవ వరప్రసాది యా
క్రోశము జేసి ముందనికిఁ గోసి తలన్బవిదీసె దుందునిన్ 92

క. ఇప్పుదిగి దెప్పరమ్ముగ
నప్పాపసురారి నృపతి యంపఁగ నొంపన్
దెప్పున ద్రెళ్ళెను సుర సడి
చప్పుడు గాకుండ శౌరి చక్ర మహిమ చేన్ 93

చ. మొఱసెను దేవదుందుబులు ముచ్చట నచ్చట నాడిరచ్చరల్
గురిసెను పుష్పవర్షములు ఘుమ్మన ముమ్మరమైన తావులున్
విరిసెను మందమారుతము వీచెను హాయి సమస్త దిక్పతుల్
బిరబిర వేల్పులెల్ల తనవెంటనెరా హరి వచ్చి రాజుతోన్ 94

ఉ. మాకును లోకులందఱకు మాటకు ముందుగ పాట్లు తప్పెఁగా
నీ కరుణ న్మహీశ యతని న్వయించితి ప్రాణ గొడ్డమున్
లీఁకము వీనిపేరనినఁ బిట్టలు కూడఁగ నీరు ద్రావ నే
బేకొని లోకమింకెదను జేయుడి నిద్దురఁ జెందు హాయిగాన్ 95

ఉ. కావు నరాళి నన్ను ననగాచి తుదంకముని న్తనున్ననున్
గావునఁ బెట్టి మట్టి సురకంటకు దీనికి సాటి యేవియున్
గావు నరేంద్ర యిట్టి యుపకారికి ప్రత్యుపకార మీదగున్
గావునఁ గోరు మీవరకు నన్ బతినీదయయున్న జాలునాన్ 96

శా. భావంబున్ గువలాశ్వమెచ్చికొని సంభావించి సంక్రదనుం
డే వింక న్బువి దందుమారుఁ డన ప్రత్యేకాఖ్య నుం జెందుమా
దేవ బ్రాహ్మణ భక్తి కల్గి యరులం దెంపార నిర్జించి యే
దేవేళ న్మది నీవగోరు దది యట్లే సిద్ధియౌ నెప్పుడున్ 97

ఉ. ఇంకను గోరు మీవు వరమిచ్చితి మెచ్చితి నీకృతంబనన్
శంకను దక్కి భూమి పతి శక్రుని కిట్లని దేవసేయవే
కింకరు నన్బరించి, పరికించి రణస్థలి బడ్డ బిడ్డలన్
గొంకక సైనికావళులఁ గూడఁ జిరాయురుపేతులౌ నటుల్ 98

వ. అనిన విని యాసురపతి నరపతి కిట్లనియె 99

చ. సురలకుదంక మౌని కతి శూరత నీవొనరించి నట్టి మే
ల్పిర తర మింతయేని చెప్పఁగఁ దీఱదు రాజనీవు నా
స్మరణము నెప్పుడు వచ్చెదవు మన్ననఁ గొమ్మన సేన సూనులన్
బరువడి నిద్రలేచి నటువారక లేచిరి లబ్ధజీవులై 100

వ. ఇట్లు జగదీశ్వరు కృపచే గువలాశ్వ మహీశ్వరుండు దుందు రాక్షసుపై కెత్తి చని చెక్కు చమర్పక యఱచేనెత్తుఱు గాకుండఁ దలపువ్వు వాడకుండ నలవోకయుగా లోక భీకరుండును మునిలోక కంట కుండును నగు దుందుని ఖండించి కుటజాశోకాద్యావృత్తమగు ముని యుటజాంగణమ్ము నిష్కంటకమ్ము గావించి భావించి సురపతికి దయరావించి లబ్ధ విజయుండై తన నయ వినయములకుఁ బరమానంద భరితుండగు సురపతి వలన సంప్రాప్త సర్వ మనోరథుండైన మారుధ ఘన రథుండై యుద్ధ మృతులగు సుతులను బదాతి ముఖ చతురంగ బలంబును దద్వర బలంబును లబ్ధ జీవితులుగ బడసి తత్సహితుండై సహితుండై యుదంకముని మహేంద్రునకు బృందారక బృందమ్ము నకు నభివందనమ్ము లాచరించి యాదరంబుగ వారల యాశీర్వాదంబులొంది వీడ్కొని పరమానందంబు తో పరివారంబుఁ దోడ్కొని పురంబు నుండి వెడలు నాడు వచ్చినవారు వచ్చినట్లుగ నొకప్రాణియేని బీరుకపోకుండ నుడివోని కడిమి కడలగడలుకొనఁ గసిగందని కసిగుందని కాంతిగుందని శాంతి రణవిజయమ్ము చేకొని సందన ముఖే చరవీధి నెగసి సంతతతముగా వెల్లి విరియ హరి చందనపు విరిసోనల గుప్ప గూర దొప్ప దోగుచు శీతల సుగంధ పరిమళమ్మై పథ శ్రీమాపహారకమగు మంద మారుతము చారు తరముగ వేమారు వీవ భావుక శుకపికాది మధురతర రుతములకుఁ దోడ్పడి మంగళ వాద్యమ్ములు చోద్యముగ నాకసమంటి చెలంగ రంగరంగ వైభవములతో వైభవములతో వెడలి వేంది మాగధ బృందమ్ముభి నందింపని కడక వసుంధరా బృందారక బృంద మహదా శీర్వాదములతో దుర్వాదములు లేక యెదుర్కొని శతసహస్ర విధమ్ముల వినుతింప సకల సామంత ప్రధాను లెదుర్కొన మహారాజోప చారములతో జారులు చూడవచ్చిన జనసమూహము నదుపు సేసి దారి భార్లా యొనర్ప మహారాజ

నిదానమగు నిజరాజధానిని గువలాశ్వ చక్రవర్తి సపుత్ర పరివారుండై సుఖముగా
శుభముహూర్తమున ప్రవేశించె నెట్లనిన 101

క. ఈ కువలాశ్వ విజయమను
ప్రాకట సత్కథను భక్తిఁ బఠియించినవా
రూఁ కొనినవారు పుణ్యము
చేకొందురు వాంఛితములు సిరిసంతతులన్ 102

ఇది శ్రీనాథ యామునావతార పవిత్ర శఠమర్షణ గోత్ర బుక్కపట్టణ కుల కలశాంబుధి రాకాసుధా కర విద్యానగర సంస్థాన సముపార్జితానేకాగ్ర హార బిరుదాంచిత కర్ణాటక రాజాచార్య శ్రీవేంకటాచార్య పౌత్ర శ్రీనివాస తాతా చార్య పుత్ర అష్టావధాన కరణ చణ శిష్ట జనహిత వైయాకరణ పండిత స్వీయ ప్రతిభా స్వయం సమాదిత రాజకీయ హూణ భాషా ప్రాభవ ప్రభాదుర్య రాఘవా చార్య ప్రణీతంబగు కువలాశ్వ విజయంబు నందు

# పంచమాశ్వాసంబు
# సర్వము సంపూర్ణంబు
# 18-10-1920

| | | |
|---|---|---|
| | శ్రీ | కరుండును, |
| | బు | ద్ధి సింధు |
| వ | క్క | రవేళ |
| కు | ప | కారియౌ |
| చు | ట్టి | ముప |
| కర | ణ | ము, సత్య |
| ధా | రా | ఘుండు |
| సత్సం | ఘ | శుభదాయి (యిచ్చువాడు) |
| | వా | మాస్మరుడు, |
| | చా | రుధాముఁ |
| డా | ర్య | మ్మతుండు (పూజ్యుల) |
| | వి | శిష్ట |
| సామ | ర | స్యజ్ఞుండు |
| సం | చి | త బహు |
| మ | త | సారవేది |
| | కు | టిల |
| దాన | వ | శైల |
| చటు | లా | వియు |
| వి | శ్వ | విశ్రుత |
| కో | వి | ద (పండితుడు) |
| నుత | జ | యుఁడు, |
| కలి | ర్ | బురికేగె |
| | ము | దితుతుడై |
| క | వి | యుఁగ్రృతియు, |
| | ల | లిని |
| విల | సి | ల్లఁదన |
| వె | ల్లు | వలును |
| రాఁ | గా | |
| దొల్లబంతి | క | డందాక తోనెపూని యలపు లేకుండ |